# అక్షరయజ్ఞం

రచన

డా॥ యార్లగడ్డ బాలగంగాధరరా

యం.ఏ., పిహెచ్.

ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జుననగర్ - 522510

నిర్మలా పబ్లికేషన్సు

సీతారామాంజనేయపేట,

మంగళగిరి - 522 503

# అక్షరయజ్ఞం

డా॥ యార్లగడ్డ బాలగంగాధరరావు

ప్రథమ ముద్రణ : ఏప్రిల్ 2001.

ప్రతులు : 1000



ప్రతులకు :
**శ్రీమతి యార్లగడ్డ నిర్మల**
సీతారామాంజనేయ పేట
మంగళగిరి - 522 503
ఫోన్: 08645 -32521

మూల్యము : రూ. 100.00

## అంకితోత్సవ దృశ్యాలు



ఆవిష్కరణ: శ్రీపెదప్రోలు వేణుగోపాల కృష్ణమూర్తిగారు
ఇంకా డా॥ కందిమళ్ళసాంబశివరావు, ప్రొ.యస్.గంగప్ప , శ్రీ పి.యల్.ఎన్. ప్రసాద్,
మండవ జయచంద్ర ప్రసాద్, ప్రొ.యార్లగడ్డ బాలగంగాధరరావు

## అంకితమిస్తున్నప్పటి దృశ్యం



ప్రొ. యస్.గంగప్ప, శ్రీ పెదప్రోలు వేణుగోపాలకృష్ణమూర్తి,
శ్రీ మండవ జయచంద్రప్రసాద్,శ్రీమతి కమల,
ప్రొ. యార్లగడ్డ బాలగంగాధరరావు, శ్రీమతివిమల

# నా మాట

ఇందులో సంకలితమైన కొన్ని వ్యాసాలు అప్పటప్పట కొన్ని పత్రికలలో ప్రచురింపబడ్డాయి. కొన్ని ప్రచురణలోనికి రానివి. అన్నింటికి మూలం, నా అధ్యాపక వృత్తి. నా విద్యార్థులకు ఇందలి విషయాలు తెలిసినవే. కొన్ని విషయాలపై ఇతఃపూర్వం పండితులు గావించిన నిర్ణయాలతో నేను ఏకీభవింప లేక పోయాను. కొన్ని కేవలం నా బుద్ధికి మాత్రమే పొడగట్టినవి. సాహిత్య దర్శనంలో ఒక్కొక్కరిది ఒక్కొక్క తీరు. జీవనంలో ఎంత వైవిధ్యముంటుందో సాహిత్యంలోను అంత వైవిధ్యం ఉంటుంది. అంటే జీవనానికి దర్పణమే సాహిత్యం. మిక్కిలి అది ఆలోచనామృతం. దాని కొన, సాగించిన కొలదీ సాగుతుంది. అయితే అది ఏ తత్ సాహితీ స్రష్ట భావనకు అనురూపంగా వుండడం సహృదయత అవుతుంది. అలాంటిది ఈ సంకలనంలో ఎంతవరకు గలదో – నిర్ణయింప వలసింది సహృదయ పాఠకులే. నేను వెలువరించిన అభిప్రాయాలతో భేదం వున్నవారు మొగమాటమి లేక వ్రాయవచ్చును. అది సరిపోలినదయితే కృతజ్ఞతతో స్వీకరిస్తాను.

దీనిని శ్రీ మండవ జయచంద్రప్రసాదుకు అంకిత మివ్వడానికి కారణాలున్నాయి. మా ఇరువురి స్వగ్రామం ఒకటే. అదిపెదప్రోలు. అతడు నా సహాధ్యాయి. వరుసకు నాకు మామ. అయితే ఈ కారణాల వల్లనే దీనిని నేను అంకిత మీయడం లేదు. అతడు సంస్కారి. తమ బాగు మాత్రమే తాము చూచుకుంటున్న ఈ నేటికాలంలో, తన కుటుంబ శ్రేయస్సును, గౌరవాన్ని కాపాడటమేగాక, ఊరి బాగును, మంది క్షేమాన్ని ఆకాంక్షించి, వానికై కృషిచేస్తున్నవాడు. దాతృత్వం, పెద్ద మనిషి తరహా – ఇవి అతనికి కుటుంబం నుండి వారసత్వంగా సంక్రమించిన లక్షణాలు. నే ఎరిగిన కాలం నుండి మాకుటుంబానికి వారి కుటుంబానికి నెనరుంది. సమవయస్కులమే అయినా, అతన్ని మామా అని పిలవడం అలవాటు. ఈ అన్ని కారణాలుగా అతనికి దీనిని ఇస్తున్నాను. అతడు అనుమోదించాడు. అతనికి, అతని కుటుంబానికి సకల శ్రేయోభివృద్ధులు కలిగించాలని శ్రీకాకుళ ఆంధ్ర నాయకుని ప్రార్థిస్తున్నాను.

దీనికి ఆశీరభినందనలు అందించిన వారు, మా గురుదేవులు శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి గారు. వారికి నాపై, నా కుటుంబంపై నా సాహిత్యవ్యాసంగం పై వల్లమాలిన ప్రేమాభిమానాలు. అది వారి మాటల్లోనే చూడవచ్చును. ఆ మహానుభావునికి, పాదాభివందనాలు.

దీనిని ఇంత అందంగా, అల్ప వ్యవధిలో ముద్రించిన 'ప్రింట్ ప్లాజా' సంస్థ వారికి నా హృదయపూర్వక అభివందనాలు.

ఇట్లు
బ్రాహ్మణ దాసుడు
యార్లగడ్డ బాలగంగాధరరావు

మంగళగిరి
ది. 24-04-01

శ్రీగురుభ్యో నమః
శ్రీరామాయనమః

# సాహితీ వరివస్య

ఎందు కిప్పుడు మరల సాహిత్యచర్చ
యనిన దనదైన యనుభూతి తనది గాన
నదియు హితమును బ్రాయమును నగుట జేసి
చాల నవసరమని పించె జదువరులకు.

నామ విజ్ఞాన మహాయజ్ఞం చేసి సోమయాజియైన మా డా॥ బాలగంగాధరరావుగారు మళ్ళీ అక్షరయజ్ఞం పేరిట సాహితీ క్షేత్రాలు మరీ లోతుగా దున్ని తన మేధో భాగీరథిని వీటి మీదికి పుష్కలంగా పారించి సాహితీ - సస్యాన్ని స్వర్ణమయం చేసి క్రొత్త క్రొత్త పంటల నీ భూముల మీదనే పండించే కృషీవలుడు కావటం నా హృదయ క్షేత్రం మీదికి సాహితీ సౌరభాన్ని నిండార ప్రసరింపజేసింది. తలమునకలైన ఆనంద తరంగాల వెల్లువతో ఆహ్లాదకరంగా వినిపిస్తూ ఉండగా వీనులవిందు పొందటం నా అదృష్టమనిపించింది. నా యెఱుకలో నున్న వనుకొన్న సాహితీసాగరపు లోతులలోకి నన్ను ముంచుతూ ఉంటే - (నా యెఱుక ఎంతటిది?) "అనుకొంటూ ఆశ్చర్యపడుతూ విన్నాను.

ఇది అక్షరయజ్ఞమే - సాహిత్యమే నిజంగా అక్షరమయం. - ఇది క్షరంకానిది కనుకనే దీని కిల్లా చిలవలూ పలవలూనూ. వీటితో ఇది ఒక రమ్యోద్యాన వనం. అక్షర నందనవనం కూడా. ఇక్కడ మళ్ళీ వసంతం పూతపూసి పుష్పించి సౌరభం, చిమ్ముతూ నవరసాల కిసాల ఫలోదయాలతో దీని రుచి అభిరుచిని పెంచుతోంది.

దీనికి నాట్యావిర్భావ నేపథ్యం ఉంది - దీనితో సంబంధం సొప్తపదీనం - 'ఇందులో చేమకూర కూడ పండించటం చమత్కృతి. సరమ వృత్తాన్తం తో భయ వృత్తాన్తం బయట పడింది. ఇది ఎంతో వృత్తాంతాన్ని త్రవ్వి తలకెత్తుతోంది. తరువాత శ్రీనాథుని "పంచాస్త్రోప నిషద్రహస్య పరమబ్రహ్మ స్వరూపాన్ని" దాని అంతరార్థాన్ని వెల్లడిస్తూ పండితుల కళ్లు తెరిపించే ప్రయత్నం ప్రశంసార్హంగా సాగింది. తిక్కనగారి "సాదురేగెనేనిన్" అనే ప్రయోగం యొక్క సహేతు విచారణ ప్రామాణిక సమాచారంతో ఆలోచన కందుతోంది. వివాహానంతరం ఇంటిపేరులు స్త్రీలకు మారటం సంగతి సమంజసంగా యుక్తిసహంగా భాసిస్తోంది.

ఇక శ్రీనాథుడన్నా నన్నయ అన్నా నాకూ మా బాలగంగాధరరావు గారికీ పరమ ప్రీతి - అందుకే నాకు తెలియని - తెలిసీ తెలియని విషయాలెన్నో బయటపెట్టి ఈయన సాహితీ పరులైన జిజ్ఞాసువులతో బాటు నాకు కూడా తృష్ణ తీర్చి తృప్తి కలిగించారు. అన్నమయ్య మీద వీరికి మిక్కిలి మక్కువ. అదీ మనకి జ్ఞాన నేత్రాన్ని తెరిపించింది.

అందుకే ఈ అక్షరయజ్ఞం ఆలోచనామృతంగా సాగిన ఒక నూతన సాహితీ చర్చా విధానం. ఓపిక పట్టి జిజ్ఞాసువులై పాఠకులు నవ్యమార్గాన్ని పరిశీలించటమే కాక ఈ విధమైన చూపుతో సాహిత్యాన్ని పరికించటం అలవరించుకోవాలని నా విన్నపం. ఇలా ఈ మాటలనిపించినందుకు మా బాలంగంగాధరరావుగారికి నా ఆశీరభినందనలు.

మచిలీపట్నం
22-04-01

జోసుమూర్తి
**జోస్యుల సూర్యనారాయణమూర్తి**

# విషయ సూచిక

# నాట్యావిర్భావ నేపథ్యము

సకల జీవరాశి నిరంతరము సుఖాన్వేషణము గావించును. జంతు సంతానపు ప్రాథమిక వ్యాపారము ఆహారసేకరణ. రెండవ వ్యాపారము పునరుత్పత్తి. జీవసంసార చక్రమిట్టిది. ఇది సాధారణ వ్యాపారము. అయితే ఇంతమాత్రమే కాదు. సూక్ష్మముగా పరిశీలించినచో ప్రతిప్రాణియు పై రెండు వ్యాపారములకు మించిన ఆనందమను ఒక వ్యాపారమును కూడ అన్వేషించుచుండును. ఇది ఆయాప్రాణుల నిసర్గమైన శక్తియుక్తులను బట్టి ఉండును. అనగా దీనికి కొన్ని పరిమితులు కలవు. మనుష్యేతర ప్రాణిప్రపంచము నందు పై రెండు వ్యాపారములే స్ఫుటముగా కనిపించును. కాని అందును వినోదముకొరకు, తద్వారమున ఆనందానుభూతికి ప్రయత్నము కలదు. కుక్కలు, పిల్లులు, కోతులు, గోమహిష జాతి పశువులు కూడ పరస్పరము ఒక విధమగు హేలగా ప్రవర్తించుట గమనించుచున్నాము. మిథ్యా కలహములు, ఒకదానినొకటి స్పృశించుట, కవ్వించుట, మొదలగు చేష్టాదికము లన్నియు ఈ కోవలోనివే. ఇవి నిసర్గములు. మనుష్యజాతి యందును చమత్కారముగా మాట్లాడుట, ఎదుటివారిని ఆటపట్టించుట మిథ్యాకలహములును కలవు. ఇవికాక ప్రయత్నపూర్వకముగ వినోదమును సంపాదించు ప్రవృత్తి కలదు. ఆటపాటలన్నియు ఈ కోవలోకి వచ్చును. ఆటపాటలను పదము ఒకవ్యాపార సూచకముగ కనిపించును. కాని వాస్తవమునకు వ్యస్తముగ రెండును వినోదమునకగు సాధనములే సాధారణమైన క్రీడలు వ్యాయామమునకు తన్మూలమున దేహసౌష్ఠవమునకు తోడ్పడును. పాట భావసంబంధి అగుటచే ఎదుటివారికి ఆహ్లాదముతోపాటు ఉద్బోధనుగావించును. ఇదిసాధారణస్థితి. భౌతికమైన ఉపయోగము. అట్లుగాక కరచరణాద్యంగముల చలనము ఒక క్రమపద్ధతిలో విక్షేప మగుటచే లాస్యము చూపరులకు ఆహ్లాదము కలిగించును. దాని కాహార్యము తోడైన మరింత నయనానంద కరమగును. అట్లే పాటయు రాగతాళ సమన్వితమై సంస్కారవంతమైనచో మనసును రంజింపచేయును. ఇట్లు ఈ రెండును ప్రేక్షకులను

శ్రోతలను పరవశింపచేసి అనిర్వచనీయమైన తన్మయానుభూతిని కలిగించును. పాటకాధార భూతమగు భావము సువ్యస్థితము, అలంకారయుతము, గమకము కలిగిన భాషచే ముందు శ్రవణములకు ఆనందము. పిదప అందలి భావము మనసును ఉత్తేజమొనర్చి రాగరంజితము గావించును. ప్రాకృతికముగ ఆటపాటల స్వరూప ప్రయోజనములిట్టివి.

ప్రాయికముగ ఆటపాటల వ్యాపారమిట్టిదే అయినను సమాజములోని వ్యక్తుల అంతరువును బట్టి, గ్రహణస్థాయి సామర్థ్యమును బట్టి రుచి భేదముండును. ఈ రుచి భేదము అనేకములైన ప్రక్రియలకు మూలమైనది. అనగా సంఘమునందలి అన్ని అంతరువుల వారికి ప్రక్రియాభేదముచే ఈ ఆటపాటలు అందివచ్చినవి. మల్లయుద్ధము, వ్యాయామ సంబంధమైన వివిధ క్రీడలు, పగటివేషములు, బయలాటలు, కోలాటములు మొదలగు వివిధ విన్యాసములు, ఏలపదాలు, గొబ్బిపాటలు, మంగళారతులు, వీరగేయములు, ప్రశంసాగీతములు, మెరవణి గద్యలు, వెన్నెలపాటలు, వాలేశుపదములు మొదలగు గీతములు కొన్ని వర్గములను అనందింప జేయుచున్నవి. లయబద్ధమైన డప్పులు, చిందాటలు కొందరిని అలరింపగా, వీణ, వాయలీనము, మృదంగము, డోలు నాదస్వరము మరికొందరిని అలరించును. అట్లే హరికథలు, బుర్రకథలు, నాటకములు, నాట్యకలాపములు మరికొందరిని అలరించును. కనికట్టు ఇంద్రజాలము మున్నగు ఆశ్చర్యజనకములైన క్రియలు కొందరిని అలరించును. కొందరు కేవలము కావ్య పఠనమునందు ఆసక్తి గలవారై కావ్యగత వృత్తాంతములను తమ మనోనేత్రముల ముందు సాక్షాత్కరింపచేసికొని భావోద్విగ్నులై రసానందమును పొందుదురు. ఇట్లు ప్రక్రియలెన్ని యైనను వాని పర్యవసానము స్థాయి భేదమును బట్టి సామాజికులకు దేహపరిశ్రాంతిని చిత్తవైక్లబ్యమును పరిహరింపజేసి ద్వివిధముగ స్వస్థులనుగావించుటయే. అనగా విశ్రాంతినిపొందుట. కనుక వినోదము యొక్క పరమ ప్రయోజనము చరమమున విశ్రాంతి యందు పర్యవసించును. ఇది నిస్పృహను, నైరాస్యమును, నిరాసక్తతను పోద్రోలి నూతనోత్తేజమును స్ఫూర్తిని కార్యాసక్తిని కలిగించి జీవుని అభ్యుదయమునకు నడిపించును.

ఇక ఈ వినోదకల్పనమునకు పరిహాసకల్పనమునకు మనసురాగ రంజితమైనవేళ దానిని పంచుకొనుటకు తోడుండవలెను. మంది ఉండవలెను. ఇక దీనికి వస్తువెక్కడి నుండి లభించుననగా జీవనమునుండియే. జీవనము సుఖదుఃఖ మిశ్రమము. తనకగు సుఖము ప్రపంచమున కంతటకు సుఖముగా తనకగు దుఃఖము ప్రపంచమంతటికిని దుఃఖముగను జీవుడు భావించును. స్వభావతః జీవి సుఖమునే

పోరును. కాని దుఃఖమనివార్యము. ఆ దుఃఖమును కూడ మరచిపోవుటకు ప్రయత్నించును. దానినుండియు ఒకవిధమగు శాంతిని పొందుటకు ప్రయత్నించును. సుఖదుఃఖములు రెండును పై ఆటపాటలకు వస్తువగును. దుఃఖము వ్యక్తిని విచారమగ్నుని చేయును. లోకుల దుఃఖమును కూడ హర్షింపలేడు. కాని దానినే రంగస్థలమునందు చూచినపుడు సామాజికుడు ఆనందించుచున్నాడు. ఇది ఎట్లు సంభవించుచున్నది. దీనిని రెండు విధములుగా భావింపవచ్చును. ఒకటి అది తత్కాలీన సంభవముకాదు. ఎన్నడో, ఎవరికో సంభవించిన దుఃఖము అభినయింప బడుచున్నది. సామాజికుడు తన జీవనములోని దుఃఖమును అభినయపాత్ర గతములైన దుఃఖముతో అన్వయించుకాని సామాన్యీకరణమును పొంది అది అట్టిదికదా! అని తనను తాను ఆశ్వాసించుకొనుటచే పరితృప్తి పొందుచున్నాడు. ఇక రెండవది, దాని నభినయించుచున్న నటుల నటనా పరిణితికి కొన్ని సందర్భములలో అప్పుడప్పుడు వారితో అనగా ఆపాత్రలతో తాదాత్మ్యము పొందుచున్నాడు. నిజమునకు అది నటనయే. కాని ఒక్కొక్కప్పుడు క్షణమాత్రమైనను దానిలో లీనమగుచున్నాడు. వస్తువు ప్రత్యక్ష జీవనము నుండియే వచ్చినను దానిని రక్తి కట్టించుటకు కొన్ని అభూతకల్పనలు కొంత అతిలోకవర్తనము చోటుచేసికొనును. మొదలు ప్రదర్శనమే నటనము. దానికితోడు కొంతమృషాకల్పన. నాటకమిట్లు సిద్ధమగుచున్నది. వాస్తవమునకు నానాటి బ్రతుకే ఒకనాటకము. ఇది సామాజికునకు స్వీయాను భవములోనిది. స్వీయానుభవమున ఆతడే పాత్ర. కాగా నాటక దర్శనమున ప్రేక్షకుడు. స్వీయానుభవమే మరల అక్కడ చోటుచేసికొనుట కారణముగా అందలిహేలలు గుర్తించి తాదాత్మ్యము పొందును. నానాటి బ్రతుకు ఒకనాటకమైనట్లు నానాటి సంసారమొక రోత. దానిని యథాతథముగ గ్రహించుట కిచ్చగింపగ దానినుండి పలాయనము చిత్తగించును. వానిని మరుగుపరుచుటకు ఎన్నియో యత్నములు. ప్రయత్న పూర్వకమైన భ్రమయందు తానుండి అట్టి భ్రమకు తాను లోనుకానట్లు ఇతరులను భ్రమింప జేయుటకు యత్నించును. ఇది అపరిహార్యముగు వంచనా శిల్పము. దీనికి వెలియయిన జీవనము సంక్షుభితము. రోగనిదానము, దానికగు ఔషధము ఈ వంచనా శిల్పమునందే కలదు. నాటకమును ఇట్టిదియే. ఇట్లనుట కంటె జీవన వృత్తమునకు ప్రతిబింబమే నాటకమనుట సరియగుమాట. ఇది ఇట్లుండ ఎంత సుఖ మనుభవించినను లేక ప్రయత్నపూర్వకముగ దుఃఖోపశమనము గావించు కున్నను జీవునియందు అనిర్వచనీయమగు ఒకానొక ఆర్తి, వేదన పట్టి పల్లార్చును. ఒక్కొక్కప్పుడు దానికగు కారణమేదో కూడ తెలియరాదు. జీవనము నందు ఒక గ్లాని

జనించును. దీనికి తరణోపాయము భక్తి. ఈ వేదన సామాన్యము. దానికగు ఉపశమనము భక్తి తప్ప మరియొకటి లేదనుట సత్యము. కనుకనే స్వాభావికములైన జీవన వృత్తములటుండ ఆటపాటలకును భక్తి ఒకవస్తువై భాసించినది. ఇంక దానిని ప్రపంచీకరించుటకు ఎన్నియో ఇతివృత్తములు. ఎంతో గాథాకల్పనము. ఇది అటు జీవనము నందు దాని ప్రతిబింబమగు నాటకమునందు చోటుచేసికొనినవి. మానవ సంస్కృతి అంతయు ఇట్టిదియే. ఇది దేశ కాల బాధితమునుకాదు. ఏ మతమును దీనికి అపవాదముకాదు. కనుక ఇది సర్వజనాదరణీయము. అట్లనుటకంటె ఇది ప్రపంచము నంతటిని తన పరిధి యందిముడ్చు కొన్నదనుట మేలు. మతభావనకును ఇదియే మూలము. రుచి భేదమును బట్టి, అవగాహనమును బట్టి, అనుసరణము వచ్చుట వలన మతమునందు మార్పుండవచ్చును. కాని అన్నింటి లక్ష్యము జీవుని వేదనను ఉపశమింపజేయటయే.

ఇట్లు మానవోపయోగమునకు తన్మూలమున చిత్త సంస్కారమునకు చిత్తశాంతికి లక్ష్యములై నిలిచిన యావద్వినోద ప్రక్రియలకు, కాలాంతరమున దానిని మరింత సంస్కారవంతముగ తీర్చి దిద్దుటకు లక్షణము అవసరమైనది. అదియే శాస్త్రము. అయితే శాస్త్రమును నిర్మించుట ఒక్కనాటి అనుభవముకాదు. ఒక్కరి ఉపజ్ఞయుకాదు. ఎందరెందరి అనుభూతియో - కాలమున ప్రవర్తిల్లిన వాటిని ఏకోన్ముఖము చేయుటకు ఎంతో ప్రయత్నమవసరము. ఎంతో అభిజ్ఞత అవసరము. ఈ అభిజ్ఞత, ఉపజ్ఞ, ప్రతిభ మూడును సంమిళితమైన వేళ శాస్త్రమునకు నాంది జరుగును. అది ఏ మహానుభావుని వలన సమీక్షింపబడి సంపుటీకరణము నందునో అతడు దానికి కర్త అగుచున్నాడు. అట్టివానిలో ఈ ఆటపాటలకు దిశానిర్దేశము గావించినవాడు భరతుడు. అనగా నాటికి ఈ విషయకమై జరిగిన కృషి, అందలి నిగ్గు, భరతుడను వ్యక్తియందు ఏకముఖముగ ప్రతిఫలించినవన్నమాట. ఆపిదప ఆతని వాక్కు ప్రమాణమై నిలిచినది. రంగస్థలముతో కూడిన ప్రేక్షకాగార నిర్మాణము నుండి రంగస్థలము నందభినయింపబడు హావభావములను, దాని నుండి తన్మయత్వమును, తాదాత్మ్యమును పొందువేళ సామాజికుని భావసందోహమును, అది మూర్తీభవించుటకు, జరిగిన క్రమపరంపరను సాధికారికముగ నిర్వచించినాడు. ఇది అభినయపూర్వకమైన నృత్యమునకు, నాట్యమునకు, నాటకమునకు మాత్రమే పరిమితముకాక భారతీయశిల్పకళలు తీర్చిదిద్దుటకును ఇది ప్రమాణముగా నిలిచినది. లోకపుతీరు ఒక్కటే అయినను లోకులు మనస్తత్వమును బట్టి అవి భిన్నముగ సాక్షాత్కరించుట మన ఎఱుకలోనిదే. అట్లే శాస్త్రమొక్కటే అయినను ప్రతిపాదింప

బడిన విషయము ఒక్కొక్కరికి ఒక్కొక్క తీరున భాసించుటను బట్టి భిన్నదృక్పథము లేర్పడును. ఇది దాని ఔత్కృష్ట్యమును మరింతగా భాసింపజేయవచ్చును. కొన్ని సందర్భములలో వ్యాఘాతమును కలుగవచ్చు. ఇట్టి స్థితి నాట్యశాస్త్రమునకును తప్పలేదు. కనుకనే జాయసేనాపతి నృత్తరత్నావళిని రచింపవలసి వచ్చినది.

ఆగత్య బ్రహ్మలోకాదిహ భరతమునిః శాస్త్రమే తస్మదీయం
దృష్ట్వాభూయః కృతాదౌ ప్రసృమర పులకవ్యఞ్జితాన్తః ప్రమోదః
ఆశ్చర్యం పశ్యతేదం కథమధిగతవానాశయం మే సమగ్రం
సశ్రీమాన్ జాయసేనాపతిరితి నియతం వక్ష్యతే ఒగ్రేమునీనామ్

అనిచెప్పవలసి వచ్చినది. ఇట్టిస్థితి ఏశాస్త్రమునకైనను తప్పదు. కాగా నాట్యశాస్త్రమును వేదసన్నిభముగ పరిగణించుటయు కలదు. ఈ నాట్యవేదము బ్రహ్మయే స్వయముగ సృజించెనని చెప్పబడినది. దేవతల ప్రార్థనను మన్నించి బ్రహ్మ దీనిని చెప్పెను. దృశ్యమును శ్రవ్యమును అయిన క్రీడనీయకము దేవతలు కోరగా బ్రహ్మ సంకల్పమున ఇది వెలువడినది.

ధర్మ్యమర్థ్యం యశస్యంచ సోపదేశ్యం ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్॥
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్।
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్॥

నాలుగు వేదములట్లుండగ ఇది పంచమవేదమని చెప్పబడినది. బ్రహ్మ సృజించెనను మాట బహుశః ప్రతిపాదిత విషయమునకు పరమ ప్రామాణికత్వమును సంపాదించుటకు, దానిని లోకమున స్థాపించుటకు చేసిన ప్రయత్నము కావచ్చును. కాని నాట్యము విషయమై యావత్ప్రపంచము నందును దీనికి సాటి యగు నిరూపణము మరియొకటి లేదనుట స్థితిస్థాపక సత్యము. అట్టి ఈ నాట్యశాస్త్రము ప్రాంత, భాషా భేదములతో నిమిత్తము లేక యావద్భారతమునందును ప్రవర్తిల్లు చున్నది. అయితే ప్రాంతీయముగ భేదములు లేవా యనిన కలవనుట నిజము. కాని అందు భరతోపదేశ విషయము చోటు చేసికొనుటయు అంతే నిక్కము. ఇట్లనుట కంటె భరత ప్రతిపాదితమైన దానికి ప్రాంతీయత్వము జోడింపబడినదనుట మేల్తరము. భరతుడు నిర్దేశించిన నిర్వచనమునకు అతి సమీపస్థితిలో నున్నవి కూచిపూడి, మేలట్టూరు భాగవత మేళములు.

కూచిపూడి శైలిని గూర్చి ప్రత్యేకముగ చెప్పవలసినది లేదు. అది నేడు జగద్విఖ్యాతమైనది. దీనికి ఆద్యప్రవర్తకుడు సిద్ధేంద్రయోగి. కొందరి మతమున ఇతడొక

కల్పిత వ్యక్తి. కావచ్చును. అది సిద్ధేంద్రయోగి కృతమైనను లేక అన్యకృతమైనను దాని ప్రమాణమునకు ఎట్టి వ్యాఘాతమును లేదు. ఏమైనను దాని ననుసరించి, తమ జీవితమున కొక ధ్యేయముగ దానిని భావించి ప్రచారము గావించి సుకృతి నందిన బ్రాహ్మణ కుటుంబములు ఎన్నో అన్ని . వారు జీవితమును దానికై మీదు కట్టినారు. అదియే వారికి జీవన వేదమైనది. రసలుబ్ధులను, సామాజికులను సుకృతులను గావించినారు. భరత నాట్యమునకు కూచిపూడి శైలి కొంత భిన్నము దీనికి కారణము బహుశః అత్యంత సామాన్యమైన సామాజికులను కూడ అలరింప జేయుటకు చేసిన ప్రయత్నము గావచ్చును. చారిత్రకముగ గోల్కొండ నవాబుల నాటి నుండి, అంతకు పూర్వము శ్రీకృష్ణ దేవరాయల నాటి నుండి దీని యునికి కలదని స్పష్టమగు చున్నది. ఇది కేవలము వినోదసాధన మగుట మాత్రమే కాక సాంఘికముగను ప్రయోజనములను సాధించినది. సమ్మెట గురువరాజు వృత్తాంతము దీనికి తార్కాణము. నిజమునకు కూచిపూడి పరిసర ప్రాంతములన్నియు ఈ కళలు నిలదొక్కుకొనుటకు కారణభూతమైనది. క్షేత్రయ్య ఇక్కడివాడు. అతని పదముల కాలవాల మైన మొవ్వ గ్రామము కూచిపూడికి అత్యంత సమీపము. అట్లే శ్రీకాకుళము అంధ్ర నాయకునికి నెలవు. శతాబ్దుల నుండి ఈ ప్రాంత ప్రజలను ఇతర ప్రాంతముల వారిని అలరించిన కూచిపూడి భాగవతము నేడు యావత్ప్రపంచమునకు పరిచయమైనది. దానిని పారంపర్యముగ కాపాడుచు దానికే తమ జీవితమును మీదుకట్టిన మహానుభావుల పట్ల ఈ ప్రాంతమంతయు కృతజ్ఞతా బద్ధము. ఇక్కడే ఒక్కమాట. కూచిపూడి యందే ప్రవర్తిల్లి ఒకప్పుడు ప్రవర్ధమానమై నేడు కనుమరుగైనవి పగటివేషములు. దానియందును చొరవ చూపవలసిన ఆవశ్యకమెంతైనను కలదు.



# సంబంధంబు సాప్తపదీనంబు

ఈ పదబంధము శ్రీనాథకృత హరవిలాస చతుర్థాశ్వాసమునందలిదిగా నందరకు తెలిసినదే. సందర్భము, ఎల్లరెరిగినదే. అది యిది. పార్వతి పరమేశ్వరుని భర్తగా పొందగోరి, తలిదండ్రుల యనుమతి వడసి తప మాచరించుచున్నది. అంత కొంత కాలమునకు, ఒక బ్రాహ్మణ వటుడు విశ్రామార్థము ఆమె తప మాచరించు చోటికి వచ్చినాడు. అతడు కపటవటుడనియు స్పష్టపరుపబడినది. అతడు పరమేశ్వరుడేనని మీది కథయందు స్పష్టపడును. అతడు, ఆమె సపర్యలనంది, కొంత తడవు విశ్రమించి, పిదప సంభాషించుటకు పక్రమించినాడు. అదియంతయు, ఆమె తపము బాగుగా జరుగుచున్నదా, ఎట్టి యాటంకములు లేవుగదా, నీ పుట్టువు వలన హిమవంతుని చరితము చరితార్థమైనది - అని ఈ విధముగా కాలోచితమైన సంభాషణము గావించి, 'సంబంధంబుసాప్తపదీనంబుగావున నింతతడవు నీతోడ గదిసి పలుకుచునికిం జేసి, ఏ నాప్తుండ గావున నొక్క మాట యడిగెద. బ్రాహ్మణజాతి స్వభావ సులభంబైన చాపలంబు జూచి హెచ్చుగుందాడం బనిలేదు. రహస్యంబు గాకుండెనేని జెప్పుమని, ఆమెస్థాయి, వైభవము, సౌందర్యాదికములను ప్రస్తావించి, అట్టినీకు తప మాచరింప వలసిన అవసరమేమి వచ్చినది, ఒకవేళ ఎవరినైన వరించి, ఈ తపము చేయు చుంటివా, ఒకవేళ అదియే కారణమైనచో, నేను బ్రహ్మచారినే, నన్ను వివాహమాడుము, లేక తపమే ప్రధానమైనచో నాతపములోని సగమిచ్చెదను, కావున తపోభిలాష మాను కొనవలసినదని నాడు.

మొదట ఆమె తపమెట్లు సాగుచున్నదని యడిగినాడు. ఇది తన కాశ్రయ మిచ్చుట కారణముగ, యోగక్షేమములను విచారించుచున్నట్లు, లోకసాధారణ రీతిలోనున్నది. కాని అతడు వచ్చిన పని వేరు. దాని కుపక్రమింప వలయును. మీద నడుగ బోవునది ఆమె వ్యక్తిగత విషయము. దానిని ప్రస్తావించుటకు కొంతచనవు. అధికారము లుండవలయును. పూర్వ పరిచయము లేదు. కనుక మొదటి దానికి స్థితి లేదు. రెండవ దానికి ఎట్లును ఆస్కారము లేదు. తా వచ్చిన పనిసాధించుటకు

మార్గము లేదు. క్షేమ సమాచారములతో సంభాషణముగిసినది. కొనసాగించుట ఎట్లు. దానికి ప్రాతిపదిక చనవు. అదిలేదు. మరి దీనిని పొసగించుట ఎట్లు. దానికి తానామెకు ఆప్తుడనని చెప్పుచున్నాడు. పూర్వ పరిచయమే లేనప్పుడు ఆప్తత్వమునకు స్థితి లేదు. దానిని స్థాపించుటకు రెండు కారణములు చూపుచున్నాడు. అందొకటి సంబంధంబు సాప్తపదీనం బనుట. రెండవది ఇంత తడవు ఆమెతోడ కదిసి పలుకుట ఈరెంటివలన తానాప్తుడనని చెప్పుచున్నాడు. ఇక అడిగెడుమాట, ఆమె వ్యక్తిగతము. అనగా తాను స్థాపించుకొన్న ఆప్తత్వమునకు వెలియైనదన్నమాట. దానిని పొసగించుటకు. తాను బ్రాహ్మణుడగుట, ఆజాతికి చాపల్యంబు, స్వభావ సులభంబులని సమర్థించు కొనుచున్నాడు. అయినను రహస్యము కాకున్నచో మాత్రమే చెప్ప వలసిన దనుచున్నాడు. బ్రాహ్మణజాతికి చాపల్యంబు సహజమను మాట శ్రీనాథమహాకవి మరియొక తావునను ఉట్టకించివాడు. అది కాశీఖండమున. చాపల్యము మానవ సాధారణ లక్షణముగా కాక, బ్రాహ్మణులకే ననుటలో శ్రీనాథుని తలంపు మేధావి తనమని ప్రాకరణికముగ దీని కర్థము. సంబంధంబు సాప్తపదీనంబు, అనుటలో ఏడు మాటలు కలసి మాటాడుట వలన సంబంధము కలుగుచున్నది. అనగా పరిచయము. లేక మిత్రత్వము. మరియొక పద్ధతిలో సాప్తపదీనమున కర్థము ఏడడుగులు కలసి నడుచుట. దీని వలనను సంబంధమేర్పడును. అది వివాహసంబంధి. కల్యాణ క్రతువున నిది యొక భాగము. అగ్నికి ప్రదక్షిణము చేయుచు, వరుడు, వధువు చేత చెప్పించు వచనములలో ఇది గలదు. ఇచ్చట ఈ రెండును కలవా లేక మొదటిది మాత్రమేనా అనునది ప్రశ్న. మొదటిది లేదని కాదుగాని, రెండవదానికే సందర్భమున్నట్లు గోచరించుచున్నది. ఎట్లనగా, తరువాతి వచనమున, ఇంతతడవు గదిసి పలుకుచు నికింజేసి యనుటవలన, వచో సంబంధమైన సంబంధము, దీనివలననే సిద్ధించు చున్నదిగదా, కనుక మొదటిదాని కంటె రెండవదానికే (వివాహసంబంధము) ప్రాముఖ్యమున్నట్లనిపించును. నిజమున కది సరికాదు. ఏడుమాటలుకలసి మాటాడి నంతమాత్రముననే సంబంధమేర్పడు చుండగా, ఇంతదనుక నీతోడమాటాడుచున్న కారణముగా, నేను ఆప్తుడనైతిని అని చెప్పుటయే సహజము. దీనిని సాధించినది, 'సంబంధంబు సాప్తపదీనంబు గావున నింతతడవు' అనుటలో కావున పై గల ద్రుతము. అయితే, వివాహసంబంధమేనను విషయము ఇందు ధ్వనించు చున్నదనుటలో సందేహము లేదు. తరువాతి కథనమున అతడే వివాహ ప్రసక్తి చేయుచున్నాడు. ఇప్పటి కది మాయావటువు రూపముననే అయినను, ఉద్దేశింప బడిన కథేతి వృత్తి మదియే గదా! సంబంధ శబ్దమునందే వివాహమను నర్థము గలదనుటకు లోకమే ప్రమాణము. సంబంధము స్థిరపడినది, లేక ఇంకను స్థిరపడ లేదనుమాట, వివాహవిషయ

ప్రస్తావనమున ప్రచారములో నున్నదియే. అందువలననే, దాయబంధువులను, వివాహము వలన ఏర్పడు బంధువులనే సంబంధబంధువు లనుట జరుగు చున్నది. మిగిలినవారు లౌకిక బంధువులు లేక,కారణ బంధువులగు చున్నారు. ఈ కారణముగను, తరువాతి కథాసంబంధమైన విషయమువలను, వీరిరువురికి వివాహ మగుటయు నిశ్చయము గనుకను, శ్రీనాథుడు రెండర్థములు గలసివచ్చునట్లు, ఈపదబంధమును ప్రయోగించినాడు. ఈ విధముగా భవిష్యర్థ సూచనము గావింప బడుచున్నది. ఇట్టిదానిని శ్రీనాథుడు మరియొక చోటను ఈ గ్రంథమునందే, కిరాతార్జునీయ ఘట్టమున గావించినాడు. అర్జునుని పరీక్షింపదలచి, యర్జునుని యుద్ధమున కాహ్వానించుచు, ఒకవేళ తానుచెంచువాడు గనుక, తనతో యుద్ధముచేయ సంశయించునేమో యని, చెంచని నన్నుంజూడకు, వంచింపకు హీనజాతివాడని, సంగ్రామాంచలమున నిదె నను మెప్పించెదవే నపుడు నిన్ను సెబాసందున్, అనినాడు. ఇది అప్పటి సందర్భమునకు తగినట్లు మాట్లాడినట్లు కన్పించును గాని, నన్ను మెప్పించినచో సెబాసందుననుటలో, నీవు కోరుచున్న పాశుపత మిత్తునను సూచనయు గలదు. లేకున్న కేవలము అతడు సెబాసన్న, ఇతనికి ఒరిగిడిదేమున్నదిగనుక. ఇట్లు భవిష్యవృత్తాంతమును సూచించుట కావ్యములందు కన్పించుటయు సాధారణము. కాని అత్యంత సహజముగా, అప్రయత్నముగా దొరలినట్లు. పదబంధ మతుకుట మహాకవులకు సహజము. ఇట్టిది వారు కావలసియే చేసినారనియు తలంపవలసిన అవసరము లేదు. మహానుభావుల వచనమునకు అన్యథాత్వంబు సిద్ధించునా!

ఇక ఏడుమాటలు కలసి మాటాడిన మైత్రి ఏర్పడుననుట భారతముననను ప్రసక్తమైనది. ఆరణ్యపర్వ షష్ఠాశ్వాసమున వ్రీహిద్రోణాఖ్యానమున దేవదూత, ముద్గలుని కడకు వచ్చి దివిజలోకమునకురమ్మని యాహ్వానింప, ఆలోకమెట్టిది, వినవలతును, అందులగుణ దోషంబులెఱింగింపవలయు" ననిముద్గలుడడిగినాడు. అచ్చటను ఇట్టిదే సందర్భము. వారిరివురికి పూర్వపరిచయము లేదు. తెలియవలయు ననెడి కోర్కెముద్గలునికి కలదు. దానిని పాసగించుటకు, అనగా, దేవలోకమునకు కోరి పిలువ, ఈ సంవాదమేమియని దేవదూత కెచ్చుట కోపము వచ్చునోయని, దానిని నివారించుటకు ముద్గలుడు పై వచనమునకు సత్పురుషులతోడి మైత్రి సాప్తపదీనం బనిచెప్పుదురు గావున, బురస్కరించి అడుగుచున్నానని నాడు. దీనిని బట్టి సాప్తపదీనంబుమైత్రికి మూలమని బోధపడుచున్నది. నంబంధమున కెట్లు (వివాహమునకు) మూలమైనదో ముందు చూచితిమి. శ్రీనాథుని వచనమున రెంటికిని స్థితిగలిగినది. ఇట్టిది మహాకవుల నిజవృత్తి. మహద్వృత్తి.

# చేమకూర చమత్కృతి

చేమకూర వెంకటకవి పేరు తలచినంతనే, మన తలపు లోనికి వచ్చునది ఆయన విజయవిలాసం. ఆయన మరోరచన సారంగధరచరిత్ర, కాని రసికత నిండిన రచన విజయవిలాసం. అతివేలమైన శృంగారరచనలు వెలువడిన కాలం తంజావూరు నాయకరాజుల పాలనాకాలం. సాహితీ, సమరాంగణచక్రవర్తిగా పేరు గన్న శ్రీకృష్ణదేవరాయలకు అన్ని విధముల దీటైనవాడు తంజవూరి నేలిన రఘునాథ నాయకుడు. కృష్ణాధ్వరి, రామభద్రాంబ మధురవాణి మున్నగు విద్వత్కవులను తన ఆస్థానమున నిల్పిన రసిక కవిరాజశేఖరుడతడు. రఘునాథనాయడెంతటివాడనగా, "నేరుతునని మాటాడగ, వారిజభవు నంత వానివశమే తంజావూరి, రఘునాథనాయని గారి సభను అంటాడు కవి చౌడప్ప. రఘునాథనాయకుడు తనవాల్మీక చరిత్రలో కవిత్వలక్షణాలిలా వుండాలంటాడు.

చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు, కుంకుమపైపై
గుప్పిన క్రియ, విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనన్ కవిత్వము సభలన్.

అదిగో! అలాంటి రాజకవి సత్తముని తన కావ్యకృతితో అలరించినవాడు ఈ చేమకూర వెంకటకవి. మరి ఈతడెంతటి వాడన

ప్రతిపద్యము నందుఁ జమ
త్కృతిగలుగం జెప్పనేర్తు వెల్లెడ బెళుకే
కృతివింటి మపారముగా
క్షితిలో నీమార్గమెవరికిన్ రాదుసుమా.

అని రఘునాథ భూవరుని చేత మెప్పుపొంది నంతటివాడు. తా రసపుష్టిమై, బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమత్కారము నర్థగౌరవముఁగల్గ ననేక కృతుల్ ప్రసన్న గంభీర గతిన్ రచించి మహిమించిన రసికాగ్రణుడైన రఘునాథనాయని చెవిసోకగా చెప్పిన కృతి ఈ విజయ విలాసము.

నిజమునకు జాతివార్తా చమత్కారాలు లేక కృతి నిలువదు. అది సామాన్యమే. కాని ఇచ్చటి విశేష మేమన అది ప్రతిపదం లోను భాసింపచేయడం. కృతికర్త, కృతిభర్త

ఇరువురు, ఈచమత్కారం ప్రతిపదంలోను, అంటే ప్రతి పద్యంలోను భాసించాలనే భావించారు. ఇక వారి కవనం ఆమాటకు సరిపడిన సంగతి గాక ఎట్లుండును. అదిగో ఆవైనం తెలిసే ప్రయత్నమిది. చేమకూర చమత్కారాన్ని తెలిసేముందు, ఆయన ఇంటిపేరు నూతగా గొని, పండిత విమర్శకులు గావించిన చమత్కారం గమనిద్దాం. చేమదుంపలకూరపై మక్కువ గొన్న ఒకరు ఆతని కవిత్వం పాకానపడిందన్నారు. ఆ కూరంటే ఇష్టపడని మరొకరు, ఇంటిపేరు నసగావున్నా, కవిత్వం పసగావుందన్నారు. ఇంకొకరు ఇంకోఅడుగు ఇదే మార్గంలో ముందుకువేసి చక్కెరమళ్లలో అమృతం పారించి పండించిన చేమకూర యిది అన్నారు. ఇంతకు ఇన్నింటికి కారణ మైనది వేంకటకవి ఇంటి పేరైన చేమకూర. దానిని ఖాద్యశాకంగా భావించి పై విధంగా చమత్కరించారు. చమత్కారంగా భావించి నంతవరకు వచ్చు ఇబ్బంది లేదుగాని, నిజంగా ఆయన ఇంటిపేరు శాకసంబంధియే నను కుంటే మాత్రం పొరపాటే. నిజానికి చేమకూర, చేమకూరుకు ఔపవిభక్తిక రూపం. దాని పూర్వరూపం చేమకుర్రు. ఇదొక ఊరిపేరు. పండిత లోకంలో ఇలాంటి తబ్బిబ్బులు, మారుపాట్లు చాల వున్నాయి. పాలకురికి సోమనాథుని ఇంటిపేరుకు, తెలంగాణంలోని పాలకుర్తికి సామ్యాన్ని ఊహించి, సోమనాథుడు పాలకుర్తి వాడని చెప్పారు. నిజానికి ఈ పాలకురికి, మనకు సరిహద్దున గల సేలంజిల్లా ధర్మపురి తాలూకా గ్రామం. అనంతామాత్యుడెంతో స్పష్టంగా చెప్పినా, ఆయన ఊరిపేరు ఉయ్యూరుకు సమీపంలోని పెనమకూరుగా గుర్తింప లేక పోయారు. నాదు, కవిత్వంబు నిజంబు కర్ణాటభాష యని శ్రీనాథుడంటే, అదేదో విడమరచి చెప్పలేక, కర్ణే అటతీతిః కర్ణాట భాష అంటే కాబోలు ననుకున్నాం తప్ప, తనది దక్షిణ తీరాంధ్ర భాష అంటున్నాడని గ్రహింప లేక పోయాము. కర్ణాట మంటే, నేటి కన్నడదేశమనే భావన తప్ప, ఆ కన్నడదేశాన్ని శ్రీనాథుడు గజ కర్ణాటకం అంటే పీఠభూమినందలి కర్ణాటక మని సంభావించాడని గ్రహింప లేక పోయాము. ఇలాంటి వెన్నో! ప్రకృతము చేమకూర చమత్కృతి.

లోకంలో ఒకతీరువుంది. ఒకవిషయాన్ని ఇతరులకు చెప్పడంలో ఒక్కొక్కరి దొక్కక్క తీరు.ఇదిపూర్తిగా వైయక్తికం. తీరు ఏదైనా విషయం చెప్పడం ప్రధానం. కాని కొందరు చెప్పే తీరులో కొంత విలక్షణత చోటు చేసి కుంటుంది. లోకులు ఆ చెప్పే తీరును శాణతన మంటారు. నాగరకంగా నైతే చమత్కారమంటాము. వింటున్నప్పుడు దానిని గుర్తు పట్టగలం. పట్టు బట్టి ఉదాహరణ లివ్వమంటే కష్టం. కారణం అదిచెప్పేతీరులో, మాటవిరిచే పద్ధతిలో, ధ్వనిపై ఊనిక కలిగించడంలో, కొంతమ్రింగి వేయడంలో, కావాలని తొట్రుపాటు స్ఫురింప చేయడంలో-ఇలా, పలువిధాలుగా భాసిస్తూ వుంటుందది. అయితే ఇదంతా వాచిక మయినప్పుడే. వ్రాతలో దానిని గుర్తు పట్టడమెలా! శ్లేషనయితే గుర్తుపట్టవచ్చు. మరి ఇతర ఛాయలనెలా గుర్తు పట్టడం. మరోమార్గం లేదు. కేవలం కవి అంతరంగాన్ని ఆకళింపు చేసికోవడం తప్ప. అంటే పాఠకుడు మానసికంగా కవికి దగ్గర కావాలి. కవి భావ ఛాయా చాలనంతో తాదాత్మ్యం

పొందాలి. దానినే మనవాళ్లు సహృదయత అన్నారు. అప్పుడు మాత్రమే కవి పాఠకునికి అందివస్తాడు. ఆతని చమత్కారము భావవీథిలో సాక్షాత్కరిస్తుంది. గుర్తు పట్టదగినంతగా అనుభవం లోనికివస్తుంది. పైలక్షణాలకు, సామెతలు, జాతీయాలు తోడైతే అదిగొలిపే హాయి ఇంతటిది అనిచెప్పడం మాటలలో సాధ్యమయేదికాదు. అయినా వలుకాడనేర్చినవారం. పలుక కుండా ఉండలేము. ఇతరులతో. పంచుకోకుండాను ఉండలేం. ఆ చాపల్యమే ఈ వ్యాసంగానికి మూలం.

అనేకానేక కారణాల వలన వెంకట కవి కృతులు రెండింటిలో ప్రసిద్ధి నందినది విజయవిలాసం. ప్రతి పద చమత్కారానికిది తార్కాణగా నిలిచింది. విలాస నామక గ్రంథాలలో శ్రీనాథుని హరవిలాసం మొదటిది. ఆ హరుని మెప్పించిన విజయుని విలాసమది. అది స్థూలంగా భక్తికి కుదురు. కాగా ఇది రక్తికి నెలవు. ఈ రక్తి ముచ్చటగా మూడైన మూడు ముళ్ల బంధంతో, ముడివడినది. మూడాశ్వాల మేర వ్యాపనం కలిగింది. కథ ఎల్లరకు విదితమే. కథనం వేంకట కవికి మాత్రమే ఎరుకైనది. ఏ తదనుభవం మనందరిదీ. ఉలూచి, చిత్రాంగద, సుభద్రలను అర్జునుడు వివాహం గావడం ఇందలి ఇతివృత్తం. భారతాంతర్గతం. ఈ విషయాన్ని చిత్రీకరించడంలో వెంకటకవి ప్రతిభావ్యుత్పత్తులు గోచరిస్తాయి. అవి ఆయన ఊహలో, పదాల పొహళింపులో, లోకోక్తుల ఉపయోగంలో, శ్లేషను ఉపయోగించడంలో ప్రతిఫలించాయి. కావ్యాన్నంతటిని సమీక్షించడం పీఠికను సంతరించడ మవుతుంది అయినా పక్వాన్న పరిశీలనకు ఒక్క మెతుకు చాలుగదా!

కావ్యప్రారంభం, అర్జునుని తీర్థయాత్రా సంరంభంతో. దానికి కారణం, విప్ర గోసంరక్షణార్థం. ఆయుధసేకరణనిమిత్తం, ధర్మరాజు క్రీడా మందిర సమీపానికి వెళ్లడం: తమలో తాము ఏర్పాటు చేసికొన్న నియమం ప్రకారం అర్జునుడు తీర్థయాత్ర కుద్యుక్తుడు గావడం. ఇదీ మొదలు. దీనిని, పాండవుల రాజధాని యైన ఇంద్రప్రస్థపుర వైభవ వర్ణనతో ప్రారంభంగావించాడు వెంకట కవి. కాగా, సాధారణంగా, కావ్య కథావస్తువును మొదటనే ఛాయా మాత్రంగా సూచించడం కవి సమయం. ఇచ్చట చేమకూర వారి ప్రస్తావన గమనిద్దాం.

ద్వారక ముద్దు జెల్లెలట తన్నగరీమణి, సృష్టియన్నిటన్
దేరుగడైనచో నిదియ నేర్పుల మేరని యెంచిచేసెఁబో
ధారుణి విశ్వకర్మ, గుఱి దానికి నెక్కడ నీడులేని సిం
గారము గల్గుటట్లు వెనుకన్ సృజియింపక యుండుటయే సుమీ.

వైభవంలో ద్వారకకు దీటైనది ఇంద్రప్రస్థం. ఇక దానితో మరేది సమానం కాకూడదని విశ్వకర్మ ఇంకే నగరాన్ని నిర్మించలేదుసుమా. అంతేకాదు. దాని కంటె మిన్నగాను నిర్మించాడు. ఇంకో దాన్ని నిర్మించే ప్రయత్నము ఎన్నడు చేయ లేదు, అనేది వక్తవ్యాంశం. అయితే కవి దానిని ఎలా చెప్పాడంటే, ఈ ఇంద్రప్రస్థం ద్వారకకు

ముద్దు చెల్లెలని. ద్వారకకు సరిపోలిందని చెప్పాడనటానికి ఈ ముద్దు చెల్లెలనే మాట ఉపయోగించాడనేది సాధారణమైన మాట. ఇంద్రప్రస్థం గొప్పదనం చెప్పడం ఇలాగే చెప్పనక్కరలేదు. ఎలాగైనా చెప్పవచ్చు. కాని ఇలా చెప్పడంలో విశేషముంది. అర్జునుని యాత్రాప్రారంభం ఇంద్రప్రస్థంనుండి. ముగింపు ద్వారకతో. సుభద్రను వివాహమైంది అక్కడ. అంటే ఇతివృత్తం యొక్క ఆద్యంతాలు ప్రస్తావించడం జరిగింది. మరో విశేషమేమంటే. ద్వారకకు అధినేత శ్రీకృష్ణుడు. సుభద్ర ఆతని అనుంగు చెల్లెలు. కావ్యేతివృత్త అంతిమఫలం సుభద్రార్జునుల వివాహం. ద్వారక ముద్దు చెల్లెలు అనే పదబంధ ప్రయోగం వలన పాఠకుల మనసులో జరుగనున్న యావద్వృత్తాంతాన్ని సూచన ప్రాయంగా తెలియజేశాడు కవి. ఇదొక చమత్కారం. అలాగే యాత్రోన్ముఖుడైన వేళ అతనితో పౌరులు సేవకులూ మొదలైన వారు బయలుదేరారు. అర్జునుని ఈ ప్రయాణం, పరిణయమౌట కేగు గతిని భాసించిందంటాడు కవి. తీర్థ యాత్ర అభిలషణీయమే అయినా కొంత క్లేశ కారణమే. కాని పెండ్లికి బయలుదేరడం, అందులో కొంత పథ క్లేశమున్నా. ఆనందంగానే వుంటుంది. ఇక్కడ ఈ యాత్ర పెండ్లికి బయలు దేరి నట్లుందనడంలో కేవల క్లేశరాహిత్యాన్ని, దానిపై అభిలాషనువ్యక్తం చేయడమేగాక, అర్జునునికి జరుగనున్న వివాహాలను సూచించినట్లయింది.

అలా తీర్థసేవనం చేస్తూ. గంగ సమీపానికి వచ్చాడు అర్జునుడు. అతణ్ణి చూచి వలచింది, నాగకన్యయైన ఉలూచి. ఇంకేమి! కోరిన మగవాడు తీయన. ఆతని చెక్కిళ్లను, మోవిమెఱుంగును, రూపసంపదను మెచ్చుకుంది. తీరుతీయానికి ఆశ్చర్యపడింది. ఇక అలాంటి వాడికి కాకపోతే తనహృదయాన్ని ఎవరికి సమర్పించడం అనుకుంది. ఇక్కడ కవి ఆమెనోట పై భావాన్ని ఇలా పలికించాడు. అమ్మకచెల్ల నా హృదయమమ్మక చెల్లదు వీని కియ్యెడన్' అని ఇందుమొదటి అమ్మకచెల్ల ఆమెపొందిన ఆశ్చర్యాను భూతికి అక్షరరూపం. ఆమొత్తం పదబంధానికి కేవలం 'దు' అనేవర్ణాన్ని చేర్చి, అమ్మకచెల్లదు అనే క్రియార్థరూపాన్ని సంధానించాడు. సహృదయుల చేత సెబాననిపించుకున్నాడు. మొదటిక్షణంలో ఆపదం పునరావృతమవు తోందనిపిస్తుంది. ఆవెంట చేరిన అక్షరంతో, మొదటి దానికి ఏమీ సంబంధం లేనిదిగా రూపెత్తి, మొత్తం మీద వెంకటకవి చాణతనానికి తార్కాణగ నిలిచింది.

ఇక చిత్రాంగదను గూర్చి చెప్పే సందర్భంలో ఒక కంద పద్య ముంది. అందు చిత్రంగద వాతెఱకు అమృతము, మేని మిసిమికి తొలకరిమెరుపులు, చేతులకు పద్మములు, సాటి అని ప్రతిపాదించాడు. ఇంతమాత్రము చెప్పడంలో పెద్ద ప్రత్యేకత ఏమీ లేదు. అయితే దానికిది చాటువ అని చెప్పడానికి తులా శబ్దాన్ని గ్రహించాడు. తుల అంటే త్రాసు అని తెలిసిందే. త్రాసుచేసే పని తూకపురాయికి, తూచవలసిన ద్రవ్యానికి భారంలో సమానత్వాన్ని చూపడం. కనుకనే తుల్య శబ్దానికి సమానభావన ఉద్దిష్టమయింది. ఇక వెంకటకవి పలికినతీరు గమనిద్దాం.

వాతెఱకు నమృతమేతుల
మేతులకింపుల పిసాళిమిసిమికి క్రామ్మం
చేతుల, చేతుల కబ్జము
లేతుల లేతుల వెలందు లీ చెలితులయే.

ఈపద్యం మొత్తంలో తుల అనే అక్షరాలు ఏడుమారులు ఆవృత్తమైనాయి. కాని ఆ రెండక్షరాల పొందికతో ఏర్పడు తులా శబ్దం, త్రాసు అనేభావనలో నాలుగు మార్లు మాత్రమే కన్పిస్తుంది. మిగిలిన మూడు పర్యాయాలు ఇతరములైన అక్షరాలతో కలసి వేరువేరు పదాలైనాయి. అవి తులకింపులలోనితుల. చేతులలోని తుల, ఏతుల లోని తుల. ఇది పదాల లోని కొన్ని అక్షరాల సమానత్వాన్ని ఆధారం చేసికొని సాధించిన చమత్కారం. ఆ సాధనలో అనాయాసంగా అందివచ్చిన శబ్దాలంకారాలు ముక్తపదగ్రస్థ ఛేకాను ప్రాసలు. అర్థాలంకారం ఉపమ. అలాగే, తనతో వచ్చిన విశారదుని, చిత్రాంగద తండ్రివద్దకు పంపే సందర్భంలో చెప్పిన పద్యంలో మరోవిధమైన చమత్కారాన్ని అందించాడు.

అపుడున్నరుడు ప్రఫుల్ల నవాంబుజప్ర
సన్నముఖుడయి మలయధ్వజ క్షితీశ
కమలహితునకు మామకాగమన వార్త
దెలుపు మనుచు విశారదు పిలిచి పనిచె.

ఇందలి నృపుడు అర్జునుడే. ఈ సమయాన అతడు ప్రఫుల్ల నవాంబుజ ప్రసన్నముఖుడు. మలయధ్వజుడు చిత్రాంగద తండ్రి. అతడు ప్రభువు కనుక క్షితీశుడని చెప్పట. ఆతడెంతటి వాడంటే కమలహితు నంతటివాడు. అంటే సూర్యునితో పోలిక. మరి అంబుజములకు అంటే కమలములకు హితుడైన వాడు కమల హితుడు. అంటే సూర్యుడేగదా! భావిని కాగల చిత్రాంగద వివాహాన్ని పురస్కరించుకుని, ప్రఫుల్లనవాంబు జముఖుడైన అర్జునునికి సూర్యతేజంతో ప్రకాశంచే మలయధ్వజుడు హితుడవు తాడు. ఇంతమాత్రం ఎవరు మాత్రం చెప్పలేరు గనుక అని అనిపిస్తుంది. అయితే వెంకటకవి ప్రత్యేకత ఇలాంటి పోలిక కల్పించాలను కోవడంలో వుంది. ఆ పోలికను సమర్థించడానికి తగిన పదజాలాన్ని ఎన్నుకోవడం. దానికి తగిన కవి సమయాన్ని పాటించడం. ఇంతకు, ప్రతిపాదిత విషయం, తన రాకను ఆ రాజుకు ఎరుక, పరుప మనడం. దానికి అతడు కావించిన పద సంయోజనం మామకాగమన వార్త తెలుపు మనేది. మామక అంటే నాదైన, ఆగమనాన్ని తెలుపు మనుమాట. దీనిని సరసులు ఇలా చమత్కరించారు. మామకు అంటే తన కుమార్తైయైన చిత్రాంగదను ఇవ్వడంవలన మలయధ్యజుడు, అర్జునునికి మామ కానున్నాడు. అదిగో ఆ మామకు తన రాకనుతెలుప మన్నాడు. ఇంకా పెండ్లికాలేదు. గదా! ఇప్పటికిప్పుడే మలయధ్వజుని మామ అనడం ఎలా కుదురుతుందని, పైవ్యాఖ్యానానికి కొందరి ఆక్షేపణ. అంటే

కవి భావనలో ఈ చెప్పిన భావన లేదనడం. పై పదబంధాన్ని అలా కాక, మామకాగ, మనవార్త తెలుప మన్నాడనే భావనలో భావన చేసి చూడమని చెప్పిన వారూ ఉన్నారు. అంటే మలయధ్వజుడు తనకు మామ అయ్యేట్లుగా, అంటే దానిని పొసంగించేటట్లుగా 'మన' అంటే తననుగూర్చిన సమాచారాన్ని అతనికి అందించ మని విశారదునికి అర్జునుడు చెప్తున్నాడని భావింపమన్నారు. పెళ్లికాకుండానే మామ అనడం కుదరదని, మామ అయ్యేట్లుగా చూడమని చెప్పుట మేలని, ఈ అర్థం చెప్పిన వారి ప్రతిపాదన. కాని ఉద్దిష్టార్థం మాత్రం తనరాకను తెలుప మనడమే. ఆ తరువాతి రెండర్థాలు పాఠకలోకం ప్రతిపాదించినవి. ఆ అర్థాలు వెంకట కవిభావనలో ఉన్నాయా లేవా, ఉంటే రెండూ ఉన్నాయా, రెంటిలో ఏదో ఒకటి మాత్రమేఉందా, అయితే అది ఏది - ఇదీమీమాంస. దీని నెవరు తీర్చి చెప్పగలరు. వేంకటకవి లేడాయెను. కేవలం శ్లేష అయితే కవిహృదయం తెలిసి పోతూనే ఉంటుంది. కాని ఇదిశ్లేషకాదు. పదసంయోజనం కల్పిస్తున్న సంధిగ్ధత. ఇలాటి చోట్ల కవిహృదయం కంటె, పాఠకుల ఉపజ్ఞ బలిమిని సంపాదిస్తుంది. అవకాశమున్నన్ని భావనలు అందు ప్రతిపాదింప వచ్చును. మనం తేల్చుకోవలిసింది కవి భావన ఏమిటనేదికాదు. ఇన్ని భావనలకు చోటిచ్చిన పద సంయోజనం, దానిని సందర్భాను గుణంగా ప్రయోగించిన కవి నైపుణ్యాన్ని. ఆక్షేపణంటారా! ప్రతిపద చమత్కృతిని సాధిస్తానన్న కవిగారిమాట ఎలాగూవుంది. ఇక్కడ ఆలోచింపవలసింది కథా గమనపు ముందు వెనుకలుగాదు. ఆతని చమత్కార నైపుణ్యాన్ని మాత్రమే. ఇదిలా వుంటే ఇందులో వున్న మరోవిశేషం. వార్త పద ప్రయోగం. పైకి కేవలం తన రాకను గూర్చిన సమాచార మనే భావనలో వార్త పదం ఉపయోగించి నట్లు కన్పిస్తుంది. కాని ఇక్కడ 'వార్త' పదప్రయోగంతో నిమిత్తంలేకనే, పైభావాన్ని చెప్పవచ్చు. అంటే ఆగమనాన్ని తెలుపమంటే చాలు. పద్య మెలా పూర్తవుతుందనే ప్రశ్నవస్తుంది. సమర్థుడైనవాడు ఏ ఛందంలో నైనా తన భావాన్ని ఒదిగించ గలడు. దానిని, మరికొన్ని విశేషాలను చేర్చి పెద్ద వృత్తంలోనూ చెప్పగలడు. అయినా ఇవన్నీ, ఆలోచించుకుని పద్యం చెప్పడం జరుగుతుందా! కవితాధార జాలు వారాలి తప్ప. ఇక అసలు విషయానికి వద్దాం. లోకంలో ఒకమాట వుంది. చిన్న సమాచారాన్ని గూడ పెద్ద వార్తగా, సంచలనం కలగించేటట్లు, వినేవారికి అదేదో పెద్దవిశేషంగా ధ్వనించేటట్లు చెప్పే సందర్భాన్ని 'వార్త' పదంతో సంభావించడం. ఇక్కడ తన ఆగమనాన్ని ఒకవార్తగా, అంటే గొప్ప చేసి చెప్పమనడం. వెంకటకవి ఇంత ఆలోచన చేసి దానిని అలా ప్రయోగించాడా అని అడిగితే, మళ్లీ పై సమాధానమే వర్తిస్తుంది. అది, మన ఊహాపోహ విచార మనేది. ఇలాటి చమత్కారాలు చేమకూరవారిలో అడుగడుగునా కన్పిస్తాయి.

చిత్రాంగద నుద్వాహమైన, పిదప అర్జునుడు మెల్లగా ద్వారక చేరుకున్నాడు. అక్కడ వుంది సుభద్ర. ఆమెపై ఎప్పటి నుండో మరులు గొనియున్నాడు. కొంత కథాక్రమం

గడిచిన తరువాత, ఒకనాడు, చిక్కిన ఏకాంతపు వేళ, ఆమాటా ఈమాటా అడిగినట్లుగా, అర్జునుని గూర్చిన సమాచార మడిగింది సుభద్ర,యతి రూపానవున్న అర్జునుణ్ణి. మొత్తం మీద ఆమె మనసు గ్రహించాడు. అక్కడొక పద్యాన్ని ఇలా తీర్చాడు. వెంకటకవి.

అని రాజవదన మాటికి
ననురాగము తేటపడగ నాడెడు మాటల్
విని జేజే రాకుమారుడు
వనజేక్షణ కనియె వలపు వడ్డికి బాఱన్.

ఇందలి రాజవదన, వనజేక్షణ, సుభద్ర. జేజేరాకుమారుడు అర్జునుడు. సుభద్ర మాటల్లో అర్జునుని మీది అనురాగం తేట పడింది. సువిదితమైంది. ఇకదాగుడు మూతలతో పనిలేదు. ఉన్నమాట గట్టిగా చెప్పవచ్చును. దీనికి వలపు అధికం కాగా అని అర్థంచెప్పడం జరిగింది. ఆధిక్యభావన కాలంబనం వడ్డి శబ్దం. అది వృద్ధి సంబంధి అని తెలిసిందే. కూర్చిన అర్థం సమంజసంగానే వున్నట్టు భాసిస్తోంది. కాని కొంచెం పర్యాలోచన చేస్తే. ఆ అర్థం సాసాయించదు. కారణమేమంటే వలపు పారుతోంది. ఎక్కడికి. వడ్డికి. పారుశబ్దం గమనార్థకం. ఆ పారుట దేనికి? వడ్డికి. అంటే వలపు పారుటకు ఫలం వడ్డికి చేరుట. ఈ వివేచనలో వృద్ధ్యర్థం పొసగదు గదా! మరి దీనినెలా అర్థంచేసికోవాలి. ఇంతకూఈపదబంధం ఈయ నొక్కడే ప్రయోగించలేదు. తంజావూరు సాహిత్య మంతటా కన్పిస్తుంది. అహల్యా సంక్రందనంలో, వైజయంతీ విలాసంలో కూడ ఈ పదబంధం కన్పిస్తుంది. తత్పూర్వం అన్నమయ్యలో కూడ. అన్నింటా ఒకటే సందర్భం. నాయికా నాయకుల ప్రణయోద్వేగ సంరంభ సందర్భమే. వలసినంత వలపు వృద్ధి అప్పటికే వుంది. ఇక కావలిసింది ఆపైది. అదే - సమాగమం. అదిగో అటువైపు, ఆదిశగా దానికి పారుతోంది వలపు. వడ్డిశబ్దానికి సమాగమం అనే అర్థాన్ని ఏలా సంఘటితం చేయడం. దానికా అర్థం లేదు. అయితే ఆశబ్దం హలాదిగా కాక అజాదిగా ఒడ్డు అని చదివితే ఆ అర్థం సిద్ధిస్తుంది. ఆ పదానికా అర్థం తెలుగున లుప్తమైంది. కన్నడంలో వుంది. ఇది చమత్కారానికి నిదర్శనం గాకపోయినా, చక్కని జాతీయ ప్రయోగానికి నిదానమైనది.

ఇలాంటి జాతీయాలు ఎన్నింటికో తావలమైనది విజయవిలాసం ఈతకు మిక్కలిలోతుగలదా, మోక్షమునకు మోర లెత్తుకొని పోవుట, రేకమోవక, ఏనుగుపాడి, పంచబంగాళమై పారు, పెట్టనికోట, పిలువని పేరంటం, అనవలసి అంటినిగాక, ఎయ్యెడమేలె చూతురు, గమనింపరు జారుపాటులున్, ఇల్లటపల్లుడు, వ్రాతఫలంబు తప్పునే, కాయోపండో పోయిన పని, పలుకు బంగారు, ఈదాడంటే కోదాడనుట, తికమకలు చేయవలదు, - ఇలా ఎన్నో ఆయన ప్రబంధంలో కన్పిస్తాయి. అవి రసజ్ఞులైన పాఠకులు ఎవరికి వారుగా చదివి ఆనందిపవలసినదే. ఇదికేవలం విహంగ వీక్షణం మాత్రమే.

# సరమ వృత్తాంతము

సరమ ప్రసక్తి మహాభారత ప్రథమాశ్వాసమున గలదు. శౌనకాదుల కోరికపై ఉగ్రశ్రవసుడు మహాభారతమును విన్పింప ప్రారంభించి, ప్రస్తావ వశంబున శమంతక పంచక వృత్తాంతమును వివరించి అందు కురు పాండవులు యుద్ధము చేయుట కారణముగా, నది కురు క్షేత్రంబయ్యెనని, అట్టి కురుక్షేత్రమున జనమేజయుడు దీర్ఘసత్రమను యజ్ఞము చేయుచున్నాడనియు చెప్పెను. ఆయజ్ఞ సందర్భమున, సరమ యను దేవశుని కొడుకు సారమేయుండను వాడు క్రీడార్థము రాగా, వానిని జనమేజయుని తమ్ములు బాధించిరనియు, అది పోయి, తల్లికి మొఱ్ఱపెట్టుకొనగా, సరమ వచ్చి, రాజా, నీతమ్ములు దయమాలి, అనపరాధియైన నా కుమారుని బాధించిరి. ఇదితగును, ఇది తగదని ఆలోచింపక, సాధులకు పేదలకు అపకారము గావించిన దుర్వినీతులకు అనిమిత్తాగమంబులైన భయములు ప్రాప్తించునని చెప్పి అదృశ్యమైనది. ఇంతమాత్రము సరమ వృత్తాంతము. ఆ పిదప జనమేజయుడు యాగ సమాప్తి గావించి, సరమ వచన ప్రతీకారార్థంబు శాంతి పౌష్టిక క్రియలు నిర్వర్తించినాడు. అట్లు రాజ్యంబు సుఖంబుగా సేయుచుండ ఒక్కనాడు అతని యొద్దకు ఉదంకుడు వచ్చెను. ఆతరువాత ఉదంకుని కథ, రురునికథ, గరుత్మంతునికథ, ఆస్తీకునిజననము, సర్పయాగము, దాని ఉపసంహృతి - ఈవిధముగ ప్రథమ ద్వితీయాశ్వాసములు నడచి ముగిసినవి.

ఈ కథా ప్రస్తావనమున సరమ ప్రసక్తియేల. దీని వలనకథకుడు ఆశించిన ప్రయోజన మేమి. మొదలు ఈ సరమ యెవరు. వీనికి సమాధానములు తెలియక మీది వృత్తాంతము సమముగ బోధపడునది కాదు. పేదలకు సాధులకు అపకారము చేసిన అనిమిత్తాగమములైన భయంబులు కలుగునని సరమవచనము. నిమిత్తాగమ భయము కానిండు, అనిమిత్తాగమమైన భయము కానిండు, భయము కలుగునని చెప్పరాదా! ప్రత్యేకముగ అనిమిత్తాగమంబులైన భయములు కలుగునని చెప్పుటలో విశేషమేమై యుండును. ఈ మాటను చెప్పించుటకు సరమను ఎన్నుకొనుటలో

విశేషమేమి. నిమిత్తాగమ, అనిమిత్తాగమములని భయమును రెండువిధములుగ వర్గీకరించుటలో ప్రయోజన మేమి. మొదట భయ మనగా నేమి. అది ఉత్పన్న మగుటకు కారణమేమి. ఈ ప్రశ్నలకు సమాధానము తెలిసి, పిదపసరమ వృత్తాంతము నారయుదము.

భయము రెండు విధములని చెప్పుటకు కారణము, భారతకర్త అనిమిత్తాగమములగు భయములు కలుగుననుట. దీని వలన నిమిత్తాగమ భయములు కలవని తెలియుచున్నది. ఇక భయమనగా నేమో తెలిసికొందము. యాదృచ్ఛికముగా నొక సర్పమును చూచితి మనుకొందము. దానివలన భయము కలిగె నందుము. అట్లే ప్రయాణమున ఒక ప్రవాహమును గమింప వలసి వచ్చినది. అది ఎంత లోతైనదో తెలియదు. తెలిసినను కొందరికి నీటిలో దిగుటకు భయ ముండును. ఒక వేళ పడవ యున్నను, దానిపై ప్రయాణించుటకును కొందరు భయపడుదురు. రాత్రివేళ సంచరించుట కొందరికి భయము. శవమును చూచుట మరికొందరికి భయము. ఇట్లు అనేకసన్నివేశములలో భయమున కాస్కార మున్నట్లు, ఒకాఒక మానసిక వికారము (భావము) భయమని సంభావింప బడు చున్నట్లు మన అనుభవము చెప్పుచున్నది. నాట్యశాస్త్రమున భరతుడు దీనిని (భయమును) ప్రస్తావించి యున్నాడు. కొంత జాగ్రత్తగా పరిశీలించినచో. చాలసన్నివేశములలో మనకు కలుగునది భయము కాదని, త్రాసము మాత్రమేనని, మరికొన్ని సందర్భములలో జుగుప్సయు భయ శబ్దముతో సంభావించు చున్నామని తెలియును. అయినపుడు భయమునకు, త్రాసమునకు భేదముండ వలయును. భేదమున్నదనుట స్పష్టము. అది ఎట్టిదియో తేటపడవలసి యున్నది. సర్పమును చూచితిమి. అదిమనను చూచినదో, లేదో తెలియదు. కాని, దాని దర్శన మాత్రము చేతనే, ఒక విధమైన మానసిక వికారము మనలో కలుగు చున్నది. అది మన కపకారము చేయునేమో ననెడు శంక. మరి ఇట్టి శంక కుందేలును చూచిన ఏల కలుగుట లేదు. పులిని చూచిన, సర్పమును చూచి నప్పటి వలెనే అనుభూతి నందుచున్నాము. దానినే భయశబ్దముచే సంభావించు చున్నాము. నిజమునకు ఇచ్చట కలిగిన అనుభూతి భయముకాదు. భయమునకు కారణ ముండును. త్రాసమునకు కారణ ముండదు. సర్పము కారణము కాదా యనిన కాదనియే సమాధానము. అది కారణమే అయినచో, కుందేలును కారణము కావలయును. అంతేకాక సర్పమును మనము చూచితిమి. అది మనను చూడక పోయినను, భయము కలిగినదని చెప్పుటగలదు. అది నిన్ను చూడకున్న దాని త్రోవన అదిపోవును. అట్లు జరుగుచు న్నదియు మన అనుభవమే. ఒక వేళ చూచినను,

దానికి మనము ఆహారముకాదు. అది మనపైకి ఏలవచ్చును. ఎప్పుడువచ్చును. దానికి నీవు అపకారము తలపెట్టిన, అది ప్రతీకారము తలపెట్టును. కాకున్న పసిపిల్లలు పాముతో ఆడుకొనుట ఎట్లు సంభవించు చున్నది. ఇట్టి వృత్తాంతములు మనము వినుచుంటిమిగదా! మన మేమియు చేయకున్నను, అది నా వెంట పడినదని చెప్పుట కలదు గదా యందురు. ఇది కూడ నిజమే. మరి ఈ రెంటిని పొసగించుట యెట్లు? మన మేమియు చేయని మాట మన వరకు నిజము. కాని దర్శనమాత్రము చేత మనలో కలిగిన వికారము చేత, శరీరావయవములలో కలిగిన కదలిక, తన కపకారము తలపెట్టినామను భావము సర్పమునకు కలిగిన ఏమగును. ప్రతీకారమునకు పూనుకొనును. అట్లుగాక దానిని చూచినను, నిర్వికారముగ, స్థాణువుగ మనము నిలిచిన, అదియు అట్లే మనను చూచి, దాని త్రోవన అదిపోవును. ఇట్టివృత్తాంతములు మనము వినుచున్నాము. దీనికి కారణము ఆత్మసాక్షాత్కారము. అనగా మనము దానిని సర్పముగ గాక, మనవంటిదే ననుభావముతో దానిని చూచిన, అదియును మనలను దాని వంటి దానిగనే గమనించును. అనగా ఇచ్చట జరుగుచున్నది భౌతికస్వరూపమును చూచుటగాక, అందలి ఆత్మను దర్శించుట. అప్పుడు భేదము లేదు. దానియందును, మనయందును ఉన్నదొక్కటియే అయినపుడు, ఇక పై విధమైన మానసిక వికార వ్యాపారమునకు తావు లేదు. అనగా భయము లేదు. త్రాసము లేదు. ఏదియును లేదు. ఉన్నదొక్కటియే. అదియే, ఆత్మ వత్ సర్వభూతాని అనుటలో ప్రతిబింబించు చున్నది. అనగా మనలో వికారము కల్గిన, తత్ప్రతి వికారము లేదా, తత్సమమైన వికారము ఎదుటి వానియందు కలుగును. ఇది భయ త్రాసాది భావములకు కారణ మగుచున్నది. కేవలము మనము చూచి, అది (సర్పము) మనను చూడకయే, మనలో కలిగిన శంక, త్రాసము. అది చూచినను, మనము నిర్వికారుల మైన, అదియు నిర్వికారమునుపొందిన, ఆత్మవత్ సర్వభూతాని యనునది ప్రవర్తనీయ మగుచున్నది. మనలో కల్గిన వికారము, దానికి శంక కలిగించి, అది ప్రతీకారమునకు పూనుకొనుట వలన మనకు కలిగినది భయము. నిజమునకు మొదట భయ పడుచున్నది సర్పమే. అనగా, దానికి మనమేదో అపకారము తలపెట్టు చున్నామను భావన దానికి భయమును కలిగించినది. అనగా మనలో కలిగిన వికారము దానికి మనమే ప్రతీకారము కలిగించు చున్నామను భావన కలిగించు చున్నది. దానివలన భయము కలుగుచున్నది. ఆవెంట దానికి చేతనైన పద్ధతిలో ప్రతీకారము చేయ ప్రయత్నించు చున్నది. లేకున్న మనవలెనే దానికిని త్రాసమే కలిగెడిది. మనకు కలిగిన త్రాసము వలన మనమేమి చేసితిమి. పారివచ్చితిమి. దానికి భయమనిపేరు పెట్టితిమి. దీనిని మరియొక ఉదాహరణముతో పరిశీలింతము. ఒకరికి మనవలన అపకారము జరిగినది. అనగా ఆ అపకారమునకు మనము కర్తలము. దాని కతడు ప్రతీకారము

గావించునని మనము శంకింతుము. ఇది భయము. కాని సర్ప విషయమున అట్లుగాక, సర్పదర్శన మాత్రము వలననే మనకు భయము కలిగిన దని చెప్పుచున్నాము. ఇచ్చట ప్రతీకారమునకు స్థితిలేదు. మనము పారి వచ్చితిమి. అది ఏమైనదో మనకు తెలియదు, ఇక అది మనకు తారసపడునని చెప్పుటకును లేదు. అయినను ఆ సన్నివేశ ప్రసక్తి ఎప్పుడు వచ్చినను, ఆ సందర్భమున 'భయము' కలిగినదనియే చెప్పుచున్నాము. పై ఉదాహరణము వలన ప్రతీకారమున్నచోట మాత్రమే భయము కలుగునని, లేని చోట కలుగుచున్నది త్రానము మాత్రమేనని స్పష్టమగు చున్నది. కాని చాలసందర్భములలో త్రానమే, భయముగ సంభావింప బడుచున్నదని తెలియుచున్నది. అయితే ఒకసందేహము. సర్పవిషయ సంబంధమైన ఉదాహరణ పులికిని వర్తించునా యని? మిదుమిక్కిలి దానికి మనము ఆహారము కూడ. కనుక దాని వలని (అనగా అట్టిజంతువుల ప్రవర్తనము; ఎట్లుండునో మనకు పూర్వము తెలిసి యుండుట) మనకు అపకారము నిత్యము. ఆ సందర్భమున మనకు కలిగినది ఏమి. ప్రాణహాని జరుగు నున్నదను విహ్వలత. అంతేకాని దాని నుండి తప్పించుకొనివచ్చి. భయము కలిగినదని చెప్పుటకు అస్కారమే లేదు గదా. అట్లుగాక దానిని దూరముగా గమనించి పారివచ్చిన (పులిమనను చూడకున్న) అప్పటి వికారము తిరిగి త్రాసమేయగును. నిర్వికారమే అయిన వెనుకటి వక్కణము ఇచ్చుటకును వర్తించును. ఇది భయ నిర్వచనము.

ఇక నిమిత్త, అనిమిత్తాగమ భయము లనగా నేమో చూతము. పైచెప్పిన దానిలో, అనగా ఒకరికి మనము అపకారము చేయుటవలన, అతడు మనపట్ల వర్తింపనున్న తీరును గూర్చినశంక, దానివలని ఫలము నిమిత్తాగమ భయము. పులి విషయమున కలుగుచున్నది అనిమిత్తాగమము. కారణము, అది మనపై ప్రతీకారము, తీర్చుకొనుటకు అంతకుముందు దాని పట్ల మనము చేసిన అపరాధ మేమియును లేదు. దాని ఎదుట పడుటయే తప్ప అన్యకారణము లేదు. అట్టి స్థితికి మనము లోనగుట కేవలము ప్రారబ్ధము. ఇది కర్మములు మూడింటిలో నొకటి. తక్కిన రెండును ఆగామిసంచితములు. ప్రారబ్ధమునకు కారణముండదు. అది వర్తమానమే. కనుక, అందు ఏకారణము కనుపించి, అట్టి భావనకు లోనగుచున్నాము. కాని ప్రారబ్ధము నకును, సంచితము కారణమగును. సాధారణముగ సంచితమును, పూర్వ జన్మగత కర్మముగ సంభావింతురు. అదినిజము. కాని ప్రారబ్ధము ఈ జన్మమందలి సంచితము. ఈ జన్మము నందలిదే యైన, అది ఎట్టిదో మనకు తెలిసియుండ వలయునను శంక కలుగును. దానిని నివృత్తి చేయుటకు సరమ వచన ముపయోగించును. అనగా

కారణము విస్మృతమై, కార్యము మాత్రము కలుగుట. కాని సాధారణ వ్యాపారము కార్యకారణ సంబంధియై యుండునుగదా! పులి వలని కలుగబోవుచున్న ఆపదకు, తత్కాలీన కారణము ఎట్టిదియు లేదు. కార్యము మాత్రము స్పష్టమగుచున్నది. అది దాని వలని కలుగనున్న హాని. ఇది అనిమిత్తాగమ భయము. అనగా, ఇప్పటి హానికి నిమిత్తము ఏమో తెలియ వచ్చుట లేదు. కాని కార్యము (హాని) జరుగుచున్నది. దీనినే సరమ వచనము సమర్ధించు చున్నది. అనగా దైనందిన వ్యవహారములో, మనము అనేక కార్యములు చేయుచుందుము. దాని ఫలితములను అనుభవింతుము. అట్టి వానిలో కొన్నింటికి మన జ్ఞప్తి వలన కారణము కనుగొందుము. అనగా మననము చేసికొనుట వలన ఇది సంభవించును. కాని కొన్ని మననమున కందిరావు. అనగా అప్పటి కది సాధారణవ్యాపారము. స్మృతిపథముపై ముద్ర వేయునంతటి బలమైనవి కావు ఆకార్యములు. అనగా అవి అనంతర కాలమున హాని కలిగించు కారణములుగా పరిణమించు ననెడి ఊహయును మన కుండదు. అందువలన జ్ఞప్తి యుండదు. అట్టవానిలో నొకటి పేదసాదలకు చేయు నపకార మొకటి. వారు మనకంటె బలహీనులగుట మనపై ప్రతీకారము చేయలేరు, అందువలననే మనకు భయము కలుగదు. ఆ కారణముగనే అది మన స్మృతి పథము నుండి తప్పుకున్నది. కాని ఫలిత మిప్పుడు కలుగుచున్నది. ఇదిగో ఇట్టిది జరుగునని, అనగా అనిమత్త భయములుత్పన్నమగునని సరమహెచ్చరించినది. ఇది నిమిత్త అనిమిత్తాగమ భయ వివరణము. ఇక దీనిని సరమ ముఖమున ఏల చెప్పింప వలసి వచ్చినదో చూతము.

సరమ కుమారుడు సారమేయుడనువాడు జనమేజయుడు యాగము చేయుచున్న ప్రాంతమునకు (కురుక్షేత్రము) క్రీడార్థము వచ్చినాడు. దానికి హాని కలిగించినారు జనమేజయుని సోదరులు. దానివలన ఏమైన అశుచి కలుగవచ్చునని వారూహించి యుండవచ్చును. అందువలన దానిని వారు తరిమి కొట్టి యుండ వచ్చును. ఇది లోకసహజమే. కాని దాని నడచిరని కవి వచనము. అచ్చోటికి రాదగునో కూడదో, దానికి తెలియదు. దాని ప్రకృతి ప్రకారము అదినడచు కొనినది. అది దేవశుని కుమారుడుగదా! అంతమాత్రము తెలియదా యని యడుగవచ్చును. నిజము. కాని వయసును పరిగణింపవలయును గదా! యుక్తాయుక్త విచారము ఎప్పుడు చేయ గలుగుదుము. కొంత వ్యక్తత కలిగినతరువాత. అది సారమేయము నందు లేదు. క్రీడార్థమని చెప్పుటలో అది వయసున ఎంత పిన్నయో తెలియుచున్నది. అట్టిదానిని బాధించినారు రాజసోదరులు. అది పోయి తల్లికి మొఱ్ఱ పెట్టుకున్నది. అంతట సరమవచ్చి, 'కడు నకరుణాన్వితులై నీ తమ్ము లతివివేకదూరుల్ మతి దలపక నాపుత్రకు నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్' అని అనుటలో, సారమేయము

వయసు, అతని అనపరాధిత్వము, రాజసోదరుల ప్రవర్తనము నందలి దురుసు తనములు వ్యక్త పరుపబడినవి. అందువలన ఆమె ' తగునిది, తగదని యెదలో వగవక సాధులకుఁ బేదవారలకెగ్గుల్ మొగి జేయు దుర్వినీతుల కగు ననిమిత్తా గమంబు లయిన భయంబుల్ అనినది. ఇది మొగిజేయు ననుటవలనవారు ప్రయత్నపూర్వకముగనే, ఎట్టి అపరాధము సారమేయము నందు లేకయే, దానిపట్ల అపకారము చేసిరనియు, వారు దుర్వినీతు లనుటలో, అదివారినైజమని స్థిరపరుపబడినది. ఇక్కడ ప్రతీకారము చేయ సారమేయము అశక్తుడు. కనుకనే తల్లి కడకు బోయి మొఱ్ఱ పెట్టినది. ఇట్టి అశక్తుల యెడ, పేదసాదల యెడ, మనము చేసెడి అపకారము, భవిష్యమున భయ హేతువగును. అప్పటికి దాని నిమిత్త మేమిము గోచరింపదు. కనుక అనిమిత్తముగ కనిపించును. అట్టిదే నీకును కలుగును సుమా అని సరమ శాపము. అనగా కవి అనిమిత్తాగమ భయమేల, ఎట్లుకలుగునో చెప్పుట ఆశయముగా, ఈ వృత్తాంతము నెన్నుకొనినట్లు కన్పించుచున్నది. ఇది కొంత వరకు సత్యము. కారణము అనిమిత్త భయములు, పేదసాదల కెగ్గు సేయుట వలన సంభవించును. దీనిని సంఘటించుటకు, అట్టిపాత్రను ఎన్నుకొనవలెను. కనుక అశక్తుడు బాలుడునైన సారమేయము, తగుపాత్రమైనది. వారి పట్ల ఎగ్గుసేయుటకు దుర్వినీతులైన రాజసోదరులుండిరి. సారమేయము పోయి తల్లికి మొఱ్ఱపెట్టుట వలన, పై శాపపూర్వక వచనము చెప్పుటకు, సరమ కారణమైనది. ఇది యిట్లు సంఘటింప బడినదని వ్యాఖ్యానించుట కారణముగ నిది సత్యముగ పొడకట్టును. అందువలననే కొంతవరకు సత్యమనుట జరిగినది. వాస్తవమున కది సత్యముకాదు. భారత కర్త వ్యాసభగవానుడు. తద్వృత్త మిట్టిదని ఆయనచెప్పుచుండగా. దానికి మన ఊహాపోహ విచారములు సాగించి వ్యాఖ్యానించుట ఎట్లు? కనుక ఈ వృత్తాంతమును కథనము గావించుటలో వేరొండు కారణముండవలయును. దానిని గమనింప కున్న పై వ్యాఖ్యానము సరియైనదనిపించి, ఉద్దేశితాంశము బోధపడదు. ఒకవేళ పై వ్యాఖ్యానము సరియైనదే అని భావించినను, దానికి సరమనే ఏల ఎన్నుకొన వలయును. ఇట్టిదే మరియొక దానిని కల్పింపరాదా వ్యాసభగవానుడు. కల్పింప వచ్చును. నిజమునకు భారతమును వ్యాసుడు కల్పించెనా లేక, జరిగిన వృత్తాంతమును కథనము చేసెనా? ఇది సహృదయులు ఎవరికివారు ప్రశ్నించుకొని, సమాధానము నన్వేషించు కొనవలయునే తప్ప, ఒకరి సమర్థనము పై ఆధారపడ తగినది కాదు. భావించినవారికి భావించినంత. అది అట్లుండ కల్పన అయినను సరమనే ఏల ఎన్నుకొనెనో గమనింతముగాక.

సరమ శాపవచనము వలన జరిగిన దేమి. జనమేజయు డంతటి వాడు ఆ వచనములకు భయపడి శాంతి పౌష్టిక క్రియలు అతిప్రయత్నమున చేసివాడు. అనగా జనమేజయు నంతటి వానికి భయము కలిగిన దనిన, సరమ వచనమునకు అన్యధాత్వము కలుగదని, అది ఆమె వచించిన ప్రకారము జరుగునని జనమేజయునకు తెలియునని దీనివలన వ్యక్తమగుచున్నది. అనగా ఆమె అంతకు తగినదని అతని విశ్వాసము. కనుక దీనిని సంఘటించుటలో, ఎవరో ఒకరు, ఏదో ఒక అనురూప వృత్తాంతము కాక, సమర్థమైన దానినే ఎన్నుకొనవలెనని తెల్లమగుచున్నది. దానికి తగినది సరమ (ఒకవేళ కల్పితమైనను) అని వ్యాసభగవానుని ఆశయమై యుండవలయను. జరిగినదే కథనము గావింపబడిన దని భావించువారికి పై వ్యాఖ్యానముతో పనిలేదు. కాని రెండు సందర్భములకును పనికి వచ్చు అంశము ఒకటియే. అది సరమ సామర్థ్యమే, దానిని, సంఘటింపబడుటకగు, వివరణము. ఇక ఈ సరమ ఎవరు. ఇంతటి శక్తి ఆమెకు ఎట్లు సంభవించినదో తెలియనగును.

దీనికి సరమ దేవశుని యని ఒక్కమాట చెప్పిన చాలును. దేవశుని యగుట, ఆమెకు అంతటి శక్తి సిద్ధించెనను వివరణము చాలును. దీనికి సరమయే యేల కావలయును. మరియొకరిని ప్రస్తావింపరాదా! యనిన సరమ ఎవరో తెలియ వలసియున్నది. మహాభారతమున ఇంతమాత్రము కలదు. కాని ఈమె ప్రస్తావన ఋగ్వేదము నందును, వరాహపురాణము నందును గలదు. "కిమిచ్ఛన్తీ సరమా ప్రేదమానద్ దూరేహ్యధ్వాజగురి: పరాచై: కాస్మేహితి: కాపరిత్యనీత్ కథం రసాయా అతర: పయాంసి". (ఋగ్వేదము 10-108-1)

సృ 'గతేధాతువునకు' అమచ్ ప్రత్యయము చేసిన సరమ సిద్ధ మగును. ఈ సరమను నిరుక్త కారులు మాధ్యమికవాణిగను, ఐతిహాసికులు దేవశుని గాను చెప్పుట జరిగినది. మాధ్యమికవాణి యనగా మేఘ గర్జనము. అనగా ఉరుముట. చాలదినములుగా వర్షములేదు. ఆకస్మికముగా ఒకనాడు మేఘము లావరించినవి. వాని గర్జనమువిని, చాల కాలము తరువాత, ఆకస్మికముగ ఈ మాధ్యమిక వాణి ఎట్లు సంభవించినదని ఆశ్చర్యము కలిగినదని, దానినుద్దేశించి, చాలరోజుల తరువాత దీనిని వినుచున్నాము. అంతరిక్ష నదీజలములను ఎట్లు గమించినది. ఇప్పుడు ఏమి కోరి వచ్చినది. అని పై మంత్ర భావము. ఇతిహాస పక్షమున అసురులు దేవతల గోవులను అపహరించి నపుడు, ఇంద్రుడు వాని నన్వేషింప సరమ అను కుక్కను వారికడకు పంపెను. అప్పుడు అసురులు సరమతో, నీవేమి కోరి మాచోటికి వచ్చితివి. ఇంద్రలోక మిచ్చటికి చాలదూరము. ఎక్కువ దూరము నడువగలవారు తప్ప దీనిని గమింపలేరు. మా వలన నీకు ఏమి కావలసియున్నది. మార్గమున రాత్రి ప్రయాణము

సుఖముగ జరిగినదా! దారిలో గల నదులను ఎట్లు దాట గలిగితివి. అనునది దీనిభావము. వరాహ పురాణమున దీనినే కొంత ప్రపంచీకరించుట జరిగినది. పై గోవుల అపహరణము. తరువాత, ఇంద్రుడు, వాటికి కాపున్న సరమను గోవులను గూర్చి ప్రశ్నింప, నాకు తెలియదని చెప్పెను. అంతట, కాపున్న దానికి తెలియక, ఎవరికి తెలియును. అసురుల వద్ద లంచము పుచ్చికొని, ఇది ఈ పని చేసినది. నాలుగు తన్నిన నిజము బయటపడునని సలహానిచ్చిరి. ఇంద్రుడట్లు చేయ సరమ నిజము చెప్పినది. అంతట వానిని తిరిగి తేవలసినదిగా దానినే నియోగించెను. దానికి సరమ నేను వెళ్లినచో నా సంతానమునకు ఆకలి ఎట్లుతీరును. గోక్షీరము నిప్పింపు మని కోరగా, ఇంద్రు డట్లు చేసెను. ఇది వరాహపురాణ కథనము. దీని వలన సరమ ఎవరో, ఆమె ఎట్టి శక్తి సమన్వితురాలో తెలియుచున్నది. అట్టిది గనుకనే జనమేజయుడు దాని వచనమునకు భయపడి శాంతి పౌష్టిక క్రియలు జరిపించినాడు.

ఇంతటితో సరమ వృత్తాంతమును ముగింపవచ్చును. కాని ఉగ్రశ్రవసుడు భారత కథను విన్పింతునని, దానిని సరమతో ప్రారంభించుటకు కారణమేమి. భారతము వ్యాసకృతము. దానిని జనమేజయునికి చెప్ప వైశంపాయనుని నియోగించివాడు. దానిని వినివచ్చిన ఉగ్రశ్రవసుడు శౌనకాదులకు చెప్పుటకారంభించినాడు. నిజమునకు మహాభారత కథనము జనమేజయుడు సర్పయాగము చేయ ప్రారంభించి, అది ఉపసంహృతినందిన తరువాత, అతడు వ్యాసభగవానుని తన పితృపితామహుల వృత్తాంతమును వివరింపుమని కోరుట జరిగినవేళ, దానిని చెప్పుమని వైశంపాయనుని నియోగించెను. అతడు, వ్యాస జనన మాదిగా చెప్పుట కారంభించెను. దానిని విని వచ్చిన ఉగ్రశ్రవసుడును దాని నట్లే ప్రారంభింపవచ్చును. కాని అతడు దానికి పూర్వము సరమ వృత్తాంతము కథనము గావించినాడు. దీనికి కారణమేమి. ఇది తెలిసిననే సరమ వృత్తాంత కథన ప్రాముఖ్యము తెలియరాదు. అది ఇట్టిది.

జనమేజయుని సర్పయాగము కడ చనక, మధ్యలోనే ఉపసంహృతినందినది. దానికి కారణము అస్తీకుడు. ఆతడెవరో వివరించుటకు జరత్కారు వృత్తాంత మవసరమైనది. ఈ వృత్తాంత ప్రస్తావనము వలన వాసుకి, ఆదిశేషుల ప్రసక్తికలిగినది. ఆకారణముగా కద్రూ వినతల వృత్తాంతము, గరుత్మంతుని వృత్తాంతము చెప్పవలసివచ్చినది అనగా ఆస్తీకుని వృత్తాంతము కథనము గావించుటకు ఇంత నేపథ్య మవసర మైనది. ఇంతకు మూలము జనమేజయుని సర్పయాగము. అతడు దాని నేల చేయవలసి వచ్చినది. ఉదంకుని ప్రేరేపణ. దానిని చేయింప ఉదంకునికి గల కారణము తాను తన గురుపత్నికిచ్చిన మాట చొప్పున, పౌష్యునికడకుపోయి, ఆతని భార్య నడిగి కుండలములు తెచ్చునపుడు తక్షకుడు వాని నపహరించుట.

దాని కారణముగ జనమేజయునికి సర్పయాగబుద్ధి పుట్టించినాడు. ఇది ఉగ్రశ్రవసుడు చెప్పగా వినిన శౌనకాదులు, అట్లయిన సర్పములు ఎట్లు బ్రతికి బయటపడినవి అని ప్రశ్నించిరి ఆస్తీకుని వలన యని చెప్పుచు. దానిని నతడెట్లు గావించెనో యను దానికి ఉపమానముగా, తొల్లి రురుండను భృగువంశజుడు సర్పములను దండించు చుండగా, సహస్రపాదుడెట్లు ఆపెనో, అట్లే ఆస్తీకుడును ఆపెను అని చెప్పెను. ఈ కారణముగా రురుని కథ చెప్ప నావశ్యకమైనది. ఏమైనను ఉదంకుడు ఇందు ప్రధాన భూమిక వహించి యున్నాడు. ఎవరీ యుదంకుడు. పైలుని శిష్యుడు. అంతమాత్రమేకాదు. పంకజభవ సన్నిభుడు, అఘపంకక్షాళన మహాతపస్సలిలుడు. అనాతంకమతి. గురువునకు పరిచర్యలొనర్చి అపరిమిత నిష్ఠాపరుడై జ్ఞానము బడసినవాడు. అదియును గుర్వనుగ్రహముచే, అణిమాదికాష్ట గుణములతో, గురుకార్యమును నిర్వహించి, గుర్వర్థంబునందు ఋణవిముక్తుడై, పిదప ననేక కాలంబు తపస్సు చేసిన వాడు. (ఇతడు శ్రీకృష్ణుని యాక్షేపించు నంతటి శక్తిమంతుడు నని, ఆనుశాసనికమున తెలియగలదు). అట్టి ఉదంకుడు, తక్షకుడు తనకు గావించిన అపకారము మనసు నందుంచు కొని ప్రతీకారము చేయ నిశ్చయించినాడు. అది తానై చేయదగినది కాదని పూర్వము తేలినది. కనుక సమర్థుని నియోగింప వలయును. దానికి సమర్థుడు జనమే జయుడని భావించినాడు. జనమే జయుని యందు ఏగుణములు గమనించి ఆతడు సమర్థుడని భావించియున్నాడో తెలిసినగాని, అతడట్లు భావించుటకు కారణము తెలియదు. అతడు ప్రతిహత శత్రువిక్రముడు. పాండవ వంశవివర్ధనుడు. సువ్రతుడు. అనవద్య విదూరుడు. ఉదారకీర్తి నిర్మిత వివిధాధ్వరుడు. ఉత్తమ స్తుతమతి. తనకార్యము ఆతనిచే నిర్వర్తింప చేసికొనుటకు ఇవిచాలునా! ఇంతమాత్రమేకాదు. అతడు ప్రతీకారార్థంబును కొన్ని చేయగలడు. అవి సరమవృత్తాంతమున శాంతి పౌష్టిక క్రియలు. కనుక తగు కారణమున్నచో దానికి ప్రతీకారము చేయ నుత్సాహము కలిగిన వాడు జనమేజయుడు. ఉదంకు డట్టి కారణము నిరూపించినాడు. ఒకటి తక్షకునివలన తనకైన యపకారము. ఆ తక్షకునివలననే, జనమేజయుని తండ్రి పరీక్షిత్తు మరణించుట యనునది రెండవది. దీనికి ప్రతీకారము చేయసంకల్పించినాడు జనమేజయుడు. అచ్చట సరమ వచనమునకు ప్రతీకారము. ఇచట తనతండ్రికిని, ఉదంకునికి గలిగిన అపకారమునకు ప్రతీకారము. అనగా ప్రతీకారము రెంటియందును సామాన్యము. ఇది ఆతని నైజము. రెండవది పేదసాదల పట్ల సమభావము. సరమచెప్పినదిముందు తెలిసియున్నాము. సాధులకెగ్గు తాను చేయకపోయినను, తనసోదరులు చేసినను పరోక్షముగ తాను కర్త. అది సరమ అతనికిచ్చిన శాపమువలన, దానినుండి ఉపశమనము పొందుటకు

శాంతి పౌష్టిక క్రియలు తానై నిర్వర్తించుట వలన రూఢమైనది. సారమేయము వయసును బట్టి, అర్హతను బట్టి, అతడు పేద సాధువు నైనవిషయమును సరమ నిరూపించినదానిని, సమముగా గ్రహించినాడు.

కనుక అతడు సాధుమతమైన దానిని ఆచరించునని తెలియుచున్నది. నిజమునకు, ఈ మాట జనమేజయుడే చెప్పియున్నాడు. సర్పయాగము చేయ నుద్యుక్తుడగువేళ, మజ్జనకునకు, ఈ ఉదంకునకు సాధుమతంబున సర్పయాగము ప్రీతి చేయగల వాడనని చెప్పియున్నాడు. ఈ వివరణము వలన మిగిలిన ఉత్తమ గుణములతో పాటు, అతని యందు ప్రతీకారము చేయుట యందు దృఢ నిశ్చయము, సాధుమతమైన దానిని గావించుటలో ప్రీతిగలవని తేలుచున్నది.

పైరెండు గుణములను అతనియందు గలవని నిరూపించుట కథాగతి కవసరము. దాని కొరకుగా, ఆ రెండును ఇమిడిన సరమవృత్తాంతము కథనము గావింపవలసిన అవసరమేర్పడినది. అతడట్టి వాడైననే, ఉదంకుడు, అతని దగ్గరకు వెళ్లును. వెళ్లిననే సర్పయాగముజరుగును. అదిఉపసంహృతి నందిన తరువాతనే, జనమేజయునికి, తనతాత తండ్రుల వృత్తాంతము వినవేడుక కలిగినది. ఇది మహాభారత కథనోత్పత్తికి మూలము. దీనికి నైపథ్యము నవదరించినది సరమ వృత్తాంతము. కనుక ఉగ్రశ్రవసుడు, శౌనకాదులకు మహాభారత కథను వ్యాసోత్పత్తితో గాక, ముందుగా దీనితో ప్రారంభించినాడు. ఇదియును వ్యాసకృతమే. అయితే మనుష్యలోకము నందలి మహాభారతమునకే ఇది వర్తించును. ఇతర లోకముల నెట్లు ప్రవర్తింప చేసెనో. దానికి ఆముఖ మెట్లు గూర్చెనో తెలియరాదు.

అది అట్లుండ, సరమ మాధ్యమిక వాణికి చెందినదని చెప్పుటవలన, ఆమె పితృదేవతావర్గమునకు చెందినదని తెలియుచున్నది. పితృదేవతలమాటకు, చేతకు ఎదురులేదు. కనుకనే జనమేజయుడు, ఆమె మాటకు అంతవిలువ ఈవలసి వచ్చినది. శాంతి పౌష్టిక క్రియలు జరిపింప వలసి వచ్చినది. పితృదేవతావర్గమన నెవరు. వారి వాక్కునకు అన్యధాత్వము కలుగకుండుటకు కారణమేమి. పితృదేవతల మహత్త్వమును రూపించిన ఘట్టములు మహాభారతము నందు రెండుగలవు. అవి, భృగు, భారద్వాజ వృత్తాంతములు. శ్రీనాథుడును హరవిలాసమునందు, పితృదేవతల ప్రసక్తిగావించినాడు. పార్వతి తల్లి మేనక. ఆమె పితృదేవతల కన్నబిడ్డగా చెప్పబడినది.



## పంచాస్త్రోప నిషద్రహస్య పరమ బ్రహ్మ స్వరూపంబు కాంచీ దామపదంబు

ఈ సమాసానికి ఆకరమైనది, వినుకొండ వల్లభరాయ కృతమైన క్రీడాభి రామంలోని పద్యం. ఈ కావ్యంలోని భాషా విన్యాసం వలన క్రీడాభిరామం వల్లభరాయ కృతం గాదని, ఇలాంటి అనేక పదాలు, పదబంధాలు, సమాసాలు శ్రీనాథుని కావ్యాలలో కన్పిస్తాయి గనుక, అది శ్రీనాథకృతమని, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తీర్మానించారు. దీన్ని మొత్తంగా అంగీకరించినా, అంగీకరింపక పోయినా, శ్రీనాథుని ప్రమేయం ఆగ్రంథ నిర్మాణంలో వుందని భావించడానికి అవకాశం లేకపోలేదు. ఆ అభిప్రాయానికి రావడానికి ఆస్కారమున్న పద్యాల్లో, పై సమాసం గల పద్యం కూడ దోహదం చేస్తోంది. దానికి ఆకరమైన పూర్తిపద్య మిది.

పంచారించిన నీ పయోధరము లాస్ఫాలింతునో, లేతబొ
మ్మంచుం గెంజిగురాకుమోవి ణిసి ధాత్వర్థంబనోనుష్ఠింతు
పంచాస్త్రోప నిషద్రహస్య పరమబ్రహ్మ స్వరూపంబు నీ
కాంచీదామపదంబు ము ట్టుదునొ యో కర్ణాట తాటంకినీ

ఈ పద్యంలోని 'ణిసి ధాత్వర్థమనుష్ఠింతునో' అన్న పదబంధాని కర్థం, నిన్ను ముద్దుపెట్టుకుందునా' అని. అలా వాచ్యంగా అనకుండా, 'ణిసి' అనే ధాతువు (ఈ ణిసి అనేధాతువుకు అర్థం ముద్దు) యొక్క అర్థాన్ని ఆచరింపనిస్తావా అని ధ్వనిపూర్వకంగా అడగడం, పండితకోటిచేత మెప్పుపొందింది.

ఇంతకు, ఇక్కడ సందర్భమేమంటే - మంచన శర్మ అనే బ్రాహ్మణుడు అతని వైశ్యమిత్రుడు టిట్టిభశెట్టి అనేవారు, నాటి ఆంధ్ర రాజధానియైన ఓరుగల్లుకు వెళ్లి, ఆనగరంలోని విశేషాలను పరికిస్తూ వెళుతున్న సందర్భంలో, త్రోవలో ఒక కర్ణాటస్త్రీ ఎదురుపడింది. ఆమె జార. ఆమెను చూచిన మంచనశర్మ, ఊరుకోకుండా పైపద్యం చెప్పాడు. పద్యభావం తేటతెలుగులో చెపితే కొంత ఎబ్బెట్టుగా వుండే మాట నిజం. అందుకే కవి దానిని అందరికి అందిరానీయకుండా, అంత సమాసభూయిష్ఠంగా,

అందంగా, సహృదయపండితుల మనస్సును ఆహ్లాదపరిచే విధంగా చెప్పడం జరిగింది. అయితే ఇప్పటి మన అవసరాన్ని బట్టి అర్థం చెప్పక తప్పని పరిస్థితి. బాగా విస్తరించియున్న నీ వక్షోజద్వయాన్ని మీటుదునా! నీ నునులేత పెదవులపై ముద్దుపెట్టుకొందునా! మన్మథవేదానికి ఆకరమైన నీ మొలనూలి శరీరభాగాన్ని స్పృశింతునా! అని, మనసులోని మాటను గడసరి తనంతో అన్నాడు. ఆమె అంతకంటె గడసరి. ఆ తబిసీళ్లు ఇక్కడ అనవసరం. అయితే కాంచీదామపదాన్ని, పంచాస్త్రోప నిషద్రహస్య పరమ బ్రహ్మస్వరూపంగా, అంటే ఆ శరీర భాగాన్ని మదనోపనిషద్రహస్య పరమబ్రహ్మస్వరూపంగా భావించడంలోని ఔచిత్యమేమిటి. నిజానికి పండితులు ఇక్కడ ఉపనిషత్తుల ప్రసంగం, బ్రహ్మముయొక్క ప్రసక్తిని ఆక్షేపించారు. దానిని, శ్రీనాథుడు శృంగారి కనుక, అలా వ్రాశాడన్నారు. అంటే శృంగారం పై లౌల్యం, అతని చేత ఈ పని చేయించిందని చెప్పడంజరిగింది. ఎలా చెప్పినా, ఇంతకు ఇది శ్రీనాథుని కల్పనమా, అంటే - కేవలం అతని లౌల్యమా లేక అతడు అలా వ్రాయడానికి ఏమైనా ఆకరముందా అనేది ప్రశ్న. దానికి ఆకరమున్నమాట నిజం. అది ఇది. అది కూడ సాధారణమైనది కాదు. ఛాందోగ్య బ్రాహ్మణ ప్రతిపాదన మిలా వుంది. బ్రహ్మదేవునికి రెండుముఖాలని, అందు ఒకముఖం వేదాలను చదువుతుందని, రెండవ ముఖం కన్యక యొక్క ఉపస్థేంద్రియమని, అది ఆనందేంద్రియమని దానితో బ్రహ్మ సంతానోత్పత్తి గావిస్తాడని ఆ ప్రతిపాదనం.

దీనిని బట్టి కావ్యకర్త ఉపనిషత్తుల ప్రసంగం చేయడం, పరమబ్రహ్మ స్వరూపంగా కాంచీదామ పదాన్ని అనుసంధానం చేయడంలో వైపరీత్యం లేదని, అది ఆతని లౌల్యం కాదని, సందర్భానుసారంగా చేసిన సంయోజనమని, అది అతనికి ఆయా బ్రాహ్మణాలతో గల అధికపరిచయానికి తార్కాణమని బోధపడుతుంది. కనుక వేగపడక వివరించుట ఎంతోమేలు. నిజానికి, క్రీడాభిరామం వల్లభరాయ కృతమైనా, ఏదో ఒక మేరకు శ్రీనాథుని ప్రమేయం అందులో కలదని చెప్పడానికి, ఇతరములైన ఉపపత్తుల కంటె ఇది మేలైన ఉపపత్తియని భావింపవచ్చు. మరిశ్రీనాథుడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు. సకల వేద పురాణాగమములను పారము ముట్ట అధ్యయనం చేసిన దిట్ట.

XXXXXX

## “సాదురేఁగె నేని న్వను తలపాలమునన కాని నిలువదు సుమ్మీ”

పై వక్కణము ఆంధ్రమహాభారతము ఉద్యోగపర్వ ద్వితీయాశ్వాసము నందలిదిగా, సాహితీ వేత్తలందరెరిగినదే. అట్లగుట తిక్కన పలుకిది యని వేరు చెప్ప పనిలేదు. దీనికాకరమైన పూర్తిపద్యమిది.

అనుజులకు నడ్డపడియే
ఘినిఁ జేయగనీమిఁ జూచి మెచ్చితి గాకీ
వును సాదురేఁగెనేని
న్వను తలపాలమునన కాని నిలువదు సుమ్మీ.

ఆంధ్రమహాభారతము, ఉద్యోగ, ద్వితీయ-13.

తెలుగు విశ్వవిద్యాలయము వారు ప్రచురించిన దాని యందును ఇది యిట్లే కలదు. శబ్దరత్నాకర కారులు కూడ ‘సాదు’ ఆరోపముకడ పై పద్యపాదము నిట్లే ఉధృతము గావించినారు. కనుక పై పద్యపాద విషయమున పాఠభేదము లేదనియే తలంపనగును. ఇందలి ‘సాదు’ శబ్దమునకు సాధువైన గోమహిష్యాదిక మని శబ్దరత్నాకరము. తన్మూలమున దీనికగు వివరణము, సాధువైన గోవు చెలరేగినచో, అనగా కోపించినచో తలపాలము (పొలిమేరయందలి, లేక దాని నంటి యున్న పొల మని శబ్దరత్నాకరకారుల భావన) చేరికాని నిలువదని. అనగా సహజముగ శాంత స్వభావము కలదియే యైనను, ఏకారణముచేత గాని దాని కాగ్రహము కలిగినచో, అందుకు బాధ్యులైన వారిని తలపాలము వరకు తరిమి గాని నిలువదు అని అర్థ వివరణము. లోకమునందు ఈ పద్యపాదమునకీ యర్థమే యిప్పటికి స్థిరమైనది. కారణము పాఠభేదము లేకుండుట. మరియొక వ్యాఖ్యానము ఇప్పటికి వినరాకుండుట. విచారము పై నిది సమంజసమైనది కాదేమో ననిపించుచున్నది. దీనికి ప్రతిపత్తి చూపుటకు పూర్వము ప్రాకరణికముగా దీని సందర్భమును పరికింతము.

సంజయుడు తన రాయబారమును ముగించి, హస్తినకు వచ్చి, ధృతరాష్ట్రునకు తా బోయి వచ్చిన విశేషములను ఎరిగించునప్పటి మాట ఇది. పాండవుల యౌదార్యమును, కౌరవుల దుర్మానమును ఏకరవుపెట్టు చున్నాడు. ‘నిన్ను, నీకుమారుని, దుస్సేనుడు, శకుని పట్టి యాడించు చున్నారు. పాండవులకు

యాగ్రహము గలిగిన మిమ్ములను ఒక్కక్షణంలో సమయింపగలరు. యుధిష్ఠరుని ఓర్పును, అతని అసమర్థతగా, భయముగా,మనవారలు తలంచుచున్నారు. "డీకొనఁగందగరే కొండంగని యోటమివెట్టి నట్లు కౌరవనాథా" అని దాని కొనసాగింపుగా మాట్లాడిన సందర్భంలో పైపద్యం చెప్పబడింది. పైదాని భావం, తమ్ములకు అడ్డుపడి, వారిని, నీకుమారులకు ఏవిధమైన ఎగ్గు చేయనీయకుండుట చూచి, నీవు బాగున్నది యని యనుకుంటున్నావు. కాని జాగ్రత సుమా! బాగా విను. ఆలకిస్తున్నావా! సాదురేగెనేని తలపాలమున కాని నిలువదు సుమా! అని సంజయుని హెచ్చరిక. ఇచ్చట సాదువెవరు. ధర్మజుడు. నిలువనిదేది. సాదువైన దానిస్వభావము. ఇది ధర్మజుని సైరణతోపోలిక. తలపాలమేది. మొత్తము కురువంశము, దానిమూలము. అనగా ఈ పోలికతో చెప్పదలిచినది నిసర్గముగ ధర్మజుడు సాదు. అంతంతమాత్రముచే అతనికి ఆగ్రహము కలుగదు. ఆ సైరణను, నీవు, నీవారలు అతని చేతగానితనముగా భావించుచున్నారు. కాని ఎంతటి సాదువుకు ఎప్పుడో ఒకప్పుడు, ఓర్పు నశించి ఆగ్రహం కలుగుతుంది. ఇక ఆ సమయంలో దానిని సమయింప జేయుట ఎవరి తరమును కాదు. అవతలివారి అంతు, పాతు, చూసి గాని విడువరు సుమా యని. పైపద్య పాదము, ఈ వివరణను బాధింపదు. కనుక వివరణము నందెట్టి వ్యాఘాతము లేదు. ఉన్న భేదము పద్య పాదమునకు చెప్పికొనుచున్న భావము నందే. దానిని చూతము.

ధర్మజుని 'సాదు' శబ్దముతో పోల్చిన, లేక సంభావించిన, అట్టి సాధువు రేగెనేని తలపాలమున అనగా - మీ యంతు చూసి కాని 'నిలువడు' అని అనవచ్చును. కాని తిక్కన గారట్లనుటలేదు. మహత్యర్థక ప్రత్యయము "డు" గాక, అమహదర్థక ప్రత్యయము 'దు' ప్రయోగించినారు. మహతి కిచ్చట ఆస్కారములేదు. వాస్తవానికి 'డు' ప్రయోగింపబడి యున్నచో, ధర్మజుని సాదుగా భావించుట కనువు ఏర్పడెడిది. అట్లగుచో మరియొక విచారవిమర్శకు తావును ఉండెడిది కాదు. కాని పాఠభేదములేక. 'దు' మాత్రమే కన్పించుచున్నది. కనుక తిక్కన హృదయమునందు 'సాదు' శబ్దమున సంభావింపబడినది ధర్మజుడు కాదనుట, నిక్కము. మరి ఏది ఇచ్చట ఉపాదేయము. ధర్మజుని గుణము. అది యుధిష్ఠరుని సైరణ. తిక్కన దీనికి ముందు పద్యమున ప్రయోగించిన దిదియే. అనగా ధర్మజుని సైరణ యనుగుణము నామవాచకమై, 'సాదు' శబ్దముతో పోలింపబడినది. అట్లగుచో, 'సాదు గుణము సాదువై నామవాచకముగా ఏల గ్రహింపరాదనవచ్చును. నిస్సందేహముగా గ్రహింపవచ్చును. అప్పుడు. 'సాదు' శబ్దమున కాకరమైన దేది. ఆ ఆకరమైనది, ధర్మజునితో పోలిక కెనయగును. దానిని 'సాదు' శబ్దముచే గ్రహింపబడుచున్న 'గోవు'ను గ్రహింపదగునా! గ్రహించినచో ప్రారంభమున చెప్పికున్న, లోకమునందు స్థిరమై యున్న భావనకు విఘాతము కలుగదు. కనుకనే ఆ అర్థము స్థిరమైనది. కాని ఒక యిబ్బంది కలదు. అది (గోవు) ఆగ్రహించిన వేళ తలపాలమునే ఏల నిలువ వలయును. తన కాగ్రహము కలిగించిన వానిని తరుముట తలపాలము వరకు మాత్రమేనని నిసర్గముగ దాని కేమైన

నిబంధనమున్నదా! అయినను, ఏది తలపాలమో, తెలియగల జ్ఞానము దానికి గలదా! తలపాలము దాటిపోరాదను ఆంక్ష లేమైన పశువులకు గలవా! పోనిండు. ఇచ్చట తరుముట కాక, దానిస్థానమున మరియొక క్రియ, దానికి (గోవుకు) అనుసరణీయ మ్మగు దానిని సంభావింప గలమా! ఈ విధముగ తరుము చున్నవేళ, తరుమ బడునది, తలపాలము వరకు పారిపోవలెనా! ఏదో విధమున దాని దృష్టినుండి తప్పించుకో ప్రయత్నింపదా! ఒకవేళ అట్టిది సాధ్యపడకున్నను, తలపాలమను నిబంధన మేమి. సాదు శబ్దమును గోశబ్దముతో సంభావించిన పైప్రశ్నలకు సమాధానము కావలెను. అట్లుగాక సాదు శబ్దముతో మనుష్యమాత్రుని సంభావింతమన్న తిక్కన దాని కవకాశమీక, 'దు' ప్రయోగించి యున్నాడు. లేఖక ప్రమాదమని సరిదిద్దుదమన్నచో, సంభావింపబడినది ధర్మజుని గుణమ్మైన 'సైరణ' యే తప్ప ధర్మజుడుకాడు. కనుక పై యర్థములు సరిపోలుటలేదు. మరి తిక్కన గారి హృదయము నందలి భావన ఏమై యుండును.

జ్ఞప్తికొరకు పద్యపాదమును మరియొకసారి స్మరింతము. 'సాదురేఁగెనేని న్వీను తలపాలముననకాని నిలువదుసుమ్మీ'! ఇది గదా ప్రయోగము. ఏ కారణము చేత గాని సాదురేగితే, విజృంభించితే. అది తల పాలమున మాత్రమే నిలుచును తప్ప, అంతవరకు దాని విజృంభణము ఆగదు అని గదా పై దాని భావన. తలపాలముసన కాని నిలువదు అనుదానిలోని 'న' అక్కడ మాత్రమే నిలుచును, అంతవరకు నిలువదు అని స్పష్టీకరించుచున్నది. కాని అది (సాదు) గోవుగాని, వ్యక్తిగాని యైనచో పైన వివరించిన దానివలన, తలపాలమున కీవల నిలుచుటకును, అవకాశములున్నవి. కాని ఆ భావనకు తావీక తలపాలమున 'న' అనునది నిరోధించుచున్నది. రెండవది యగు 'న' పాదపూరణార్థమను వారి కొక నమస్కారము. తలపాలము చేరికాని నిలువదు అని స్పష్టీకరించుటకే అది ప్రయోగింపబడిన దనుట నిర్వివాదము. కనుక విజృంభించిన వేళ, తలపాలము చేరికాని నిలువని నిసర్గ లక్షణము గలదైన దేదో అదిమాత్రమే ఇచ్చట 'సాదు' శబ్దముచే తిక్కనచే సంభావితమై యుండనగును. అదిస్పష్టమే. అదిసాదు. మరి సాదనగా నేమి అనునది ప్రశ్న, అంతేగాక దానికి అట్టి అనగా 'తలపాలమున గాని నిలువని' నిసర్గ గుణమున్నదా యనిపరికింప వలయును.

లోకమునందు ముఖ్యముగ కర్షక లోకమున ఒకసామెతగలదు. అది 'సాతురేగినా బూతురేగినా ఆగదు' అని, సాతుశబ్దానికి వర్తకసమూహము, బాటసారుల గుంపు అనే అర్థాలు నిఘంటువుల్లో కనిపిస్తాయి. బూతు అంటే అశ్లీలమని తెలిసిందే. కాని పై సామెత లోని 'సాతు, బూతు'లు పై అర్థాలలో ఇమిడేవి కావు. అవి రెండును కలుపు మొక్కలు. నిఘంటువుల కెక్క లేదు. రైతులకు బాగా తెలిసినవే. ఇవి రెండు చాల వేగంగా వ్యాపిస్తాయి. నిరోధించడం కష్టంఅనే అర్థంలో పై సామెత ఏర్పడింది. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో సాతులూరు పేరుతో గ్రామాలున్నాయి. కృష్ణాజిల్లాలో

బూతుమిల్లిపాడు అనే గ్రామం, గుంటూరు జిల్లాలో బూతుమిల్లి అనే గ్రామంవున్నాయి. ఆ గ్రామాలు, అచ్చట ఒకప్పుడు విస్తారంగా పెరిగిన ఆ మొక్కల పేర్లతో ఏర్పడ్డాయి. పై పద్యపాదం లోని శబ్దం కూడ సాదు కాక సాతు అయివుండాలి. అప్పుడు మాత్రమే, తిక్కనగారి అమహదర్థక ప్రత్యయానికి స్థితి కలుగుతుంది. యుధిష్ఠరుని సైరణ కాక, ఆ సైరణ వలని నిరోధింపబడుచున్న, అతని అనుజుల ఆగ్రహాన్ని, అన్నగారి అనుమతిలేమి, అనుజుల యందడిగి యున్న ప్రతీకార కాంక్షను 'సాతు' శబ్దముతో అన్వయించు కొనవలసి యున్నది. ఆ ప్రతీకార కాంక్ష కార్యరూపముదాల్చెనా, ఎట్లు సాతురేగిన తలపాలము చేరికాని నిలువదో, అట్లే నీవంశమును నిశ్శేషముగ నిర్మూలించికాని నిలువదు సుమా అని సంజయుని హెచ్చరిక.

ఇక రెండు ప్రశ్నలు మిగిలి యున్నవి. ఒకటి తలపాలము చేరి నిలుచుట. సాతు, రెండవది. తిక్కన గారు 'సాదు' అనుచుండగా 'సాతు'గా మార్చుట యెట్లు అనునది. సాతు అను కలుపు మొక్క అసాధారణము, అనూహ్యామైన వ్యాప్తి గలది. గట్లు, గనిమెలు దీనిని ఆటంక పరుప లేవు. సాతు బూతులతో కూడిన సామెతయే దీనిని స్పష్ట పరచుచున్నది. దానిని గమనించి, నిరోధించు ప్రయత్నము చేయులోపునే, పరివ్యాప్తమగు స్వభావముగలది. కనుక నిరోధము అసాధ్యము. దానికి ఆగుదల లేదు. అన్నిముఖముల వ్యాపించును. మరి ఇది ఎక్కడ ఆగును. దానికి ఆగు స్వభావము లేదంటిమి. ఎచ్చట ఆగు ననగా తలపాలము చేరి ఆగును. తలపాలమనగా పొలిమేర. అక్కడ ఎందుకాగు ననగా, అది మిగిలిన గట్లు, గనిమెలు, బోదెలు కంటె వెడల్పు ఎక్కువ గలది. దానిని అధిగమింపలేదా! స్వభావరీత్యా అధిగమింపగలదు. కాని కొంత విలంబన ముండును. అంతేగాక పొలిమేరలు రహదారులు. పశువులు, బండ్లు, మనషులత్రొక్కిడి. అందువలన నడచు త్రోవలో ఏదియు మొలవదు. మొలచినా బ్రతుకదు. పైగా సాతు బదనిక కనుక అక్కడ ఆగిపోతుంది. పొలిమేరల లోగా గల మొత్తాన్ని మాత్రం ఆక్రమిస్తుంది. పైరులను నాశనంచేస్తుంది.

ఇక రెండవ ప్రశ్న. 'సాదు' ను 'సాతు'గా భావించుట ఎట్లు. లేఖక ప్రమాద మనునది ఒక ప్రతిపాదన. రెండవది 'సాతు'ను నెల్లూరివారు. 'సాదు' గా ఉచ్చరింతురేమో అనునది మరొక ప్రతిపాదన. రెండవదాని కంటె మొదటి దానిని సంభావించుటయే మేల్తరము. కారణము అట్టి మారుపాటులు మన సాహిత్యము నందు, అనేకము గలవు గనుక. ముఖ్యముగ శ్వాసనాద సంబంధి ధ్వనుల లిఖిత రూపముల యందు, ఇది సాధారణము. అప్పకవి వాచా చెప్పినను నాదధ్వనులను శ్వాసధ్వనులుగనే చదువుటకు అలవాటు పడితిమిగనుక. అందుకు మంచి ఉదాహరణ, అన్నమయ్య పదములలోని ఆఁటది అను దానిని అట్లే చదువుట. దానిని ఆఁడది అని చదువ వలయును. ఇచ్చట తద్విరోధము. అంతే. సహృదయులు వివేచింతురుగాక!

# వివాహం తరువాత స్త్రీల ఇంటిపేరు మారాలా!

కొంత కాలం క్రితం 'మీఇంటి పేరెలావచ్చింది' అని ఆంధ్రజ్యోతిలో నేను నిర్వహించిన శీర్షికకు ప్రతిస్పందిస్తూ పాఠకులు అడిగిన ప్రశ్నల్లో ఇది ఒకటి. అలా అడిగినవారి ఉద్దేశం బహుశా, ఎందుకు మారాలి అని గాక 'ఎందుకు మారుతోంది' అనేది అయివుండాలి. కారణం, మారి తీరాలి అని నిర్దేశం చేసినవారులేరు. లేక అలాంటి చట్టం ఉన్నట్లు దాఖలా ఏమీ కనిపించడంలేదు. కాని మారుతున్న మాటనిజం. ఇది ఒక ఆచారం అని సరిపెట్టుకోవచ్చు. అయితే ఆచారం ఏర్పడడానికి కూడ ఏవో కారణాలుండాలి.

ఆ కారణాలు అన్వేషించే ముందు, అసలు ఇంటి పేరెందుకో తెలియాలి. దీనికి ముందు పేరెందుకో తెలియాలి. పేరు సమమైన గుర్తింపు కొరకు. సమూహం నుండి వ్యష్టిని గుర్తించడం కొరకు. ఇంటిపేరు, ఆగుర్తింపును మరింత సమగ్రం గావించడం కొరకు. ఇంత మేరకు స్త్రీ, పుం వివక్షలేదు. వివక్ష ప్రారంభమైంది వివాహిత స్త్రీల విషయంలో. అలా ఎందుకు జరుగుతోంది అనేదిప్రశ్న.

ఈ ప్రశ్న భారతీయ సమాజంలో మాత్రమే ఉత్పన్నమైనదికాదు. ఇతరదేశాల్లో కూడా వచ్చింది. బహుశా ఆ స్ఫూర్తే ఇక్కడ పనిచేసి యుండవచ్చు. ఇదిసమాజంలోని పురుషాహంకారానికి నిదర్శనమన్న వారు కూడ వున్నారు. ఇతర దేశాల్లో ఈ విషయమై న్యాయస్థానాల నాశ్రయించడం కూడ జరిగింది. వివాహిత భర్త ఇంటి పేరులోనికి మారడం మారకపోవడం అనేది ఆ స్త్రీ ఇష్టాయిష్టాలకు వదిలివేస్తూ, సమాజానికి, లేక లౌకిక వ్యాపారానికి సంబంధించినంత వరకు అలా మారడం అనేది అవసరమని ఉట్టంకించాయి. కాని ఆ ఆచారానికి కారణాలు వివరింపలేదు. కారణ మేమై వుంటుంది. లోకంలో చాల ఆచారాలుంటాయి. కొన్నింటికి కారణాలు తెలియవస్తాయి. కొన్నింటికి తెలియరావు. కారణం, ఆ ఆచారం మొదలు ప్రారంభమైననాటినుండి నేటివరకు గల కాలంలోని అంతరం. మొదలు కారణమున్నా, ఆకారణమేదో ఇప్పుడు అందిరాక పోవడం. అందిరావడం లేదు గనుక, దానిని పాటించడం మానివేస్తున్నారా! లేదు. ఎందువలన.

అవి సమాజపు విలువ బుగా రూపుదిద్దుకున్నాయి గనుక. అయితే పూర్వపు ఆచారాల నన్నింటిని పాటిస్తున్నారా అంటే అదీ కనుపింపదు. అంటే కొన్ని పాటింప బడుతున్నాయి. కొన్ని పాటింపబడడం లేదు. పాటింపబడుతున్నవి మాత్రం, చట్టం కంటె బలీయమైనవి. నిజానికి చట్టం వాటి జోలికి వెళ్లదు. కారణమేమిటి! చట్టంకాని, ఆచారంగాని, బహు జనులకు హితవును, సుఖాన్ని కలిగంచాలి తప్ప కష్టం కలిగింప రాదు. అలాగే కొన్ని 'కుల' కట్టుబాట్లుంటాయి.. వాటిని అనుసరింపక పోతే, అనుసరించడం ఇష్టం లేక కోర్టు నాశ్రయిస్తే కోర్టుకూడ, ఆ కట్టుబాటుకే విలువనిస్తుంది తప్ప, దానిని అతిక్రమించే విధంగా తీర్పునివ్వదు. కారణమేమిటి. చట్టాలు, నిబంధనలు, న్యాయసూత్రాలు, ఒకప్పటి ఆచారాలు వాటి పాటింపు మొదలైన వాటి క్రోడీకరణమే గనుక. అలాంటి క్రోడీకరణలలో ఈ ఇంటిపేరు మారడం, మారక పోవడం అనేది ఎందుకు చోటు చేసికోలేదు. ఇదొక్కటే అన్నమాటేమి, చాల చోటు చేసికోలేదు. అలాంటి వాటిల్లో ఇదొకటి. ఇకముందు చోటుచేసి కుంటుందేమో. అది ఇప్పటి కిప్పుడు చెప్పగలిగింది కాదు. ఏమైనా ఆచారం మాత్రం బలీయమైనది.

ఇక విషయానికి వస్తే, ఎందుకు మారాలి, లేక ఎందుకు మారుతోంది అనే ప్రశ్న ఎవరి నుండి ఉత్పన్నమైంది. విద్యావంతులైన స్త్రీలనుండి. వివాహంతరువాత, వీరికి సంబంధించిన రికార్డులు మార్చుకోవలసి రావడం చేత మాత్రమే నన్నది గుర్తుంచుకోవాలి. అలా మార్చకపోయినా ఇబ్బందికలుగని చోట, వివాహితులైన విద్యావంతులైన స్త్రీలు, తమ వివాహత్పూర్వపు ఇంటిపేర్ల తోనే కొనసాగుతున్న వారు లేకపోలేదు. అంటే అవసరం కారణ మవుతోంది. ఇబ్బంది లేని చోట కూడ మార్చుకోవలిసిందేననే నిర్బంధము భర్తనుండి, లేక అత్తవారింటి నుండి ఎదురైతే అది వ్యక్తినిష్ఠమే తప్ప, మారితీరాలి అన్నచట్టమున్నట్లు లేదు. విద్యావంతురాం(డ్రు కాని స్త్రీల విషయంలో ఈ సమస్య ఉత్పన్నం కాదు. కారణం లౌకిక వ్యవహారంలో స్త్రీల విషయంలో ఇంటిపేరుతో పని లేదు గనుక. పురుషుల విషయంలో వుందా అంటే అదీ అనుమానమే. లిఖిత పూర్వకమైన వ్యవహారం లేని చోట ప్రత్యేకంగా ఇంటిపేరు ఉట్టంకించ నవసరంలేదు. స్త్రీల విషయంలో కూడ, వారువిద్యావంతులు కాకపోయినా, ఓటర్లలిస్టులో, ఒకవేళ వ్యష్టిగా జీవిస్తున్న వేళ, రేషనుకార్డు, తపాలాచిరునామా ఇలాంటి విషయాల్లో, ఇంటిపేరు తప్పదు. దీనిని బట్టి లిఖిత వ్యవహారంలో ఇలాంటి విషయాల్లో ఇంటిపేరు తప్పదు. దీనిని బట్టి లిఖిత వ్యవహారంలో ఇంటి పేరు అవసరమవుతోంది. అది పురుషుని విషయంలో తప్పనిసరి కాగా, స్త్రీల విషయంలో కొన్ని అవసరాలను బట్టి, విద్యావంతువైన స్త్రీల విషయంలో మరిన్ని అవసరాలను బట్టి ఇంటిపేరు అవసరమవుతోంది. ఇక మార్పు కన్పిస్తోంది. స్త్రీల విషయంలో మాత్రమే. (స్త్రీలు అంటే ఇకనుండి విద్యావంతులైన వారిని ఉద్దేశించి

మాత్రమేనని గ్రహించాలి). పురుషుల విషయంలో మార్పులేదు. ఇలా ఎందుకు జరిగిందనేది గదా ప్రశ్న.

మార్పు జరగడమనేది లిఖిత వ్యవహారంలో స్ఫుటంగా కన్పిస్తుంది. వాగ్వ్యవహారం లోనికి వచ్చేటప్పటికి, అలావుండదు. ఒక వ్యక్తిని గూర్చి (స్త్రీ గాని, పురుషుడుగాని) ఆరా తీసేటపుడు, ఎవరు అనే ప్రశ్నకు ఫలానా వారి అబ్బాయి, లేక అమ్మాయి, (వివాహితులుకానపుడు), వివాహిత స్త్రీ అయినపుడు ఫలానా వారి భార్య అని గదా సమాధానం. పాఠశాలలో చేర్పించవలసిన చోట విధిగా, ఆవ్యక్తి తండ్రి ఎవరో సూచించవలసివుంది. ఈ సూచించడమనే ప్రక్రియ, వివాహం తరువాత మార్పు అనే దానికి కారణమైనది. పురుషుని విషయంలో మార్పు లేదు. వివాహిత స్త్రీ విషయంలో పైన సూచించిన సందర్భాలను బట్టి మారుతోంది. దీనిని బట్టి నమోదు అనేది లేకపోతే మార్పు అనేది లేదు. కారణమేమంటే సాధారణవ్యవహారంలో ఇంటి పేరుతో అందునా - స్త్రీల విషయంలో పనిలేదు గనుక. పురుషుని విషయంలో ఎందుకుంది అంటే, ఆ కుటుంబానికి అతడు వారసుడు గనుక, అతని తండ్రి తరువాత ఆ కుటుంబానికి అతడు యజమాని గనుక, అకుటుంబపు ఆస్థి అతనికి సంక్రమిస్తుంది గనుక, తత్సంబంధమైన వ్యవవహారాన్ని బట్టి, అవసరాన్నిబట్టి ఇంటిపేరు వ్యక్తపరుప వలసి వస్తుంది గనుక. స్త్రీ విషయంలో పైకారణాల ప్రమేయం లేదు గనుక, అది వ్యక్తీ కరింపబడే అవకాశముత్పన్నం కాదు. ఉత్పన్నమైన వేళ, ఆమె ఫలానా వారి భార్య అని చెప్పబడుతుంది. ఆ వ్యవహారాలతో ప్రమేయమేర్పడే నాటికి వివాహితురాలు కాకపోతే ఫలానా వారి కుమార్తె అని వ్యవహరింపబడుతుంది. అప్పుడైనా, (ఫలానా వారి కుమార్తె అన్నపుడు) తండ్రిఇంటిపేరు ఉట్టంకింపబడడం లేదా అంటే, (వివాహిత అయితే భర్త ఇంటిపేరుతో) ఉట్టంకింప బడ వచ్చును. అది లేఖరి విన్యాసమే తప్ప, ఉట్టంకించకపోయినా, చట్టపరమైన ఇబ్బందిలేదు. పురుషుని విషయమైనా (ఫలానా వారి కుమారుడు అని చెప్పేటప్పుడు) అంతే.

అంటే విద్యాసంబంధమైన వ్యవహారాలు, యోగ్యతా పత్రాలపై నమోదు విషయంలో మాత్రమే, ఇంటిపేరు ప్రసక్తి వస్తోందనేది స్పష్టము. ఇది వివాహాత్పూర్వం, యువతీ యువకుల విషయంలో సామాన్యం. పై విధమైన వ్యవహారం లేనిచోట్ల ఈ మార్పు అనే ప్రసక్తికి ఆస్కారంలేదు అనే విషయం జ్ఞాపకముంచుకోవాలి. అదే సమయంలో చట్టపరమైన ఆంక్షలు కూడ లేవని కూడ గుర్తుంచుకోవాలి. వివాహ కార్యక్రమంలో కూడ గోత్రనామానికే తప్ప, ఇంటిపేరు ప్రసక్తి లేదు సరికదా, ఒకే ఇంటి పేరున్నా (వధూవరులకు) గోత్రభేదమున్నపుడు సంబంధబంధుత్వానికి అడ్డులేదు. మూడు తరాలనుండి, వధూవరుల కుటుంబాల మధ్య ఏవిధమైన బంధుత్వం లేనపుడు, వారు ఏకగోత్రజు లైనప్పటికి వివాహాలు గావింపవచ్చునని

కూడా సవరణ వుంది. కాబట్టి ప్రాధాన్యం వహిస్తోంది. గోత్ర గృహనామాలు కాదని, జన్యు సంబంధమైన కారణాలే ప్రాధాన్యం వహిస్తున్నాయని బోధపడుతోంది.

అయితే వివాహం తరువాత పురుషుడు, తన తండ్రి ఇంటిపేరుతో అంటే తనదైన 'కుటుంబనామంతో' నే వ్యవహరింపబడుతున్నాడు. కాని స్త్రీల విషయంలో అలాకాక, వివాహం తరువాత, తన తండ్రి కుటుంబనామంనుండి, భర్త కుటుంబ నామంలోనికి మార్చబడడం జరుగుతుంది. (అది కూడ పైన వివరించిన సమస్యల వలనే తప్ప సాధారణ లోక వ్యవహారంలో దాని ప్రసక్తి లేదని, అదికూడ విద్యావంతులైన స్త్రీల విషయంలో మాత్రమేనని గుర్తుంచుకోవాలి). ఇలా ఎందుకు మారాలి అనేది సమస్య. మార్చుకోవడం ఇష్టంలేనివారు,మార్పుతో అవసరం లేనివారు (యోగ్యతాపత్రాలు మొ॥వాటి విషయంలో) వివాహం తరువాత కూడ తమ తండ్రుల కుటుంబ నామాలతోనే లౌకిక వ్యవహారాలలో కొనసాగుతున్నారు. ఇలాంటి సందర్భాల్లో, అలాంటి వారి విషయంలో సంఘం నుండి ఎట్టి అభ్యంతరం ఎదురుకాలేదు. నిజానికి ఈ వ్యవహారాల్లో సంఘానికి ప్రమేయమే లేదు. చట్టం కూడ దానికి ఎలాంటి ప్రాధాన్యము ఇవ్వడం లేదు. వివాహ స్థితిని నిరూపించడానికి, ఇతర ఆధారాలను పరిగణనలోనికి తీసికొంటారు తప్ప, ఇంటిపేరు మారిందా లేదా అన్న దానిని పరిగణింపరు. ఇక సమస్య అంతా భర్త నుండి, ఇతర కుటుంబ సభ్యులనుండి వత్తిడి వచ్చినపుడు, అలా మారడం ఆత్మన్యూనతగా భావింపబడు తున్నప్పుడే మాత్రమే ఇది ప్రసక్తమవుతోంది. ఎప్పుడైనా, ఏవిషయంలోనైనా, ఇలా జరగవలసిందే నన్నపుడు మాత్రమే, అలా ఎందుకు జరగాలి అనే ప్రశ్న ఉదయిస్తుంది. అందులో ఆత్మ గౌరవమనే విషయం చోటుచేసికుంటే, అది సమస్యగా పరిణమిస్తుంది. అలా లేనపుడు ఆ సమస్యకు ఉనికియే లేదు.

మారి తీరాలి అంటున్న వారు కూడ, అది ఆచారం గనుక, అలా మారక పోతే, తమకు, తమ కుటుంబ ప్రతిపత్తికి, గౌరవానికి ఏదో భంగం కలుగుతుందనే అపోహే తప్ప,ఎందుకు మారాలో స్పష్టమైన అవగాహన లేదు ('ఎందుకు మారాలో' అనే మాటవలన, ఈ వ్యాసకర్తకు అలా మారితీరాలి అనే అభిప్రాయం వుందని భావింపవలదు. విషయ వివరణ కొరకు మాత్రమే ఆ పదం ఉపయోగింప వలసి వచ్చింది). అలాగే, పురుషుని విషయంలో మార్పు లేనపుడు స్త్రీ విషయంలో మాత్రమే ఈ మార్పు ఎందుకుండాలి అనే వారిలో కూడ, పంతమే కనిపిస్తుంది తప్ప, ఆచారమే అయినా, అది ఎందుకు అలా ఏర్పడిందోననే దానిపై స్పష్టమైన అవగాహన ఉన్నట్లు కనుపింపదు. ఇలా అనడానికి కారణాలున్నాయి. అవేమిటో ముందు చూసి, తరువాత ప్రధాన విషయానికి వద్దాము.

విద్యావంతురాండ్రు కొందరైనా, తమపేరు తరువాత, భర్తల ఇంటిపేర్లు చేర్చుకుంటున్నవారు గల రనేది నిర్వివాదం ఇలాంటి వారిలో ఇంటిపేరు ఎందుకు మారాలి అనేవారు ఉండి ఉండవచ్చు. అలాగే మార్చుకున్నవారు ఉండి వుండవచ్చు. వారు పై రెంటిలో ఏ వర్గానికి చెందినా, కావలసిన విషయం, వివాహితలు తమ భర్తలపేర్లు, తమ పేర్లకు ఎందుకు జోడిస్తున్నారనేది.మీదు మిక్కిలి అది నాగరకత గాను, సంస్కారానికి ప్రతీకగాను భావింపబడుతోంది. (అందరి విషయంగాదు. అలా భావించే వారి విషయం మాట). ఇది మన తెలుగు సమాజంలో స్థూలంగా స్వాతంత్ర్యానంతరం ప్రారంభమైంది! అక్షరాస్యత పెరగడం, ఇతరప్రాంతాలతో, అక్కడి ఆచార వ్యవహారాలతో సంసర్గం ఏర్పడడం కారణంగా ఇది ప్రారంభమైంది. ముఖ్యంగా రచయిత్రులు దీనిని పాటించినట్లు కనిపిస్తుంది. పై కారణాలు దీనికి మూలం. కాగా ఇది కేవలం అవగాహనా లోపం వలన జనించిన అనుకరణ మీది మోజుతో చోటుచేసికుంది. దీనికి గలకారణాలు. పాశ్చాత్య ప్రపంచంలోను, ఉత్తర భారతదేశంలోను, దక్షిణాదిలో తమిళనాడు, కేరళ రాష్ట్రాల్లోను, మన అనుసరణకు భిన్నంగా, కుటుంబనామాలు వ్యక్తుల పేర్ల చివర వుంటాయి. ఉదా: విలియం వర్డ్స్‌వర్త్, జాన్ ఫిట్జరాల్డ్ కెనడి, మొరార్జిదేశాయి, వల్లభభాయిపటేల్, సుబ్రహ్మణ్యం పిళ్ల, శంకరన్ నంబూద్రి. వీనిలో వర్డ్స్‌వర్త్, కెనడి, దేశాయి, పటేల్, పిళ్ల, నంబూద్రి అనేవి ఆయా వ్యక్తుల కుటుంబ నామాలు. కాని వాటిని వ్యక్తి నామాల్లోని భాగంగా పరిగణించి, ఇక్కడ తమ భర్తల పేర్లు చేర్చుకోవడం జరిగింది. అన్ని సందర్భాల్లోను ఇలాగే జరగకపోయినా, ఈ భావనే అలా చేయడానికి ప్రోత్సహించింది. అలా తమభర్తలపేర్లను తమపేర్ల చివర చేర్చుకున్న స్త్రీలు, తమ ఇంటిపేర్లను అలాగే ఉంచుకున్నారంటే దీనిని అవగాహనాలోపంగా తప్ప ఎలా పరిగణించాలి! వాదానికి అలా కాదని చెప్పవచ్చు. కాని సమమైన ఆలోచనతో విచారిస్తే సత్యం బోధపడక పోదు.

ఇది ఇలాంటిదైతే, కొందరు, భర్తల ఇంటిపేరు లోనికి ఎందుకు మారాలి అన్నవారు, ఒకటి రెండు సూచనలు గావించారు. అది (1) తమ వివాహాత్పూర్వపు ఇంటిపేర్లతోనే అంటే, పుట్టింట కుటుంబనామం తోనే వ్యవహరింపబడాలి అనేది ఒకటి. మరి ఆ పుట్టింటి ఇంటిపేరు కూడ తండ్రిదే గదా? తండ్రి కూడా పురుషుడేగదా! ఇంటపేరు మారడం, పురుషాహంకార సమాజానికి నిదర్శనము అన్నప్పుడు, మరో పద్ధతిలోనైనా దానినే పాటించడం ఎలా సబబు అవుతుందో వివేచనకు అందిరాదు. రెండవ సూచన ఏమంటే, తమ సంతతికి, తమ (వివాహితలు) వివాహాత్పూర్వపు ఇంటిపేరు పెట్టాలనడం. ఇందులో గావించిన మరో సూచన ఏమంటే, సంతతిలోని బాలురకు తండ్రి ఇంటిపేరు. బాలికకు తల్లి ఇంటిపేరు ఉండాలనడం. వీటి వలన కాలాంతరంలో ఉన్పన్నమయ్యేది గందరగోళమే తప్ప, పురుషాహంకారాన్ని తప్పించడ

మెలా అవుతుందో తెలియరాదు. నిజానికి, ఈ ఎందుకు మారాలి అన్న సమస్య పాశ్చాత్య ప్రపంచం నుండి ముఖ్యంగా అమెరికా నుండి దిగుమతి అయింది. అచ్చటి స్త్రీవాదులు పరిష్కారం కొరకు న్యాయస్థానాలను ఆశ్రయింపగా వచ్చిన తీర్పుల విషయం, ఈ వ్యాస ప్రారంభంలో పేర్కొనడం జరిగింది. అది, మారడం, మార్చు కోకపోవడం, అనేది, అలా కోర్టు నాశ్రయించిన వారి ఇష్టాయిష్టాలకు వదిలివేయడం, ఆస్థి సంక్రమణం లాంటి విషయాల్లో మారి వుంటే పరిష్కారం సులభమని చెప్పడం జరిగింది. అంతేగాక అది విశ్వవ్యాప్త మైన ఆచారమని చెప్పడం జరిగింది. అంతే తప్ప ఆచారానికి మూలమేమిటో చెప్పబడలేదు. ఈ విషయాలన్నీ అమెరికాలోని న్యూయార్కు నుండి వెలువడే 'నేమ్సు' అనే పత్రిక నుండి గ్రహించడం జరిగింది. ఇలా వుండగా ఈ మధ్యకాలంలో 'నడుస్తున్న చరిత్ర' అనే పత్రికలో, ఎందుకు మారాలి అనే విషయంపై ఒకవ్యాసం వెలువడగా, దానిపై ఇరువురు పాఠకురాండ్రు, ఇలాంటి సమస్యలను అనవసరంగా రేకెత్తిస్తున్నారని, అలా మార్చుకోకపోవడం ఇష్టంలేనివారు అలాగే కొనసాగవచ్చని, ఇతరులపై వారి అభిప్రాయాలను ప్రసరింప జేయడం అనవసరమని, ఆ వ్యాసకర్త, తమ నిజ జీవితంలో ఎందుకు ఆచరణలో పెట్టడం లేదని వ్రాశారు. అంతేగాక ఇది ఒక వికారపు ఆలోచన, వ్యర్థ చర్చ తప్ప మరొకటి కాదని కూడ వ్రాశారు. (చూడు నడుస్తున్నచరిత్ర, జనవరి, ఫిబ్రవరి 2001). అంతేగాక, ఈ మారడం అనేది ఆనవాయితీగా జరుగుతున్నపుడు, దానివలన ఇబ్బంది లేనపుడు, ఆ ఆనవాయితీని కొనసాగిస్తే తప్పు ఏమిటి అని వ్రాశారు. దీనినిబట్టి ఈ సమస్యపట్ల వివాహిత స్త్రీలలో ఏకాభిప్రాయం లేదని తెలుస్తుంది.

ఇక అసలు విషయానికి వద్దాము. మారడం అనేది ఆచారం. ఈ ఆచారం ఎందుకు ఏర్పడింది అనేది ప్రశ్న. నిజానికి మారడం అనేది లేదు. అంటే వివాహాత్పూర్వం స్త్రీకి కుటుంబనామం లేదు. వివాహం తరువాతనే ఆమె ఇంటిపేరు స్థిరీకరింప బడుతోంది. అది భర్త ఇంటిపేరుతో! అయితే వివాహాత్పూర్వం పురుషునికి కూడ కుటుంబనామం లేదు. మొదలు వివాహ విషయంలో దీని ప్రసక్తిలేదు. వివాహం తరువాత, వెంటనేకాక పోయినా, కుటుంబాలు విడిపోతున్నాయి. అలా విడిపోయినపుడు, వ్యవహార సరళి నిమిత్తం, వివాహితుడైన వానికి, అతని కుటుంబనామం సంక్రమిస్తోంది. తత్పూర్వం, రికార్డులతో పని ఏర్పడినపుడు తప్ప, ఇతరత్రా అతడు ఫలానా వారి కుమారుడు అని, ఆమె ఫలానా వారి కుమార్తె అని మాత్రమే వాస్తవమైన వ్యవహార సరళి అని ముందు చెప్పడం జరిగింది. వివాహానంతరం పురుషుడు కుటుంబీకుడు అవుతున్నాడు. అతనిభార్య కుటుంబిని అవుతోంది. ఇరువురు, వారి సంతతి అంతా కుటుంబ మవుతోంది. అలా ఆ కుటుంబాని కంతకు కుటుంబనామం స్థిరీకరింప బడుతోంది. ఈ స్థిరీకరణంలో పురుషుని కుటుంబనామం

అలాగే వుండగా, స్త్రీకి అప్పటికి గల అంటే ఆమె తండ్రి కుటుంబనామం, మారుతోంది గదా అనబోతారు. ఇదే గదా అసలు సమస్య! పై వాక్యాల్లో దీనికి సమాధానం వుంది. అయినా మరికొంత వివరంగా చూద్దాము. వివాహితకు తన కుటుంబం ఏది! తండ్రి కుటుంబమా! లేక తాను, తనభర్త, తన సంతానంతో కూడిన కుటుంబమా! మారడం దోషమైతే, తండ్రి కుటుంబ నామంతో కొనసాగడం మరింత దోషం కాదా! మరి ఆమె సోదరుల కుటుంబనామాలు ఎలా వుండాలి. ఆమెది, ఆమె సోదరులది ఒకటే కుటుంబనామమైతే, సమమైన గుర్తింపు కొరకు ఏర్పడిన వివక్షకు స్థితి ఏమిటి. ఆమె వల్లనే గదా పురుషుడు కుటుంబీకుడు అవుతోంది. ఆమె కుటుంబిని అవుతోంది. కనుక దీనిలో ఇంటిపేరు మారడం అనే సాధారణ వ్యవహారం గాక, సమాజ మనుగడ అందులోని కుటుంబ వ్యవస్థ అనే అంశాలు ఇమిడి వున్నాయి. కనుక అది కేవలం ఇంటిపేరు గాదు. కుటుంబ నామం. ఇది పైకి కనుపించేటంత సాధారణ వ్యవహారంగాదు. కనుకనే ఇది విశ్వవ్యాప్తమైన ఆచారం.

ఇప్పుడు ఈ ఆచారానికి మూల మేమిటో చూద్దాము. పెళ్లివలన గదా, ఈ సమస్య ఉత్పన్నమైనది! అది లేకపోతే ఈ సమస్యేవుండదు. కాని అపుడు సంతతిని ఎలా గుర్తించాలో తెలియదు. అది అలా వుంచినా, పెళ్లికాని సమాజం స్వీడన్‌లో అమల్లోనికి వచ్చిందని, అది విఫలమయిందని ఎవరో చెప్పగా తెలిసింది. అయినా ఇప్పుడు దానితో పనిలేదు. మన సమస్య ఇంకా అంతవరకు ఎదగలేదు. పెళ్లి అంటే వివాహమని అర్థం - అని అనుకుంటారు. నిజానికి కాదు. పెళ్లి అంటే వధువు అని మాత్రమే. మనం పెళ్ళికూతురని ఎవరిని సంభావిస్తున్నామో ఆమే పెళ్లి. అంతే! వివరాలు కావలసినవారు, హేమాబ్జనాయికా స్వయవరం, వైజయంతీ విలాసాలను పరామర్శింపవచ్చును. దీనిని పరిశీలించండి. బాలిక, కన్య, వధువు, భార్య - ఇవి సంస్కృత పదాలు. వీటికి సమమైన పదాలు ఆడపిల్ల, పడచు, పెళ్లి, మగువ (మగనాలునే మగువ అనాలి) అంటే వధువు అనే సంస్కృత పదానికి సమానమైన తెలుగుపదం పెళ్లి. ఈ భాషాచర్చ ఇలా వదలి, వధువు అని ఎప్పుడు అంటున్నామో తెలుసుకుందాము. వివాహం నిశ్చయమైనపుడు, కన్య, వధువు అవుతుంది. అంటే ఏమిటి. ఫలానా వరునికి ఈమె వధువు అని నిశ్చయింపబడిందన్న మాట. దీనికి ఒక కార్యక్రమం వుంది. అది లగ్నాలు పెట్టుకోవడం. అప్పుడు జరుగుతోందేమిటి.

బ్రాహ్మణుల్లో నయితే గోత్ర ఛేదనం. ఇతరుల్లో నయితే వరుని ఇంటివారు, ఉద్దేశింపబడిన కన్యను, తమ అమ్మాయి అనిపించుకోవడం. పసుపు కుంకుమలు ఇచ్చి, తాము తెచ్చిన చీరను ఆమెతో ధరింపచేయడం. గోత్రఛేదనం ఎవరిగోత్రం నుండి.ఆమె తండ్రి గోత్రనుండి. మారడం, భర్తగోత్రంలోనికి. అంటే ఆ క్షణం లోనే

ఆమె వరుని కుటుంబంలో చేరిపోయింది. నిజానికి మనం దేనిని పెళ్లి అంటున్నామో (వ్యవహారంలో) అది జరగిపోయింది. తరువాత పందిట్లో జరుగు తోంది, అలా జరిగి పోయిన దానిని, విస్తృతమైన పరిధిలో అందరికి తెలియజేయడం. దానికి మరింత పరివ్యాప్తత ఊరేగింపు లో ఉంది. మాంగల్య ధారణ, సప్తపది - ఇవన్నీ దానికి మరింత ప్రమాణీకరణాన్ని మందిలో అనుసంధించడం. నిజానికి కొన్ని సందర్భాల్లో, పై కార్యక్రమానికి, అనంతరం బంధుమిత్రుల సమక్షంలో జరిగే తంతుకు మధ్య, వరుడు గతించిన సందర్భాల్లో, అతని కుద్దేశింప బడిన వధువు వైధవ్యాన్ని పాటించిన సంఘటనలున్నాయి. ఇది అభిలషణీయమా అనేది కాదు ఇక్కడి ప్రశ్న. గోత్ర ఛేదనానికి ఎంత ప్రాముఖ్యత వుందో, మన పూర్వులు దానిని ఎలా పరిగణించారో తెలియజెప్పడం మాత్రం వరకే దీని ప్రసక్తి.

కనుక, మార్పు జరుగుతోందనే దానికి (ఇంటిపేరుకు) స్థితి లేదని, మారుతోంది గోత్రమని, తత్ఫలితంగా స్త్రీకి కుటుంబనామం స్థిరపడుతోందని తెలుస్తుంది. దంపతులు, వారి సంతతి - ఇదీ కుటుంబం. సమమైన గుర్తింపు కొరకు వివక్షింపబడడం తప్పదు. వివాహం తరువాత కూడ స్త్రీ తండ్రి ఇంటిపేరుతో కొనసాగితే.... అది ఆమె ఇష్ట మనిపిస్తుంది. కాని కుటుంబమనే విషయకంగా, ఆ మార్పు ఆమె సోదరులకు అయిష్టం కలిగిస్తుంది. అందులో కొన్ని న్యాయపరమైన చిక్కులుండే అవకాశముంది.

అన్నింటికంటె ప్రధానమైనది, స్త్రీకి తన దైన కుటుంబం అవసరమా కాదా అనేది. ఆమె కుటుంబిని. ఆమె వల్లనే కుటుంబమనే దానికి అస్థిత్వముంది. ఆమెయే గృహనీతి విద్యకు గృహము. విమలచారిత్ర శిక్షకు ఆమెయే ఆచార్య. ఆమెయే అన్వయస్థితికి మూలము. ఇదీ గృహిణి విషయమై మహాభారత ప్రతిపాదనము. తొందరపాటు, ఏమరిపాటు లేక, విజ్ఞులు ఆలోచింతురుగాక!



# మన ఇంటి పేర్లు

ప్రతి వ్యక్తికీ పేరుంది. ఇంటిపేరూ వుంది. ఈ ఇంటిపేరు నిజానికి కుటుంబ నామం. కొందరు తాము నిర్మించుకున్న నివాస భవనాలకు పేర్లు పెట్టుకుంటారు. నిజానికవే ఇంటిపేర్లు. అయితే ఈ భావన ఇటీవల ప్రాచుర్యంలోనికి వచ్చింది. వెనుకటి శతాబ్దాల్లో రాజ భవనాలకు పేర్లున్నట్టు దాఖలా వుంది. సాధారణ భావనలో కుటుంబ నామమే ఇంటిపేరుగా వ్యవహరింపబడుతోంది. కారణం కుటుంబానికి ఆశ్రయమిచ్చేది ఇల్లు గనుక, కుటుంబ నామం ఇంటి పేరుగా చెలామణిలోనికి వచ్చింది. ఇలాంటి వ్యవహారం, దీని విషయంలోనే కాదు మరో చోట కూడ కన్పిస్తుంది. ఇలువరుస అనే వ్యవహారముంది. అక్కడ కూడ ఇండ్ల వరుస అని కాక కుటుంబ చరిత్ర అనే అర్థాన్నే ఇస్తోంది.

ఇక ఈ ఇంటిపేర్లు ఏదో ఒక పద్ధతిలో ప్రపంచ మంతటా వున్నాయి. ఇలా చెప్పడానికి కారణం, మన ఇంటి పేర్లు, వ్యక్తి నామానికి ముందుండగా, ఇతర భాషా సమాజాల్లో వెనుక వున్నాయి. దేనినయినా సమంగా గుర్తించేటందుకు పేరు అవసర ముంటుంది. అది మనిషైనా, జంతువైనా, వస్తువైనా, స్థలమైనా అంతే. అయితే సమాజంలోని వ్యక్తులకు, వారు నివసించే స్థలాలకు మాత్రమే అన్నింటికి పేర్లుంటాయి. మిగతా వాటికి జాతి గతమైన పేర్లు తప్ప, ప్రతి దానికి పేరుండదు. పిల్లులలో ప్రతి పిల్లికీ పేరుండదు. అలాగే ప్రతి వేపచెట్టుకు పేరుండదు. ఇక వ్యక్తులందరికీ పేర్లున్నా, ఒకే విధమైన పేర్లు చాలా మంది వ్యక్తులకుంటాయి. దీనివలన సమమైన గుర్తింపుకు విఘాత మేర్పడుతుంది. దానిని అధిగమించే ప్రయత్నంలో భాగంగా ఇంటి పేర్లు అవసరమైనాయి. అయితే కొన్ని సందర్భాలలో అప్పుడు కూడ ఇబ్బంది ఎదురవుతుంది. అప్పుడు తండ్రి పేరు లేదా వారు చేసే వృత్తి పేరు లేదా వారి శరీర వర్ణం - ఇలా ఆయా వ్యక్తులలోని ఏదో ఒక ప్రత్యేకతనుబట్టి ఇచ్చే శబ్దంతో ఆ ఇబ్బందిని పరిహరిస్తాము.

ఇలా ఏర్పడ్డ ఇంటిపేర్లు, ఒక భాషా సమాజపు అంటే ఒక జాతి జీవనానికి ప్రతీకలుగా భాసిస్తాయి. అంటే సమాజపు అన్ని ముఖాలు అందులో దర్శనమిస్తాయి. కాలగతిలో జనజీవనంలో అనేక మార్పులు వస్తాయి. జీవన శైలి మారిపోతూ వుంటుంది. ఆ మార్పు కనుగుణంగా దానిని సూచించే వ్యవహారం సంఘ జీవనంలో చోటు

చేసికొంటుంది. దాని కనుగుణమైన భాషా వ్యవహారమేర్పడుతుంది. అంటే క్రొత్త భావనలు, దాని కనుగుణమైన పదజాలం వ్యాప్తిలోనికి వస్తూ వుంటుంది. కాని మారనివి పేర్లు. అందువలన అవి పురా సమాజపు జీవనానికి దర్పణంగా భాసిస్తాయి. అందులోను, ఒకనాటి సమాజాన్ని అర్థం చేసుకోడానికి బాగా ఉపయోగపడేవి ఇంటిపేర్లంటే అతి శయోక్తి లేదు. వాని అధ్యయనం వలన చరిత్ర, సంస్కృతులకు నేపథ్యాన్ని సవదరించే సమస్త అంశాలు బోధపడతాయి. ఒక భాషాసమాజపు సాంస్కృతిక చరిత్రను అధ్యయనం చేయడంలో విస్మరింపరానిది గృహ నామాధ్యయనం. దీనిని కొంత వివరంగా చూద్దాము.

మన ఇంటిపేర్లలో నూటికి తొంబదికి మించి ఊళ్ళపేర్లే చోటు చేసికున్నాయి. అంటే ఆయా పేర్లు గల ఇంటిపేరు లున్న కుటుంబాలు ప్రాయికంగా మొదలు ఆ గ్రామానికి చెందిన వారన్నమాట. అంటే ఇప్పుడున్న గ్రామానికి వారు ఆ గ్రామంనుంచి తరలి వచ్చారని తెలుస్తుంది. మరి అలా తరలి రావడానికి కారణాలను తరచి చూస్తే ఆ కారణాల నేపథ్యం తెలుస్తుంది. అవి యుద్ధాలు కావచ్చు, వర్షాభావం కావచ్చు, రాజకీయ్య కారణాలు కావచ్చు, భయంకరమైన వ్యాధులు కావచ్చు. ఏ కారణం లేకుండా ఉన్న ఊరును విడిచి పోవడానికి ఎవరూ ఇష్టపడరు. ఆ కారణాలను అన్వేషించుట వలన, ఆ నాడు సమాజంలో నెలకొన్న పరిస్థితులపై అవగాహన కల్గుతుంది. ఇక, మరికొన్ని కుటుంబాల ఇంటి పేర్లు, ప్రస్తుతం వారు ఏ గ్రామంలో వున్నారో, ఆ గ్రామ నామాలే అయివుంటాయి. అంత మాత్రంచేత, అనాది నుండి వారు ఆ గ్రామవాసులేనని, అంటే ఆ గ్రామానికి వారే గడ్డ ఎత్తారని చెప్పడం సాధ్యం కాదు. ఎందుకంటే జనం వచ్చాకే, ఆ జనావాసానికి పేరు ఏర్పడుతుందనేది సాధారణ సూత్రం. అయితే కొన్ని ఇంటిపేర్లతో ఏర్పడ్డ గ్రామాలు లేకపోలేదు. వలేటివారి పాలెం, యార్లగడ్డవారి లంక లాంటివి వాటికి ఉదాహరణలు. అయతే ఇలాంటి గ్రామ నామాలు ఇంటిపేర్లు గావడం చాల అరుదు. అయితే పై సన్నివేశాలకి - అంటే, ఇప్పుడున్న ఊరి పేరే ఇంటిపేరు గావడానికి కొన్ని కారణాలున్నాయి. సాధారణంగా ఇలాంటి సన్నివేశం, గ్రామాధిపతుల, పంచాణంవారి విషయంలో వుంటుంది. అంటే కరణాలు, వెట్టి, తలారి, మున్సిఫ్, కమ్మరి, వడ్రంగం, కంసాలి, పురోహితుల కుటుంబాల విషయంలో మాత్రమే, ఇది సాధారణంగా కన్పిస్తుంది. ఇది ఊళ్ళ పేర్లు ఇంటిపేర్లయిన వాని విషయం.

కొందరి ఇంటిపేర్లు వ్యక్తి నామాలుగా వుంటాయి. భైరవభట్ల, అప్పాజోస్యుల, వీరమాచనేని, తమ్మిశెట్టి, గుండుబోయిన, తిమ్మావఝుల మొదలైనవి ఇలాంటివి. ఇందులో భైరవ, అప్ప, వీరమాచ, తమ్మి, గుండు, తిమ్మ అనేవి ఆయా వ్యక్తుల పేర్లు. భట్ల, జోస్యుల, నేని, శెట్టి, బోయిన, వఝుల అనేవి ఆయా వ్యక్తులు అనుసరించిన వృత్తులు. భట్టు అనేది బ్రాహ్మణుల్లో ఒక స్థాయిని సూచిస్తుంది. జోస్యుల, వారి జ్యోతిష్య పరిజ్ఞానానికి సంకేతం. నేని నాయక శబ్దభవం. శెట్టి వాణిజ్య

పరమైనది. బోయడు అనేది దేవాలయానికి చెందిన ఒక వృత్తి. భక్తులు ఇచ్చిన పశువు సాకి, ఇచ్చిన వారి అభీష్టం మేరకు, దేవాలయానికి నేయి అందించే వృత్తి ఇది. పఝుల ఉపాధ్యాయ శబ్దానికి మారు రూపం. ఆ పేర్లు గల వ్యక్తులు ప్రసిద్ధులుగావడం వలన తరువాతి కాలంలో, వారి వారి సంతతికి, వారి పేర్లు ఇంటిపేర్లు అయినాయి.

ఇవిగాక కొన్ని వృత్తులు, సాధారణ నామాలు కూడ ఇంటిపేర్లుగా కన్పిస్తాయి. అవసరాల, సమయమంతుల, గడియారం, అయాచితుల, సోమయాజుల, భారతుల, రామాయణం, పంతులు, వ్యాకరణం, దిట్టకవి, సంగీతం, కప్పగంతుల, అర్చకం, గుడిసేవ, భండారు, జన్యావుల, సుంకరి, కిలారి, ఉపద్రష్ట, వాజపేయాజుల, అవధానుల, పచ్చిపులుసు, వరికూటి, జొన్నకూటి, ఆరిగె కూటి, భాగవతుల, శరణు, అగ్నిహోత్రం, అశ్వధాటి, నీరుకట్టి, దశబంధాలు, ఆరాధ్యుల, సూరి, బందా, వేదాంతం, పడితరం - ఇలా అనేక విధాలైన పేర్లు కన్పిస్తాయి. ఇందులో కొన్ని తేలికగా బోధపడతాయి. మరికొన్నింటికి వివరణలు అవసరం. అవసరాల అనేది, ప్రభువు కాలోచితమైన వ్యవహారాలను గుర్తుచేసేవారు. సమయమంతుల అలాంటిదే. గడియారం కాలమానాన్ని పరిగణించేవారిది. అయాచితుల, యజ్ఞం నిర్వహించేటపుడు, ఆహ్వానం లేకుండానే, యాదాలాపంగా హాజరయ్యేవారు. సోమయాజుల, యజ్ఞం చేసి సోమయాజియైన వారికి వచ్చినది. భారతుల, ఒక ఆధ్యాత్మిక వ్యవస్థకు సంబంధించినది. కప్పగంతుల వేదం చదివే తీరులోని ఒకవిశేషం. జన్యావుల, పునరుత్పత్తి కొరకు పశువులను సాకేవారిది. కిలారి, ప్రభువు ఆలమందలపై అధికారులకు సంబంధించినది. ఉపద్రష్ట యజ్ఞ నిర్వహణ పర్యవేక్షకుడు. వాజపేయాజుల, తత్సంబంధమైన యజ్ఞం చేయింప సామర్థ్యం గలవారు. శరణు, శైవ మతానుయాయులలో ఒక అంతరువు. అశ్వధాటి కవిత్వం చెప్పడంలోని విశేషాన్ని సూచిస్తుంది. నీరు కట్టి, గ్రామం లోని చెరువు నీటిని వంతుల ప్రకారం సరఫరా చేసే ఉద్యోగం. దశబంధం చెరువులను నిర్మించడంలో, మరమ్మతులు చేయడంలోని నిర్వహణకు పరిహారంగా చెల్లించవలసిన శిస్తులో పొందిన రాయితీ. బందా దేవాలయ నిర్వహణలో ఒక ఉద్యోగం. పడితరం, ఆలయంలో ప్రసాదాలను వినియోగించే పదార్థాల వంతు. పై వివరణలనుబట్టి ఒకనాటి మన సమాజపు తీరుతెన్నులెలాంటివో అర్థమవుతున్నాయి గదా!

అయితే మరి కొన్ని ఇంటిపేర్లు కొంత తబ్బిబ్బుకు లోను చేస్తాయి. గాలి, మల్లెమాల, ఇందుకు ఉదాహరణలు. ఇక్కడ గాలి అంటే వాయువు కాదు. అదొక ప్రాంత నామం. ఆ ప్రాంతానికి ఆ పేరు, గాలి అనే చెట్లవలన వచ్చింది. మల్లెమాల అంటే మల్లెపూలదండ కాదు. అది ఒక ఊరిపేరు. కొండదాపున గల అడవిలోనున్న పల్లెను మాల అంటారు. అలాంటిచోట వచ్చిన గ్రామాలు అర్తమాల, వికృత మాల, మల్లెమాల మొదలైనవి. అలాగే తేళ్ళ. ఇది విష జంతువుకు సంకేతంకాదు. త్యాడ అనే ఊరిపేరుపై బహువచనం తేళ్ళ. ఇలా ఇంటిపేర్లలో చాల వైవిధ్యముంది. అన్నీ తెలుసుకో దగ్గవే.

# ఆమని - అన్నమయ్య అమరిక

ఆమని, భూభ్రమణ పర్యాయమున సంభవించెడి ఋతువు. దీనిని అన్నమయ్య అమరించుటేమి యనుప్రశ్న సహజముగా ఉదయించును. నిజమే. ఆమని ఋతువే. ఋతువులు ఆరు అవి వసంతము, గ్రీష్మ వర్ష శరత్ హేమంత, శిశిరములు. ఋతుపరిగణనము కంటె మనకు పరిచయమైనవి ఎండాకాలము, వానకాలము, శీతకాలమనునవి. ఇచ్చట మనకవసరమైనది ఆమని. ఇది వసంత ఋతువునకు పర్యాయముగా, మన కవులు ప్రయోగించినారు. ఆమని అనగా వసంతమని లోకమున రూఢమైనది. ఉదాహరణకు శ్రీనాథుడు హరవిలాసమున "ఆరామ పేరామని యెదుట నెమ్మనంబునం బేరామనియై వర్తిల్లు నార్తి సంబెరంబిచ్చి" అని ప్రయోగించినాడు. మన్మథుడు శివుని కంటి మంటకు ఆహుతికాగా, రతీదేవి విలపించు ఘట్టమిది. పేరామని ఎదుట అనగా వసంతుని ఎదుట అని ఇచ్చటి అర్థము. పై వాక్యమునందే, మరొక పర్యాయము పేరామనిని ప్రయోగించినాడు శ్రీనాథుడు. దానిని చర్చించుటకిది అదను కాదు. ఆమనిని వసంతముగా శ్రీనాథుడు భావించినాడనుట వరకే మనము ప్రస్తుతము గ్రహింప వలసినది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇట్లు చాలమంది కవుల ప్రయోగములు గలవు. అన్నమయ్య కూడ ఇదే అర్థమున బహుపర్యాయములు ప్రయోగించినాడు. అయినపుడు అన్నమయ్య అమరిక ఏమున్నదనిపించును. దీనిని విచారించుటకు పూర్వము, శ్రీనాథుని ప్రయోగమును మరొక్కసారి గమనింతము. అతడు ఆమని అనిగాక, పేరామని అని ప్రయోగించినాడు. ఈవిధముగా, పేరామని ప్రయోగము, యయాతి చరిత్రము నందుగలదు. అందు "......... తోపు చూపఱకుం బేరామనిగా నామని యొప్పెనంత" అని, పేరామని, ఆమనికి విశేషణముగా ప్రయోగింప బడినది. అనగా, ఆతోట, చూచువారికి మిగుల వసంతముగా భాసించు చున్నది అని దాని భావము. అనగా పేరామని ఇచ్చట ఆధిక్యార్థమున ఉపయోగింప బడినది. శ్రీనాథుని భావనకు, పొన్నెగంటి తెలగన్న భావనకు పొంతనయే లేదు. పేరామనికి మరొక ప్రయోగము కొరవి శాసనమున గలదు. "పేరామణి పున్నమ నాండు ఏనూరు

ద్రమ్మ లరివెట్టి సుఖంబు మనువారు" అని ఆ శాసనమున చెప్పబడినది. ఇచ్చట పౌర్ణమికి విశేషణముగా పేరామని ఉపయోగింప బడినది. అనగా ఒకానొక పౌర్ణమికి పేరామని పౌర్ణమి అను వ్యవహారము గలదని తెలియుచున్నది.

దీనిని బట్టి, పేరామని, వసంతము, ఆధిక్యము, ఒకానొకపున్నమి అను అర్థములలో ప్రయోగింపబడినట్లు తెలియుచున్నది. ఆంధ్ర భాషార్ణవము, పంటయొబ్బిడి చేయించుట, పంటకోసి జాగ్రత్త పెట్టించుట అను నర్థములను ఇచ్చినది. కుందూరి ఈశ్వరదత్తుగారు శాసన శబ్ద కోశమునందు పై అర్థముతో పాటు, వసంతమను అర్థమును ఇచ్చియున్నారు. డా॥ బూదరాజు రాధాకృష్ణ గారు, ఆమని శబ్దము శ్రావణశబ్దము నుండి ఉత్పన్నమైనదని, ఆమనిపున్నమి అనగా శ్రావణ పున్నమి అని అర్థము నిచ్చియున్నారు. కాని పేర్ శబ్దమును వివరింపలేదు. దీని నింత తడుముటకు కారణము ఈశ్వరదత్తుగారు, రాధాకృష్ణగారు శాసనమునందలి పేరామణిని వివరించుట. ఇక అన్నమయ్య ఆమని అమరికకు, దీనికి సంబంధమేమనగా, రాధాకృష్ణగారు ఆమనిని వసంతముగా గాక శ్రావణముగా సంభావించుట; నిజమునకు అదే అర్థము. అన్నమయ్య కూడ అదే అర్థమున ఉపయోగించుట. ఈశ్వరదత్తుగారు, పంట యొబ్బిడి చేయు సమయ మనుటకు గలకారణము, పేర్ శబ్దమునకు అర్థము, ఆమని వసంతముగా రూఢమైన తీరుతెన్నులను తరువాత గమనింతము. ముందు అన్నమయ్య పలుకాటను పరామర్శింతము.

ఆమని వసంత ఋతువుగా పెక్కురు కవు లుపయోగించినారని, అన్నమయ్యయు బహుపర్యాయములట్లు ప్రయోగించినాడని చెప్పుట జరిగినది. కాని ఆమని శ్రావణి సంబంధిగా రాధాకృష్ణగారు గ్రహించి నారని, నిజమునకదే సరియైనదనియు చెప్పబడినది. కాని శ్రావణము వర్షఋతు సంబంధి. వర్ష వసంత ఋతువులనడుమ గ్రీష్మమున్నది. అయినపుడు ఒకే శబ్దము రెండు ఋతువులను ఎట్లు బోధించుచున్నది. ఆమని, శ్రావణి సంబంధిగనుక వర్షఋతు వనుట సత్యము. మరి మహాకవు లెట్లు పొరబడిరి. అట్లు వసంతముని భావించినవారిలో అన్నమయ్యయు గలడు. అయినపుడు అన్నమయ్య ఆమనిని అమరించిన తీరెట్టిది! ఇందొకటి తెలిసిన రెండవది తెలియును. ఇందు ఒకటి ప్రకృతి గతమైన విషయము. రెండవది, దానిని పరిగణించుటలో ప్రాంతీయ జనానీకము అనుసరించిన విధము.

ఋతువుల పరిగణనము సూర్యుని చుట్టును భూమి చేయు భ్రమణమునకు సంబంధించినది. ఋతుగణనము స్థూలమైనది. అనగా అక్షాంశములను బట్టి ఋతుప్రవేశ, నిష్క్రమణములలో, సర్వత్ర నొకటిగా నుండక కొంత భేదముండును.

ఇక మాస గణనము, ప్రాంతమును బట్టి మారుచున్నది. భారత దేశమున ముఖ్యముగ మూడు గణనములు గలవు. అవి సౌర, చాంద్ర, బార్హస్పత్య మానములు. ఆంధ్రులమైన మనము చాంద్రమానమును పరిగణించుచున్నాము. చంద్రుడు శ్రవణానక్షత్ర యుక్తుడైన మాసము శ్రావణము. ఈ శ్రావణి తమిళమున ఆవణియై, తెలుగున ఆమని యైనది. శ్రావణమాసము తెలుగువారికి వర్షకాలము. అదే శ్రావణమాసము అనగా ఆసమయము (కాలము) కొందరికి వసంత ఋతువు. కన్నడ రాష్ట్రమందలి కానడ (కెనరా) జిల్లాలలో ఇది వసంత ఋతువే. అచ్చటి మాసపరిగణనము చాంద్రమానము ననుసరించియే యున్నది. కనుక ఒక చోట వసంత ఋతువైనది, మరొకచోట వర్షకాలమగు చున్నది. ఆవిధముగా శ్రావణి (ఆమని) కొందరికి వసంతమైనది. కవుల ప్రయోగములలోని రూఢికి ఇదిమూలము. అన్నమయ్య ప్రయోగములకును ఇదే మూలము. కాని అన్నమయ్య ప్రయోగములలో ఒకవిశేషము గలదు. భాషలోని శబ్దములకు రూఢ్యర్థములు, యౌగికార్థములుండును. అనగా లోకమున కొన్ని శబ్దములకు మూలార్థ మొకటి యుండగా, అనేకానేక కారణములచే మరియొక అర్థమును సంతరించుకొని, లోకమున అదేరూఢమై, మూలార్థమును వెనుక బట్టించును. దీనిని అర్థవిపరిణామ మందురు. ఆమని, వసంతముగా రూపుదిద్దు కొనుట ఇట్టిది. అన్నమయ్యలోని విశేషమేమనగా, రూఢ్యర్థమును గ్రహించుచునే, అదే నిజమని భ్రమింతు మేమో యని, పనివడి మూలార్థమునను అట్టిశబ్దములను ప్రయోగించును. కనుకనే అన్నమయ్య భక్తులలో పరమ భక్తుడు. భాషాబోధకులలో పరమాచార్యుడు. అనగా రూఢ్యర్థమునే, యౌగికార్థముగ భ్రమ పడుదు రేమోయని హెచ్చరించును. కాకున్న పనివడి అట్టి ప్రయోగముల చేయుటకు కారణ మగుపింపదు. ఈ క్రింది ఉదాహరణములను పరికించిన ఇది స్పష్టమగును.

ఒక పదమున అన్నమయ్య 'ఆమని ఈగకు ఆజన్మము సుఖము" అని ప్రయోగించెను. ఈగలు పుట్టి, వృద్ధి నొందునది వర్షకాలముననే గదా! దానిని చక్కగ పొసగించిన తీరు ఆమని ఈగ కనుటలో గలదు. ఇందు విశేషంచి, అనగా పనివడి చెప్పిన దేమున్న దనిపించును. పనివడి చెప్పినది కాకున్నను దాని సంభావ్యతను నిజస్థితిలో భావించినాడు గదా! ఇంతకంటె పనివడి ప్రయోగించిన తీరు గమనించిన, అన్నమయ్య, ఆమనిని మూలార్థమున అమరించిన తీరు అవగతమగును. ఈ పదమును గమనింపుడు.

తామరతూడున నీచెయి దాకించెనంటాను
వేమారు నాతని నెన్ని వెంగేలాడేవే
భూమిలో నీకరములు పోలించి చూచి తేను
ఆమని తామరతూండ్ల అందములేకావా!

శ్రీవేంకటరమణుని చెయిదములను నేరములుగా నెంచి, ఆలమేల్మంగ చెలికి చెప్పగా, ఆచెలి, శ్రీవేంకటేశుని ఆ చేతలు సహజములే కావా, దీనికింత అనవలెనా యని అలవేల్మంగను అనునయించుట ఇందలి భావము. తామరతూడుతో, రమణుడు నీచేతిని తాకించెనని ఆరోపించుచున్నావు-అందు దొసగేమున్నది గనుక. మరి నీ చేతులు తామరతూండ్లను పోలినవే కాదా! ఇందు వైరుధ్యమేమున్నదని చెలి వివరణము. ఆ అనుట కేవలము తామర తూండ్లనక, ఆమని తామరతూండ్లనిపించుటలో ఔచిత్యముగలదు. అదే అన్నమయ్య అమరిక.

ఇచ్చట ఆమనికి రూఢ్యర్థమైన వసంతమును గ్రహించిన, ఉద్దిష్ట భావ ప్రతిపత్తికి భంగము కలుగును.కారణము వసంతము వచ్చునప్పటికి జలాశయములు వట్టి పోవును. కొన్నింటిలో జలము పుష్కలముగా నున్నను, వర్షకాలమున పుట్టిన తామర తూండ్లు లావణ్యమును, మృదుత్వమును కోల్పోయి, బిరుసెక్కి, వడబడుట మొదలగును. మరి అమ్మవారి చేతులను పోల్చవలసినది లావణ్యముగల తామర తూండ్లతోనా, లేక వసంతమునాటి బిరుసెక్కిన వాటితోనా! భావుకులు వివేచింతురు గాక. కనుక అన్నమయ్య, వర్షకాలమందలి తామరతాండ్లని స్పష్టపరచుట కొరకు పనివడి ఆమని శబ్దమును ప్రయోగించెననుట ఋజువగుచున్నది. లేకున్న లాలిత్య, మృదుత్వములను బోధించుటకు మరివేరు పదములను ఇచ్చట సంధానింపలేడా! కనుక ఆమనికి వసంతము రూఢ్యర్థమే సుమా! యౌగికార్థము వర్షకాలము అని బోధ గావించుటకు పనివడి దీనిని ప్రయోగించెననుట నిక్కము. ఇదీ అన్నమయ్య ఆమనిని అమరించిన తీరు.

ఒక ఇతరుల ప్రయోగముల సామంజస్యమును పరిశీలింతము, ఆమని, ముందువివరించిన భూభ్రమణ కారణముగా, ఒకచోట అదేసమయము వసంత ఋతువగుట, కవులప్రయోగమునకు మూలము. శ్రీనాథునికి మూలము కాళిదాసు కుమారసంభవము. అందు వసంతుని ప్రస్తావన కలదు. కనుక వసంతమునకు పర్యాయముగా, రూఢమైన ఆమనిని ఆతడు గ్రహించినాడు. పేరామనిని గ్రహించుట ఏమరిపాటు. కాకున్న పదముపై లౌల్యము. ఆంధ్రభాషార్ణవ మిచ్చిన పంట ఒబ్బిడి చేయుకాలము కుందూరి, ఈశ్వరదత్తుగారు గ్రహించిరి. ఆమని ఇచ్చట మనకు

వర్షకాలమైన, మరియొకతావున నది పంట ఒబ్బిడి చేయుకాలము గావచ్చును. రాధాకృష్ణగారు, ఆమని పౌర్ణమిని శ్రావణ పౌర్ణమిగా గ్రహించుట యుక్తమేనని ముందు చెప్పడమైనది. కాగా 'పేర్' శబ్దమునకర్థమేమి! దీనికి పెద్ద అని అర్థము గలదు. దానినుండి తెలగన్న భావించిన ఆధిక్యార్థమును పొసగింప వచ్చును. అప్పుడు పేరామణి పున్నమ అనగా పెద్ద శ్రావణ పున్నమ అని అర్థము వచ్చును. మరి చిన్న శ్రావణ పున్నమి ఉన్నప్పుడే ఇది పొసగును. ఇది సరిపడని సంగతి. ఇందలి పేర్ శబ్దమునకు వెదచల్లు అని కన్నడమున అర్థము. తమిళమున, భూమి కవులుకు సంబంధించిన పద్ధతిని సూచించును. రెండర్థములు సస్యారంభ స్థితిని పట్టి ఇచ్చుచున్నవి. శాసన ప్రయోగమున కిది అర్థము. శ్రీనాధుని రెండవ పర్యాయపు పేరామని ఇందేదియు కాదు. అచ్చట విహ్వలత అను అర్థము ప్రాకరణికముగ సరిపోలును. ఆమని శబ్దమునకు ఈ అర్థమున్నట్లు బ్రౌను, తన నిఘంటువున నమోదు చేసియున్నాడు. దీనికి మూలము తమిళము నందలి. 'ఆవ' అను తమిళపదము, ఆధిక్యార్థమున పేర్ చేర్చి, శ్రీనాథుడు 'పేరామనియై' అని ప్రయోగించాడు.

ఆమని శబ్దవిచారము ఇంత చర్చకు తావిచ్చినది. దానిని యౌగికార్థమున వివేచించిన వాడు అన్నమయ్య. రూఢ్యర్థము బలీయమై, అదే మూలార్థమని భ్రమింతురేమో- అని అన్నమయ్య దానిని అనువైనచోట అట్లు అమరించినాడు. మరి కొన్నింటిని కూడ అట్లు తీర్చినాడు. కనుకనే ఆతనిని భాషకు పరమాచార్యుడనుట!



# యయాతి చరిత్రము

కౌరవులు, పాండవులు పౌరవ్యులు. పూరుని వంశమున జనించిన వారు పౌరవ్యులు. పూరుడెట్లు ఈ వంశమునకు మూల పురుషుడాయెనో వివరించుట నేపథ్యముగా గలది ఈ యయాతి చరిత్రము.

యయాతి నహుషుని కుమారుడు. పూరుడు యయాతి కుమారుడని చెప్పిన చాలును. కాని వ్యాసభగవానుని రచనా ప్రణాళిక అట్టిది కాదు. భారతము లోక హితమును నిష్ఠగా గొని కావించిన రచనము. లోకహిత మెట్లు ఒనగూరును. లోక రీతి యెట్లుండునో ఉదాహరణ పూర్వకముగా వివరించి అందేది లోకమునకు స్వీకార యోగ్యమో తెలుపుట. దానికొరకు భారతము వెలసినది. లోకరీతి యంతయు నుపన్యసించుటకు కేవల ప్రధాన కథ సమర్థము కాక పోవచ్చును. కారణము ఏ యొక్కరి జీవిత వృత్తాంతము సర్వ లోక రీతికి ఉదాహరణముగా నుండక పోవచ్చును. అట్టియెడ ప్రధాన కథేతర ఇతివృత్తముల నాశ్రయింప వలసి వచ్చును. కాని యవి ప్రధాన వృత్తమునకు సంబంధించినవి కాకపోయిన, పాఠకులలో, శ్రోతలలో అనాసక్తికి మూల మగును. కనుక అవి ప్రధాన వృత్తాంత సంబంధులై యుండుట అత్యావశ్యకము. అట్టియెడ ఉపాఖ్యానములు ఆధారభూతములగు చున్నవి. ఈ యయాతి చరిత్ర ప్రపంచీకరణమునకు ఇది మూలము. దీని నూతగాగొని వివరించిన లోకపు తీరును గమనింతము.

నిజమునకు పూరుని వృత్తాంతము పై రెండు వాక్యములలో ముగింప వచ్చును. కాని వ్యాసుని ప్రణాళిక చూడుడు. పూరుడు యయాతి కనిష్ఠపుత్రుడు. జ్యేష్ఠుడుండగా ఇతనికి రాజ్యార్హత యెట్లు ప్రాప్తించెను. తండ్రియైన యయాతి వాగ్దానము వలన. నియమాతిక్రమణమైన వాగ్దానము నెట్లొతడిచ్చెను? యయాతికి సంప్రాప్తించిన అకాల వృద్ధత్వమును కుమారులలో పూరుడు గైకొనుటచే. యయాతికి అకాల వృద్ధత్వ మెట్లు కలిగెను? మామ యగు శుక్రుని శాపమువలన. అల్లుని మామ శపించుట యేమి? యయాతి గావించిన వాగ్దాన భంగము వలన. ఆ వాగ్దానమేమి?

శర్మిష్ఠను మంచము పొత్తునకు వెలిగా నుంచుట. శర్మిష్ఠ ఎవరు? వృష పర్వుడను రాక్షసరాజు కుమార్తె. అమె విషయమున శుక్రుని యనుశాసన మేమి? మొదలు శుక్రుడు విప్రుడు. యయాతి క్షత్రియుడు, మరి వీరికి సంబంధబంధుత్వ మెట్లు? శుక్రుని కుమార్తె దేవయానికి బృహస్పతి కుమారుడు కచుని శాపము. ఆమెకు ఇతనికి గల సాంగత్యమేమి? అతడేల శాపమిచ్చెను? ఆమె కచుని శపించినది గనుక. ఆమె ఏల శపింపవలసి వచ్చినది? ఇన్ని ప్రశ్నలకు మూలము ఈ కథ ప్రపంచీకరింపవలసి వచ్చినది. ఈ ప్రశ్నలు పరస్పరాధారితములు. వీటికి గల సమాధానములలో "లోకరీతి" ఇమిడియున్నది. వాటిని వివరించుట మిషగా ఈ కథ వివరింప వలసి వచ్చినది. అది యెట్లో చూతము.

నహుషుని కుమారుడు యయాతి అని ప్రారంభింప వచ్చును. కాని ఏతత్ చరిత్ర కథనము నందు ఇముడని నీతిని వివరింపవలసి వచ్చుట కారణముగా నహుషుని తండ్రి పురూరవుని వృత్తాంత మవసర మైనది. అంతేగాక ఎవరి వృత్తాంత మైనను తాతతండ్రుల వృత్తాంతముతో గదా లోకమున మొదలగునది. అట్లును పురూరవుని చరిత్ర అవసరమై యున్నది.

పురూరవుడు వైవస్వత మనువు కుమార్తె ఇలకు, సోమ పుత్రకుడైన బుధునికి జన్మించిన వాడు. అతడు చక్రవర్తి. అతనికి లేనిదేమి? లేని దేమియు లేదు. ఉన్నవి మాత్రము మదాంధత, లోభము. వాటివలన నష్టమేమి? నష్టము అతనికి కాదు. పాలితులకు. ప్రభువైనవాడు లోభి యగుట యేమి? ఎంత ధనము, విద్యాధనము కలిగినను సంతృప్తి యెచ్చటిది. కనుక లోభమును సమర్థింప వచ్చునా! పురుషకారముచేత న్యాయమార్గమున వానిని సంపాదించుటకు ఎట్టి అడ్డంకియు లేదు. కాని లోభము సమర్థనీయముకాదు. అది అతని నిసర్గగుణము. దాని నెవరు ఉడుపగల సమర్థులు. నిసర్గ గుణమును మానుప లోకులెట్లు సమర్థులగుదురు. ఉత్తమ చారిత్ర శిక్షవలన, ఎవరి దుర్గుణములను వారే మాన్పుకొన వలయును. విద్యా శిక్ష దాని కొరకు ఉపయోగపడవలెను. అది మాన్పు కొన వలయును. అట్లు కాని నాడు చేయగలిగినది లేదు. మిదుమిక్కిలి ఇతడు ప్రభువు. ఇతనికి బోధింపగల వారెవరుందురు గనుక! దానికితోడు ప్రభుత్వ విభుత్వములతోడి సంసర్గమున కలిగిన మదాంధత్వము. ఇది, విప్రోత్తముల ధనము నపహరించుటకు గూడ కారణమైనది. బ్రాహ్మణ ధనమును గొనుట నరక హేతువు. అందును అపహరణము. సర్వ వర్ణాశ్రమ ధర్మములను రక్షింప వలసిన ప్రభువు అధర్మమునకు నెట్టుకొన్న, అతనిని ఆ ప్రయత్నము నుండి మరల్ప నెవరు సమర్థులు. సమర్థులు విప్రోత్తములు. మరి వారే బాధితులైన - ఇంకేది దారి. అది అట్లు కొనసాగ

వలసినదేనా? అది కూడదు. మరి సమర్థు డెవడు? ఈ లోకమున నెవ్వరు లేరు. ఒక్కడే సమర్థుడు. అతడు వానిని సృష్టించిన వాడు కావలయును. కనుక బ్రహ్మ పూనిక వహించి సనత్కుమారుని పంపినాడు. అతనికి పురూరవుని దర్శనముకూడా లభింపలేదు. కారణము పురూరవుని ఉన్మత్తత. ఇదీ కథ. దీని నూతగా గొని లోభము సర్వానర్థములకు మూలము. మితిమీరిన ప్రభుత మదాంధత్వమునకు కారణము. అది ఉచితానుచితములను - కడకు విప్రోత్తముల ధనమును అపహరించుటకు కూడ వెనుదీయనీదని, సర్వులు అసమర్థులైన వేళ, ఎవరి అభ్యర్థనము లేకున్నను, దానిని సవరింవలసినబాధ్యత వాని సృష్టికి మూలమైన వాని యందుండుననియు, కొన్ని సందర్భములందు అట్టిదియు విఫలమగుననియు, తెలియజెప్పుట వ్యాసభగవానుని ప్రణాళిక.

అట్టివాని కుమారుడు నహుషుడు. అతని కుమారుడు యయాతి. అతని కుమారుడు పూరుడు. అతడు వంశకర్త అయ్యెను - అని చెప్పిన చాలును. కాని జనమేజయునకు వైశంపాయనుడట్లు చెప్పలేదు, అతనిచే వ్యాసభగవానుడిట్లు చెప్పించెను-యయాతికి శుక్రుని కుమార్తె అయిన దేవయాని వలన యదు తుర్వసులు, వృషపర్వుని కుమార్తె యైన శర్మిష్ఠవలన ద్రుహ్యువు, అనువు, పూరుడు అనువారలు జన్మించిరనియు, శుక్రశాపమున యయాతి అకాల వృద్ధత్వమును పొందుట కారణముగ, తన కుమారులను రావించి వారిలో యెవడు తన వృద్ధత్వమును గొని యౌవనము తనకిచ్చునో వాడు తన యనంతరము రాజ్యార్హుడగునని-అందు కడమవారు దాని కొడబడని సందర్భమున పూరుడు దాని కంగీకరించి ఫలితముగ రాజయ్యెనని వైశంపాయనుని కథనము. ఇంకేమి! ప్రణాళిక సిద్ధమైనది! ప్రత్యక్షశ్రోత జనమేజయునికే కాదు. భారత కథాశ్రవణ, పఠన దత్తావధానులైయున్న వారందరి మనములలో ప్రశ్నలు, ఉత్సుకత పొడమును. ఇది అవసరము. దానిని సంఘటితము చేయుట ఉత్తమ కథకుని లక్షణము. అది ఉత్తమ కథన రీతి. ఇందు మొదటి ప్రశ్న. విప్రకన్య యైన దేవయానిని క్షత్రియుడైన యయాతి ఎట్లుద్వాహ మయ్యెనని. రెండవ ప్రశ్న అల్లుడనియు వివేచింపక శుక్రుడు యయాతి నెట్లు శపించె ననునది. దీనియందు మీది కథ ఇమిడి యున్నది. దానిని వివరించుట మిష. దాని నూతగా గొని బోధింపవలసిన దానిని బోధించుట ప్రయోజనము. అదెట్లు పొసగింపబడినదో చూతము-

మొదటి ప్రశ్నకు సమాధానము, దేవయానిని బ్రాహ్మణుడు వివాహ మాడకుండు గాక యను కచునిశాపము. అందువలన కచుని వృత్తాంతము అవసరము. కచుడు బృహస్పతి కుమారుడు. అయిననేమి? ఆ బృహస్పతి సుర

గురువు. వారికి అసురులకు వైరము. దానివలన అగు యుద్ధము నందు సురలు మడియు చుండిరి, అసురులు మడియుచును మృత సంజీవని వలన పునర్జీవితులగు చుండిరి. అది వీరికి కావలయును. అది శుక్రుని యధీనము. అతడు అసుర గురువు. కోరి దాని నతడు వీరికెట్లు లభింపజేయును. కాని వీరి కది అవసరము. కాని అసాధ్యము. అసాధ్యమని ప్రయత్నింపక పోవుట నీతికాదు. భేదము ననుసరింప వలెను. దానికి దేవతలు కచుని నియోగించిరి. కచునే యేల నియోగింపవలెను? ఏమో! వారి కప్పటి కట్లు తోచినదన వచ్చునా? అనవచ్చును. అనుటకేమి. కాని ప్రయోజనము సిద్ధించునా? కనుక సమర్థునే నియోగింప వలెను. కచుని సామర్థ్యమెట్టిది? అతడు బాలుడు. నియమ వ్రత శీలుడు. అయిన చాలునా? ఇట్టివాడు మరొకడు దేవతల యందు లభింపడా! లభింపవచ్చును. మరియేల ఇతనినే నియోగించిరి. దీనికిచ్చట సమాధానము లేదు. మీది కథలో స్పష్టపరుపబడినది. దానిని యథావకాశముగ తెలిసికొందము. ఇక్కడ దేవతలు చెప్పిన మాట యొకటి కలదు. అది ఇది - శుక్రుడు కరుణాలయుడు. నిన్ను ప్రీతి చేకొనును. తద్విద్యాలలనాదానము చేయును అని. అతడు కరుణాలయుడైనను, ఏది తమ పక్షము నభ్యున్నతికి కారణమగునో దాని నుపదేశించునని వీరు ఎట్లు తలచినారు? అతడంత వెఱ్ఱియా! ఇంతమాత్ర మూహింపలేని వారు - వారు దేవత లెట్లగుదురు. అది వారెరుగుదురు. ఎరిగియే యొక మాట చెప్పినారు. శుక్రునకు దేవయాని యను కుమార్తె గలదు. దాని మాటను అతడు అతిక్రమింపడు. నీ నేర్పు విధంబున దాని చిత్తము లోగొని తేని కార్యము సాధింపనగు ననునది ఆ మాట. అప్పటికి వారికి తోచిన ఉపాయమది.

తన సాయ మపేక్షించిన వారి మాట చొప్పున కచుడు శుక్రుని సందర్శించినాడు. తనను తానెరుక పరచు కొనినాడు. అతని సుకుమారత్వంబును, వినయ ప్రియ వచన మృదు మధురత్వమును అనవరత నియమ ప్రకాశిత ప్రశాంతత్వంబును గాంచి, శుక్రుడు ఆతని పట్ల స్నేహనిబద్ధుడైనాడు. ఇది యాతని అధ్యాపకత్వమునకు ప్రతీక. ఇది సహృదయ విద్యావేత్తల లక్షణము. ఇది వైయక్తికము. కాని వచ్చినవాడు విపక్ష గురుపుత్రుడు. ఆట్టివాడు కోరి తన యొద్ద నేర్వదగినది ఏమైయున్నది. తన శిష్యరికమున నేర్వదగిన దేమున్నది. ఉన్నది యొక్కటే. అది మృతసంజీవని. ఇంత మాత్రము గ్రహింపలేని యల్పుడా శుక్రుడు. కాదు. అది యాతని మాటలలోనే తెల్లమయినది. బృహస్పతి పుత్రుని పూజించిన బృహస్పతిని పూజించినట్లే యని భావించినాడు. ఇట పూజించుట యేల? అంతటివాడు తనను కోరివచ్చుట! వచ్చినవాని ఆంతర్య మేమగుగాక. ప్రతి ద్వంద్వియైన వాని కుమారుడు తనను

గురువుగా స్వీకరించుట తన మహత్త్వమునకు ప్రతీక. అట్లు గాకున్న బృహస్పతి యెడలగల గౌరవము. ప్రతిద్వంద్వియొక్క మహత్తత్త్వమును గుర్తించుట పరమౌదార్యము. ఇట ఇందేది వర్తించినను వర్తించియుండవచ్చును. ఫలితము కచునికి ప్రవేశము. శుక్రుని కడ అంతేవాసిత్వము. ఇపుడు కార్యము కొంత సఫలమైనది. ప్రయత్నారంభమునకు స్థితి కలిగినది. ఇక ఫలోన్ముఖము కావలెను. వంచన మనమున ఒకించుకయును లేక, మతి, మాట, చేత ఒక్కరూపగునట్లు శుక్రుని ఆదేశమును-పాటింతుననక-అక్షణమాత్రన పాటించినాడు. అదియు వినయమున. అంతకంటె నెక్కుడు విధేయత్వమున. దేవయానిని ఆయా చేతల, ప్రియభాషణముల సంతత ప్రీతి గావించుచు కొలిచినాడు.

దేవతల పనుపు యింత మాత్రము నెరవేరినది. అది శుక్రునారాధించుట. దేవయాని చిత్తంబు లోగొనుట. ఇక మృత సంజీవనిని పొందుట కావలసియున్నది. ఇప్పటికి పెక్కేండ్లు గడచినవి. కాని మృతసంజీవని ఊసు రాలేదు. దానిని కచునికి బోధింపుమని దేవయాని తండ్రిని యడుగను లేదు. ఆమె సాయముండిన- ఆయన దానిమాట యతిక్రమింపడు గావున బోధించునని గదా దేవతల యాలోచనము. ఇట్లే మరి కొంత కాలము గడచిన యేమై యుండెడిదో. ఎంత కాలము గడువ వలెను. దేవయాని తండ్రికి చెప్పునంతవరకు. కాని యట్లు జరుగలేదు. ఈ లోపుగనే, దనుజులు కచుని మట్టుబెట్టినారు. కథ ముగిసినది - అని అనుకొనినారు దనుజులు. కాని కథ ప్రారంభమైనదే ఇచ్చట. దానిని తెలియుటకు మున్ను ఒకటి విచారింతము. పలుకాడ నేర్చినవారము. భావింవగలవారము ఊహాపోహ విచారము చేయక నుండలేము కదా!

కచుని చేతలకు సంప్రీత మనస్కయై దేవయాని మృతసంజీవనిని బోధింపుమని తండ్రిని ప్రార్థించిన ఏమైయుండెడిది. బోధించి యుండెడివాడా? బోధించి యుండునని అతని ప్రవర్తనమువలన తెలియుచున్నది. బోధించు ననియే గదా దేవతలు కూడా భావించిరి. కాని బోధించి యుండడనుటకును కొంత నిదర్శనము గలదు. ఏమనగా - మొదటి పర్యాయము కచుడు మృతుడైన సందర్భమున కుమార్తె అభ్యర్థనముపై బ్రతికించినాడు. కాని రెండవమారు అట్లుచేయక అతడు చచ్చియు స్వర్గమునకే - అనగా స్వస్థానమునకే పోగలడు, విచారమేల? అనినాడు. ఆమె హఠము గావించినది. పెద్దయుంబ్రొద్దునకు ప్రసన్నుడై మరల బ్రతికించినాడు. ప్రసన్ను డగుటకు మొదటి పర్యాయములేని ఆలస్యము రెండవ మారేల చేసివాడు. దనుజులు ఎందుకు కచుని మట్టు పెట్టుచున్నారో ఊహింపలేడా? బ్రతికించిన మరల చంపరా! ఇది యొక ఆవృత్తిగా పరిణమించును.

దీనివలన ప్రయోజనమేమి? కనుక వలదను కొనినాడు. కాని ఆమె ఊరకుండునా! ఆమెలేక ఈతనికి ఊపిరాడునా! కనుక బ్రతికించినాడు. ఇట్లే మృత సంజీవనిని బోధింపు మన్నను బోధించెడి వాడు కాడా యనవచ్చును. ఏమో ఏట్లుండెడిదో - కాని, కొంత విచారము చేసి యుండెడి వాడు. దానికి తార్కాణము మొదట తక్షణము బ్రతికించినవాడు, రెండవమారు ఉపేక్షించినాడు.దీనికి కారణము పైన చూచితిమి. అదియే యిచ్చటను ప్రవర్తించును. అచ్చట కచుని పట్ల దనుజుల ప్రవర్తనము, దానికగు కారణము, అప్రత్యక్షము. కాని యిచ్చట ప్రత్యక్షము. అది మృత సంజీవని విషయము. తాను అసుర గణోపాధ్యాయుడై యుండి తన పక్షము వారి అభ్యున్నతి కది యేక కారణమైయున్న, దానిని కుమార్తె భోధింపుమన్న, బోధించునా! కొంత అనునయించి యుండెడి వాడు. అందలి ఔగాములను బోధచేసి యుండెడి వాడు. నీతోడి కచుని స్నేహమునకు మూలమిది. నిన్ను ముందుంచుకొని తన కార్యము నెరవేర్ప నెంచు కొనుచున్నా డనెడి వాడు. అయితే ఇది యంతయు ఊహ. ఇట్లగుటకును వీలున్నదని సూచన. ఇట్లే యగుచో ఏమై యుండును. అయినను, అతనికి మృతసంజీవని బోధించి తీరవలసినదే నని ఆమె హఠము గావించినచో బోధించెడి వాడేమో ! ఇచ్చట రెండు మార్గములలో ప్రవర్తించు ననుటకు అవకాశమున్నది. ఒకటి బోధించుట - రెండవది పై బోధనల వలన తండ్రి, కుమార్తెలకు కచుని పై అగ్రహము కలుగుట,దాని వలన కచుని ఆశయము విఫలమగుట. ముందు చెప్పినట్లుగ ఇది ఊహ. కాని ఇట్టిది జరుగుటకు అవకాశము కలదు గదా! మరి ఇట్టి విపరీతమును దేవతలు ఏల ఊహింపరైరి? ఒకటి అప్పటి వారి ఆతృత . ఇంత ఆలోచనమునకు తావీయ లేదని భావించుట, లేక విశ్వాసము కావలెను. లేదా ఈ రెండును కాక మార్గాంతరము మరియొకటి లేనపుడు అప్పటికి వారికి తోచినదదియని భావింపవలయును. ఒకటి నిశ్చయము. కేవల శిష్యవృత్తివలన శుక్రుడు బోధింపడనుట వారికి తెలియును. కుమార్తె అనుగ్రహము అవసరమని తెలియును. అది పై విధమున బెడిసికొట్టునా! ఏమో-అని విచారించిన, మరి ఉపాయాంతర మేది. కనుక ఉన్న ఉపాయమును వారనుసరించి నారని భావింపవలెను. ఇక్కడ వ్యాసభగవానుని మెలకువ గమనింప దగినది. కథ ఆగిపోవుట పొడగట్టిన వేళ ఎట్లు మలుపు తప్పినాడో గమనించునది.

కచుడు శుక్రునకు శుశ్రూష చేయుచునే యుండెను. ఏండ్లు గడచినవి. మృతసంజీవని బోధ సంగతి కాదు కదా దాని ఊసు కూడ ఇంతవరకు ప్రస్తావితము కాలేదు. కాని దనుజులు కచుని యనుమానించి నారు. అతడు తమ గురువునకు ప్రియశిష్యుడైనాడు. గురుపుత్రి మనమును లోగొనివాడు. ఇంత చేసినవాడు ఇంకెంత

చేయునో! తమకు కాలమాసన్నమైన, కచుడు గురుపుత్త్రి ముఖమున గురుని తద్విద్యాబోధనమునకై ప్రేరేపించును. అప్పుడు చేయగలిగినది లేదు. ఇప్పటికి చేయగలిగిన దొక్కటి కలదు. అది కచుని మట్టుబెట్టుట. ఆలోచన పొడమినది తడవుగా దానిని ఆచరణమునకు తెచ్చినారు. ఇప్పట్లున చేయదగినది మరి యొక్కటి గలదు. అది-కచుని యత్నారంభమిట్టిదని గురుని ప్రబోధించుట. దాని నేల వారు అనుసరింపలేదు? వారి అశ క్తత. కాకున్న దానినే అనుసరించెడివారు. వారు అశక్తులు - నిజమే. తమ ఏలిక ముఖమున విన్నవింప చేయవచ్చునే-అతడును అశక్తుడు. తరువాతి కథలో అది స్పష్టమైనది. దేవయాని వృషపర్వు పురము చొరనొల్ల ననిన నాడు దానిని ఒప్పింప యత్నించుచున్న గురుని సమీపించి అతడు పలికిన పలుకులలో అది స్పష్టమైనది. కనుక అశక్తుడు. తన ప్రభుతకు, విభుతకు మూలము మృత సంజీవని. అది గురుని యధీనము. అతడు కుమార్తె అధీనము లోనివాడు. చేయగలిగినది లేదు. మీదు మిక్కిలి ఉపాధ్యాయునిపై ఎవరి పెత్తనము చెల్లి రాగలదు. అది నా యిష్టమన్న ఏది దిక్కు. ఇంత ఆలోచించినారో లేదో, కాని దనుజులు వృషపర్వుని కంత శ్రమ కల్పింపక వారికి తోచినది వారు చేసినారు. పుత్త్రి అభ్యర్థనముపై తండ్రి కచుని బ్రతికించినాడు. తమ యత్నము విఫలమైనది. అట్లగుటకు కారణము కచుని శరీరము నాశనము చేయకుండుట. కనుక ఈమారు కచుని శరీరమునుకాల్చి ఆ బూదిని సురలో కలిపి గురుని చేతనే త్రాగించినారు. ఇప్పుడు శరీరమును లేదు, బూదియు లేదు. ఇంకెట్లు?!

కాని దేవయాని ఊరకుండునా? కచునిపై గల ఆసక్తి ఆమె నూరకుండ నిచ్చునా? తండ్రితో చెప్పినది. మరల దనుజులు కీడుచేసి యుందురని దుఃఖించినది. తండ్రి ఓదార్ప జూచినాడు. కచుడు సద్గతికి పోవును, ఆతనికై శోకింపనేల యనినాడు. దేవయాని యేమన్నది?- నేను శోకింప కెట్లుండుదు ననినది. అదియు నెట్లు? కచుడెవరు! మతి లోకోత్తరుడైన అంగిరసు మనుమండు. ఆశ్రితుండు - బృహస్పతికి పుత్త్రుడు. మీకు శిష్యుడు. అంగిరసుని మనుమ డనుట లోనే బృహస్పతి కుమారుడను స్ఫూర్తి గలదు కదా! మరల బృహస్పతి పుత్రుడనుట యేల? ఆ బృహస్పతి పుత్రుడనియే కదా నీ వాతనిని చేరదీసితివి. ఆ కారణముననే గదా నీవాతనికి ఆశ్రయ మిచ్చినది- అని అతని బలహీనతను ఎత్తి చూపినది. అతడు శిష్యుడు కూడ. మరినీవు అచ్యుత ధర్మజ్ఞుడవు. గురు ధర్మమును పాటింపవలదా యను జ్ఞాపక మిందు గలదు. అతడెట్లును సుగతికి చనునన్న మాటయు నిజమే. కాని అతడు సుగతికి వెళ్ళుట, వెళ్లకపోవుట, కాదిచ్చుట ప్రధానము. ఆశ్రితుడైనవానిని, శిష్యుడైనవానిని శుక్రుడిట్లు వదలి వైచెనన్న అపకీర్తి, చ్యుతధర్మజ్ఞు డన్న వాదు లోకముల యందు వ్యాపింపదా?

ఇంక నేనెందులకు శోకింతుననగా అతడు సురూపుడు. కనుక నాకిది సహజము. నీ వచనమునం దున్నను లేకున్నను, నేనేల శోకింతుననగా శోకించుటకు కారణమేదో నీ ఊహ యందుండ వచ్చును. లేకపోవచ్చును. కాని మా యిరువురిమధ్య స్నేహమున్న మాట వాస్తవము. అంతకుమించి-ఉన్నది లేదు. మించి యుండ దలచినచో నా పై నీకు గల ప్రేమాతిశయమున నీ వెట్లును అనుమతింతువు. కాని అతడు ఇప్పటికి బ్రహ్మచర్యాశ్రమ వ్రత సంపన్నుడే. ఇక ముందు ఆతని మనఃస్థితి - యేమో! నావరకు అతడు సురూపుడు. నేనుకన్యను. ఆ పైన వివరింప నక్కరలేదని భావము. అట్టి వానికై శోకింప కెట్లుందును అని చెప్పినది. అతనిని జూచి కాని భుజింప నొల్లనని హఠము గావించినది. శుక్రుడు పుత్రికా స్నేహ మోహమునకు లోగినాడు. వైయక్తికమైన యీ దుర్బలత్వము సర్వదానవ గణోపాధ్యాయ పదవీ సంబంధమైన బాధ్యతను మరగు పరచినది. అనగా నేమి? ఎంతటి వానికి, నిసర్గమైన బలహీనతలుండును. దాని నధిగమింపక స్థితప్రజ్ఞుడు కాలేడు. శుక్రుడంతటివాడు అట్లయిన సామాన్యుల సంగతి వేరుగా చెప్పవలసినదేమున్నది. వివేక శూన్యత, విచక్షణారాహిత్యము సర్వానర్థములకు మూలమని వ్యాసభగవానుని హెచ్చరిక.

శుక్రుడు కచుని కొరకు సమస్త భువనములు గాలించినాడు. కడకు తన యందే గాంచినాడు. అది సుర చేసిన దోషముగా తీర్మానించి నాడు. అంతియగాని, తన సురాపాన వ్యామోహమును గుర్తించిన వాడు కాడు. మీదు మిక్కిలి తనదైన ఈ బలహీనత క్రుద్ధత్వమునకు దారి తీసినది. ఫలితము - నాడు మొదలుగ భూసురులాదిగ సుర సేవించిరేని పాపాసక్తి పతితులగుదురని సమయము గావించినాడు. ఇది అసమర్థుని చేష్టితము. కాకున్న స్వకీయ కారణముగ నైనను, చేసిన నియమము సర్వజన హిత కారకమయ్యును, లోకమున నది ప్రవర్తనీయము గాకపోవుటకు కారణమేమి? శుక్రనీతి యని చెప్పికొనుచున్న కొన్ని ఆపద్ధర్మములను అవసరార్థమైనను లోకము పాటించుచున్నదే. కారణము అవసరము - ఎవరిది. మొదట శుక్రునిదే అయినను తమ అవసరము గూడ యందిమిడి యున్నప్పుడే దానిని లోకులు పాటింతురు. కాని ఇచ్చట అదిలేదు. ఉన్నది శుక్రుని అవసరము. అంతేకాని ఒక సమదర్శనమునుండి ఆ నియమము పుట్టలేదు. కనుక ఆ నియమము లోకమున కెంత హితకారకమైనను, దానికి ప్రవర్తనీయత లభింపలేదు. ఎందుచేత ననగా తన బాధ లోకపుబాధ. తన సంతోషము లోకపు సంతోషము అని భావించువారి పట్ల లోకమునకు గణనముండదు. సంతత వేదాధ్యయనశీలుండైన శుక్రునికి సుర వలని దోషము అప్పుడు గోచరించుట యేమి? ఆ నియమమేమి! కనుక ఒకానొక

క్రియలోని, వైశిష్ట్యము మాత్రము వలననే లోకము దాని ననుసరింపదు. చేసిన వాని వ్యక్తిత్వమును, చేతయందలి పావిత్ర్యమును, ఆచరణము నందలి స్వలాభమును పరిగణించి అనుసరణ ముండునని-భగవానుడు వ్యాసుని ప్రబోధము.

కచుని ఉనికి గమనించి నంతనే బ్రతికించినాడు శుక్రుడు. ఇప్పుడతడు వెలికి రావలయును. వెలికి వచ్చిన తాను మడియును. కనుక కచునికి మృతసంజీవని బోధింపవలయును. దానిమూలమున మరల తనను అతడు బ్రతికింపవలయును. దానికి ప్రమాణ గ్రహణము. ఇది యథావిధిగా జరుగుచున్నట్లనిపించుచున్నది. కాని తనయందున్న వానిని బ్రతికించిన వాడెట్లు వెలుపలికి వచ్చునన్న ఊహ చేయకయే బ్రతికించుట యెట్లు పొసగినది. అనగా - పుత్రికా వ్యామోహము. ఎంతవరకు అమె హఠమును సంతృప్తి పరచు ఆలోచనము తప్ప శుక్రునికి వేరొక అలోచనములేదు. అప్పటి త్వరయట్టిది. అవసరము ఆలోచనను వెనుకకు నెట్టినది. అంతే! బ్రతికించినాడు. ఇప్పుడు వెలికి రప్పింపవలయును. ఆప్పుడు తాను చచ్చును. ఒకవేళ మరల అతనిని బూదిగా మార్చిన - ముందు కుమార్తె చచ్చును. పిదప తాను చచ్చును. చచ్చునంతటి చావనిన ఇదియే గదా! ఇపుడు ఆలోచన మొదలైనది. అదియు తన అవసరము నుండి. ఆ అవసరము తన మనుగడ. తన బ్రతుకునకు, కచునినుండి తనను మరల బ్రతికింతు నన్న వాగ్దాన మవసరమైనది. మృత సంజీవని తన యధీనము. తన అధీనమైనది తన చావుకు కారణమైనది. తన మనుగడకు అది ఇతరుల అధీనమై ప్రవర్తింపవలసి వచ్చినది. ఎంత దయనీయమైన స్థితి. మరి భారతమన్న, లోకము. లోకమే, భారతము..లోకమును లోకులకు ఎరుక పరచినవాడు, లోకమే తానై, తానందుండియు - వెలియై సాక్షిగా వెలుగొందుచున్నవాడు - వ్యాస భగవానుడు. కృత మెరుగని వారి కృత్యము లెట్లుండునో ఎరుక పరచుటకు ఈ కథ తార్కాణము కదా! ఇంతటితో కచుని యుద్యోగము ముగిసినది. అసలు కథ ప్రారంభమైనది. అది-దేవయాని బ్రాహ్మణ కన్యయైనను క్షత్రియుడైన యయాతిని ఉద్వాహమగుట. ఇది కదా జనమేజయుని సంప్రశ్నము. దానికి నాంది ఇప్పటివరకు జరిగిన వృత్తాంతము. ప్రస్తావన మెట్లు జరిగినదో గమనింతము.

కచునికి తా వచ్చిన పని ముగిసినది. గురుపుత్రిని ఆమంత్రణము చేయగోరి ఆమెను సమీపించివాడు. అమె తన మనసు నెరుకపరచినది. అందు అభ్యర్థనము కంటె ఆదేశమున్నది-వివాహము నీకు నాకు భావజశక్తిచే నైనదని అన్నది. తనను పరిగ్రహించి శుక్రుని దయ జేయుమన్నది. తనకు ప్రియము గావింపుమన్నది. భావజశక్తి తనకైనది - నిజము. అతని కైనదా! ఇట్టి సన్నివేశము శంకుతలోపాఖ్యానమున గూడ

కలదు. దుష్యంతుడు శకుంతలతో నిట్టిమాటను అనివాడు. అట్లనుటకు అతడంతకు ముందు, ఆమెయందు దానిని ఉపలక్షించినాడు. కనుక అచ్చట పొసగినది. మరి ఇన్నేండ్ల సాహచర్యములో దేవయాని దాని నేల గ్రహింపలేదు. అట్టి ఆలోచనమే ఆమెకు రాదు. ఆమె నైజమట్టిది. తాననుకొన్నదే జరుగవలెనను, బాల్యవిచేష్టితము. శుక్రుని పెంపకము-శరీరమును తప్ప మనసును పరిణతి నందనీయ లేదు. తాను కోరినదే తడవుగ తండ్రి సిద్ధింపజేయుట మాత్రమే యెరిగిన యామెకు, లోకులందరు, తన యెడ తన తండ్రివలె ప్రవర్తింపవలసి యుండునన్న మకురుతనము తప్ప మరియొక భావ మెట్లేర్పడును. కనుకనే భావజశక్తి నాకైనది. కనుక నన్ను పరిగ్రహింపుము. అదినాకు ప్రియమను మాటలో, తనకు ప్రియమైనచో నది లోకమునకు ప్రియము. తన కప్రియమైనది లోకమునకు అప్రియము. ఇట్టిది ఆమె ఆలోచనము. తండ్రి ఆలోచనము, ఇట్టిదే యగుట ముందు గమనించితిమి. కనుక ఇది సాంక్రామిక లక్షణము. మితి మీరిన తండ్రి గారాబము, హఠము గావించుట నలవరిచి ఆలోచనమునకు తావులేకుండ చేసినది.

ఈ మాట విన్నంతనే కచుడు అత్యంత విషాదాకులుడైనాడు. కారణము లోకనింద్య మగు నర్థము ఆమె వాక్కు నందుండుట. ఆమె ఏవరో సామాన్య అయిన కొంత సమర్థన ముండెడిది. కాని ఆమె శుక్రుని, కుమార్తె. అతడు తనకు గురువు. గురుపుత్రి తనకు సహోదరి. కనుకనే, గురుపుత్రీ! ఇట్లు పలుకుట నీకు తగునే యనినాడు. అంతే మారుమాట లేక, ఆమె-నీ పొందిన విద్య నీయందు ప్రవర్తనీయము గాకుండు గాక యనినది. ఫలితము ఆమెను బ్రాహ్మణుడెవడును ఉద్వాహము కాకుండునని ప్రతి శాపము. ఏండ్ల తరబడి చేసిన స్నేహమున కిదియా ఫలితము. ఇది ఏల ఇట్లు పరిణమించెను. దేవయాని విషయమున ఆమె దైవము అట్టి పని చేయించినది. తన మాట కాదనిన సహింపలేని గుణమునకు ఫలితమిది. కారణము - అట్టిది ఆమెకు క్రొత్త అనుభవము. ఆతండ్రి పెంపకము-ఆ అనుభవమును సంబాళించు కొను శక్తి నీయలేదు, సరికదా తన మాట కెవరును అడ్డు చెప్పరాదను పంతమును వృద్ధిపరచినది. అదిఅట్టిద. మరి కచుడట్లు ప్రవర్తించుటయేల? స్నేహమును పరిగణన చేయవచ్చును. గురుపుత్రి యని ఓర్పు వహింపవచ్చును. బేల, అమె తోడి దేమని కరుణ వహింపవచ్చును. ఇదేదియు లేక వెంటనే ప్రతిశాప మిచ్చినాడు. దీని నెట్లు సమర్థింపవచ్చును? లోక సమర్థన మిచ్చుట అవసరములేదు. అది అతడే చెప్పినాడు. అది తాను ధర్మపథము తప్పని వాడనుట. దేవయాని తలపు ధర్మవిరోధ మనుట. అయినను ఆమె మౌగ్ధ్యమును గమనించి క్షమింప వచ్చునే.

ఆమె శాపము వలన తనకు వచ్చునట్టి కీడేదియు లేదుకదా! అది అతడే చెప్పినాడు. మృత సంజీవని తనయందు ప్రవర్తనీయము కాకున్నను తన యుపదేశమందిన వారి యందు ప్రవర్తించు ననినాడు గదా! కాని యామెకిచ్చిన శాపమట్టిది కాదు. సరికదా, అది అమె జీవికపై ఘాత మొనర్చును. అది యెంతటి తీవ్రమైనది. క్షమకు తావులేదా-అని లోకుల కనిపించును. కచున కంత మాత్రము తెలియదా-తెలియును. లోకుల కనుపించునది లోకహితుల కనిపింపదు. ఇదీ రహస్యము. లోకులకు, ఆలోచనము తత్కాలీనము. మహానుభావుల ఆలోచనము, చేత, శాశ్వత ప్రయోజనము కలిగి యుండును. అది యెట్లో చూతము.

ధర్మ విరోధముగా తనను బెండ్లి యాడు మని దేవయాని కోరుటచే కచుడు తీవ్రమైన శాపము నిచ్చినాడు. దేవయాని శుక్రుని కుమార్తె. ఆతని విభుత్వము కారణముగ, నేడు, కచుడు గాకున్న అంతటి వాడెవడో ఆమెను వివాహమాడును గదా! అంతటి మహానుభావుడు, ఇంటికైన ఇల్లాలి మాటపై ఎట్టి ధర్మవిరోధమునకు పూనుకొనునో! ఆమె స్వభావము తెలిసినదే. ఆమె ఈ స్వభావము మారునది కాదనుటయు తెల్లము. ఈ స్వభావ ఫలితము మగనిపై ప్రసరించిన అది లోకమున కెంతటి అపకారహేతువగునో - దీని నూహించియే కచుడు అంతటి శాప మిచ్చి యుండ వలయును. కాకున్న దానికి కారణము కనుపింపదు. ఏమయిన నేమి-ముందు కథకు అవసరమైన ప్రాతిపదిక-అనగా యయాతి ఈమెను వివాహమగుటకు తగు హేతువు సిద్ధమైనది. అది యెట్లు పొసగింపబడినదో చూతము.

ఒకనాడు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ సఖులతో దేవయానీ సహితముగ వనవిహారమునకు వెళ్ళినది. అచ్చట నొక జలాశయము. తమ తమ పరిధానములను ఒడ్డున నుంచి జలక్రీడలాడిరి వారు. సుడిగాలి తాకున వలువలు కలసిపోయినవి. జలక్రీడ ముగించి ఎవరి వలువలు వారు గ్రహించువేళ దేవయాని పుట్టములు శర్మిష్ఠకు దక్కినవి. ఆమెధరించినది. శర్మిష్ఠ వలువలు మిగిలినవి. నీవు కట్టి విడిచిన వస్త్రములు నేనెట్లు కట్టుకొందును. నేను గురుపుత్త్రిని. నీ కారాధ్యను. నా తండ్రి లోకోత్తర చరిత్రుడు. మీదు మిక్కిలి నేను భూసుర కన్యను అనినది దేవయాని. శర్మిష్ఠ యూరకుండునా! మరి రాచపుట్టువు. మీ అయ్య మా అయ్య కొలువుకాడు. స్వస్తివచనములు పలికి జీవితము నెరపువాడు. నేను కట్టిన వస్త్రము కట్టుటకు నీకున్న అర్హత ఏమి అని మాటకు మాట అంటించినది. అంతతో నాగక ఆమె నొక నూతిలోనికి ద్రోసి వెడలి పోయినది. అందు వ్రేలాడుచున్న దేవయానిని వేట కొరకు వచ్చిన యయాతి దాహముతో అటుగా వచ్చి ఆమెను నూతి నుండి వెలువరించినాడు. ఎవరిత్రోవను వారు వెళ్ళిరి. అట్లయిన కథ యేమున్నది. తనను వెదకుచు వచ్చుచున్న సఖితో

కాలము గడచుచున్నది. శర్మిష్ఠ యెట్లో తన మనోరథము తీర్చి కొనినది. సంతానవతి యైనది. ఇచ్చటను వాగ్దాన భంగమగు ననినాడు యయాతి. కడకు శర్మిష్ఠ అనునయముతో నొడబడినాడు. ఇది విని శుక్రుడు కోపించినాడు. ఫలితము యయాతికి అకాల వృద్ధాప్యము. తన వృద్ధాప్యమును గైకొని తనకు యౌవనము నిచ్చువారికి తన యనంతరము రాజ్యార్హతను పణముగా పెట్టినాడు. పూరుడు తప్ప, దాని కితరులు ఒడబడరైరి. కాలాంతరమున పూరుని అభిషక్తు జేయ సంకల్పించి 'నిజాజ్ఞావిధేయ చతురంత మహీతల బ్రహ్మక్షత్రాది వర్ణముఖ్యులనెల్ల' రావించి, మంత్రి, పురోహిత సామంతానంత పౌరజన సమక్షంబును ప్రత్యక్షీకరించు కొనినాడు. అపుడు సర్వ ప్రకృతి జనంబు లిట్లనిరి-అయ్యా! నీ చేసిన చేత అవిచారమూలక మనుటకు నోరాడకున్నది. అయినకు నీ జ్యేష్ఠ పుత్రుడు యదువుండగా రాజ్యార్హత కనిష్ఠునియందు నిలుపుట యెట్లు? నీవు ధరజ్ఞుండవు. అయినను మా సందేహము మాది అని అభ్యర్థించినట్లు అడిగినారు. ఇందు వినయము కలదు. విధేయత లేదు. అదే యున్నచో అట్లడిగి యుండెడివారు కారు. రాజ్యము నీ యధీనము. మేమును నీ యధీనులమే, అయినను మీ చేసిన చేత లెల్ల అంగీకరింపము- అను సూచన మిందుగలదు. దానికి యయాతియు మీకు చెప్పెడిదేమి, నాయిష్టప్రకారము నేనొనరింతును అనలేదు. "తనయుడైన వాడు తలిదండ్రులు పనచిన పనిసేయడేని వాడు తనయు డెట్లగును. తండ్రి ధనమున కర్హుడెట్లగును." అనినాడు. ఏల ఈ జవాబుదారీతనము. ఇదియే కీలకము. నాటి రాజ్యము సూత్రమున నిరంకుశము. వంశ పారంపర్యము. వర్తనము అచ్చపు ప్రజాస్వామ్యము. అది మనుమార్గము. అది ఆదిరాజ మార్గము. ఆదిక్షత్ర చరిత్ర మార్గమది. పై సూత్రమున కొదిగిన పాలకుడు కనుకనే దుష్యంతుడు శకుంతల విషయమున అబద్ధ మాడవలసి వచ్చినది.

ఇది పూరుని చరిత్రము. పిదప యయాతి చరిత్రము మరికొంత కలదు అది ఇచట ప్రస్తుతము కాదు. దీని నాధారముగా గొని భారతకర్త ప్రతిపాదించిన స్థితి మూలక ధర్మములు గ్రహించుట కర్తవ్యము. అవి ఇవి-బ్రాహ్మణ ధనము నపహరింపరాదు. ఎవరి అభ్యర్థనము లేకున్నను సమర్థుడైన వాడు వ్యతిక్రమమున్నచో సరిదిద్ద ప్రయత్నింపవలయును. ఎంతటి వానికి సంతానముపై నిసర్గ స్నేహముండును. దాని వలని ఫలితము ధర్మాచరణమునకు భంగము రానీయరాదు. లోకులు తమ స్వప్రయోజనమును కప్పిపుచ్చుకొను ప్రయత్నము చేయుదురు. అట్టి ప్రయత్నమున ఇతరుల సమర్థన మపేక్షింతురు. దాని మాటున తమ్ము తాము దొంగిలి - అందు తమ దోసము లేదని లోకమును మభ్యపెట్ట జూతురు. నియమ వ్రత శీలురైన వారు, లోకహిత కారకులైన వారు స్నేహమును పాటింపక లోకహితమునే కోరుదురు. ప్రభువైనవాని ప్రభుత జనత అభీష్టము ననుసరించి యుండవలయును. ఈ ధర్మములను ప్రతి పాదించుటకు యయాతి చరిత్రము రచింపబడినదని స్పష్టమగు చున్నది.

# సౌపర్ణాఖ్యానము

ఈ సౌపర్ణోపాఖ్యానము మహాభారతమున రెండుచోట్ల కథనము గావింపబడినది. రెండుచోట్లను కథనము గావించినవారు వ్యాసభగవానులు. కాగా ఆంధ్రమునకు వచ్చుసరికి కాల వశమున ఇద్దరి పాల బడినది. ఒకరు నన్నయ, మరియొకరు తిక్కన. ఏ తత్కారణమున ఈ యిరువురు గావించిన తీరును విమర్శించుట జరిగినది. దానికి కారణము రెండు స్థలములలో కథనము గావించిన తీరులోని భేదము. దీని నూతగా గొని నన్నయ తిక్కనల కవిత్వపు తీరును, తన్మూలముగా ఔచిత్యానౌచిత్యములను పరామర్శించుటయు గతమున జరిగినది. ఆ పరామర్శనము నందలి గుణదోషములను విచారించుటకు ఈ వ్యాసము ఉద్దేశింపబడినది కాదు. సౌపర్ణాఖ్యాన ప్రాముఖ్యము, కథనము గావించిన వారు (వ్యాసభగవానులు) ఒక్కరే అయినపుడు కథనమున భిన్నత్వము చోటుచేసికొనుటకు గల కారణములను అరయుట ఈ ప్రసంగమునకు లక్ష్యము.

సౌపర్ణాఖ్యానమను గరుత్మంతుని వృత్తాంతము, ఆంధ్ర మహాభారతమున ఆదిపర్వము ద్వితీయాశ్వాసమున, అనుశాసనిక పర్వమున ప్రథమాశ్వాసమున కాననగును. కథకుడు వ్యాసుడే అయినను ప్రాకరణికముగ కథనము గావించిన వారు వేరు. సందర్భములు వేరు. మహాభారత కథా ప్రారంభమునకు నాంది శౌనకుని ద్వాదశవర్షకోత్తమ సత్త్రయాగము. అచ్చటకు వ్యాసుని శిష్యుడైన రోమ హర్షణుని కుమారుడు రౌమహర్షణి విచ్చేయగా, హృద్యము అపూర్వము, సమగ్రజ్ఞానము బడయుటకు మూలము, అఘనిబర్హణమునకు మూలమునగు కథను వినిపింపుమని శౌనకాదులు ప్రార్థింప వారి కోరికను మన్నించి వ్యాసకృతమగు మహాభారతమును వినిపింపదలచి అద్దానిని, తాను, ముందు జనమేజయునకు చెప్పుమని వైశంపాయనుని వ్యాసుడు నియోగింప వినివచ్చితిననియు దానినే కథనము గావించుచున్నాననియు రౌమహర్షణి చెప్పినాడు. ఇది నాంది.

ఇక ప్రస్తావన. శమంతక పంచకమున కురు పాండవులు పదునెనిమిది దినములు పదునెనిమిది అక్షౌహిణుల సైన్యముతో యుద్ధము గావించుట,

మహాభారత శ్రవణ ఫలమును రౌమహర్షణి ఉట్టంకింపగా, శౌనకాదులు శమంత పంచకోత్పత్తి, అక్షౌహిణి గణనమును గూర్చి ప్రశ్నింప వాని వివరములను దెలుపుచు రౌమ హర్షణి-కురుపాండవులు యుద్ధముచేయుట కారణముగ శమంత పంచకము నాటి నుండియు కురుక్షేత్రమను పేరుతో ప్రసిద్ధమైనదనియు, అట్టి కురుక్షేత్రమున జనమేజయుడు దీర్ఘసత్రమను యాగము చేసెననియు చెప్పెను. నిజమునకు ఇంతటితో కథ ముగిసినది. అనగా మహాభారతకథ సంగ్రహముగ చెప్పట జరిగినది. వైశంపాయన ముఖమున దానిని విని యుండుటయు, మొదట అది జనమేజయునికి వినిపింపబడినది గావున అతని ప్రస్తావనయు గావింపబడినది. కాని శౌనకాదుల అభిమతము అదికాదు. మహాభారతమును మాత్రమే వినవలయుననియు వారి కోరిక కాదు. వారి కోరిక యేదో ముందే వారు స్పష్టముగావించినారు.

వారి కోరికను తీర్చగలిగినది మహాభారతమని రౌమహర్షణి తలంపు. అది సంగ్రహముగ చెప్పిన తీరునదికాదు. మరి కథ ముగిసినది. దానిని కొనసాగించుట యెట్లు? అట్టి జనమేజయుడు చేయు సత్రయాగము కడకు సరమ యను దేవశుని కుమారుడు వచ్చుటయు - దానిని జనమేజయుని సోదరులు కొట్టుటయు అది పోయి తల్లికి మొరబెట్టు కొనగా సరమవచ్చి జనమేజయుని సోదరులు గావించిన దౌష్ట్యమును వివరించి.

"తగునిది తగదని యెదలో వగవక సాధులకు బేదవారల కెగ్గుల్
మొగిజేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబులయిన భయంబుల్"

అని పరుషోక్తులాడి యదృశ్యమగుటయు, అతడు సత్రయాగము పరిసమాప్తి గావించిన పిమ్మట దేవశుని సరమ వచన ప్రతీకారార్థము శాంతికపౌష్టిక, క్రియలు యథావిధి నిర్వర్తించి ఆదినరేంద్ర మార్గుడై సుఖంబున రాజ్యంబు చేయుచుండ ఒకనాడు పైలశిష్యుడైన ఉదంకుడు విచ్చేసెనని రౌమహర్షణి కథనము. పిదప ఉదంకోపాఖ్యానము. ఆ ఉదంకుడు జనమేజయునికి సర్పయాగము చేయు బుద్ధిపుట్టించుటయు వివరింపబడినవి.

ఆగిపోయిన కథను రౌమహర్షణి ఇట్లు సరమ వృత్తాంతముతో తిరిగి ప్రారంభించుటలో ఔచిత్యమేమి? ఏదోవిధముగ శౌనకాదుల కోర్కె కనుగుణముగ దానిని కొనసాగించినట్లు కనబడుచున్నది. కాని తత్కాలీన నిమిత్తము లోపించినట్లు అనిపించును. కాని ఇది స్థూల దృష్టి. కారణము-కథ ఆగిపోయినప్పుడు శౌనకాదులు ఎట్టి ప్రశ్నను వేయలేదు. రౌమహర్షణియే కొనసాగించి నట్లున్నది. కాని శౌనకాదులు శమంతపంచక వృత్తాంతము, అక్షౌహిణి సంఖ్యను గూర్చి పరిప్రశ్న గావించినప్పుడే "తద్భారత విస్తరోక్తి విభవంబుం బాండవాడంబరంబును భీష్మాది కురుప్రవీర చరితంబుం జెప్ప ముద్యన్మతిన్"- అని అడిగియున్నారు. కనుక శౌనకాదుల అభీష్టమునకు తగు కథ మహాభారతమని తలంచి చెప్పగడంగుటయు పిదప

పైవిధమున విస్తరోక్తిని దానిని వివరింపుమనుటయు కారణములుగా తిరిగి వారు ప్రశ్నింప నక్కరలేకయే సంగ్రహముగా పూర్తిచేసిన కథను రౌమహర్షణి తిరిగి ప్రారంభించుచున్నాడు. అదియు సరమతో ప్రారంభము. పిదప ఉదంకోపాఖ్యానము, అంతకు మున్నే జనమేజయుని ప్రసంగము చేయబడినది. జనమేజయుడెప్పటివాడు? మహాభారత కథ స్వర్గారోహణముతో సరి. అంతకు పూర్వము పరీక్షిన్మహారాజు పట్టాభిషేకము. ఆ తరువాతి వాడు జనమేజయుడు. ప్రారంభము వ్యాసభగవానుని అవతరణముతో అయినప్పుడు వ్యాసుని జన్మముతో ప్రారంభింపక శౌనకాదిమునుల సత్రయాగముతో ప్రారంభించుట ఏల? ఇంతకు, మహాభారతోత్పత్తి ఎట్లు జరిగినది. అష్టాదశ పురాణంబులును, నీతి ధర్మశాస్త్రార్థ తత్త్వంబులును, చతుర్వేద వేదాంతాభి ప్రాయంబులును, చతుర్వర్గ వర్గానుబంధ బంధుర కథేతిహాసంబులును, చతుర్యుగ మహర్షి రాజవంశ చరితంబులును, చతుర్వర్ణాశ్రమధర్మ క్రమంబులును, చతుర్ముఖ ప్రముఖ నిఖిల సుర మునిగణ పూజితుండైన శ్రీ కృష్ణుని మాహాత్మ్యంబును పాండవాది భారతవీరుల మహాగుణంబులును తన విమల జ్ఞానమయంబైన వాగ్దర్పణంబు నందేర్పడ, బ్రహ్మచేత ననుజ్ఞాతుడై కదా వ్యాసభగవానుడీ భారతమును ప్రారంభించినది. అనగా - సృష్ట్యాదినుండి తనవరకు నడచిన వృత్తాంతమంతయు కథనము గావింప దలచినాడు వ్యాసుడు. జరిగినదియు అదియే. కాని అది తృతీయాశ్వాసమునగాని ప్రారంభముకాలేదు. ఎందువలన? ఉదంకోపాఖ్యాన మాదిగా ఆస్తీకుని వరకుగల వృత్తాంతమును ఎరుకపరచుటకు అని అనుకొనవచ్చునా? ఎరుకపరచుట యొక ఉద్దేశము కాగా - అంతకంటె ప్రధానమైన యంశము కథేతివృత్తమును సుసంఘటితము గావించుట. అది యెట్లో చూతము. అప్పుడుగాని గరుత్మంతుని కథాప్రాముఖ్యము, రెండుమారులు కథనము గావింపవలసిన యవసరము గుర్తింప వలను పడదు. అట్లే రెండు సందర్భములందు చోటుచేసికొనిన మార్పులు-దానికి కారణములను తెలిసి కొనుటకును ఇది యవసరము.

మొత్తము భారతము వ్యాసకృతమే అయినను తానై ఆతడెవరికిని వినిపింపలేదు. ఆయా లోకముల దానిని ప్రచారము గావించుటకు వేర్వేరు వ్యక్తులను నియోగించినాడు. మానవ లోకమున అట్టివనికి నియోగింపబడినవాడు వైశంపాయనుడు. అదియును జనమేజయునికి బోధించుటకు. దానిని విని వచ్చి కదా ప్రస్తుతము రౌమహర్షణి శౌనకాదులకు వచించుట జరుగు చున్నది. వ్యాసభగవానుడు ఏ సందర్భమును పురస్కరించుకొని భారతమును బోధింపుమని వైశంపాయనుని నియోగించినాడు. జనమేజయుడు ఉపసంహృత సర్పసత్త్రుండై- తద్విధి విధాయకము లైనవాని నన్నింటిని యథావిధి తీర్చి-అనేక పురాణ పుణ్య కథాశ్రవణ కుతూహల వరుండగుచు విద్వజ్జనగోష్ఠి నుండి ఒక్కనాడు జనహితప్రారంభుడైన వ్యాసభగవానునికి నమస్కరించి అయ్యా! మీరు, భీష్మాది

కురువృద్ధ రాజులు - ఇంతమంది యుండి పంచి యిచ్చిన రాజ్యమును సుఖముగ నేలుకొనక, పాండు, ధార్తరాష్ట్ర నందనులు ఏల కలహించిరి? ఇట్టి గోత్ర కలహమేల పుట్టెను. దీని కల రూపు తెలియంగ నానతిండని ప్రార్థింప దానిని వివరింపగదా వ్యాసుడు వైశంపాయనుని నియోగించినది. దానిని విన్పింప, ఆదివిని వచ్చి రౌమహర్షణి శౌనకాదులకు చెప్పుచున్నాడు.దాని నట్లే చెప్పవచ్చును. అనగా జనమేజయునకు వైశంపాయను డెచ్చటనుండి ప్రారంభించెనో అచ్చట నుండి-అనగా వ్యాసజన్మ ప్రకారమాదిగా ప్రారంభింపవలయును. అట్లు ప్రారంభించిన, శౌనకాది మునులకు ఈ ప్రశ్నలు పొడమును. అవి ఇవి-జనమేజయుడు సర్పయాగమేల చేసెను. అది యేల ఉపసంహృతి నొందినది. వీనికి సమాధానములు వైశంపాయనుడు చెప్పవలను పడదు. కారణము అతనికి శ్రోతయైన జనమేజయుడే కదా ఆ యాగము చేసినది. ఆ యాగమునకు సదస్యులుగా విచ్చేసినవారే కదా వ్యాసవైశంపాయనులు. అది అట్లు ఉపసంహృతి నందుటకు వారేకదా ప్రత్యక్ష సాక్షులు. కనుక దాని నేపథ్యము వారికి తెలిసినదే. కాని లోకమునకు తెలియుట యెట్లు. దానిని విశదము గావించుటకు రౌమహర్షణి, దానికి శ్రోతలు శౌనకాదులు అవసరమైనారు.

అపుడును రౌమహర్షణి ఇట్లు ప్రారంభింపవచ్చును. పూర్వమొకప్పుడు జనమేజయుడు అనగానే చెప్పబోవు మహాభారత కథయందలి పాండవులలో నొకడగు అర్జునుని మనుమడు పరీక్షిన్మహారాజు కుమారుడు సర్పయాగము చేయ తలపెట్టెను. అది ఆస్తీకుని ప్రమేయముతో నాగిపోయినది. ఆ పిదప అచ్చటికి వచ్చిన వ్యాస భగవానుని, తమతాత తండ్రుల వృత్తాంతమును చెప్పుమని జనమేజయుడు కోరగా, దానిని వివరింపవలసినదిగా వైశంపాయనుని ఆదేశింప, ఆతడు దానిని వివరించినాడు. దానిని నేను వినియున్నాను. దానినే మీకు వివరించుచున్నాను. అని ప్రారంభింపవచ్చును. అప్పుడు ఆస్తీకు డెవరు? సర్పయాగమునాప అతని కేమి పని వచ్చినది. జనమేజయుడు సర్పయాగమేల తలపెట్టెను. దాని కెవరతనిని ప్రేరేపించిరి. ఆ ప్రేరణమునకు అతనికిగల అవసరమెట్టిది. మొదలగు ప్రశ్నలన్నియు పుట్టును. వీటియన్నింటికి సమాధానము లీవలసి యున్నది. అప్పుడుగాని వృత్తాంతమందలి పౌర్వాపర్య సంబంధము తెల్లము కాదు.

పై ప్రశ్నలన్నింటికి రౌమహర్షణి తానై సమాధానము చెప్పినను, అగ్ని సర్వభక్షకుడగుట, రురుని కథ ప్రసక్తములు గాకుండుటకు అవకాశముగలదు. కనుక అట్టిదాని కవకాశమీక రౌమహర్షణి, కథ మరియొక విధమున ప్రారంభించినాడు. అయితే జనమేజయునితోనే. కాని ప్రారంభము సర్పయాగ ఉపసంహృతితోగాక, దానికి దారితీసిన మరియొక యాగముతో. దానిని పరామర్శించుటకు పూర్వము మరి రెండు ప్రశ్నలు. ఒకటి జనహిత ప్రారంభుడు, గతరాగద్వేషుడు. నిర్మత్సరుడునగు వ్యాసభగవానుడు జనమేజయునితో సర్పయాగము నేల మాన్పింపలేదు. ఒకజాతి

సర్వనాశన మగుచుండ, ఎట్లుపేక్షించినాడు. మీదుమిక్కిలి సర్వశిష్యకోటితో సదస్యమునకు వచ్చుట ఎట్లు జరిగినది. రెండవది ఉదంకుడు సర్పయాగమును చేయుమని జనమేజయుని ప్రేరేపించెను. ఏక విప్రసంబోధన చేసి ఇంతపని చేసినాడు తక్షకుడు-అనగా మీ తండ్రిని చంపినవాడు అనిగదా! అతని వచనము. మరి తానును (విప్రుడు) ఇప్పుడట్టి క్రియకే పాల్పడుచున్నాడు. అచ్చట పోయినది పరీక్షిత్తు ఒక్కడే. ఇక్కడ సర్పజాతి క్షయము. మీదు మిక్కిలి కులపాంసను డొక్కడుండిన, ఆ కులమంతటిని నాశనము గావించినను దోషము లేదని సమర్థనము. మరి తా నపరిమిత నిష్ఠాపరుడై జ్ఞానము బడసినవాడే! ఇట్టి క్రియకు ఆతని మనమెట్లు అంగీకరించినది.

ఈ రెండు ప్రశ్నలు పొడముట సహజమేకదా! దీనికి భారతము ఏమని సమాధానము చెప్పును. మహాభారతమే చెప్పవలయును. మరి మహాభారతము లోకాగమ న్యాయైకాంతగృహంబు. నానావేద వేదాంత విద్యాయుక్తంబు, సర్వవేద శాస్త్రముల యశేష సారము. ప్రత్యక్షముగ భారతమున దీనికి సమాధానములు గానరావు. కాని దత్తావధానులై వినిన చదివిన సహృదయులకు సమగ్రంబగు ఎఱుక గలుగును. అస్తు.

జనమేజయునితో గదా కథ ప్రస్తావింపబడినది. అచటకి సరమ వచ్చినది. ఆ ముచ్చట ముగిసినది. ఈ సరమ ఎవరు? ఈమె ప్రస్తావనమేల? సరమ విషయము నిరుక్తమున చూడనగును. ఆమెరాకవలన, నిష్ఠురోక్తులకు గురియైన జనమేజయుడు శాంతిక పౌష్టిక క్రియలనాచరించినాడు. అంతకుమున్ను దీర్ఘసత్రము చేసియున్నాడు. ఇప్పుడును సోమశ్రవసుని తనకు పురోహితునిగా జేసికొని, వివిధ యాగములను నిర్వర్తించుచు విశిష్టజనస్తుతుడై, వర్ధమాన లక్ష్మీయుతుడై, ఉత్తముడై రాజ్యము చేయుచున్నాడు. జనమేజయుని గూర్చి ఇంత ప్రశంస రౌమహర్షణి ఏల చేసెను? ఇట్టివాడైనగాని, ఉదంకుడు అతని కడకు రానేరడు. మీదుమిక్కిలి మహాభారతకథకు ప్రత్యక్ష శ్రోతయగు సర్హత నితనియందు నిరూపించుట. అట్టివాడు గాకున్న, వ్యాసభగవానుడు భారతమును విన్పింపుమని వైశంపాయనుని నియోగించునా!

దీని నవకాశముగా గొని ఉదంకుని వృత్తాంతము, కథనము గావింపబడినది. గురుదక్షిణ సమర్పించిన యనంతరము అనేకకాలంబు తపంబాచరించి, తక్షకుడు చేసిన అపకారము మనమునందుంచుకొని, ప్రతీకారము చేయగోరి జనమేజయుని పొలికిబోయి, తక్షకుని వలన తాను పడినపాట్లు, ఆతని తండ్రికైన మరణము నివేదించి, అతనిని సర్పయాగము చేయ ప్రేరేపించినాడు. ఇది ఇట్లే కొనసాగిన జనమేజయుడు సర్పయాగముచేయుట, దానికి ఆస్తీకుడడ్డుపడినాడు అని చెప్పుట జరిగెడిది. (అట్లే జరిగినది కూడా). అప్పుడు ఆస్తీకుడెవరు? అను ప్రశ్న మొదలై దానికి సమాధానము చెప్పవలసియుండెడిది. ఇది పైకి కనిపించెడి ప్రశ్నయే. దాని సమాధానములో

జరత్కారుని కథ, తన్మూలముగ, గరుత్మంతుని కథ ఈ క్రమమున కథ నడచును. అనగా వెనుక ముందుగా నడచును.

దీనిని ముందు వెనుకలుగా నడిపింపవలయును. అది ఎట్లు పొసగింపవలయును. దీనికుపాయము, శౌనకాదుల సంప్రశ్నము. అది ఇది. మరి ఇట్టి సర్పయాగమున సర్పములు నశింపక ఎట్లు బయటపడినవి అనునది. ఇది పైకి తేలని ప్రశ్న. సర్పములు ఇప్పుడును గలవుగదా! అవి ఎట్లు తప్పించుకొనినవి అను శౌనకాదుల ప్రశ్న సహేతుకము. దీనికి రౌమహర్షణి సమాధానము. తొల్లి భృగువంశజుడైన రురుండు గావించు సర్పఘాతము సహస్రపాదుండుడిగించె. అట్లు జరత్కారు సుతుండైన ఆస్తీకుండు, జనమేజయుని ఆ ప్రయత్నమునుండి విరమింపజేసెనని, దానిని సవిస్తరంబుగా వివరించెదనని ప్రారంభించి భృగువంశకీర్తనంబు, ఆస్తీకు చరితంబును వివరించెను.

భృగువంశకీర్తనము వలన అగ్నిభట్టారకుని పరాభవము, రురుని జన్మోదంతములు వివరింపబడినవి. ఈ రురుడు ప్రమద్వరను వివాహమాడగోరెను. ఈ లోపున అమె సర్పదష్టయై మరణించెను. తన ఆయువున సగమామెకు ఇచ్చి ఆమెను బ్రతికించుకొనెను. కాని నాటినుండి సర్పములను చంప మొదలిడెను. అంత ఒకనాడు ఒక డుండుభమును చంపప్రయత్నింప, అది మనుష్యభాషణమున, బ్రాహ్మణుడవై ఇట్టి హింసావృత్తి నవలంబింప నుచితమా యని ప్రశ్నించి ప్రసంగ వశమున తన శాపవృత్తాంతము నెరుకపరచి, భృగువంశ సముత్పన్నుండవు. నీకిది తగునే, జనమేజయుని సర్పయాగంబునందు, కద్రూశాపంబున నగు సర్పకుల ప్రళయమును, భవత్పిత్రు శిష్యుండగు ఆస్తీకుడేగదా, దానిని నివారించినది అని చెప్పి రురుని ఆ ప్రయత్నమునుండి మాన్పించెను.

ఈ డుండుభమే సహస్రపాదుడు. దీనిని విని శౌనకాదులు, ఇతరులవలన ఎట్టి యాపదలు రాకుండ బిడ్డలను కాపాడు మాతృమూర్తి (కద్రువ) బిడ్డలపై నేల యలిగి శాపమిచ్చెనని యడిగిరి. ఈ అడుగుటలో వారు సౌపర్ణాఖ్యాన శ్రవణ కుతూహలురైనారని కవివాక్కు. అంత రౌమహర్షణి అ వృత్తాంతమును వివరింప మొదలిడెను. ఇది ఆదిపర్వమునందలి సౌపర్ణాఖ్యాన కథా ప్రారంభము. ఇట్లు ప్రారంభమై, కద్రూవినతల వృత్తాంతము, సర్పముల జననము, అమృతోత్పత్తి, మధ్య కద్రూవినతల పన్నిదము దానివలన 'వినత' దాస్యము, దానిని బాపుటకు గరుడని యత్నము, అమృతము గొనివచ్చుట, తిరిగి అది ఇంద్రుని చేరుట (చేర్చుట)- ఇంతవరకు స్థూలముగ ఆదిపర్వ, అనుశాసనిక ఫర్వములంధలి వృత్తాంతము సమానముగ నడచినది.

పిదప జరత్కారు వృత్తాంతము, ఆస్తీకుని జననము, జనమేజయుని సర్పయాగము, దానిని ఆస్తీకుడు వారించుట మహాభారత కథా కథన ప్రారంభము-

ఇది అది పర్వసందర్భము. ఇదియంతయు ధర్మరాజాదుల స్వర్గారోహణము తర్వాత ఎన్నడో జరిగినది కావున ఈ వృత్తాంతములకు ఆనుశాసనిక పర్వమున తావులేదు. ఇందు మరియొక విశేషముగలదు. ఆదిపర్వ సందర్భమున నచ్చట వ్యాసభగవానుడు లేడు. గరుడోదంతము తరువాత జరిగిన జనమేజయుని సర్పయాగ సందర్భము ననే వ్యాసులవారు ప్రత్యక్షముగ కన్పించిరి. కాని అనుశాసనిక కథా సందర్భ మట్టిదిగాదు. అచట వ్యాసభగవానుడున్నాడు. ఇక గరుడని వృత్తాంతము పరిశీలింతము.

ఇచ్చటనే ఒకమాట. ఈ వ్యాస ప్రారంభమున, శౌనకాదులు పుణ్యకథను వినవేడుట, రౌమహర్షణి దానికి పూనుకొనుట నాందిగా చెప్పబడినది. అచ్చటనుండి, సర్పయాగ ఉపసంహృతివరకు ప్రస్తావనము. వ్యాసోత్పత్తితో భారతకథోపక్రమణము. కాగా గరుడుని కథ ప్రారంభించుటకింత వ్యాఖ్యానమవసరమా? పైన తెలిసిన విషయములెవరికి తెలియనివిగనుక. దత్తావధానులరై భారత పఠనము గావించు వారికెల్లరకు తెలిసినవే. మరి లోకమున, వ్యాఖ్యానములెట్లుత్పన్నమైనవి? అగు చున్నవి? అందు ఏకవాక్యత లోపించుట కేమి కారణము.

అనుభూతియందలి భేదము, అయినను ఇప్పటికి గావించిన వివరణవలన ఇతివృత్తము మరింత సుబోధక మైన దీని లక్ష్యము నెరవేరినట్లే. కాగా మరియొక విశేషము. సౌపర్ణాఖ్యానము వివరింపుమని గాని గరుడని వృత్తాంతము నెరుకపరుప వలసినదనిగాని, శౌనకాదులు రౌమహర్షణిని కోరలేదు. వారడిగినది కద్రువ సంతానము నెట్లు శపించెనని మాత్రమే. దానిని మిషగాగొని రౌమహర్షణి, శాప వృత్తాంతముతో పాటు, గరుడని వృత్తాంతమును వివరించినాడు. చివరికిది సౌపర్ణాఖ్యానమనియే ప్రసిద్ధి పొందినది. దానికే ఫలసిద్ధియు చెప్పబడినది. అడిగిన దొకటియైన, దానికంత ప్రాధాన్యమీక, మరియొకదానిని విశేషముగ ప్రస్తుతింప కారణమేమి. ఈ ప్రణాళికయందలి అంతరార్థమేమి. అనుశాసనిక పర్వ కథా సందర్భమున ఇట్టి ప్రశ్నయుదయించుట కాస్కారమే లేదు. కారణము ధర్మజుడు ప్రత్యేకముగా అడిగినాడు.

అచట వచనమిది "గరుత్మంతుడు మహానుభావుండని విందు నవ్విహగ విభుని వృత్తాంతంబు తెఱంగెఱుంగ వినదలతు వివరింపవే" యని ధర్మజుడు భీష్ముని కోరినాడు. ఇచటను ఫలశ్రుతి చెప్పబడినది. కాని అది సామాన్యముకాదు. కేవలము వినిన ధర్మజునికి చెందినది. తన్మూలమున మనకును అందివచ్చును. అదివేరు. కాని ఆదిపర్వ సందర్భము అట్టిదికాదు. ప్రత్యక్షశ్రోతలైన శౌనకాదులకేగాక ఫలశ్రుతి సర్వులకు చెందునట్లు చెప్పబడినది. కావున ఒకటి నిశ్చయము. అది గరుడుని వృత్తాంత మహిమ. అదిపర్వమున ఇంద్రుడును గరుడుని మహానుభావంబును గుర్తించినాడు, మెచ్చుకొనినాడు. కనుక అడిగినది కద్రూశాప వృత్తాంతమయ్యును, అందుభాగమైన గరుడని వృత్తాంతము ప్రాధాన్యము సంతరించుకొన్నది.

లోకముననను ఆ మాటే పాదుకొనినది. అదియే ప్రధానము సుమా అని హెచ్చరించుటకే కావచ్చును మహాభారతకర్త, శౌనకాదులు సౌపర్ణాఖ్యాన శ్రవణ కుతూహలపరులైనారని, ప్రథమాశ్వాసమును ముగించినాడు. కాని గరుడనికి సుపర్ణుడును వ్యవహారము కథా సందర్భమున కలిగినది. మొదలు లేదు. కాని దీనిని గరుడోపాఖ్యానమనక సౌపర్ణాఖ్యానమని సంభావించుటలోను, ఫలశ్రుతియందును అట్లే సంభావించుటలోను మహాభారతకర్త ఆశయమిదియే అయినట్లు స్పష్టమగు చున్నది. ఇది ఆదిపర్వ సందర్భము. ప్రాకరిణకముగ, నిచ్చట వక్త రౌమహర్షణి. మరి ఆనుశాసనిక పర్వ కథాసందర్భముననను, ధర్మజుడడిగినది గరుత్మంతుని వృత్తాంత మేయైననను, దానిని వినిపించిన భీష్మడును, ఫలశ్రుతి చెప్పుచు, దీనిని సౌపర్ణాఖ్యానమనియే సంభావించినాడు. ఇది, దీనిని సౌపర్ణాఖ్యానమని సంభావించుట లోని ఔచిత్యమును వివరించుటకు తోడ్పడుచున్నది. గరుడోదంత ప్రాధాన్యమునకు కారణము ఆతడు మహానుభావుడగుటయని ముందు చెప్పబడినది. అదెట్టిదో తరువాత చూతముగాక. అదిఅట్లుండ ఆదిపర్వ కథనము నందు, గరుడని దెస హరి ప్రసన్నుండై వరంబీవచ్చిన, శ్రీమన్నారాయణునకు మ్రొక్కి వరంబు పొందెను. అంతేగాక, నారాయణునిచే తనకు వాహనమును, మహాధ్వజము నగుదువుగాకయని యాశీస్సులందినాడు.

ఇక ఆనుశాసనికమున, ధర్మజుని కోరిక విని, భీష్ముండు అచ్చుతు నాలోకించి, ఆ సుపర్ణుండు నీవేనని వినియున్నాననగా, శ్రీకృష్ణభగవానుడు దాని నామోదించెను. దీనివలనను గరుడని ప్రాముఖ్యము ఎరుక పడుచున్నది. అందువలనను కద్రూ శాపవృత్తాంతము ప్రాముఖ్యమున వెనుకబడి గరుడని వృత్తాంతము ప్రాధాన్యము సంతరించుకొనినది. ఇట్లు ప్రాధాన్యము సంతరించుకొనుటలో మరియొక విశేషము కలదు. కద్రూ శాప వృత్తాంతము మధ్యలో ముగియును. అనగా శాపమునకగు కారణము. దానికిని గరుడని వృత్తాంతమే కారణమగుచున్నది. ఈ మొత్తము కథకు మూలము - నిజమునకు, వినతకు అనూరుడిచ్చిన శాపము. దాని విమోచనము గరుడని వలన జరుగవలసియున్నది. వినతకు గల్గిన శాపము ఉచ్చైశ్రవముతో ననుబంధము గలది. ఇది కద్రూవినతల సంవాదమునకు మూలము. తత్ఫలితము కద్రువ తన సంతానమునకిచ్చిన శాపము. కనుక ఇట్లును గరుడని వృత్తాంతమునకే ప్రాధాన్యము. కాగా గరుడని వృత్తాంతమే జరత్కారు కథకు, ఆస్తీకుని ప్రమేయమునకు మూలమగుచున్నది. అది గరుడనితో ఆదిశేషుని మైత్రి. దానితో నాతడు పన్నగ ముఖ్యుల పొత్తు వీడి తనంత తానుండినాడు తప్ప మున్ముందు తన వారికి రానున్న ఆపదను గూర్చి పట్టించుకొనడయ్యెను. దీనినంతయు తలంచి, తన కపాయము లేకున్నను, వాసుకి తనవారిని గూర్చి విచారించినాడు. ఆ విచార ఫలితము వాసుకి సోదరి (ఈమె పేరు జరత్కార) జరత్కారుల వివాహము. ఆస్తీకుని జననము. మీది

కథ తెలిసినదే. ఈ విధముగ కద్రువ వృత్తాంతము ముగిసినపిదప అనంతర కథను సంఘటించుటయందును గరుడడే ప్రాధాన్యము వహించినాడు. ఇన్ని కారణములుగ శౌనకాది మునులు అడిగినది కద్రూ శాపవృత్తాంతము కాగా నిది సౌపర్ణాఖ్యానముగ సంతరింపబడినది. ఇక దీనిని కొంత వివరముగ రెండుచోట్లను కథనము గావింపబడిన తీరును పరిశీలింతము.

కద్రూవినతలు కశ్యప ప్రజాపతి భార్యలు. అనగా సవతులు. ఈ మాట వీరిపట్ల నన్నయ్య తిక్కనలిర్వురు ప్రయోగించినారు. వారు ప్రయోగింపనంత మాత్రమున వారు సపత్నులు కాకపోదురా! కనుక దానికంత ప్రాధాన్య మీనక్కరలేదు. సపత్నులమధ్య మాత్సర్య ముండును. ఇదియును లోకమునగలదియే. అట్టిదిచ్చటను గలదని తిక్కన వెల్లడించినాడు. అంతేకాదు ఆమెకు చాపల్యమును గలదని అనూరుడు వచించినాడు. దీనివలన మాత్సర్యము ఇరువురిలోనుగలదని సంస్థాపింపబడలేదు. వినతకు మాత్రము గలదని స్పష్టపడినది. మరి కద్రువకు గలదా! ఇప్పటికిప్పుడు తెలియరాదు. మీద స్పష్టపడు నేమో వేచి చూతము. కొంత తడవు కథను పరికింతము.

సుతుల బడయగోరి, వారు కశ్యప ప్రజాపతిని వేడికొనిరి. లోకమున స్త్రీ పురుష సంయోగమున సంతానము జనించుచుండ - వీరు భార్యాభర్తలు గదా! మరి సంతానముకొరకు భార్యలు భర్తను వేడుటయేల. ఇది సహజ ప్రక్రియకు భిన్నముగ గోచరించుచున్నది గదా! మరి దీనికేమి సమాధానము. ఇట్టి సందర్భములును మహాభారతమున పెక్కు గలవు. అనగా భార్యలు భర్తలను సంతానము కోరుటయు, మరికొన్ని సందర్భములలో భర్తలు తమ భార్యలకు సంతానము కలిగింప గోరి తపమాచరించుటయు గలదు. అట్లేల చేయవలయునో అనగా సహజ వ్యాపారమైయున్నచోట, ప్రత్యేక ప్రయత్నమేల అవసరమైనదో వివరించు వివరణమును భారతము దత్తావధానులరై పఠించినవారికి తెలియగలదు. దీని నింత ప్రపంచీకరించుటకు కారణము ఆదిపర్వమున సంతానముకొరకు కద్రూ వినతలు ప్రార్థింప, అనుశాసనికమున, కశ్యపుడు తానై వరము నిత్తుననగా వారు సంతానమును కోరుట. ఆదిపర్వ విషయమున లోక సహజమైన కార్యమునకు, భార్యలు ప్రార్థింపనేల అనుప్రశ్న యుదయించుచున్నది. అనుశాసనిక విషయమున అట్లుగాక కశ్యపుడు తానై వరము నిత్తుననినాడు. ఆ వరము సంతాన విషయమో గాదో తెలియదు. కాని కద్రు వినతలు కోరినది మాత్రము సంతానమునే.

ఇచట నన్నయ్యకంటె తిక్కన ఎక్కువ లోకజ్ఞానమును ప్రదర్శించినాడను ఒకమాట గలదు. కారణము పైన సూచించినదియే. అది సంతానము కొరకు భార్యలు ప్రార్థించుట ఏల. అది సహజ వ్యాపారము. నన్నయకీపాటి తెలియలేదని దానిని తిక్కన చక్కగ నివారించినాడని కాబోలు. కాని ఒక సంగతి మరువరాదు. వరమునిచ్చెద కోరుకోమనిన, భార్యలు సంతానము కోరిరి. కశ్యప ప్రజాపతి, అది సహజ ప్రక్రియయే

గదా! దీనికి వరమేల! మరి ఏదైన కోరుకొనుడనక వారి ప్రార్ధనకు వల్లె యనినాడు. దీనినిబట్టి వరము కోరుమనుటలోని కశ్యపప్రజాపతి ఉద్దేశము సంతానము గూర్చియేనని స్పష్టమగుచున్నది గదా! మరి ఇచట నన్నయ్య విజ్ఞతకు వచ్చిన లోపమేమి. తిక్కన కనబరచిన అధిక విజ్ఞతయేమి! మన చూపులోని భేదము తప్ప. అయినపుడు వక్కణములో భేదమెందుల కందురా! వక్తవ్యాంశము ఒక్కటే అయినను వక్కణపుతీరు వ్యక్తికి వ్యక్తికి మారుననుట లోకవిదితమే. అంతేగాక శౌనకాదులకది క్రొత్త విషయము. కాని ధర్మరాజుకు, గరుత్మంతుని వృత్తాంతము వివరముగ కాకపోయినను కొంతయయినను తెలియునని గరుత్మంతుడు మహానుభావుడని వినియుందుననుటలో తెలియుచున్నది.సందర్భముననుసరించియు వక్త భాషణమునందు భేదము కలుగును.

ఒకే విషయము తీరి కూర్చున్న వేళ వివరించుటకును. త్వర కలిగినవేళ విన్నవించుటకును లోకమున భేదముండుట మనము గ్రహించుట లేదా! మన అనుభవముననను కలదు గదా! శౌనకాదులు ఎట్టి త్వర లేక వినుటకు సిద్ధపడినారు. కాని భీష్ముడు అంపశయ్యపై నున్నాడు. అప్పటికెన్నియో బోధించినాడు. ఇంకెన్ని ధర్మరాజు అడుగనున్నాడో తెలియరాదు. కనుక విషయము సంగ్రహింప బడవచ్చును లేదా వక్తవ్యాంశబోధ ఒకటే అయినను పలుకుతీరులోని భేదముగానైనను గ్రహింపవచ్చును. దీని నింతటితో విడిచి ముందుకు సాగుదము. ఎట్లయిననేమి వీరు ముందడిగినను, లేక కశ్యపుడే ఇత్తునన్నను ఫలిత మొక్కటే. అది వారు సంతానము బడయగోరుట. ఇది సత్యస్థితి. వారి కోరికయు సహజము. స్త్రీకి మాతృత్వము కన్న మించిన ఔన్నత్యము, ఫలము మరియొకటి లేదని సర్వప్రపంచము అంగీకరించినదే గదా!

కద్రూ వినతలు కోరినారు. కశ్యపుడిచ్చినాడు. ఇందెట్టి విశేషములేదు. కాని వారి కోరికల లోనే విశేషముగలదు. నన్నయ్యగారి కద్రువ "అనలతేజులు, దీర్ఘదేహులునైన యట్టి తనూజులన్, వినుత సత్త్వుల గోరె వేవురం గడు వేడ్కతో" ఇక వినత,' సుపుత్త్రులన్ భుజవీర్యవంతుల వారి కంటెను బలాధికులైనవారి వీరుల నిద్దరిని కోరినది. కద్రూ వినతలు సంతానము వేడుట. కశ్యపుడు అట్లేయనుట, తదనుగుణముగ వారు కోరుకొనుటయు జరిగినది. ఇది యింత సాధారణముగ కనుపించుచున్నను ఈ వృత్తాంత ప్రాధాన్యమునకంతకు మూలమైన విశేషాంశము ఇందుగలదు. అది "వారికంటెను" అను వినత వచనమునందు నిక్షిప్తమైనది. వినత మాత్సర్య స్వభావము గలది యని తిక్కనవాచ్యము చేయగా, నన్నయ్య దానిని ధ్వని పూర్వకముగ చెప్పినాడు. ఇది ఇట్లుండ, లోకమున కద్రువ ఒకింత దుష్టురాలుగ, వినత ముద్దరాలుగ ముద్రితమైనారు.

దానికి కారణము, కద్రువ అన్యాయముగ వినతను దాస్యమునకు గురి చేయుట. ఇది వినతపై సానుభూతిని కలిగించుటకు కారణమైనది. ఇది నిజమేగదా!- అనిపించును. తిక్కన ఈ చోట ఇట్టి తారతమ్యపు మాటకు చోటులేక, కద్రువ వేవురను, వినత ఇద్దరిని వేడుకొన్నదని చెప్పినాడు. దీనినిబట్టి నన్నయమాటలో కద్రువపై వినతకు కొంత ఈసు కలిగియున్నట్లు లేదా తనకు కద్రువ కంటె ఆధిక్యము కావలెనని యున్నట్లు స్పష్టమగుచున్నది. తిక్కనమాటలో అట్టిదేమియు లేదని తెలియుచున్నది. కాని ముందుగ కద్రువ యండములు ఫలించి తన యండములు ఫలింపకునికి మత్సరమున వినత అండము నవియించెనని ఆమె స్వభావమును వెల్లడించినాడు. ఇది తన యండము ఫలింప లేదనెడి తత్కాలీన రోషమునుండి ఉద్భవించినదియే గాని ఆమె స్వభావము మాత్సర్య పూరితము కాదందురా! స్వభావ మెప్పుడు బయల్పడును? సందర్భము వచ్చినప్పుడే గదా! కనుక వినతకు మాత్సర్యము తన సవతియందు గలదనుట స్పష్టము.

కద్రువ కిట్టి దృష్టి వినతయందు గలదా, లేదా! అనునది తేలపలసియున్నది. ఇప్పటికి మాత్రము స్పష్టము గాలేదు. వినత స్వభావము, ఈ వ్యాఖ్యానము వలననే గాక, అనూరుని వచనమునను స్పష్టము. అందు నన్నయ్య తిక్కనల కిరువురికిని ఏకవాక్యత గలదు. తిక్కన ఆ మాట స్పష్టముగ చెప్పినాడు. నన్నయ్య వాచ్యముగ మత్సర, చాపల్య శబ్దములు ప్రయోగింపలేదు. తల్లికి ఆలిగి యండంబు అవియించిన యవినీత కావున నీవు నీ సవతికి దాసివి కమ్మని అనూరునిచే అనిపించినాడు నన్నయ. తిక్కనయు ఇట్లే అనిపించినాడు. అనూరునకు తల్లిపై కోపము కలిగినది. ఎంతటి కోపము? మాతృదేవి యని యైనను గణింపక శాపమిచ్చు నంతటి కోపము. నిజమే! ఆమె వలన తాను వికలాంగుడైనాడు. తన దుఃస్థితికి తాను వగచుచుండ, తనరూపు తనతల్లికే అప్రియమగుట మరియొక కారణము. ఈ అప్రియశబ్దము నన్నయది. తిక్కనగారి వినత దుఃఖవివశురాలైనది. నన్నయ్యగారి అనూరుడు తల్లిపై కోపించుటకు కారణము కన్పించుచున్నది. అది తనపై తల్లికి కలిగిన అప్రియత్వము. మరి తిక్కనగారి అనూరునికట్టి కారణము కనుపింపదు. వికలాంగుడగుటందురా! అది రెంటను సామాన్యమే.

ఏమైననేమి ఈ యొక్క కారణము చాలదా అతడు కోపించుట కందురా! - అనవచ్చును. ఫలితము - కోపము, శాపరూప మందినది. అది కద్రువకు దాసియే యగుటగా ఏల యుండవలయును. మరియొకటి కారాదా! మరి అట్టి శాపమే అతడేల యిచ్చెను. రహస్యమంతయు ఇందుగలదు. వినత అండము నవయించుటకు కారణము, కద్రువకు సంతానము కలిగి, తనకు కలుగకుండుటయే గదా! అనగా ఎవరి కారణముగా నామె రోషపడి తన యండము నవయించినదో, ఆమెకు దాసి యగుట వలననే పశ్చాత్తాపముతో నైనను వినత స్వభావము నందు మార్పు అలవడ

గలదని అనూరుని వాంఛయై యుండవలె. ఇట్లేల యనవలయును. అట్టి శాపము లేకున్న వినత దాసియగుట ఎట్లు? దానిని గరుడడు బాపుట ఎట్లు? మీది కథ జరుగవలె నన్న ఇది అవసరమేగదా యందురా-ఇది నిజము. ఇదియే వస్తుస్థితి. అనగా వాస్తవము. అప్పుడు నన్నయ్య తిక్కనలను పోల్చవలసిన అవసరమే లేదు. పోలిక తెచ్చిననే పై వివరణ మవసరము. కాదనిన మన బుద్ధి కొలది కథాగతపాత్రల స్వభావమును అంచనా వేసికొనుట - ఇదియు అవసరమే. ఏ కావ్యమైనను ఊరక మానసికానందముకొరకును, కాలక్షేపము కొరకును కాదుకదా! "విశ్వశ్రేయః కావ్య" మని కదా! విశ్వశ్రేయమెట్లు ఒనగూడును. ఉత్తమ చారిత్రశిక్ష నలవరచు కొనుటవలన. దానికి పూర్వుల అనుభవములు, వారి నడవడికలు, ఆయా సందర్భముల వారు స్పందించిన తీరు, దానివలన కలుగు ఫలితములు, విపరీత ఫలితములు- వీని యన్నింటిని ఆకళింపు చేసికొని తమతమ వర్తనములను ఎప్పటి కప్పుడు సరిదిద్దుకొనుటకు కారణమగును. అది అట్లుండ, వినత స్వభావ మిట్టిదని తెలియనైనది. ఇక కద్రువ విషయము చూతము.

కశ్యప ప్రజాపతి వరములు వేడుకొమ్మనినాడు.ముందు కద్రువ కోరికొనినది. పిదప వినత కోరికొనినది. ఇందొక న్యాయము, వైపరీత్యము, రెండును గలవు. కద్రువ పెద్దది. కద్రూ వినతలు పుత్రార్థినులై కశ్యపునారాధించుట యనుక్రమము ననుసరించియు, ఆమె ముందు కోరుకొనుట ఉచితమే. ఇది న్యాయము. ఎన్నిక పిన్నకే తగు నను దాని వలన వైపరీత్యము. ఇచ్చట దీనికేమి ప్రసక్తియని యడుగవచ్చును. కారణమిది. వినత ముందు కోరుకున్న, కద్రువ కోరిక ఎట్లుండెడిది. ఇది ఊహాజనితమైన ప్రశ్న. దీనికి సమాధానమును ఊహయే. వినత ఏ విధముగ కంటె శబ్దము నుపయోగించినదో, అట్లే. కద్రువకు మత్సరస్వభావమున్నట్లు సంస్థాపింపబడలేదు గదా! నిజమే. కథాగమనమును పరికింపుడు. ముందు కద్రువ కోరికొనినది. పిదప ఆమె కోరుకున్న వారి 'కంటె' అధికులిరువురు కావలెనని వినత కోరినది. మరల తన అభిలాషను వ్యక్తపరచుకొనుటకు ఒకవేళ కద్రువకు, వినతకుమారుల కంటె బలాఢ్యులను కోరుకొనవలెనని యున్నను అవకాశములేదు. మిన్నకుండినది. కాని లోపల ఆబాధ శల్యమై పీడించు చున్నది. కాకున్న ఉచ్చైశ్రవమును తానుచూచి, వినతకు చూపి,"అతిధవళంబైన యశ్వంబునందు, సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్లయైయున్నది." అని ఏల యనవలయును. అయ్యశ్వవాలము నిజముగ నల్లగనున్నదా! లేదుకదా! మరి యేల ఆమె అట్లు పలుకవలసి వచ్చినది. తెల్లగ నున్నది ఎల్లరకు తెల్లగనే కన్పించును గదా! వినతకును అట్లే కన్పించును గదా! కనుక వినతనుండి ఆమె ఏ సమాధానము నాశించి ఇట్లు పలికినది. వినత ఎట్లును తెల్లగ నున్న దనును. తాను నల్లగ నున్న

దనును. వాదు ప్రారంభమగును. దానినుండి పంతముత్పన్న మగును. అది పందెమునకు దారితీయును. ఋజువునకు వచ్చిన తానోడిపోవుటయు స్పష్టము. ఇంత తెలిసిన కద్రువ ఇట్లేల యనినది. ఏదో ప్రయోజనమాశించియే కదా. ఏమా ప్రయోజనము. వినతను ఎట్లైనను వాదులోనికి లాగవలయును. వాదుఫలితము ఋజువైన తానోడిపోవునే! అనగా దానికిని ఏదో ఉపాయ మామె ముందే ఆలోచించి పెట్టికొనిన దనుట స్పష్టమగుచున్నది. తరువాతి కథ దాని నెట్లును స్పష్టపరచినది. అది వినతను ఓటమికి గురిచేయుట. తాను గెలుచుట. ఈ గెలుపు ఆమె ఆధిక్యమును నిలుపవలయును. లేకున్న ఆ పందెము ఫలితము దాస్యమే అగుట యేల. ఋజువు-తనను దాసిని చేయునే. మరి దీని కేల ఆమె సాహసించినది. ఇది సాహసముకాదా! కాదు-దుస్సాహసము. అనగా దాని నెట్లైన నల్లగా రూపించి, వినతను దాసిగా నొనర్చుకొన వలెననెడి ఊహ ఆమె యందు బలవత్తరముగ గలదని నిరూపించుచున్నది. ఇట్టి ఊహ లేకపోయి నపుడు మాత్రమే అది సాహసము, దుస్సాహసమగును. కానినాడు అది తంత్రము. దుస్తంత్రము. సవతిపట్ల సమభావము గలదియే యైన ఇట్టి ఆలోచనము చేయునా! కనుక వినత పట్ల ఆమెకు సద్భావము లేదనుట స్పష్టము. ఎప్పటినుండి లేదు. మొదటి నుండియు లేదని చెప్పుట కాధారము లేదు. కాని, వినత 'కంటె' శబ్దము తన వర ప్రసక్తి యందు తెచ్చినప్పటినుండి మాత్రము లేదని చెప్పవచ్చును. కానినాడు పనిగట్టుకొని, నిజముగ తెల్లగనున్న దానిని, అందు కొంత నల్ల యున్నదని చెప్పనేల. దానిని నిరూపించుకొనుటకు - అప్పటికి దానిని తప్పించి - ఆ తప్పించుటకు పతి పరిచర్యాకాలంబు సమీపించెనని, వినతను నోరుమూయించి, రేపు చూతమని చెప్పి, తనకుమారుల పిలిచి, తన అభిలాషను వ్యక్తము చేసి భంగపడి, వారిని శపించుటకు కూడ వెనుదీయక (వారిని పొందుటకు సహస్రవర్షంబు లారాధించినది కశ్యపుని), చివరి కెట్లో, ఒకపుత్రుని వలన దానిని తన కనువుగ పరిణమింపచేసి- ఇన్నిపాట్లేల పడినది. మొదలు ఉచ్చైశ్రవము ఆమెకు కన్పించినట్లు వినతకు మాత్రము కన్పింపదా. అదిగో చూడుమని ప్రత్యేకముగ చూపి, ఇంత ప్రసంగము చేయుట ఏల. కనుక ముందున్నను లేకున్నను. వినత కోరిక వినిన నాటి నుండియు. ఆమె లోలోన, కుపితయై యున్నదనుట, సమయము కొరకు నిరీక్షించు చున్నదనుట స్పష్టమగుచున్నది. ఇచ్చట వ్యాఖ్యానమును - విడిచిన, కథాక్రమము ఆదిపర్వసంబంధి. ఇక ఆనుశాసనికమును గమనింతము.

అందును ముందు కద్రువయే ఈ ప్రసంగము గావించినది. అంతవరకు భేదములేదు. దానిని విని వినత, కద్రువతో, నవ్వులాట కనుచుంటివా, లేక నీ కట్లు కనుపించుచున్నదా యని యడిగినది. ఇందు వినతయే కయ్యమునకు కాలు దువ్వినట్లు కన్పించు చున్న దనిపించుచున్నది. "నీదుచూపునకు పోలిన భంగియో,

అంతయు తెల్లగ నున్న దానిని కొంత నల్ల గలదనుట ఏటి మాట, నల్లకన్పింపదే, కానిఇట్లు తెమలంబలుక పని ఏమి" అనుటలో కొంత, ఆమె కాలుదువ్వినట్లే కన్పించుచున్నది. అది ఆమె స్వభావమే. మాత్సర్యము గలదియే. చపలయు గూడనని ముందే తెలిసినది. నన్నయయు దానిని నిరూపించు చున్నాడు. గమనించుడు. అప్పటి వినతమాట ఇట్టిది 'నీవేకన్నులంజూచితే' అనునది. మీదుమిక్కిలి అక్క అని సంబోధించినది. కాదు - ఊదిపలికినది. అందనురాగముగాని, తనకంటె పెద్దదను గౌరవముగాని కన్పించు చున్నదా! అవహేళనముతప్ప. సరి. ఇకవాదుమొదలైనది. జంటపన్నిదము చరచినారు. కద్రువ ఏ ఉద్దేశముతోనైన గానిండు కొంత నల్ల కలదన్నది. తానుకాదనినది. కద్రువ పంతమాడినది. అక్కగారనెడు గౌరవమున్నచో దాని నంతటతో ఆపివేయ వచ్చునుగదా! అశ్వము ఎట్లుండిన మనకేమి. మనకీ వాదులాట ఎందులకు. పందెమేల యనవచ్చునుగదా! అట్లనక పందెమునకేల ఒడబడినది. అశ్వమెట్లును తెలుపు. పందెమున తానే గెలుతునన్న విశ్వాసము. దాని వలన కద్రువ తనకు దాసి యగుట నిక్కము. ఈ యుహ లేకున్న మనలో ఒకరి కొకరు దాసి యగుటయేమి. ఇది ఏమంత బాగైన విషయము. వలదనరాదా! అనవచ్చును కాని ఆమె స్వభావ మననీయదు. కావున ఒకరిపై నొకరికి ఈసున్నదనుట స్పష్టము. కాదు-అప్పటి వరకు సఖ్యముగనేయున్నారు. ఇది అప్పటి కప్పుడు సంఘటింపబడినదాని ఫలితమే తప్ప అన్యముకాదు-లేకున్న వరములెప్పటివి. ఏనూరేండ్లు గడచినవి. దానికి ప్రమాణము సర్పముల అనూరుల జన్మము. ఆపైన కొంత కాలము గడచినది. ఇంతకాలము వారు సఖ్యముగనే యున్నారు. దానికి ప్రబలసాక్ష్యము వారిరువురు కలసి వాహ్యాళికి వచ్చుట. కాని నాడు - ఇది ఎట్లుపొసగు ననవచ్చును. నిజమే. అట్లనిపించుట కవకాశము లేకపోలేదు. కాని లోకమును గమనింపుడు. అభిప్రాయ భేదములు వచ్చినపుడు, వెంటనే కలహింతురు కొందరు. సమయము కొరకు నిరీక్షింతురు కొందరు. అప్పటి వరకు దానిని దిగమ్రింగుదురు. పైకి ఎంతో సఖ్యముగ కనుపింతురు. మరికొందరు అభిప్రాయ భేదమునట్లే యుంచుకొని, ఎవరిదారిని వారుందురు. మరికొందరు ఆ విషయము నంతటితో వదలివైచి, తక్కువిషయములందు దాని ప్రభావము రానీక, యథాపూర్వస్థితిని కొనసాగింతురు. మొత్తము కథాక్రమమునవలోకించిన, కద్రూవినతలు తమమాత్సర్యమును సమయము వచ్చునంత దాక అడచి కొని, ఇప్పుడు ప్రస్ఫుటీకరించుకొని నారో,- అదెట్టిదియు లేక సఖ్యముగనేయున్నారో, సహృదయ పాఠకుల బుద్ధికి అందక పోవునదికాదు. గరుడని వృత్తాంతమును వదలి దీనిపై ఇంత చర్చఎందుల కన్పించుట సహజము. మహాకవులు ఒక ప్రధాన ఇతివృత్తము గొని,

దాని నూతగా చేసికొని అనేకవిషయములును బోధింతురు. ఎన్నింటినో ప్రధాన ఇతివృత్త పరిధిలో నిముడ్తురు. అట్టివి కొన్నింటిని గమనించితిమి. అవి రురునికథ . అగ్ని భట్టారకునికి భృగుని శాపము-ఇందు ప్రస్తావింపబడినవి. అవి ఇతివృత్తముతో ప్రత్యక్ష సంబంధము కలవి కావు. వాటిని దీర్ఘముగ నుదహరింపకయు, విస్తరింపకయు కథను కొనసాగింపవచ్చును. కాని వాని ప్రయోజనము వాని కున్నది. అవి ప్రత్యేకముగ తడుమ వలసి యున్నది. ప్రకృతము కద్రూవినతలు. వారిస్వభావములను గూర్చి ఇంత చర్చించితిమి, ఫలితమేమి. ఆయాసందర్భముల వారివారి గుణశీలములను వ్యక్తీకరించుటలో కవి ఆశించిన ప్రయోజనమేమి. ప్రత్యక్షముగ సూచింపబడిన విశేషములేనా. ఇంకేమైన గలవా! ఇందేమైన లోకరీతి, నీతి, ఇమిడియున్నవా! ఈ దృష్టితో ఇంత చర్చింప వలసి వచ్చినది. అది ఇది.

కద్రూవినతలు సపత్నులు. సపత్నుల మధ్య మాత్సర్యముండును. ఇది సహజము. లేకుండుట అసహజము. లేకుండుట అభిలషణీయము. కాని దుర్లభము. కథాభాగమున, మొదటి నుండియు వారిరువురి మధ్య మాత్సర్య భావమున్నదని సంస్థాపింప వలను పడ లేదు గాని, వినత కోరిక యందలి ప్రాధాన్యమాధారముగా, అప్పటినుండి మాత్సర మున్నదని స్థాపించుట జరిగినది. కాని లోకన్యాయము చొప్పున సపత్నుల మధ్య ఈసు, అసూయలుండుట సహజము. ఆ న్యాయము చొప్పున వీరిరువురి మధ్యను ఉండి ఉండవలయును. ఇట్లనుట కొంత నిరంకుశత్వముగ కన్పించును. కాని ఉండుటయే వాస్తవము. ఏలనన, స్త్రీలు దేనినైనను పంచుకుందురు గాని, భర్తను మాత్రము పంచుకొనుట కిచ్చగింపరు. ఎక్కడైన కోటి కొక్కరున్న వారి విషయము వేరు. ఈ లోకరీతిని గూడ కవి బోధింపుచున్నాడని భావింపవచ్చును. ఎట్లు. కద్రూవినతలు సామాన్య స్త్రీలుకారు. కశ్యప ప్రజాపతి భార్యలు. అంత మాత్రమేనా! వారు ఏకగర్భ సంజాతులు. దక్షప్రజాపతి కుమార్తెలు. అట్టి - అంతటి వారి మధ్యనే ఈసునసూయలు చోటుచేసికొనెనన్న, ఇక సాధారణ స్త్రీల సంగతి చెప్పనేల. తస్మాత్ జాగ్రత యని కవి హెచ్చరిక. ఇక మిగిలిన కథ, సంబంధ మున్నంత వరకు సామాన్యమే. ఒకటి రెండు విషయములు.తప్ప. అవి ఆదిపర్వము విషయమున, క్షీరసాగర మథనము, బ్రాహ్మణ స్వరూప నిరూపణము అధికము. కాగా తల్లి దాస్యమును బాపుటకు గరుడడు తల్లి ప్రబోధముచే నని ఆదిపర్వ వృతాంతము. కాగా అది నారదుని బోధనము వలనని ఆనుశాసనికము. మిగిలిన మార్పు లేమైన వున్నను కథా గమనమును మార్చు నంతటివికావు. లేక ప్రభావితము చేయు నంతటివియును కావు. కాని ఒక్క మార్పు ప్రధానమైనది గలదు. అది తల్లి శాపమును బాపుటలో గరుడని ప్రయత్నములోని భాగముగ అమృతము తే బనిచినవారు

ఉరగులు. ఇది ఆదిపర్వవిషయము. కాని ఆనుశాసనికమున ఆమాట చెప్పినది ఉరగమాత కద్రువ. ఇచ్చట గరుడని వచనము మనసు ద్రవింపజేయును. బంధుత్వమున నేను నీకు పుత్రుడనే! నన్ను జూచియైన, నాతల్లిని దాస్యము నుండి విముక్తు రాలిని జేయుము. నీవుపెద్దవు. నేను చిన్నవాడను. ధర్మాధర్మముల ప్రసంగముల ఊసు నాకు వలదు. నా తల్లి దాసియగుట దైవకృతము. దానికి విడుపు గల్గిన నాకెంతో యూరట అని కడుదీనముగ నర్థించినాడు. దానికి కద్రువ, అట్లయితేని ఈ వృథాప్రసంగము వలన పని లేదు. చేతనైన అమృతము తెచ్చియిమ్ము నీ తల్లిని దాస్యము నుండి విడిపించుకొమ్ము అనినది. అనగా గరుడడు ప్రస్తావించిన బంధుత్వమును ఆమె సరకు గొనలేదు. మీదుమిక్కిలి అతని పలుకులకు ఆమె మొగము మురకటించు కొనుచు పై విధముగ పలికినది. దీనిని బట్టియు వినత పట్ల కద్రువకు గల భావమెట్టిదియో తెల్లమగుచున్నది. మరియొక భేదము. ఆదిపర్వ విషయమున, అమృతము ఉరగుల కందిన ఉపద్రవము కలుగును. దానిని వారికీ వలదనిన ఇంద్రుని వచనమునకు, గరుడడు నా పని వారికి తెచ్చిపెట్టునంత వరకే. సమయము జూచి, దానిని నీవు సంగ్రహింపుము, (నావలని అభ్యంతరము లేదని సూచన). అని. ఆనుశాసనికమున, గరుడడు తెచ్చినట్లే తెచ్చి, తిరిగి తానే ఇంద్రుని కిచ్చినాడు. ఇక రెంటి యందును అనురూపవిషయము. గరుడని మహానుభావుత. ఒకరు, మహాను భావుడెట్లగును. మొదలు అనుభావమనగానేమి. నిశ్చితాభిప్రాయము. సరియైన నిర్ణయము. ఇవి గొప్పగ నుండుట మహానుభావుని లక్షణము. అవి గరుడని యందెచ్చట ప్రస్ఫుటమైనవి. ఒకటి మాతృదాస్యము బాపుట యందు స్థిర సంకల్పము. దాని కెంతకైనను ఓర్చికొనుట. వజ్రాయుధ విషయమున దానిని కించపరుప కుండుట. అమృతము తెచ్చుట పైననే తప్ప దానిపై ఎట్టి లౌల్యము అతనికి లేకుండుట. అమృతము ఇతరులకు దక్కిన ప్రమాదము కలుగునన్న ఇంద్రుని వచనమును వివేచించుట. తిరిగి అతనికే చేర్చుట. ఇవన్నియు అతనిని మహాను భావుని చేసినవి.

అతడట్టివాడు కనుకనే, కథేతివృత్తమేదైనను, ఇది సౌపర్ణాఖ్యానముగ రూపెత్తినది. అట్లే ప్రచార ప్రశస్తుల నందినది. చివరకు భీష్ముని వచనము వలన పక్షీంద్ర ఉపేంద్రులకు అభిన్నత్వము స్పష్టమైనది. శ్రీ కృష్ణభగవానుడును దాని ననుమోదించినాడు. ఆదిపర్వమున శ్రీ మన్నారాయణరూపమున, ఈ ఇతివృత్తమునకు సాక్షీ భూతుడైనాడు. వ్యక్తులవచోవైఖరిలో మార్పుండ వచ్చు గాక! తాత్పర్యమునకు భగవానుడే సాక్ష్యమైనచోట మన తీర్పేల! పూర్వోక్తమైన ఈ యన్ని విధముల సౌపర్ణాఖ్యానము మహద్వ్యాప్తి నందినది. భిన్నత్వమునకు కారణము వచో వైఖరి. కాలము నందలి వ్యత్యస్తస్థితి. వస్తువు మాత్రముసామాన్యము.

# శకుంతలోపాఖ్యానము

మహాభారతము పంచమవేదము. ఇతివృత్తము పరిమాణ విషయమున ఘనమైనది. కౌరవ పాండవ వృత్తాంతము ప్రధాన కథ. ఏతత్ కథాసంబంధియగు అనేక వృత్తాంతములు, ఉపాఖ్యానములుగ అందు కథనము చేయబడినవి. కేవలము కథాసంబంధులగుట మాత్రమే కాక ఒకాఒక నీతిని, రీతిని, ధర్మమును ప్రతిపాదించు ఉద్దేశముతో ఈ ఉపాఖ్యానములు కథనము గావింపబడినట్లు భావింపవలసి ఉన్నది. అట్టి వానిలో శకుంతలోపాఖ్యానము ఒకటి.

దీని నూతగాగొని సత్యప్రాధాన్యము నిరూపింప బడినది. ఇది ప్రధానము. ఇక దీనిమూలమున తెలియ వచ్చినవి ప్రభువుల మృగయాసక్తి, వివాహములయందలి వివిధవిధములు, వివాహిత, దీర్ఘకాలము పుట్టింట ఉండదగదనుట మొదలగునవి. కావ్యకర్త ప్రతిపాదింప దలచినవి ఇవియే, అయిన పక్షమున ఆలక్ష్యము నెరవేరినట్లే. ఇంకదీనిని తిరిగి ప్రయత్నించి పరిశీలింప వలసినది లేదు. కాని లోకమున దుష్యంతుడు శకుంతలను మోసము చేసినాడను భావము పాదుకొనినది. దీనికి మరింత బలము నొసగినది కాళిదాస కృత అభిజ్ఞాన శాకుంతలము. మోసము చేసెననుటలోని యథార్థాయథార్థములను పరిశీలించుట ప్రకృతము.

దుష్యంతుడు మోసము చేసినాడనుమాట ఇప్పటిదికాదు. కాళిదాసుకాలము నాటికే ఏర్పడి యుండవలెను. లేకున్న దుష్యంతుడు, రాజసభలో శకుంతలను తానెరుగనన్న దానికి కారణముగా, అతనికి మరపు కలిగినదని, అట్లు మరపు కలుగుటకు, దుర్వాస మహాముని శాపవృత్తాంతము కల్పింప నవసరము లేదుగదా! అనగా మోసము చేసినట్లు కాళిదాసు భావించి యుండవలెను. లేదా లోకము భావించియున్న దానిని నివారించుటకు, కాళిదాసు ఈ ప్రయత్నము చేసియుండ వలెను తప్ప వేరు కారణము కన్పింపదు. భారతము వ్యాసకృతము. అది యథార్థ చరితము. లేక వ్యాసకల్పితము. ఏదైనను, దానిని మార్చ వలసిన అవసరమేమి? ఆ మార్పుకు ప్రయోజన మేమి! దుష్యంతుని ఉత్తమునిగా చూపుట. కథ అట్టి దైనపుడు

ఇతరుల కల్పనయేల. ఆ కల్పన వలన ఆశించిన ప్రయోజనము కలిగినదా! - లేదు! మోసము చేసినాడన్న అభిప్రాయము దీనివలన మరింత రూఢి అయినది. ఒకటి చేయబోయిన మరియొకటి అయిన దనుట కింతకంటె వేరు ఉదాహరణ మక్కరలేదు. శకుంతల మోసమునకు గురియైనదో లేదో, మోసమను మాటకు తావెక్కడ ఏర్పడినదో పరిశీలించుదము.

శకుంతలోపాఖ్యానము తెలిసినదే. దుష్యంతుడు వేటకువచ్చి, కణ్వాశ్రమ ప్రాంతమునకు చేరినాడు. వలయు నమాత్యులందగినవారల నుండగ బంచి, దుష్యంతుడొక్కడు ఆశ్రమానికివచ్చి, ఆ మునివల్లభు మందిరంలో శకుంతల యను కన్యను చూశాడు. ఈ మాట నన్నయ పాఠకులకు చెప్పిన మాట అనగా ఆమె 'శకుంతల' అని పాఠకులకు తెలియును. దుష్యంతునకు తెలియదు. కాని శకుంతలకు వచ్చినవాడు దుష్యంతుడు అని తెలియును. ఇక్కడి వచనమిది. 'అదియును (శకుంతల) ననంత విలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెరింగి', - కనుక అతడు దుష్యంతుడని ఆమెకు తెలియును. ఇది - ముఖ్యముగా పాఠకులు మనము నందుంచుకొన వలయును. ఎట్లు తెలిసెనో వివరించుట కిది చోటుగాదు. ఆమె శకుంతల యని యప్పటికి దుష్యంతునికి తెలియదు. ఆమెకు మాత్రము ఆతడు దుష్యంతుడని తెలియును. ఇది ప్రధానము.

ఇక తెలిసి ఆమె ఆసనార్ఘ్యపాద్యాది విధములం బూజించి కుశలంబడిగినది. ఇవి కేవలము అతిథి మర్యాదలవలె కానవచ్చుచున్నవి. అర్ఘ్యపాద్యము లిచ్చుట, కుశలమడుగుట మర్యాదలేనని సరిపుచ్చు కున్నను, అందు పూజించెననుమాట ఏల. ఇంటికి వచ్చిన వారికి మర్యాద చేయుట భారతీయ ధర్మము. నిజము. వచ్చిన వారందరిని పూజింతుమా! అది కాదు. - ఇక్కడ పూజించుట యను దానిని అట్లు గ్రహింపబనిలేదు. లోకసామాన్యముగ ఆర్ఘ్యపాద్యము లిచ్చుట మాత్రమే అని సంభావింపవలెనందురా! పోనిండు అట్లే అనుకుందము. మరి కుశల మెప్పుడడిగెదము. కుశలమడుగుటకు తగు ఎరుక యుండవలయును గదా! ఇది గూడ కేవలము - ఎవరు, ఎక్కడ నుండిరాక ఇత్యాది విషయములేతప్ప, కుశల శబ్దమును ఇచ్చుట వేరుగా భావింపరాదందురా - అట్లే అనుకున్నను 'ఎవరు' అనుదానికిచ్చుట తావులేదు. కారణము అతడెవరో ఆమెకు తెలియుననుటముందు స్పష్టమైనది. అంతేగాక, దుష్యంతుడు చెప్పిన సమాధానమునందును ఆ వివరములు లేవు. కేవలము వేటకొరకువచ్చి, ఇట కణ్వమహామునిని చూచిపోవగా వచ్చితిమి అనుటతప్ప, తానెవరో అతడు చెప్పలేదు. కారణమేమైయుండును. ఆమె ఆడుగలేదు. అడుగక పోవుటకు కారణము, ఆమెకు అతడెవరో తెలిసి యుండుట. ఇది ఇట్లుండనిండు. ఒకమారు

మరల పై విషయమును ప్రస్తావింతము. అది, ఇది. అమెచేసిన మర్యాదలన్నియు అతిసంభ్రమముతో. ఈ సంభ్రమమేల కలిగినది. దీనికిట్లు చెప్పటగలదు. ఒక్కసారిగా దుష్యంతుని ప్రవేశము, ఆమెకు తొట్రుపాటు కలిగించినదనుట. ఇది ఒప్పిదముగ నున్నట్లే యున్నది. కారణము వచ్చినవాడు దుష్యంతుడని తెలిసినను, అనుకొనివేళ, అకస్మికముగా దర్శనము కలిగినపుడు తొట్రుపడుట సహజముగదా! కాని అంతకంటె తనకు కావలసినవాడు, కావలెనని తా, కోరుకున్నవాని దర్శనము వలన మనసుకు సంబరము కలిగి, చేయుమర్యాదలలో పూజ్యభావము నిండినదని భావించుట మేల్తరము గదా! వివేచింపుడు. ఇట్టి భావమచ్చట నున్నదా (మనసుకు సంబరము కలుగుట) అని అనుమానింతురుగాక. ఉన్నదని భావించుటకు ఏ ఉపపత్తులు గలవు అని అడుగవచ్చును; పరామర్శింతము. దానికి పూర్వము, సంభ్రమశబ్దము తెలుగున సంబరమాయెనని, సంబర శబ్దమెట్టి సందర్భములలో ఉపయోగింతుమో, ఎట్టివేళల సంబరము కలుగునో చదువరులు మనమున ఉంచుకుందురుగాక! ఆ సంబరమే తిరిగి ఇచ్చట సంభ్రమమైనదనుట నిశ్చయము. ఇంక మీది వృత్తాంతము చూతము.

కుశలమడిగియున్న శకుంతలతో దుష్యంతుడు ఏమనినాడో పైన చూచితిమి. 'వేటకు వచ్చితిమి. కణ్వుని చూచి పోవగా వచ్చితిమి. ఎందుబోయిరి?' అనునవి దుష్యంతుని మాటలు. ఇవి శకుంతలతో నవినవేనా? కాదు. తనలో తానసుకున్నట్లు అనినాడు. ఎందు బోయిరొకో అనినాడుగాని ఎందుబోయిరి అని ఆమెతోననలేదు. అట్లనరాదు, ఆమెతో నన్నట్లు గానే భావింపవలెనందురా! అట్లు భావించుటకు ఆస్కారములేదు. కారణము ఆ తరువాత "వారనినన్ విని" ఆమె చెప్పుట కారంభించినది. అతడు ఆమెనే నడిగియున్న యెడల వారడిగిన యాలతాంగి వారి కిట్లనియె ననిగదా యుండవలసినది. కావున అతడు స్వగతముగ ననుకున్నట్లు స్పష్టమగుచున్నది. అడిగిన వ్యక్తి ఎదుటనుండగా స్వగతముగ అనుకున్నట్లు అనుట - ఈ నటన మేల. ఇది నటనమే. అప్పటి నటనావసరమట్టిది.ఎట్లో చూతము.

దుష్యంతుడు వచ్చి చేసిన పని యేమి? తన్వి, బయోజదళాయతాక్షి. సంకులమిళితాళి నీలపరికుంచిత కోమలకుంతలయైన శకుంతలను చూచినాడు. చూచుట అయిపోయినదా! లేదు - చూచుచునే ఉన్నాడు. ఎప్పటివరకు! ఆమె అతిధి మర్యాధలు యాంత్రికముగా గ్రహించినాడు. ఎప్పుడు ఆమెమాట వినపడినదో. అప్పటి వరకు ఆమెను చూచుచునే ఉన్నాడని భావింపనగును. అమె కుశలమడిగినది. అడిగినదానికి ప్రత్యుత్తర మీవలెను. ఇంతవరకు అతనిని ఆమె గమనించుటలేదా! అతని చిత్తము పరవశమయినదని గ్రహింపలేదా! ఏమో! ఆమె గ్రహించి యుండునేమో యన్న శంక ఇతనికి. దానిని కప్పిపుచ్చుకొనవలెను. లేకున్న 'ఆ దుష్యంతుడు అనంత సత్వుడు.' - అయిన ఆయన ధీరత్వమునకు భంగము కలుగును. తన్నివారణార్థము -

ఎందుబోయి రొకో అని ఆశ్చర్యము నటించుట. పరవశుడైనాడని ఎట్లు భావించుట. చూచి - చూచి, 'దానిని కన్యకగా నెరుంగుట' (శకుంతల అను పేరుమాత్రము ఇంకను దుష్యంతునకు తెలియదు.) అది మనోజ రాజ్యలక్ష్మియుం బోనిమ్మను దాని నంతటిదగుట. సర్వలక్షణ లక్షితంబులైన సర్వాయవంబులు జూచుట, సంచలిత హృదయుండగుట' అనునవి, ఆమె కుశలంబడుగు పర్యంతము ఆమెను చూచుచునే ఉన్నాడనుట కుపబలకము. ఇక సంభాషణము ప్రారంభమైనది. అతడడిగినది ఒక్కమాట. 'నీవెవరి కూతురవు.ఇట్టి రూపలావణ్య విలాస విభ్రమ గుణసుందరివి. ఇందులకేల వచ్చితివి' అనునది ఆ మాట. దీనినిబట్టి ఆమెను మునికన్య యని అతడు భావింపలేదు. ఆమె హావభావములు అట్లు లేవు. తనవలెనే ఆమెయు నచటికి వచ్చియున్నదని భావించినాడు. లేకున్న ఇందుల కేల వచ్చితివని అడుగడు. నీవెవరి కూతురవు అని అడుగుట ఏల. ఆమె తన నాకర్షించినది. రూపము, వయసు, లావణ్యము, గుణము ఇవన్నియు వ్యక్తము లైనవి. వ్యక్తము కావలసినదొక్కటి. అది, ఆమె పుట్టువు. రాజైన తాను, గ్రహించుటకు వలను పడునదేనా! కాదా! అట్లేల అనుకొన వలయును, లోకసాధారణరీతిలో అడిగె ననుకొనవచ్చును గదా! అనవచ్చును. కాని మీది కథ అట్లనుకొనుటకు తావిచ్చుటలేదు. అతను మదనాతురుడైనాడని స్పష్టీకరింపబడినది గదా! 'కామాతురాణం న భయం, నలజ్జ' అని గదా చెప్పుదురు. అట్టి చోట్ల ప్రవివేచనమునకు తావుండునా అను ప్రశ్న పుట్టుట సహజము. లోకమున అది సహజమే. కాని ఇతడు దుష్యంతుడు. ఆత్మ ప్రత్యయము కలవాడు. ఇదియు అనంతర కథలో స్పష్టము చేయబడినది. అనుకూలమైన స్థితి. అతడు ప్రభువు. ఆమె అబల. అచ్చట మరెవ్వరులేరు. కాని అతడెట్టి చనవు తీసికొనుటకు ప్రయత్నింపలేదు. ఇది అతని సంస్కారము.

ఆ అడిగినదానికి ఆమె చెప్పిన సమాధానము, 'జగతీవల్లభా!' అని మొదలిడినది. 'అత్యగణిత ధర్మ స్వరూపుడని జనంబు దన్ బొగడగ జగదారా ధ్యుండుగు కణ్వమహామునీంద్రుని ఆత్మజను' అని. కణ్యుడు మహాముని అని దుష్యంతునికి తెలియదా! తెలియునన్నమాట, కణ్వమహామునిని చూచిపోవగా వచ్చితి మన్నపుడే వ్యక్తమైనది. మిగిలిన విశేషములు మాత్రము దుష్యంతునికి తెలియవా! తెలిసినను, తానెంతటిదో దుష్యంతుని మనమున నాటుకొనవలెనను ప్రయత్నము. అదిగో అట్టివాని కూతురును సుమా! అని చెప్పుట. ఎవరి కూతురవు అని అతడే అడిగినాడు. కాని ఆమె ఆత్మజను అనుచున్నది. ఒకానొక ప్రయోజనమాశించి ఆమె ఇట్లనినది. ఏమి ఆ ప్రయోజనము. అతడు తనపై అభిలాష కలిగియున్నాడు. తనకును అభిలాష గలదు. దీనికేది ఆధారము అని సందేహము కలుగవచ్చును. (మీద

స్పష్టమగును) దీనిని అతని యందు మరింత వృద్ధి పొందింపవలెను. అదియు కొంత ఉత్కంఠతతో- ఎట్లు? తాను మునికన్యను అని చెప్పుటతో, అతనిలో ఏమి కలుగును. అతడామెను మునికన్య అని భావింపలేదు. ఉపరి తనవలెనే వచ్చిన దనుకొనినాడు. ఇట్టి రూపలావణ్యవిలాస విభ్రమ గుణసుందరి విందులకేల వచ్చితివని గదా అతడడిగినది. అనగా, ఆమెవంటి వారు ఇట్టి మున్యాశ్రమములకు రాబని ఏమి. అని అతడి సందేహము. కనుక ఆమె మునికన్య కాదని అతని నిశ్చయము. అట్టి అభిప్రాయములో నున్న దుష్యంతునికి తాను (శకుంతల) మునికన్య యని చెప్పిన అతడు ఉద్విగ్నతకు లోనగుట నిశ్చయ మన్న ఎరుకతోనే, ఆమె కణ్వుని అత్మజనని చెప్పినది. ఆమె ఏది ఆశించినదో అది నెరవేరినది.

ఆమె చెప్పిన మాటనే (కణ్వుని గూర్చినది) అతడును ఆమెతో ననినాడు. కణ్వుని ఆత్మజ ననిన ఆ పలుకు ఎంతయు నమ్మనేరనయ్యెద ననుకొనినాడు. అంత స్పష్టముగ అమె చెప్పినపుడు ఇతడు నమ్మనేరనయ్యెద ననుకొనుట లోని సామంజస్యమేమి. అది అతని ఆత్మప్రత్యయము. కనుకనే ఆమె ఏవిశేషములతో చెప్పినదో అంతకుమించిన విశేషణములతో అతనిని (కణ్వుని) సంభావించుచు ఉత్తమాశ్రమనిష్ఠితుడు, ఉపరి ఊర్ధ్వరేతుడు, అట్టి యనఘచరితునికి ఎట్లు కూతుర వైతివి అని అడిగినాడు. జగదారాధ్యుడగుటవరకే నీకు తెలియును. అతడు అట్లు అగుటకు కారణము కూడ నాకు తెలియును. అతడు ఊర్ధ్వరేతుడు. నీవు ఆత్మజ నని చెప్పినను నేను దానిని నమ్ముటలేదు. మరి నీ వట్లు చెప్పుచున్నావు. కూతురెట్లైనను కావచ్చును. అందువలననే నీవెట్లు కూతురవైతివని అడిగినాడు. ఇట్లడుగుటయే ఆమెకు కావలసినది. అడిగినదే తడవుగా చెప్పట కారంభించినది. అది మేనకా విశ్వామిత్రుల సంగమము, తనజన్మము, శకుంతములు రక్షించుట కణ్వుని రాక. తనని పెంచి పెద్దచేయుట, ఇది ఇంత సంగ్రహముగ చెప్పినదా. తాను క్షత్రియ కన్యనని గదా - ఇంతకు ఆమె ఎరుక పరుప దలచు కొనినది. ఆమాట ఒక్కటే అయిన పైన చెప్పినంత మాత్రము చాలును. కాని ఆమె అట్లు గాక మేనకా విశ్వామిత్రుల మధ్యనడచిన వృత్తాంతమును దీర్ఘముగా వర్ణించి చెప్పినది. తరుణి (మేనక) యమ్మౌని వల్లభుమ్రోల నున్న, సంమిళిత సుగంధ బంధుర సమీరవశంబున తూలి బాల పై వలు వెడలన్ బయల్పడియె వల్గుకుచంబులు కక్షయుగ్మమున్ లలిత కృశోదరంబు దరళ త్రివళియుత రోమరాజియున్! అని ఆగినదా! అందు తన (విశ్వామిత్రుడు) దృష్టినాటుడు దానిని గవయందివిరెను". అని చెప్పి 'విశ్వామిత్రు నిష్టంబునకు తగిన కామోపభోగంబుల పెద్ద కాలంబు రమియించిన తాబుట్టితినని' చెప్పినది. ఇట్లేల చెప్పవలయును. దీనికి సమాధానము ఇచ్చుటకు పూర్వము, ఇచ్చట

లోకములో నాడుకొను మాట ఒకటి కలదు. అది ఒక స్త్రీ నోట కవి ఇట్లు పలికింప వచ్చునా? అనునది. ఆమె పలికినది. అది అంతే. కాని నిజమునకు అవి తన మాటలు కావని చెప్పినది. తనను ఎవరో అడుగగా కణ్వుడు ఆమెను గూర్చి వారితో నన్న ఆ మాటలు మరల ఇచ్చట మీకు చెప్పు చున్నానని కదా! దుష్యంతునితో ననినది. అయినను నన్నయ అట్లు అంత పచ్చిగా వ్రాయవచ్చునా అని కొందరనుటగలదు- నన్నయ గనుకనే ఆట్లు వ్రాసినాడు. సభ్యతకు భంగము లేకుండ. అది ఎట్లో చూతము.

ఏదేని ప్రబంధమునగాని, లోకమునగాని, ఒక నాయిక. రూపలావణ్య విలాస విభ్రమములు ఎవరికి ఆదరణీయములు. లోకమునకా, నాయకునకా! కావ్యమైనచో పాఠకులకా, నాయకునకా! లోక విషయమైనచో ఆమె అందముగ నున్నదని చూచిన వ్యక్తియు అనుకొనును. ఇతరులతోను పరిమితముగ ననును. అందమును చూడరాదను ఆంక్ష లేదుగదా! మరి అందరు ప్రహ్లాదుని వంటివారు కాదుగదా! ఇక, కావ్యమైన, రచయిత వర్ణనలను బట్టి, నాయిక అందచందములు పాఠకులకు తెలియవచ్చును. కావ్యకర్త, దేని నాశించి నాయిక అందచందములను వర్ణింపవలెను. నాయకుడు ఆమెపట్ల అనురక్తుడగుటకొరకు. అనగా ఆమెను గూర్చిన వర్ణన, ఆ ప్రయత్నమున కవి తానై గాని, మరొక పాత్రచే గాని నాయకుని కందునట్లు చేయవల యును, ఎట్లు అని పాఠకునకు అనుమానము వచ్చును. కాని చాలకావ్యములలో నాయికను ప్రవేశ పెట్టుటయే - ఆమె హావ భావ విలాసములను నేరుగ పాఠకులకు అందివచ్చునట్లు చేయబడినది. ఇది సమంజసమేనా! నాయికా సౌందర్యము ఎవరికి లక్ష్యము. పాఠకునికి కాదుగదా! నాయకునకు. అట్టివారి ప్రణయ ఉదంతము, దానిని తీర్చిన తీరు, అందలి సౌకుమార్యము పాఠకులకు ఆనందమును కల్పింప వలెను తప్ప నాయిక పాఠకునికి లక్ష్యము కాగూడదు. అయిన నది అపచారము. కాని చాల కావ్యములలో అదే జరిగినది. కాని నన్నయ ఇచ్చట ఆట్లు చేయ లేదు. మొత్తము కథా నందర్భములో ముమ్మారు స్త్రీమూర్తి సౌందర్య ప్రస్తావన కలదు. రెండు శకుంతల పరముగ, ఒకటి మేనకపరముగ. ఆ చోట్ల నన్నయ రచనమిది. శకుంతలపరముగ; తన్విపయోజ దళాయ తాక్షి. సంకులమిళితాళి, నీలపరికుంచిత కోమలకుంతల. మనోజ రాజ్యలక్ష్మియుంబోని దాని సర్వలక్షణ లక్షితంబులయిన సర్వావయవంబులు, మూడవది మేనకను గూర్చి. పైన చెప్పుకొనినదే. ఇచ్చట ఒక సందేహము కలుగ వచ్చును. వివరముగ కచ, కుచ వర్ణన చేయలేదు తప్ప, సర్వలక్షణ లక్షితంబులనుటలో నన్నయ అట్టి వర్ణన చేసినట్లుగాదా! ఆనునది అసందేహము. జాగ్రత్తగా గమనించినచో, మొదటిదైన వర్ణన మాత్రమే నన్నయది. అది 'పయోజ దళాయతాక్షి సంకులమిళితాళి

నీలపరికుంచిత కోమల కుంతల' అనునది. ఎవరినైన ఎట్లు గుర్తు పట్టుదుము. కనులు చూచిగదా! దానితోపాటు కొట్టవచ్చినట్లు కనుపించునది తలకట్టు. ఇది సాధారణము. అంత మాత్రమే చెప్పినాడు నన్నయ. ఇక రెండవ వర్ణన, దుష్యంతుడు, శకుంతలను గూర్చి తా ననుకున్న మాట. అందును ఎంతసభ్యతనుపాటించినాడు నన్నయ. పట్టు బట్టి అవయవ సౌందర్యమును వర్ణింపలేదే! సన్నివేశ మిదే అయిన ఇతర ప్రబంధములలోని పోకడ ఎట్లుండెడిది. ఇక మూడవది కణ్యుడు ఎవరికో చెప్పగా, తాను విన్న మాటలు శకుంతల దుష్యంతునికి నివేదించినది తప్ప నన్నయ పాఠకులకు విన్నవించినవి కావుకదా! ఇది నన్నయ దృష్టి; కనుకనే తనను, తన కవిత్వమును 'లోనారయవలసినది' గా కోరినాడు. ఇట్టి సందర్భము లెన్నియో గలవు. ఉపరి తాను విపుల శబ్దశాసనుడ ననినాడు. దానిని నిరూపించుటకిది తావు గాదు. ఇక కథలోనికి వత్తము.

అంత సాంగోపాంగముగ శకుంతల తనజన్మ వృత్తాంతమును చెప్పుట ఏల? ఇక్కడే ఒక మాట. దుష్యంతుడు- నీవెవ్వరి కూతుర వనుటకు పూర్వమే దానిని కన్యకగా నెరింగినాడు. కన్యకగా నెరుంగుట ఎట్లు. మెడలో తాళి లేదనియా! అప్పటికా అచారముండెనా! నన్నయ ఎవరిచేతను తాళి కట్టించినట్లు లేదు. మరి ఎట్లు గ్రహించెను. స్త్రీమూర్తిని చూచి నంతనే ఆమె కన్యయో, కాదో గ్రహించునంతటి విజ్ఞానము దుష్యంతుని కుండవలయును. అట్టి శాస్త్రమేదైన గలదా! ఉన్న ఆ శాస్త్రమును అతడు పఠించెనా! ఏమో-నేరుగా సమాధానములు లేవు. ఒకవేళ అట్టి శాస్త్రమున్నచో అతడు చదివి యే యుండవలెను. లేకున్న దుష్యంతుడు ఆదిక్షత్ర చరిత్ర నెట్లేలగలడు. దుష్యంతుని మాట ఎట్లున్నను అష్టాంగ సంగ్రహము, చరక సంహిత వంటి గ్రంథములు చదివిన ఒక స్త్రీమూర్తిని చూచి ఆమె కన్య యగునో కాదో మనమును గ్రహింపగలము.

శకుంతల విపులముగ తన జన్మ వృత్తాంతమును వివరించుటకు కారణము తెలియుదము. తానెట్లు కణ్వునికి కుమార్తె అయినదో ఎరుగంగ చెప్పుమని దుష్యంతుడు కోరినాడు. అతడు అట్లు కోరుటయే ఆమెకు కావలయును. నిజాభిజాత్య సంపద నెట్లయినను ఆతని కెరుక పరుప వలయును. దానికి తగిన ప్రాతిపదిక నెట్లేర్పరచినది ముందు తెలిసియుంటిమి. ఆమె కన్య. లావణ్యవతి. తన మనము వాంఛాపూరితము. తాను ప్రభువు. ఆమె ఆభిజాత్య మెట్టిదో తెలియగోరినాడు. ఆమె తాను ముని కన్య ననినది. మనసు నిస్పృహ వృత్తికి లోనైనది. కాని ఆమె చెప్పినమాట నమ్మశక్యము గాకున్నది. ఆమె కణ్యుని కుమార్తెయే అయినచో తన మనసు అట్లెట్లు

వర్తించినది? తనపై తనకంత ఆత్మప్రత్యయము. ఈ సంశయమెట్లు విడును. ఆమెనే ఎరుగంగ చెప్పుమనినాడు. ఆతనియందు సందేహము పొటమరింప వలయును. ఆతడడుగవలెను. తాను చెప్పదలిచియే యున్నది. కానీ తానై చెప్పరాదు. సందేహము కల్గునట్లు తాను కణ్వుని ఆత్మజనని చెప్పుట దానికి తగిన ప్రాతిపదిక. అది ఫలించినది. ఇక నిస్పృహవృత్తికిలోనైన ఆతని మనస్సును ఆ స్థితినుండి యథాపూర్వ స్థితికి కొనిరాలయును. అట్లు కొనివచ్చుటలో కేవలము తన అభిజాత్య సంపద నెరిగించుటతోపాటు, తన అభిలాషను కూడా వ్యక్తీకరింపవలయును. కనుకనే తన జన్మప్రకారమును అంత సవిస్తరముగా - మేనకా విశ్వామిత్రుల సంయోగమును వివరించి చెప్పినది. ఆమె ఆశించిన ప్రయోజనము నెరవేరినది. అది, దుష్యంతుడు, తన యందు, శకుంతల అనురాగమును ఉపలక్షించునట్లు చేయుట అనునది. ఆమెకును తనయందు ఆసక్తిగలదని దుష్యంతుడు భావించునట్లు చేయుట. ఇక ఆమెకు అతనియందు ఆభిలాష కలదనుట ఎట్లో చూతము.

ఆమె జన్మప్రకారము తెలిసినంతనే, నిస్పృహ వృత్తినున్న తన మనము మదన బాణపరంపర కాస్పదమైనదని దుష్యంతుడే చెప్పికొనినాడు. తన యంద క్కోమలి అనురాగం బుపలక్షించినాడు. ఈ ఒక్కమాట చాలును గదా! ఆమెయు ఆతనియందు అనురక్తయై యుండెననిచెప్పుటకు. దీనిని వ్యక్తీకరించుటకు తగుకాల విలంబనము కల్పించుటకు కాకున్న, వారెందు బోయిరొకో యన్నప్పుడు, వారు పండ్లుదేర కానకేగిరి, 'మీవచ్చు టెరింగిరేని జనవల్లభ వారును వత్తురింతకున్' అని చెప్పుటయేగాక, 'వారు వచ్చునంతకు ముహూర్తకాలంబుండునది' అని అభ్యర్థించినది. దీనికి ప్రయోజన మేమి. ఎవరోవత్తురు, తనతండ్రి కొరకు. లేదని తాను తెలుపును. వెళ్ళుట, ఉండుట - ఆ వచ్చినవారి యిష్టము. వారికి గల త్వర. ఇచ్చట దుష్యంతుడు కేవలము పెద్దల యెడ గౌరవము నెరపు నుద్దేశముతో నమస్కరింప వచ్చినాడు. ఆది కుదరలేదు. మరల నెప్పుడైన వచ్చినపుడు సందర్శింప వచ్చునని అతడు వెనుదిరుగ వచ్చును. అట్లగుట శకుంతల కిష్టములేదు. వచ్చినవాడు దుష్యంతుడు. ఆతనిపై ఆమెకు ఆభిప్రాయముండి యుండవలెను. కాని అట్టి సాక్ష్యము కథాభాగము నందులేదు. దుష్యంతుడామెను పూర్వమే ఎరిగి యున్నట్లును సాక్ష్యములేదు. మరి ఆమె ఎట్లు గ్రహించినది? అది ఎట్లో-ఇట్లు. ప్రత్యక్షముగ తెలిసి యుండనక్కర లేదు. విని,-పోల్చుకొని యుండ వచ్చును. అ వినికిడియే అతనిపై అమెకు ఆభిప్రాయము కల్గించి యుండవలయును. ఇది విపరీతముగాదు. తాను క్షత్రియ కన్య. క్షత్రియుని చేర నభిలషించుట న్యాయమే. దానికి తగిన సన్నివేశ మిప్పుడు ఏర్పడినది. దానిని

వినియోగించు కొనవలయును. ఈ ప్రయత్నమున తన కిచ్చోట సాయపడు వారెవ్వరును లేరు. తానై చొరవ తీసికొనుట తప్ప గత్యంతరము లేదు. కనుకనే ముహూర్త కాలంబుండునది అని నిర్దేశ పూర్వక అభ్యర్థనము. అనురోధము. అది ఆశ్రమము. యజమాని లేడు. ఎవ్వరో ఆడకూతురున్నది. ఆమె అపురూప లావణ్యరాశి. చూపు మరల్చు కోలేకపోయినాడు. ఆమె కుశలమడిగినది. తాను తొట్రుపడినాడు. తా కోరి వచ్చినవారు లేరనితెలిసినది. ఇక వెనుదిరుగుట తప్ప-అచ్చటనే ఉండుట మర్యాద కాదు. ఉండుటకు కారణము కన్పింపదు. అతని ఆ స్థితిని గమనించియే శకుంతల ముహూర్తకాలంబుండునది అని అభ్యర్థనా పూర్వక అనుశాసనము గావించినది. దాని, కుపబలకము 'వారువచ్చు నంతకు' ననుట. అట్లు ఆతడుండుటకు తగు ప్రాతిపదిక నేర్పరచినది. అయిన ఏమగును. అతడు కణ్వుని గూర్చి అడుగుట, వారిచ్చట లేరని ఆమె చెప్పుట అయినది. మీది సంభాషణమునకు అస్కారములేదు. కేవలము కణ్వునిరాక కొరకై ప్రతీక్షించుట తప్ప. అయితే మాటనేర్చిన మానవుడూర కుండునా! అందును అభిలాషానక్తుడైన దుష్యంతుడు! ఆమెను వివరణలు అడిగినాడు. ఆమె చెప్పినది. ఇక అవరోధములులేవు. ఉపరి తనయందు అక్కోమలి అనురాగం బుపలక్షించినాడు. మాట సాగించినాడు, నీవంటి సౌందర్య రాశి ఉండుటకు ఇది తగిన చోటు కాదనినాడు. 'భామిని'యని సంబోధించినాడు. 'నాకు భార్యవై అశేష రాజ్యలక్ష్మీ మహనీయ సౌఖ్యములందు కొమ్మ'నినాడు. 'నీకును నాకును కాముండు ప్రేమంబు పెంపదొడంగె' ననినాడు. 'ఇక ఎడముసేయ దగద'నినాడు. ఇక ఎన్నియైన అనగలడు. అప్పటివరకు-తాను పెరిగిన చోటును-అతడు నిరసించుచున్నాడు. భామిని అని సంబోధించినాడు. కాంక్షాపూరితయైనదనిగదా ఆశబ్ద భావన. దానిని ఓర్చినది. తడవుగ భార్యవు కమ్మనినాడు. ఆమెకు అతనియందు అభిలాషయేలేకున్న వీటినెట్లు ఓర్చినది? "నీకును, నాకును కాముండు ప్రేమంబు పెంపదొడంగె' అన్నప్పుడు లేదని ఆమె అనలేదే! దుష్యంతుడు ప్రలోభపరచె ననుట ఎట్లు? అతడు పురుషుడు. ఆమెస్త్రీ. ఇతర విధములైన ఆటంకములులేవు. తన కోరిక తాను నివేదించుకొనినాడు. ఆమె కిష్టము లేకున్న తిరస్కరింపవచ్చును. కానీ మౌనము వహించినది. ఎందువలననో అవగతమగు చున్నది గదా! ఇంకను సందేహమున్నచో అనురాగంబుపలక్షించి అను పదబంధమును, నీకును నాకును-- అను వాక్యమును తిరిగి పరామర్శించునది.

దుష్యంతుని అన్ని మాటలకు ఆమె మౌనము వహించినది. అతడు వివాహ పద్ధతులను ఏకరువు పెట్టినాడు. అవి ఆమె ఎరుగదా! అయినను అతడు చెప్పెను.

అతని అత్రుత అతనిది. ఆమెకు అతడు అట్లు చెప్పుట కావలయును. తనకెంత అభిలాషయున్నను అతనిచే అభ్యర్థింపబడుట-కాదు, అతడే తనను వేగిరపరచి నాడను భావము కలిగింపవలెను. అతనిని తాను సఫలీకృతుని చేసినట్టి భావన కనుపింప వలెను. ఇది స్త్రీ సహజప్రవృత్తియే కాదా! తన యిష్టము, తానై వాచా చెప్పక ఎట్లెరింగించినదో ముందుచూచితిమి. ఇప్పుడును తన ప్రమేయము లేనట్లు తన తండ్రివచ్చి 'తన్నిచ్చుచో పరిగ్రహింపు' మన్నది. ఇది యుచితమే. ఆమె కన్య - తండ్రి చాటుబిడ్డ. తానై ఎట్లు నిర్ణయము తీసికోగలదు. ధర్మము పాటించినది. బాగు. అతడూరకుండునా! అతని త్వర ముందు తెలిసినదే. గాంధర్వ విధి వివరించినాడు. 'తన్నిచ్చుచో తానె కర్త, ఇందొరుల ప్రమేయ ప్రసక్తి లేదనినాడు. ఇది అతని ప్రవృత్తి. పురుష ప్రవృత్తి. ఇరువురు ప్రకృతికి విరుద్ధముగా నడచిన జాడలేదు. అప్పుడు ఆమె అన్నమాట. నీవలన నాకు జన్మించు కుమారునికి పట్టము గట్ట వలయను. 'అట్లయిన నీకును నాకును సంగమంబగున్' అని. తండ్రి వచ్చి తన్నిచ్చుచో గ్రహింపు మన్న మాట ఏమైనది. గాంధర్వవిధి వివరించినంత మాత్రమున బేల అయినదందుమా! అంత బేల అయిన, ఆ స్థితి యందును ఖండితముగ తన కోరికను ఎట్లు బహిర్గత మొనర్చినది. నిజమునకు బేలపడినది దుష్యంతుడుగదా! దానికిది షరతు. అతడేమి చేయవలయును. ఆదిక్షత్ర చరిత్రను స్మృతికి దెచ్చికొని వెనుదీయుటయా! ప్రకృతికి దాసోహమనుటయా! ఇందేది యాచరించిన విపర్యయ మగును. అప్పటి అతని మానసిక స్థితి - ఇట్టి విచార మొనర్పగల స్థైర్యము కలిగి యుండునా! మీదిది మీద చూచి కొన వచ్చును. ప్రకృతము ప్రస్తుతము. అంతే! వరమొసగినాడు. కాదన్న-రతులలోని మాటలు రావిమాని పూవులను నానుడికి స్థితి ఎట్లుబ్బును.

ఇందు ఎవరి నెవరు ప్రలోభ పరచినారు. ప్రలోభమనుటకు తావున్నదా! స్త్రీ పురుష ప్రకృతులు ఏతత్ సహజ పద్ధతిని వర్తించుటలో అధర్మ మేమున్నది? శకుంతల మోసపోయినది ఎచ్చట? దుష్యంతుడు మోసగించిన దెక్కడ? మరి కాళిదాసు కల్పనమునకు గతి ఏమి? ఇప్పటి వలెనే అప్పుడును మోసము చేసి నాడన్న వారుండి యుందురు. లేదా తనకే అనిపించి యుండవలెను. లేదా ఇతిహాసమును, నాటకముగ మార్చుటలో శిల్పము కొరకు చేసిన ఎత్తుగడ కావచ్చును. ఏమైన నేమి దుష్యంతుడు శాశ్వతముగ అపరాధియై నిల్చినాడు. కాని ఆ పిదప వచ్చిన నన్నయ కాళిదాసు చేసిన మార్పును ఏల గమనింప లేదు? తానును దుష్యంతుని రక్షింపవచ్చునే. అట్టి దానికి కాళిదాసు అండ వుండనే ఉన్నది కదా! మరి ఆ దారి నేల గ్రహింపలేదు నన్నయ! దాని వలన మేలు కంటె కీడు అధికము. అంతేగాక వ్యాసకృత ఇతిహాసమును

మార్చుటకు తన కధికార మేమున్నది, తాచేయగోరినది. రాజరాజు అభ్యర్థించిన. భారత బద్ధ నిరూపితార్థ మేర్పరచుట. దానినే చేసినాడు. కాళిదాసు కల్పన నెరిగియు, నన్నయ దాని ననుసరింపక పోవుట కేది కారణము? ఆతడు నిత్య సత్యవచనుడు. అయినను తెలుగు వారిలో కొందరిలో నయినను, దుష్యంతుడిప్పటికిని అపరాధిగానే నిలిచినాడు! అది అతని కర్మము.

దుష్యంతుడు నిరపరాధియని స్థాపించు యత్న మెంతచేసినను అతడు అబద్ధమాడినది నిజముకదా! దానిని అతడే అంగీకరించెను గదా! దీనినెట్లు సమర్థింప వచ్చును. కావలసినది సమర్థనముకాదు. సంయమనము. అబద్ధమాడినది నిజము. ఎందులకాడినాడు?ఆయనయే చెప్పినాడు. తమ ఇరువురి మధ్య జరిగిన వివాహమునకు వేరు సాక్ష్యములేదు. కనుక అబద్ధమాడితి ననినాడు. తన కిచ్చ వచ్చిన కన్యను వివాహ మాడుటకు ఒకరి అనుమతి. సాక్ష్యము ఏల. అది గాంధర్వము. దానికి సాక్ష్యమెట్లుండును? అప్పటి త్వర అప్పటిది. మరి ఆమె ఇప్పుడు కుమారుని వెంట బెట్టుకొని వచ్చినది. పట్టము గట్టమను చున్నది. ఆమెను భార్యగా గ్రహించుట వ్యక్తిగతము, దాని నతడు ఇప్పుడును చేయగలడు. అది చేసినచో వెంట తెచ్చిన బిడ్డకు పట్టము గట్టవలెను. దీనిని తాను చేయ లేడు. కారణము అతడు నిరంకుశుడు కాడు. ప్రజాభీష్టము మేరకు పాలనము చేయవలసినవాడు. ఆ బిడ్డకు జన్మనిచ్చిన తల్లి ఎవరో, - అనగా తమను పాలింపబోవు వాని గుణశీలములు, జన్మాదికములు ప్రజలకు తెలియవలయును. అనగా శకుంతల ఎవరో ప్రజలకు తెలియవలయును. దుష్యంతుడు శకుంతలకు భర్త. ప్రజలకు ప్రభువు. ఇందు దేనికి ప్రాధాన్యము. ఒకటి వ్యక్తిగత సంబంధి. రెండవది రాజ్యసంబంధి. ఇందు ప్రజలపట్ల అతనికి జవాబుదారితనము గలదు. కనుకనే వ్యక్తిగతముగా నిందభరించుటకు సిద్ధపడినాడు. ప్రభు ధర్మమునకులొగినాడు. ఆకాశవాణి శకుంతల వృత్తాంతము నెరిగించినది. దుష్యంతుడు శకుంతలను గ్రహించినాడు. ఆమెయు అంతకుముందు - తన నెరుగ నన్న వానిని చేరుటలో వెనుకంజ వేయలేదు. సంశయింప లేదు. నిందింప లేదు. ఎందువలన! అతని నిస్సహాయతను అర్థము చేసికున్నది కనుక. కాలోచిత లోకధర్మ మట్టిది కనుక. మరి ఆమెకు కనుపింపని దోషము-దుష్యంతునిలో-లోకమునకు ఎట్లు కనుపించినది. కర్మము అనగా ఇదియే.



# కర్ణాట కిరాట కీచకులెవరు?

కర్ణాట కిరాట కీచకులను ఈ పదబంధము ఈ క్రింది పద్యములోనిది.

కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడనేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల యోమదంబ యో
హాటక గర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁననుం ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఈ పద్యము పోతన కృతముగ లోకమున వ్యవహారము నందినది. కాని భాగవతమున నిది కానరాదు. కాని తన కృతిని నరాంకితము చేయనని, భగవదర్పితము చేయుదునని చెప్పిన పద్యమొకటి భాగవతము నందు గలదు.

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుకొన్ని పుచ్చుకొని సొక్కి శరీరమువాసి, కాలుచే
సమ్మెట వేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్

పై పద్యమునందు, మనుజేశ్వరాధముల కిచ్చి, వారిచే బహూకృతుల నంది, సంతసించి, ఆ పిదప వారిచే, లేక అట్టి వారిచే, కాలు చేతుల సమ్మెట వ్రేటులం బడుట కిష్టములేక, అది మేలగు కార్యముకాకపోవుటచేత, ఈ బమ్మెర పోతరాజు నిండైన మనసుతో, జగత్తునకు మేలు పాటించి, భాగవతమును శ్రీహరి కంకితము చేసి చెప్పెననుట గలదు.

దీనిని బట్టి, నరాంకితము చేయుట కంటె, చేసి, పిదప బాధలుపడుట కంటె పోతన భగవదంకితము చేయుట మేలుగ భావించినట్లు తెలియుచున్నది. ఇది పోతన యనుభవమా! అయినట్లు సాక్ష్యములేదు. లేక, రాజులకిచ్చి పిదప యిడుములకు లోనైన వారి వృత్తాంతము, పోతనకు తెలియవచ్చుటవలన, అట్టిది తనకు వలదని రోసి, పై విధమున జెప్పెనా! అనునది ఒక సందేహము. ఇంతకు ఈ పద్యము పోతన కృతము కాదని, తరువాతి వారెవరో అందు జేర్చియుందురని కొందరి భావన. తమ భావన కనుగుణమగు నుపపత్తులును చూపియున్నారు! పోతన్న దైనను,

కాకున్నను, పద్యమునకు స్థితిగలదు గదా! పద్యమెవరిదైనను, అట్లు నరాంకితము గావించి, ఇడుములు పడ్డ వారి వృత్తాంతము తెలిసిన వారే యీ పద్యమును రచించి యుందు రనుట స్పష్టము. అట్లే

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపు గూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైననేమి! గహనాంతర సీమల గందమూల కౌ
ద్దాలికులైననేమి నిజ దార సుతోదర పోషణార్థమై

అనుపద్యము గూడ పోతన కృతముగా వ్యవహరింపబడుచున్నది. భావము నందలి అంతరార్థము పైపద్య భావనము వంటిదే. కూళలైన వారి కిచ్చుట వలన కలిగెడి కలిమి పడపు కూటి వంటిది. దాని కంటె అడవుల బట్టి కంద మూలములను సేకరించుకొనుట మేలు. లేదా హాలికులైనను మేలే. కుటుంబ పోషణార్థము నవపల్లవ కోమల కావ్యకన్యను కూళల కిచ్చుట పాడి గాదని నమ్మినవారెవరో ఈ పద్యమును చెప్పియుందురు. ఇట్టి భావము గలిగినదే, ముందు ఉదాహరించిన 'కాటుక కంటినీరు...' ఇత్యాదిగా కల్గిన పద్యము. అందు, కండ్లలో నీరు చిప్పిలి చనుకట్టుపై బడుచుండ, గద్గదికముతో నేడ్చుచున్న సరస్వతి, కళ్లెదుట సాక్షాత్కరింప, ఆకలిని బాపుకొనుటకై, నిన్ను (కావ్య రూపమున నున్న సరస్వతిని) కర్ణాట కిరాట కీచకులకు నేను అమ్మను గాక అమ్మను. ఊరడిల్లుమని సముదాయించుచున్నాడు, ఏతత్ పద్యకర్త.

ఈ పద్యములనన్నింటిని సమన్వయించుకొనుట వలనగాని, మరే విధమునగాని, ఈ పద్యములు పోతనవని, పై పద్యములలోని భావనలకు మూలమైనవాడు శ్రీనాథుడని లోకము నమ్ముచున్నది. దీనికి కారణము, కృతులను నరాంకితముగావించి, అనంతర కాలమున నరపతులచే యిడుములు బడ్డవాడు శ్రీనాథుడు. అంతేగాక, శ్రీనాథునికి, పోతనకు దగ్గరి చుట్టరికము కలదని, రాకపోకలు గలవారని, దాని కనువగు వృత్తాంతములను వివరించుటయు గలదు. ఒకప్పుడు శ్రీనాథుడు పోతనను సందర్శించెనని, తనవలెనె, కృతులను రాజాంకితము గావించి సమ్మానములందుమని పోతనను ప్రలోభపరచెనని, అట్టి సందర్భమును పురస్కరించుకొని, ఈ పద్యములు పుట్టినవని లోకమునందు ప్రచారమందినవి. కాగా ఇవన్నియు ప్రవాదములని, అట్టి ఉదంతములకు తావులేదని [1] బులుసు వేంకటరమణయ్యగారు, తమ భాగవత పీఠికలో వ్రాసి యున్నారు.' అది యట్లుండ కర్ణాట కిరాట కీచకుల గూర్చి వారు కొంత చర్చ గావించి యున్నారు. వారు వ్రాసినది. [2]"ఇచటి కర్ణాట కిరాట కీచకులెవరు? ఆ పదమును బట్టివారు క్రూరులైన కర్ణాట వర్తకులు కావలెను. కర్ణాట వర్తకులకును, పోతనామాత్య కృతికిని సంబంధమేమో? 'ఆ కాలమున నాంధ్ర రాజులనే కర్ణాట రాజులనుచు వచ్చి'రని శ్రీ రాయదుర్గము నరసయ్య శాస్త్రిగారు వ్రాసిరి. కాని యది యెట్లు పొసగునో తెలియదు. పద్యములో

'కర్ణాట కిరాట కీచకుల'ని యుండుటచే వారు వైశ్యులై యుండవలెను. రాజులు కాజాలరు. కావున 'కాటుక కంటినీరు' అను పద్యము పోతన చెప్పినది కాదనియె నిశ్చయింప వచ్చును,"అని.

అనగా, కర్ణాటకమనగా, ఆంధ్రమేనను నభిప్రాయముతో, బులుసువారు అంగీకరించుటలేదు. కర్ణాట వర్తకులకును పోతనామాత్య కృతికిని సంబంధమేమి యను వీరి వాక్యము వలన కర్ణాట కిరాటులనగా, నేటి కర్ణాటక (కన్నడదేశము) వర్తకులని వారభిప్రాయపడినట్లు నిశ్చయము. లేకున్న రాయదుర్గము నరసయ్య శాస్త్రిగారి మాటను త్రోసివేయరు గదా! అంతేగాక మరొక సందర్భమునను వీరు కర్ణాటమును గూర్చి ఆంధ్రముగ భావింపలేదు. [3] నా కవిత్వంబు నిజము కర్ణాటభాష' అన్న శ్రీనాథుని వచనమునకు దేశనిర్దేశ, పదముగా గాక, కర్ణ+అట అని విడదీసి కర్ణ సమీపమున చరించు భాషయని యర్థము చెప్పిరి. శ్రీ బండారు తమ్మయగారును ఇట్లే అభిప్రాయపడిరి. [4] వీరేగాక మరి పలువురు, శ్రీనాథుని వక్కణమును విమర్శించిరిగాని, ఎవరును సరియైన నిర్ధారణము గావింపరైరి. రాయదుర్గము వారి మాటను త్రోసి రాజనిరే తప్ప, వారట్లేల భావించిరో యను దానిని చర్చించిన వారు గారు బులుసు వారు.[5] పై కర్ణాట కిరాట కీచకులను దానికి, శ్రీనాథుని వక్కణమునకు సంబంధమేమని పాఠకులకొకింత సందేహము కలుగవచ్చును. కాని సంబంధము గలదు. ఆ సంబంధమే పై పద్యమునకు కర్త ఎవరో, అందలి కర్ణాట కిరాటుడెవరో, ఎవరిని ఉద్దేశించి ఈ పద్యము పుట్టెనో (తాను అమ్మనను చున్నాడు. అనగా ఇట్లు అమ్మినవారెవరో యుండి యుండవలెను) అను విషయములను నిర్ధారించును.

కర్ణాట కిరాట కీచకులను పదబంధమున కీచక శబ్దము నిందార్థమున, నుపయోగించెననుట స్పష్టమే. కిరాటుడనగా వైశ్యుడనుటలో విప్రతిపత్తిలేదు. దీని కనేక ఉపపత్తులు గలవు. [6]క్రీడాభిరామమున బహుపర్యాయములు ఈ పదము ప్రయోగింపబడినది.[7] క్రీడాభిరామమందలి కథా వస్తువు మంచన శర్మయను కాసల్నాటి బ్రాహ్మణుడు, అతని స్నేహితుడు టిట్టిభశెట్టి యను వారిరువురు నాటి ఆంధ్ర రాజధాని యైన ఓరుగంటికేగి, అందలి వివిధ విశేషములను గనుట. అందు టిట్టిభశెట్టి కిరాటుడు. [8]అతనినే కొన్ని సందర్భముల వైశ్యుడనియు, కొన్ని సందర్భముల కోమటి యనియు సంభావించుట జరిగినది. ఇచ్చట కిరాట, వైశ్య, కోమటి శబ్దములు పర్యాయములుగా చెప్పబడినవి. కాగా శ్రీనాథుడు హరవిలాసమున, కిరాటుని, వాణిజ్య వంశమునకు కూటస్థుడైన వానిగా పేర్కొనెను. అతడు చిరుతొండ నంబిని సంభావించిన తీరు గమనించుడు.

[9] "హర విలాసంబను ప్రబంధమునకు, బ్రథమ విలాసంబైన కృతి నాయకుని వాణిజ్య వంశంబునకు గూటస్థుండైన కిరాటకుల శ్రేష్ఠుండగు చిరుతొండ నంబి చరిత్రంబు జెప్పెద".

పై వచనమును బట్టి వాణిజ్యము చేయు అనేక వర్గములుండెననియు, అందు చిరుతొండనంబి, కృతిపతి యైన అవచి తిప్పయ వంశమునకు కూటస్థుడనియు స్పష్టమగుచున్నది.[10] అవచి తిప్పయ వైశ్య కులాబ్ధిసోము డని శ్రీనాథుడు కీర్తించినాడు. పై యుపపత్తుల వలన అవచి తిప్పయయు కిరాటుడనుట నిర్వివాదము.

లోకమున నిప్పటికి, కృతిని గైకొన్నవాడు అవచి తిప్పయ తప్ప ప్రచురముగా మరియొక వైశ్యుడు కనుపింపడు. కృతినిచ్చినవాడు శ్రీనాథుడు. నరాంకితము గావించి పిదప యిడుములు పడ్డ వాడును శ్రీనాథుడే! ఈ వృత్తాంతమే, పై పద్యములు - 'ఇమ్మనుజేశ్వరాధములు' 'బాలరసాలసాల', 'కాటుక కంటినీరు' పుట్టుటకు కారణములైనవా! కాని శ్రీనాథుడు, అవచి తిప్పయకు అంకితము గావింపగా, దానిని అమ్ముకొనుటగా సంభావించుటెట్లు? నిజమే శ్రీనాథుని దృష్టిలో నది అంకితము. దానిని పఠించుచున్న మన దృష్టి యందును అది అంకితమే. కాని పై పద్యముల కర్త కది అమ్ముకొనుటగా భాసించెనేమో! ఏలనన శ్రీనాథుడు భోగి. అవచి తిప్పయకు బాల్య సఖుడు. రాజాశ్రయము దొరకునంతవరకు, దినవెచ్చమునకు అతడు, అవచి తిప్పయ నాశ్రయించెనేమో! దానికి పరిహారముగ శ్రీనాథుడు కంచిని సందర్శించిన వేళ, తిప్పయ కోరికపై, కృతజ్ఞతా పూర్వకముగానే-కావచ్చునుగాక, హరవిలాసము నాతని కంకితముగా నూహించి చెప్పియుండవచ్చును. ఆ పిదప, కొంతకాలమునకు శ్రీనాథుడు పడిన ఇక్కట్లు మన మెరిగినవే. దీనినంతను ఎరిగిన కవి ఎవరో దానిని అమ్ముకొనుటగానే భావించి, అట్టి పద్యములు చెప్పియుండవచ్చును గదా!

ఇది ఊహ మాత్రమే. సాక్ష్యములు లుప్తమై నపుడు ఊహయే ఆధారము. అయితే ఆ యూహ సమంజసమేననుటకు దగు ఉపపత్తులు చూపవలయును. పై యూహకు-చూపిన ఉపపత్తులు చాలిన వనుకుందును. అయితే అవచి తిప్పయ కర్ణాటుడా! అను సందేహము మిగిలియున్నది. అతడు నెల్లూరి వాసి. నేటి కన్నడ రాష్ట్రము (కర్ణాటకము) నకు, అతనికి ఎట్టి సంబంధమును గానరాదు. కాని నెల్లూరి సీమను కర్ణాట సీమయని ఋజువు పరచిన పై యూహకు కొంత బలిమి సమకూరును. దానిని సాధింపగలమేమో చూతము.

[11] శ్రీనాథుడు పాకనాటివాడు. నా భాష [12] కర్ణాట భాష యనినవాడు. [13] 'కర్ణాట కటక పద్మ వనహేళి శ్రీనాథభట్టసుకవి యని' సంభావించు కొనిన వాడు. పాకనాడనగా నెల్లూరు ప్రాంతమనుట నిర్వివాదము. దీనికే కర్ణాటమని పేరున్నట్లు [14] గ్లోసరీ ఆఫ్ మద్రాసు ప్రెసిడెన్సీ పేర్కొనుచున్నది. తెలుగు భాషనే కర్ణాట మనుట గల దనుటకు మరియొక ఉపపత్తి.

[15] హాటకమైన ప్రకీర్ణము
పాటించి గుణింపజేతు బహుపద్ధతులన్
గాటంబగు లెక్కలు క
ర్ణాటకమున వెలయ సూర్యనారాయణుడా!

ఈ పద్యము ఎలుంగంటి పెద్దనదిగను, అతడు వీరాచార్య విరచితమగు సంస్కృత గణిత శాస్త్రమును ఆంధ్రీకరించెననియు, ఈ పద్యమందలిదని చాగంటి శేషయ్యగారు కవితరంగిణిలో ఉదహరించినారు. ఎలుగంటి పెద్దన తెలుగున వ్రాయుచు కర్ణాటమను చున్నాడనిన ఏమని భావింప వలయును. అట్లే శ్రీనాథుడు 'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అని తెలుగు కావ్యమున, తెలుగున జెప్పినాడనిన ఏమి భావింప వలయును. తెలుగునాడును కర్ణాట కమనుచున్నట్టు స్పష్టమగుచున్నది గదా!

ఇక పాకనాడు (నెల్లూరి సీమ) కర్ణాటక మనుటకు పైన నొక ఉపపత్తి చూపితిమి. అంతేగాక ఆర్కాటు నవాబులను కర్ణాటక నవాబులనుటయు గలదు. వీనివలన నెల్లూరి సీమను కర్ణాటమనుటలో విప్రతిపత్తిలేదు. అయితే ఈ ఉపపత్తులు సమీప భూతమునందలివి. వీని నాధారముగా గొని, శ్రీనాథుని కాలమునకు అనువర్తింప జేయుటెట్లు! అని అనుమానింతురు. ప్రాచీనములైన ఉపపత్తులను గలవు. [16]క్రీడాభిరామమున కర్ణాటాంగన ప్రసక్తిగలదు. [17] ఆమె మరియొక సందర్భమున కరణ కాంతగా సంభావింపబడినది. కరణ కాంత యనగా కరణ దేశపు స్త్రీ. [18] ఈ కరణదేశము కనుమయవ్వలి దేశముగా అందే చెప్పబడినది. కనుమ లనగా తూర్పుకనుమలు. అవ్వల యనగా, క్రీడాభిరామ కథా సందర్భము ఓరుగంటిది కనుక, దానికి కనుమ యవ్వల యనగా, తూర్పు కనుమలకు తూర్పున నున్న భూభాగము. ఇది ఇతర శాసనస్థసాక్ష్యమువలనను స్పష్టము. పై కర్ణాట, కరణ శబ్దములు పర్యాయములగుట, పరస్పరము సమానములని తెలియుచున్నది. ఇంతకంటె మరియొక ప్రమాణము శివరాత్రిమాహాత్మ్యము నందు గలదు. [19]అందు కర్ణాట కమల ముఖులు కనుమ యవ్వలి వారుగా చెప్పబడినారు. రెంటి యందును 'కనుమ యవ్వలి' యనునది సమానము. ఒకచో 'కరణ'మై, మరియొకచో 'కర్ణాట' యనుట ఎట్లు పొసగును. స్థూల నిర్దేశమున కనుమ యవ్వలి యనుట. సూక్ష్మమున కర్ణాటము. అనగా తీరాంధ్రము. కరనాడు అనగా సముద్ర తీరస్థ భూభాగము. కరశబ్దమునకు తీరమని యర్థము. ఇక కరణ దేశము, తీరస్థభూమికి పడమరగా, కనుమల పర్యంతము వ్యాపించి యున్న భూభాగము. అయితే నంతయుగాదు. కేవలము కందుకూరు దాని చుట్టుప్రక్కల నున్న భూభాగము. దీని యివతలి భూభాగము వెంగళనాడు. దాని కీవలది మొట్టవాడినాడు. దాని కీవల నున్నది పలనాడు. ఇవి ఆనాటి తీరాంధ్రమునకు పడమర నున్న భూభాగములకు పేర్లు.

దీనిని బట్టి నెల్లూరి సీమ కర్ణాట మనుటలో సందేహము లేదు. అందువలన అవచి తిప్పయయు, శ్రీనాథుడును, కర్ణాటులే. కనుక శ్రీనాథుని భాష కర్ణాటాంధ్రము, ఆంధ్రమునందలి ఒక మాండలికము. ఇక అవచి తిప్పయ కర్ణాట కిరాటుడు. కావ్యమును అంకితముగొన్న వైశ్య ప్రముఖుడు అవచి తిప్పయ. అంకితమిచ్చుటలోని సందర్భమును పైన గమనించితిమి. దీనినంతను గమనించిన ఒకా యొక కవి పై

పద్యములు చెప్పినాడు. అతడెవరైయుండ వచ్చును? పోతనయంగుటకు ఆస్కారమున్నది. దీనికగు కారణములు చూతము.

పద్యకర్త ఇతరులెవరో చేసినట్లుగ, తాను కర్ణాట కిరాట కీచకుల కమ్మ ననుచున్నాడు. ఇతరుల సంగతి చెప్పుటలేదు. కిరాటుల విషయము ప్రత్యేకముగ చెప్పుచున్నాడు. అదియును కర్ణాట కిరాటుని గూర్చి. అట్లే మనుజేశ్వరాధముల కిచ్చి, కాలు, చే, సమ్మెట వేటులన్ బడుట ఒప్పననుట. అయితే మనుజపతులకిచ్చి అంత్యమున ఇడుములు పడినవాడు శ్రీనాథుడు. అంతేగాక కూళలైన వారి కిచ్చుట కంటె, హాలికులైన నేమి. అడవుల కందమూలముల నేరికున్న మేలెయనుట. ఇది పోతన నిసర్గ లక్షణము. శ్రీనాథునికి సమీప కాలమువాడు, లేక సమకాలమువాడు పోతన. శ్రీనాథుని యావద్వృత్తాంతము తెలిసిన పోతన పై విధముల ననియుండుటకు అవకాశము గలదు గదా! మరియొకమాట. శ్రీనాథునివలెనే తనభాషను గూర్చి పేర్కొనినవాడు పోతన.

20 కొందరకు తెలుగు గుణమగు
గొందరకును సంస్కృతంబు గుణమగు, రెండుం
గొందరకు గుణములగు, నే
నందరమెప్పింతు గృతుల నయ్యైయెడలన్.

ఇది శ్రీనాథుని

21 ప్రౌఢిబరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష యందు
రెవ్వరేమన్న నండ్రుగాకేల కొరత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష

యను దానికి ప్రతిబింబముగ రచించినట్లు భాసించుచున్నది గదా? పోతన అట్లేల యనవలసి వచ్చినది. శ్రీనాథుని వలె (రాజమహేంద్రమునందు) సమకాలపు పండితుల నిరసనమున కతడు గురియైనట్లు సాక్ష్యము లేదు. మరి కారణమేమై యుండును. శ్రీనాథుడు ఆంధ్రమునందలి ఒకానొక మాండలికము తన భాషయని చెప్పి కొనగా, పోతన అట్లుగాక, కొందరికి ఒకటి గుణము, మరి కొందరికి మరియొకటి గుణము. తానందరిని మెప్పింతును. ఎవరి నిరసనమునకు గురికానని పరోక్షముగ శ్రీనాథుని మనమునందిడు కొని, చెప్పినటుల స్పష్టమగుచున్నది గదా! కావున, పై యుపపత్తులవలన, పై పద్యములు చెప్పుట కాస్కారమున్న వ్యక్తి పోతనామాత్యుడని స్పష్టమగుచున్నది. లోకవ్యవహారమును దానినే సమర్థించుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. చూ॥ శ్రీ మహాభాగవతము. పీఠిక. బులుసు వేంకటరమణయ్యగారు. టాగూర్ పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 7.
2. పైదే.
3. శ్రీనాథుని భీమఖండము
4. దక్షిణ కాశికావ్యాఖ్యానము - శ్రీనాథమహాకవి విరచిత శ్రీ భీమేశ్వర పురాణము. పీఠిక. పుట Xiii. డా. గుండవరపు లక్ష్మీనారాయణగారు. ప్రచురణ, గుంటూరు 1997.
5. శృంగారనైషధము : ఉపోద్ఘాతము పుట 39, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు - 4. 1967.
6. క్రీడాభిరామము. పద్య సంఖ్యలు : 78, 93, 102, 182, 227, 263, 279, ఎమెస్కో ప్రచురణ. 1972.
7. క్రీడాభిరామము పద్యసంఖ్య : 51, 125, 155, పై ప్రచురణ.
8. పైదే : వచనము 113; పై ప్రచురణ.
9. హరవిలాసము : వచనము 1, కథాభాగము, ప్రథమాశ్వాసము. వావిళ్ళ వారి ప్రచురణ 1966.
10. హరవిలాసము : పద్య సంఖ్య 25, పీఠిక భాగము. వావిళ్ళవారి ప్రచురణ 1966.
11. 1-23 భీమఖండము శ్రీనాథుడు.
12. 1-15 పైది
13. 1-7 కాశీఖండము, శ్రీనాథుడు.
14. పుటలు 126, 127, గ్లోసరి ఆఫ్ మద్రాస్ ప్రెసిడెన్సీ Ed.. C.D. Maclean.
15. ఆంధ్రకవి తరంగిణి. 5 భాగము. పుట. 11.
16. పద్య సంఖ్య 86, 87, 90 92. క్రీడాభిరామము. ఎమెస్కో ప్రచురణ 1972.
17. పద్య సంఖ్య 95 పైది.
18. పద్య సంఖ్య 101 పైది.
19. 2-54. శివరాత్రి మాహాత్మ్యము. శ్రీనాథుడు.
20. 1-20 శ్రీమహాభాగవతము. టాగూర్ పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 27
21. 1-15 భీమేశ్వర పురాణము, శ్రీనాథుడు.

# పరిచర్య - పరిభాష

చర్య, భాష అనే పదాలపై 'పరి' అనే ఉపసర్గ చేరి పరచర్య, పరిభాష పదాలేర్పడ్డాయి. ఇందులో పరిచర్య శబ్దానికి సేవ, కొలువు, అనే అర్థాలను, పరిభాష శబ్దానికి పదార్థ వివేచనాచార్యుల యొక్క యుక్తి వాక్కు, గ్రంథ సంక్షేప నిర్వాహము కొరకు చేయునట్టి సంకేత విశేషము అనే అర్థాలను శబ్ద రత్నాకరం సూచిస్తోంది. అయితే పరిభాషణము అనే శబ్దానికి నిందాసహితమైన యుపాలంభము, ఆలాపము, నియమము అనే అర్థాలను శబ్దరత్నాకర కారులు సూచించారు. పరిచర్య శబ్దానికి కౌగిలి అనే అర్థాన్ని మరో నిఘంటువు సూచిస్తోంది.

పై శబ్దాల్లో పరిచర్యకు సేవ, కొలువు, ఉపచారము అనే అర్థాలు, పరిభాష శబ్దానికి, సంకేత విశేషము (పారిభాషిక) అనే అర్థాలు లోకంలో రూఢిని పొందాయి. పరిచర్య శబ్దాన్ని నన్నయ సేవ, ఉపచారము అనే అర్థాల్లో ఉపయోగించారు. (ఆదిపర్వము, 2-33). కాని భోజరాజీయ కర్త అనంతామాత్యుడు పై శబ్దాలను ప్రయోగించిన తీరు వేరు. అతడు పరిచర్య శబ్దాన్ని సురతమనే భావనలోను, పరిభాష శబ్దాన్ని వాగ్దానమనే అర్థంలోను ప్రయోగించారు. అయితే పరిచర్య శబ్దాన్ని కౌగిలి అని నిఘంటుకారులు సూచించిన భావనలో, అనంతామాత్యుని ప్రయోగాన్ని సమసింపచేయరాదా అనే శంక కలుగవచ్చు. కాని సందర్భం నిర్దిష్టమైన భావన నిస్తున్నప్పుడు సమసింప చేయడం కంటె సమసించిన భావనను గ్రహించడమే మేలుకదా! అనంతామాత్యుడు ప్రయోగించిన తీరు తీయములిట్టివి.

సత్యవాక్యపాలనావసరాన్ని, దాని పారమ్యాన్ని ప్రకటించడాని కుద్భవించిన కావ్యం భోజరాజీయం. అందులో భాగంగా నాలుగో ఆశ్వాసంలో మదనరేఖ కథ కథనంగా వింపబడింది. కథా సందర్భమిది. మగధ దేశాన్నేలే రాజు అంభీరుడు. అతనికొక కొడుకు, ఒక కుమార్తె. కుమార్తె పేరు మదనరేఖ. కావ్యనాటకాలంకారాలు గురు సన్నిధిలో అభ్యసిస్తోంది. కాలంమీదట పరువం మీద పడింది. ఒకనాడు

గురుపుత్రుడామెను కాంక్షించి, సహపాఠులందరు వెళ్లిన తరువాత, ఆమెను ఏకాంతమందిరానికి తెచ్చాడు. వాడి కళలు గుర్తెరిగి 'ఈ దౌష్ట్యము నీకు తగునా! నా తండ్రికి తెలిస్తే నిన్ను క్షమిస్తాడా! పై వాళ్ళు ఏమనుకుంటారు. కోరిక ఉంటే అగ్ని సాక్షిగా వివాహమాడాలి తప్ప, ఊరక కన్యాత్వాన్ని వృథ పుచ్చడం ధర్మమా! ఇది నీకు తగదన్నది. అయితే వాడూరు కుంటాడా! తృక్కరణోన్మాదబలిమి ఊరకుండ నిస్తుందా! 'నిన్నీవేళ పొందకుండా వదుల్తానా' అంటూ వస్త్రాపహరణానికి పూనుకున్నాడు. అంతట ఆమె 'ఓహో! చాల మంచివాడవే! ఏదో గురుపుత్రుడ వని మాటలతో పోనిచ్చినందుకు మర్యాద మీరుతున్నావు. నీ చెనటి రంతులన్నీ ఇంటివారికి చెపుతాను. చూడు' అని ఆమె అనడమేమి. అతడు మూర్ఛపోవడమేమి, రెండూ ఏకకాలంలో జరిగిపోయాయి. అలా పడిపోయిన వాడికి శ్వాస ఆడుతోందో లేదోనని చూసింది. వాడికి ప్రాణం కడబట్టింది. అప్పుడామె ఇలా అనుకుంది. 'ఇదెంతటి ఘోరం. నేరక - సద్బ్రాహ్మణుడు - ఈ స్థితిలో ఉండడానికి కారణమైనాను. నిజమేగదా! కాముశక్తి నోర్వంగగలరె జనులు! చంద్రుడు గురుపత్నిని, ఇంద్రుడు మునిపత్నిని, పరాశరుడోడరేవు పడతిని మరిగారంటే, ఇతరుల సంగతికేమి. ఇతగాడు నావలన మరణిస్తే... అదెంత పాపమో గదా! కాదని, ఇతని ఇచ్ఛానువర్తనినై ప్రవర్తిస్తే, కులంలో ఎంత హీనత! కర్తవ్యమేమిటి' అని కొంతసేపు ఆలోచించి, వలసిన ఉపచారాలు చేసి, ఎలాగో అతనిని కొంత స్వస్థునిచేసి 'కళ్ళు తెరచిచూడు! నామీద నీకింత వేడుక వుందా! అది ఎంతటిది గనుక! ఏదో - నవ్వులాటకలా అన్నాను. నీ మనసు నొప్పించాను. అంత దయాధర్మంలేని దాన ననుకున్నావా! అయినా ఇంత మాత్రానికే నీవిలా అవుతావని నేనెలా భావించగలను, చూడు', అని కొంత సముదాయించింది. దానికి వాడు తేరుకుని నా మీద నీకు గల ఆదరణ వలన బ్రతికిపోయాను. అంటూ మళ్లీ మొదటికి వచ్చాడు. అయితే ఆమె నిబ్బరంతో 'నేను, అవునన్నాను గదా! ఇంక నీకింత తొందర యెందుకు. నేనొక మాట చెపుతాను. చెప్పడంగాదు. నిన్ను వేడుకుంటున్నాను. దానిని నీవు కాదనకుండా అవుననాలి. అపుడు నీ మనసుకు నచ్చినట్లు నేను వర్తిస్తాను' అన్నదామె.

'ఓ-దానికేం. నీకేంకావాలో కోరుకో - ధనంకావాలో! లేదా నా ప్రాణం కావాలో - నీ ఇష్టం' అన్నాడు వాడు. తార్తీయ పురుషార్థాసక్తి అంతటి బలీయమైనది. కాకపోతే అతని పలుకులో వివేక మేపాటి వుంది. రాచబిడ్డకు ధనమిస్తానంటాడా! వాడే, రాజ పరిరక్షితుడు గదా! ప్రాణమైనా ఇస్తానంటాడు. ఒక్క క్షణానికి పూర్వం, పై వారికి చెప్తాను చూడు - అన్నంతమాత్రాన, యమసదనపు దరిదాపులకు వెళ్లివచ్చినవాడు. నిజమే. ఇది వివేకం ప్రవర్తించే సందర్భం కాదు. వాడేనన్నమాటేమిటి. ఎవడైనా అంతే. కాకపోతే

దుష్యంతుడంతటివాడు, ఆదిక్షత్ర చరిత్ర నేలినంతటివాడు, `నీ వలన నాకుద్భవించే వానికి యౌవరాజ్యాభిషేకం గావించాలని శకుంతల అంటే మారుమాటాడకుండా, మరోమాట లేకుండా, అలాగే నన్నాడంటే దేని బలిమి అనుకోవాలి. యుక్తాయుక్త విచక్షణకులోనై అలాగే ననడానికి బదులు అలాగా అంటే, మళ్లీ మనమే అంటాము, అతడు తృతీయ ప్రకృతి అని. సరే ఆ మాటకేమి. ప్రకృతము గమనిద్దాము.

ఆమాటకు ఆమె అన్నదిగదా! `ధనమూ అడగను. నీ ప్రాణమూ వద్దు! కాదంటే నాకు వివాహమైన మీదట, నా భర్తను కలవక పూర్వమే నేను నీవద్దకు వచ్చి నీ కోరిక చెల్లిస్తాను. దీని కొక్కదానికి ఒడబడమన్నది. దానికతడు ఏదో అనడం, ఆమె నచ్చబలకడం, చివరికాతడు ఒడబడడం జరిగింది. కాలంమీదట ఆమెకు వివాహమైనది. ప్రథమ సమాగమానికి భర్త కబురు పంపాడు. గురుపుత్రునికి చేసిన బాస ఈమె మనసులో మెదిలింది. త్రోపుసేయరాదు. ఏదిదారి. ఎవరితో చెప్పికోవాలి. మొదలొకరితో చెప్పికొనదగు విషయమా! చెప్పికొన్నను, ఎవరేమి చెప్పగలరు. ఏమి చేయగలరు. భర్త అనుమతి లేక దీనిని పొసగించుట ఎట్లు. అట్లయిన, గురుపుత్రునికి చేసిన బాసనే త్రోపు చేయవచ్చును. ఆమె నైజమట్టిది కాదుగదా! ఎంతో మథనపడి, చివరకు, ఏమికానున్న అదే కాగలదని నిశ్చయించి, భర్తకు యావద్విషయం విన్నవించదలచింది. విన్నవించింది.

ఇక్కడ అనంతామాత్యుడు ఆమెచేత పలికించిన పలుకులివి. 'దేవా! యే నొక్క విన్నపంబుచేసెద నది యుక్తంబైన, నయుక్తంబైన నీ కనుగ్రహింపకపోరాదు' అవధరింపుమని, గురుపుత్రు నభిలాష, దాని కామె కోపగించుట, అతడు మూర్ఛిల్లుట' ఆ కారణంబున బ్రహ్మహత్య సిద్ధించె. నేనేమి సేయుదునని తల్లడించి యతని బోధించుటకై తత్సమయ సముచిత వచనంబుల నుపచరింప బెద్దయుంబ్రొద్దునకు నతండు దైవాధీనంబున చైతన్యంబు నొంది క్రమ్మర తనతో 'పరిచర్య చేయందలంచి' నప్పుడప్పాపు దప్పింప నొండు దెరవు దొరకొనమి' అప్పటి కలా పలకవలసి వచ్చినదని, కావున, ఏతత్ వాగ్దానంబు సఫలము గావించుటకు అనుమతిని వేడినది. ఈ సందర్భంలో ప్రయుక్తమైన `తనతో పరిచర్య సేయంబోవ అనడంలోని పరిచర్య శబ్దానికి, రూఢ్యర్థాలైన సేవ, కొలువు లేక కౌగిలి అనే భావనలు సరిపోలునేమో సహృదయులు గమనించునది. ఉపచారమనే భావము మొదలే సరిపోలదు. కారణమే మంటే ఆ శబ్దాన్ని అదే అర్థంలో (ఉపచరించు) అదే సందర్భంలో సముచిత వచనంబుల నుపచరింప అని ఉపచార శబ్దాన్ని ప్రయుక్తం గావించడం జరగింది.

ఇక మిగిలిన భావం స్పష్టమే. అది గురుపుత్రుని అభిలాష. అది ఆమె తోడి సంగమం. నిజానికి పరిచర్య శబ్దానికి, ఆ మాటకొస్తే 'చర్' ధాతువుకే సంస్కృతంలో ఆ అర్థాలున్నాయి. తెలుగున అర్థ విపరిణామం పొంది, వేరు అర్థాల్లో రూఢమైంది.

ఇక 'పరిభాష'. పై వచనం తరువాత గల పద్యంలో ఈ శబ్దం రెండు పర్యాయాలు ప్రయుక్తమైంది. అలా భర్తకు చెప్తున్న సందర్భంలోనే - దానికి కొనసాగింపుగా ఆడుబిడ్డ కన్యాత్వాన్ని కోల్పోవడం అపకీర్తిగాని, భర్త అనుమతితో చేసేపని, ఎలాగైనా మేలైనదే గదా అనే భావంతో నేనప్పుడతనికి అలా పరిభాష చేశాను. ఇప్పుడు నీవు అనుమతించకపోతే, ఆ పరిభాషకు తప్పిన దాననవుతాను. భార్య చేసిన దోషం భర్త కంటుతుంది. మీదిది నీ చిత్తము' అని చెప్పే సందర్భంలో రెండుమారులు ప్రయుక్తమైన తీరు, పరిభాష శబ్దానికి వాగ్దానమనే అర్థాన్ని స్థిరపరుస్తున్నాయి. పరిభాష శబ్దానికి సంస్కృతంలో to declare అనే అర్థం వుంది. మొదలు భాష అనే శబ్దానికి, కేవలం వచించు అనే అర్థం మాత్రమే కాక, బుద్ధిపూర్వకంగా వచించు, నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పు అనే అర్థాలున్నాయి. ఈ రెండింటి భావం వాగ్దానమే గదా! రూఢ్యర్థాన్ని మించి, సహజార్థాన్ని - వాడుక మరుగైనదానిని, సందర్భోచితంగా ప్రయోగించడం ప్రతి భావ్యుత్పత్తులు సమంగా కలిగిన కవి మాత్రమే చేయగలడు. దీనినే శబ్దాధికార మంటారు. అది పుష్కలంగా కలిగిన కొద్దిమంది తెలుగు కవులలో అనంతామాత్యుడొకడు.



# ఒకరా

ఒకరా, ఇద్దరా అనే సంశయార్థక ప్రశ్నలోనిది కాదిది. అలాగని కేవలం రేఫ అను బోధ కూడ కాదు. 'ఒకరా' అంతా ఒకే పదం. అయితే తెలుగు పదం కాదు. కాని సాహితీ ప్రియులంతా మక్కువతో చదువుకునే అహల్యాసంక్రందనం లోనిదీ ప్రయోగం. ఏతత్కర్త సముఖము వేంకట కృష్ణప్పనాయుడు. ఈ కావ్యం వెలసినచోటు మధుర. తమిళుల ఉచ్చారణలో, మధురై. కావ్యంలో ఏ తత్కావ్యకర్త నివసిస్తున్నచోటికి సంబంధించిన పదాలు చోటు చేసికోవడం వింతకాదు. కాని తెలుగు కావ్యంలో ప్రయోగింపబడినపుడు తెలుగు నిఘంటువులలో చోటు చేసికోకపోవడం విచార్యం. పై పదాని కాకరమైన పద్యమిది.

పదియార్వన్నియ రెక్కపక్కినొకరా బాబా వజీరుండు సాం
ద్ర దయాంగీకృత యౌవరాజ్యభరతన్ రక్షింప లోకత్రయీ
విదితంబై యమరావతీ పురము శోభిల్లున్ వియద్వాహినీ
మృదు వాతూలవినీత దివ్యయువతీ క్రీడా పరిశ్రాంతియై

కావ్య కథానాయకుడైన ఇంద్రుని రాజధాని అమరావతి వైభవాన్ని వివరిస్తూ చెప్పిన సందర్భంలోనిదీ పద్యం. అంగీకృత యువరాజ ఠీవితో, నిండిన దయతో, ఒకానొక వజీరుడు రక్షిస్తూవుండగా, మూడు లోకాలలో ప్రకాశమానమై, వాతూల వినీత దివ్య యువతీ క్రీడా పరిశ్రాంతియై అమరావతీ పట్టణం శోభిల్లుతోందని పద్యభావం. మరి ఆ వజీరుడెవరు. ఎవరంటే పదియార్వన్నియరెక్క పక్కి నొకరా బాబావజీరుడు. బాబా పదాని కర్థం గుఱ్ఱమని తెలిసిందే. అయితే ఇక్కడ కేవలం గుఱ్ఱమని కాక వాహన మని గ్రహించాలి. మరి ఆ వాహనమేదంటే పదియార్వన్నియ రెక్కపక్కినొకరా! పదియార్వన్నియ రెక్కపక్కియేది. అది ఒకరా ఎలా అయింది. ఏ పక్షి రెక్కలు పదహారు వన్నెల్లో వుంటాయి. ఈ ప్రశ్నలిలావుండగా 'పదియార్వన్నియ రెక్క పక్కిన్' అని ద్వితీయాంతంగా వుండడం వలన మరికొంత అన్వయకాఠిన్యం.

నిజానికిక్కడ ద్వితీయకు ప్రసక్తలేదు. ఇది కేవలం అర్థం బోధపడక చేసినదిగా బోధపడుతుంది. 'పదియార్వన్నియ రెక్కపక్కి' అనే పదబంధం మొత్తం ఒకరా అనే దానికి విశేషణం. పదహారు వన్నెలు గల రెక్కలు గల పక్షి 'ఒకరా' అనే దానిని వాహనంగా గల వజీరుని సంరక్షణంలో ఉన్నది అమరావతి యని కావ్యకర్త అభిప్రాయం. ఇప్పుడు అర్థం స్పష్టమే. దేవ సేనాధిపతి కుమారస్వామి. అతని రక్షణలో వుంది అమరావతి. అతని వాహనం నెమలి. నెమలి రెక్కలు బహువర్ణ సమ్మిశ్రమం. సాధారణంగా పదహారు శబ్దాన్ని, బహు సంఖ్యాకమనే అర్థంలో ప్రయోగించడముంది. చాలసార్లు చెప్పాను అనే అర్థంలో పదహారుసార్లు చెప్పాను అనడం కద్దు. అయినా ఇక్కడ బహు సంఖ్యాకం అనే అర్థం కాక, నిజార్థంలోనే ప్రయోగించడం జరిగింది. ఈసారెప్పుడైనా నెమలిని పరికించి చూడండి. అందలి వర్ణభేదాలను గమనించండి. అయితే ఇంతకూ నెమలి ఒకరా ఎలా అయింది.

నెమలి పంచపక్షుల్లో ఒకటి. డేగ, గూబ, కాకి, కోడి, నెమలి అనేవి పంచపక్షులు. అ,ఇ,ఉ,ఎ,ఒ అనే వర్ణాలు పై ఐదింటికి సంకేతాక్షరాలు. 'ఒ' అనేది నెమలికి సంకేతాక్షరం. కనుకనే కుమారస్వామికి వాహనమైన నెమలిని సంకేతిస్తూ, తమిళులు ఓ కారాన్ని (తమిళలిపిలో) బొమ్మల్లో ముద్రిస్తుంటారు. ఇక ఇక్కడ ఒకరా అనే పదం ఓకారానికి సంకేతం. ఇలా సంకేతించడం వెంకటకృష్ణప్ప నాయడు చేసినది గాదు. తమిళులు నెమలిని 'ఒకరం'గా సంభావిస్తారు. (చూడు Tamil Lexicon) దానినే గ్రహించాడు కావ్యకర్త. కావ్యం పుట్టింది తమిళనాట కనుక, అక్కడి సంప్రదాయాలు చోటు చేసికోవడంలో వింతలేదు. పై పంచపక్షుల్లో నాలుగింటిని శకున పక్షులుగా సంభావించిన తీరు క్రీడాభిరామములో కన్పిస్తుంది.

కొనకొనంగోడి యేట్రింత కొంకనక్క
నమలి యీ నాలుగింటి దర్శనంబు లెస్స
వీనివల తీరుఁబలుకునుర్వీజనులకుఁ
గొంగు బంగారమండ్రు శాకునిక వరులు



# తెలుగువారి ఊళ్ళపేర్లు

గ్రామనామాధ్యయనం నామవిజ్ఞానశాస్త్రంలో ఒక భాగం. గృహనామాధ్యయనం, వ్యక్తి నామాధ్యయనం, పశుపక్ష్యాది ప్రాణికోటికి సంబంధించిన నామాధ్యయనం, మానవకల్పిత వస్తుసముదాయానికి చెందిన నామశాస్త్రాధ్యయనం అనేవి నామ విజ్ఞానశాస్త్రంలోని ఇతర భాగాలు. ఇది భారతదేశంలో ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న విజ్ఞానశాస్త్రం. నాగార్జున విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగులో ఈ శాస్త్రం ఒక ఐచ్ఛిక విషయంగా బోధింపబడింది. గ్రామ నామాలను గూర్చి, తద్వారా గ్రామనామాధ్యయన ఆవశ్యకాన్ని తెలియజెప్పడం ఈవ్యాస లక్ష్యం.

సాధారణంగా జనావాసాలను గ్రామాలని, ఊళ్లనీ సంభావిస్తూ వుంటాము. కాని ఇది సరికాదు. సంస్కృత శబ్దమైన గ్రామానికి, ప్రాకృత శబ్దమైన ఊరికి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. అవి కలిగిన జనావాసాలనే గ్రామాలుగా, ఊళ్లుగా సంభావించాలి. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో గ్రామాన్ని ఇలా నిర్వచించాడు. జనావాసంలో కనీసం 500ల కుటుంబాలుండాలని, అందులో ముఖ్యంగా వ్యవసాయ కుటుంబాలధికంగా వుండాలని, చేతివృత్తులవారు వుండాలని, స్వయంపోషకంగా ఉంటూ, దగ్గరి నగరానికి వ్యవసాయోత్పత్తులను, పాడి ఉత్పత్తులను సరఫరా చేయగలిగిన స్థితిలో ఉండాలని నిర్దేశించాడు. ప్రభువులు కొత్తగా గ్రామాలను నిర్మించేటపుడు పై లక్షణాలను దృష్టిలో పెట్టుకుని, అవసరమైతే కొన్ని కుటుంబాలను క్రొత్తగా నిర్మించిన గ్రామాలకు తరలించాలని సూచించాడు. సుమతీ శతకకారుడు కూడా అన్యాపదేశంగా దేనిని ఊరని సంభావించవచ్చునో నిర్దేశించాడు. 'అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎడతెగక పాఱునేరును ద్విజుడును చొప్పడిన ఊరనుండుము, చొప్పడకున్నట్టి ఊరు చొరకుము' అని అంటాడు. ఇక్కడ ఆయన ఊరు అనేదాన్ని జనావాసం అనే సామాన్యార్థంలోనే ఉపయోగించాడు. అయితే ఆ లక్షణాలున్న దానినే ఊరు అనడం సమంజసం. కాని 'ఊరు' అర్థంవేరు. శివాలయం లేని జనావాసాన్ని

'కొట్టిక' అని అనాలని మన నిఘంటుకారులు నిర్దేశించారు. ఈ అవగాహనతో పరిశీలించినపుడు జనావాసాలన్నీ ఊళ్లు కావని తేలుతుంది. కోడూరు, మేడూరు, తిరువూరు మొదలైనవి మాత్రమే ఊళ్లు. పురాలు, నగరాలు, ఆబాద్‌లు (నరసాపురం, విజయనగరం, హైదరాబాదు) - ఈ పదాలకు నిఘంటువుల్లో అర్థాలు దొరుకుతాయి. పూడి (పారుపూడి), తుర్రు (మొగిలితుర్రు), కుర్రు (కేసనకుర్రు), పల్లె (చల్లపల్లె), పాడు (గూడపాడు), పెంట (పాచిపెంట) మొదలైన - గ్రామనామాలలో కన్పించే పదాలకు గ్రామనామ సంబంధంగా నిఘంటువుల్లో అర్థాలు కన్పింపవు. వీటిని మరికొంత వివరంగా పరిశీలిద్దాం.

తెలుగునాట సుమారుగా 27వేల రెవిన్యూ గ్రామాలున్నాయి. దాదాపుగా అంతే సంఖ్యలో వాటికి శివారుగ్రామాలున్నాయి. అన్నింటికి పేర్లున్నాయి. కొన్ని సందర్భాలలో ఒకే పేరు కలిగిన జనావాసాలు రెంటికి మించిన సంఖ్యలో కూడా లేకపోలేదు. ప్రతిమనిషికి పేరున్నట్లే ప్రతి జనావాసానికి పేరుంది. పేరనేది గుర్తింపు కోసం ఏర్పడింది. అయితే ఈ పేర్లు పెట్టడంలో కొన్ని అంతరువులున్నాయి. మనుషులందరికి పేర్లున్నాయి. మానవ జనావాసాలన్నింటికి పేర్లున్నాయి. కాని జంతుకోటికి, వృక్షకోటికి, అలా పేర్లులేవు. పులులు, పిల్లులు, చింతచెట్లు, మామిడిచెట్లు, కాకులు, నెమళ్లు, కుర్చీలు, బల్లలు అని అంటున్నామే తప్ప ఆ తరగతిలోని ప్రతి జంతువుకు, ప్రతి చెట్టుకు, ప్రతి వస్తువుకు విడివిడిగా పేర్లులేవు. దీనికి కారణం మనిషికి మనిషికి ఉండే సంక్లిష్టమైనవి సంబంధాలు. ఈ సంబంధాల నుండే ప్రతి వ్యక్తిని గుర్తింప వలసిన ఆవశ్యకమేర్పడింది. అందుండే పేరు ఏర్పడింది. మనుష్యులు ఏ ఇద్దరో, ముగ్గురో, నలుగురో వుండివుంటే పేరుతో పనిలేదు. అదేవిధంగా జనావాసాలు కూడా నియమితంగా వుంటే పేర్లతో పనిలేదు. జనంతోపాటు జనావాసాలు అధికం కావడంతో ఒకదానినుండి మరొకదానిని వివక్ష చేయవలసి రావడంతో ప్రతిదానికి పేరు ఏర్పడింది. అందువల్లనే ఒకటి చల్లపల్లె అయితే మరొకటి కళ్లేపల్లి అయింది. ఇక్కడ రెండూ పల్లెలే. కాని ఒకటి చల్ల-పల్లె, రెండవది కళ్లే-పల్లె, మరొకటి ముని-పల్లె, ఇక్కడ- పల్లె, అనేది జనావాసాన్ని సూచించేపదం. చల్ల, కళ్లే-, ముని - అనేవి, అనేకంగా వున్న - పల్లె అనే జనావాసాలను వివక్ష చేస్తున్నాయి. అయితే అన్నీ పల్లెలు కావు. కొన్ని పట్టణాలు, కొన్ని తుర్రులు, మరికొన్ని కుర్రులు, ఈ విధంగా జనావాసాలను సూచించే పేర్లలో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది.

ప్రతి గ్రామనామంలోను సాధారణంగా రెండుపదాలుంటాయి. కొన్ని సందర్భాలలో మూడు నాలుగు పదాలున్నవి కూడ లేకపోలేదు. రెండుపదాల కలయిక:

నీరు - కొండ, పారు - పూడి; మూడు పదాల కలయిక: తూర్పు - లంక- ప
దొంగల - గన్న-వరం; చెరువు- మాధవ - వరం; నాలుగు పదాలు గలవి; నీళ్లు - 
- తిమ్మా -పురం; భుజ-భుజ- నెల్లూరు (నెల్లు - ఊరు); ఒకే పదం గలవి: దర్శి; 
కంభం; నగరం; చీకటి మొదలైనవి.

రెండుపదాలు కలిగిన గ్రామనామాలలో ఉత్తరపదాలకు (-పూడి, - ప
- తుర్రు), పూర్వపదాలు విశేషాలుగా ఉపకరిస్తున్నాయి. ఉదా: పారుపూడి; జబర్లపూ
కత్తిపూడి అనే గ్రామనామాల్లో - పూడి అనేది ఉత్తరపదం. కాగా పారు-, జబర్ల, - క
అనేవి దానిపై విశేషణాలుగా చేరి మూడు స్వతంత్రగ్రామాలకు పేర్లుగా సిద్ధించా
ఈ నేపథ్యంలో ఈ క్రింది గ్రామనామాలను పరిశీలించండి.

కళింగపట్నం, విశాఖపట్నం, నిజాంపట్నం, మచిలీపట్నం;
మేడూరు, కోడూరు, తుళ్లూరు.
కప్తానుపాలెం, చోడిపాలెం.
నరసంపాలెం, వెంకటపాలెం.
పసుమర్రు, పామర్రు, యలమర్రు.
కోగల్లు, మాగల్లు, చాగల్లు, ఈడుపుగల్లు.
విజయవాడ, నందివాడ, మర్రివాడ.
నరసాపురం, కృష్ణాపురం, పండితాపురం.
కసుకుర్రు, ఇక్కుర్రు, పాలకుర్రు.
తుంగతుర్రు, మొగలితుర్రు.
ఈలప్రోలు, పెదప్రోలు.

ఇట్లా ఎన్నో చెప్పవచ్చు. కేవలం ఏదో ఒకపేరు పెట్టడమే లక్ష్యమై
ఉత్తరపదంగా కన్పిస్తున్న వాటిలో ఏదో ఒక పదంపై విశేషణాలు అనేకంగా చేర్
జనావాసాలకు పేర్లు ఏర్పడి ఉండేవి. అలాకాక, పూర్వపదంలో వైవిధ
పాటించడమేకాక ఉత్తరపదంలో కూడ వైవిధ్యాన్ని పాటించారంటే మన ప్రాచీన
ఉద్దేశం కేవలం ఏదో ఒక పేరు పెట్టడంకాదని బోధపడుతుంది. అంటే అవి కేవ
జనావాసాలనే కాక ఆ జనావాసాల్లో వున్న వివిధ తరగతులను, వైరుధ్యాల
బోధిస్తున్నాయని అర్థం. ఆ పదాల అర్థం తెలిస్తే ఆ వైవిధ్యం బోధపడుతుంది. పే
పెట్టడంలో మన ప్రాచీనుల భావాలు తెలియవస్తాయి. తెలుగు గ్రామనామాల్లో కన్పి
ఈ వైవిధ్యాన్ని పరిశీలించండి.

-కొండ (నీరుకొండ)
- గుంట (త్రోవగుంట)
-కాలువ (కాటిగాని కాలువ)
- చెరువు (మేళ్లచెరువు)
- కట్టుబడి (అధ్వాన్నం నారాయణకట్టుబడి)
- కుంట (యాతాలకుంట)
- కొం(డలు (చేబ్రోలు ఫీరప్పకొం(డలు)
- కటకం (ధాన్యకటకం)
- వరం (గన్నవరం)
- ఏరు (పాలేరు)
- మడక (పూడిమడక)
- దొరువు (పూడిరాయని దొరువు)
- రేవు (వాడరేవు)
- రాల (దుగ్గిరాల)
- బండ (గాజులబండ)
- తిప్ప (నాగాయతిప్ప)
- లోవ (ముడసరలోవ)
- లంక (కృష్ణలంక)
- గడ్డ (పులిగడ్డ)
- కోట (దేవరకోట)
- త్రోవ (తలుపులమ్మత్రోవ)
- నరవ (బెడుదుల నరవ)
-గుండం (మోక్షగుండం)
- తోట (మల్లెతోట)
- వనం (తులసివనం)
- బయలు (గుర్రాలబయలు)
- మంద (ఆవులమంద)
- పెంట (వనిపెంట)
- వాకిలి (యాటవాకిలి)
- కడప (దేవునికడప)
-దరి (పెన్నదరి)
- మామిడి (దొరమామిడి)
- మడుగు (గుండ్లమడుగు)
- సముద్రం (తిమ్మసముద్రం)
-వాడ (విజయవాడ)
-మెట్ట (దిగువమెట్ట)
-వంపు (నదివంపు)
-పాలెం (కృష్ణాయపాలెం)
- అంకి (పోరంకి)
-రాయి (విజయరాయి)
-ముక్కల (నిడుముక్కల)
-పట్టు (పూతలపట్టు)
- శాత్తు (పరమశాత్తు)
-కాణి (వరగాణి)

ఇందులో ఏవో కొన్ని తప్ప మిగిలినవి సులభంగానే బోధపడుతున్నాయి. కటకం, అడవిలో వుండే పల్లెను సూచిస్తుంది. నరవ, కొండ త్రోవలో వుండే జనపదాన్ని సూచిస్తుంది. పై పదాలకు ఉదాహరణంగా చూపిన గ్రామనామాలను ప్రత్యక్షంగా చూచినవారికి, ఆయా గ్రామాలు, ఆయా పదాలు సూచిస్తున్న పరిసరాలలోనే ఉన్నాయనేది తెలుసు.

దీనినిబట్టి మన ప్రాచీనులు తమ జనావాసాలకు పేర్లు పెట్టడంలో స్థానిక నైసర్గిక స్థితిగతులకు ఎంతో ప్రాధాన్యమిచ్చినట్లు తెలుస్తుంది. -పూడి, -పఱ్ఱు, -తుఱ్ఱు, -కుఱ్ఱు మొదలైన పదాలకు నిఘంటువుల్లో అర్థాలు కన్పింపవు. పూడి అనేది వాగులు

వంకలు మొదలైన ప్రవాహాల ప్రక్కన, ఆ ప్రవాహాలకు ఏ మాత్రం వరదవచ్చినా మునిగిపోయే చోట కన్పిస్తుంది. నేడు కాల బోధకంగా ఉపయోగిస్తున్న సామెత 'ఏండ్లు పూండ్లు గడిచా' యనేది నిజానికి ఆ అర్థంలో వచ్చింది కాదు. ఏండ్లు, పూండ్లు గడవడం అంటే ఏరులు అంటే నదులు, పూండ్లు అంటే బురదనేలలు దాటి వచ్చామనేది అసలైన అర్థం. కాని ఈ అర్థం పెద్దన నాటికే మాసిపోయింది. పఱ్ఱు, పై స్థితికంటే ఎత్తైన భూభాగానికి వర్తిస్తుంది. తుఱ్ఱు, కుఱ్ఱు అనేవి పఱ్ఱుకంటే ఎత్తైన భూభాగాలను, ఇసుక, నల్లరేగడి కలిసిన భూములను సూచిస్తాయి. ఈ అనుబంధాలతో కూడిన గ్రామాలన్నీ, పై వివరించిన పరిసరాల్లోనే నెలకొని వుండడం గమనార్హం. రావికంపాడు, పోలకంపాడు మొదలైన గ్రామనామాల్లో కన్పిస్తున్న 'కమ్మ' కు నది అని అర్థం. గుండ్లకమ్మ మనం ఎరిగినదే. కృష్ణానదికి 'పేరకమ్మ' అనేది అచ్చపు తెనుగు పేరు. ఈ రెండు కమ్మలకు మధ్యవున్న నాడు 'కమ్మనాడు'. 'కమ్మగుట్టు గడపదాటదు' అనే సామెతను కమ్మవారి కుటుంబాలలోని గుట్టు గడప దాటి బయటకు రాదనే అర్థంలో వివరించడం పరిపాటి. నిజానికిది సరికాదు. కమ్మనాటి గుట్టు కడప దాటి పోదు అని అర్థం. అంటే పాకనాడు దాటినా, రేనాడు దాటిపోదని అర్థం. 'పెంట' అంటే పశువులను మంద వేసే స్థలం. 'తడ'కు సరిహద్దు అని అర్థం. గుఱ్ఱాల బయలులోని 'బయలు' కర్థం మేతకు వదిలేచోటు అని. పాలెం మొదటి అర్థం, పాలెగాడువుండే చోటు. అనంతరం కాలంలో శివారు అని అర్థంలో రూఢమైంది. పల్లె మొదట బౌద్ధుల నివాసం. పాడు జైనులుండేచోటు. వాడ శాఖానగరానికి పేరు. చెరువు, కుంట, గుంట, కొలను, కుళం, మడుగు, కంభం మొదలైనవి పరిమాణాన్నిబట్టి జలాశయాల్ని సూచించేవి. చీకటి అంధకారం అనే అర్థంలో కాక, చెట్టును సూచిస్తుంది. నెమలి, కాకి కూడ పక్షులపేర్లు కావు. చెట్ల పేర్లే. ప్రోలు, పురానికి వికృతిగా భావించడం కద్దు. కాని ప్రోలు దేశ్యపదం. ప్రభుత్వ ఖజానా వుండే చోటు. దానిమీది అధికారి ప్రోలయ. తరువాత వ్యక్తి నామంగా మారింది. చీరాల, పేరాల, గూటాల, కడియాల మొదలైనవానిలోని 'అల' గడ్డిజాతికి చెందిన మొక్క. ఆకూ అలము అనడం మన ఎరుకలోనిదే. 'గడ్డ' ఏటి ఒడ్డున వున్న ఎత్తైన భూభాగాన్ని సూచిస్తుంది. 'లంక' నదీ మధ్యంలోని విశాలమైన భూభాగాన్ని, 'తిప్ప' అంతకంటె తక్కువ పరిమాణంగల భూభాగాన్ని సూచిస్తాయి. పిన్నదరి, వైరదరి ఆయా నదుల తీరాన నెలకొని ఉన్న వైనాన్ని సూచిస్తాయి. 'వరం' అనేది ఒకరి అనుగ్రహంవల్ల పొందిన వరం లాంటిదికాదు. వరాని కర్థం ఒక పెద్దగ్రామంలోని కొంత భూభాగాన్ని విడదీసి ఇచ్చినది. ఆ విడదీయబడిన భూభాగం 'వరం'. అంతేకాని ఇవ్వడమనే క్రియకు సంబంధించినది కాదు. అయితే గన్నవరం, అడవివరం ఇలాంటివికావు. నిజానికవి గనివారం, అడివారం.

చెరువు క్రింది భూమి గనివారం. క్రిందనున్న (సింహాచలం దేవస్థానానికి) భూమి ఆడివారం. వైవాకలోని 'వాక', పాలువాయి లోని 'వాయి' చిన్న ప్రవాహాలను సూచిస్తాయి. వినుకొండ, బెల్లంకొండ, నీరుకొండలలోని 'కొండ' పర్వతసూచే. కాని మానికొండ, పోలుకొండ, కొండపాటూరులలోని 'కొండ' శిలాసూచి కాదు. కొండంగి అనేది గడ్డిజాతి మొక్క. దీనిని బట్టి ఇచ్చట కొండ అనేది మొక్క అని బోధపడుతుంది. ఈ ఉదాహరణలవలన, ముందు చెప్పినట్లుగా, మన ప్రాచీనులు పరిసరాలను దృష్టిలోఉంచుకొని తమ ఆవాసాలకు పేర్లు పెట్టారని అవగతమవుతుంది.

ఇక గ్రామనామాల్లోని ప్రథమ భాగాలను పరిశీలిద్దాం. వీటిలో కూడ చాల వైవిధ్యముంది. వ్యక్తినామాలు, కులనామాలు, వృత్తినామాలు, నైసర్గిక స్థితికి సంబంధించినవి. వృక్షాలపేర్లు, పక్షులపేర్లు, సంఘటనలపేర్లు - ఇలా మానవ నాగరకత, సంస్కృతి వికాసాలు ముడిపడి వున్న అన్ని అంశాలు ఇందులో చోటుచేసికున్నాయి. గ్రామనామాల్లోని వ్యక్తినామాలు ఆ గ్రామాన్ని నిర్మించినవారి పేర, గ్రామాన్ని దానంగా పుచ్చుకొన్నవారి పేర, ప్రముఖులైన వ్యక్తులపేర వస్తుంటాయి. కులాలు, వృత్తులపేర్లు, వారు ముందుగా ఆ చోట నివాసమేర్పరుచుకోవడంవల్ల వస్తాయి (ఉదా: మేదరమెట్ల, బోయగూడెం, బ్రాహ్మణతర్ల, రెడ్డిపాలెం, నాయుడుపేట). జొన్నపాడు, వరికుంట, నేలమామిడి చెలక, తాడికొండ, నెమలికల్లు, తోటకూరపాడు, రావిరేల, మర్రిబంధం, వేములదిన్నె, తుమ్మలపెంట, మద్దిపట్ల, రేణిగుంట, జమ్ములమడక, అవురుపూడి, కొడవటికల్లు, కలిగిరి, కడవకుదురు, చింతమోటు, వెదుళ్లచెరువు, ఈతముక్కల, గొట్టిపాడు, మెంతిదిబ్బ, పెసర్లంక, చాగర్లమూడి, సామర్లకోట, కందిమళ్ల, బెండపూడి, వెణుతురుమిల్లి మొదలైన గ్రామనామాలలోని పూర్వపదాలన్నీ వృక్షజాతి సంబంధులు. ఆవులెన్న, గుఙ్జాలబయలు, ఎడ్లపాడు, తోడేళ్లదిబ్బ, చీమలమర్రి, వింజమూరు మొదలైనవి జంతువులపేర్లను, పక్షులపేర్లను గడ్డిపేర్లను సూచిస్తాయి. 'వింజ' అనేది ఒక నీటిపక్షి దాని ఈకలతో చేసినది వింజామర. పులిగడ్డ, పులివెందుల, పులిప్రొద్దుటూరులలోని 'పులి' జంతువుకాదు. పులి అంటే అనాది బంజరు. బోరుపాలెం, కొండపల్లి, బండమీదపల్లి, లోయ, లాము, నరవ, ఎదురుమొండి, నంగేగడ్డ మొదలైనవి, అవి నెలకొన్న ప్రాంతపు భూస్థితిని వ్యక్తపరుస్తాయి. 'బోరు' శబ్దానికర్థం మధ్యలో ఎత్తుగా వుండి, ఇరువైపులకు వాలివున్న భూస్థితిని సూచిస్తుంది. 'మొండి' భూమి ఆగిపోయిన చోటును సూచిస్తుంది. లాము అంటే కొండ అంచునగల ఆవాసం. నంగే శబ్దానికర్థం రేవు. అయినవోలు, అయినంపూడిలలో గల 'అయిన' శబ్దానికర్థం నదివంపు తిరిగేచోట అభిముఖంగావున్న భూభాగం అని అర్థం.

కొన్ని ఊళ్లపేర్లు, రెండు, మూడుచోట్ల కూడ వుంటాయి. ఇలాంటి సన్నివేశంలో మరికొన్ని విశేషణాలు చేర్చి వాటిని వివక్షచేసిన వైనం కన్పిస్తుంది. ఇక కొన్ని దిక్కులను సూచించేవి. కాగా మరికొన్ని పరిమాణ, పౌర్వాపర్య సూచకాలు. ఉదా: తూర్పులంకపల్లి, పడమటి ఆలేరు, ఎగువతడకర, దిగువమిట్ట, సౌత్‌వల్లూరు, నార్త్‌వల్లూరు, పెదమద్దాలి, కురుమద్దాలి, పాతకురుమద్దాలి కొత్త పెదమద్దాలి మొదలైనవి. శేరీగొల్వేపల్లి, జమీగొల్వేపల్లి, శేరికల్వపూడి, జమీకల్వపూడి, మొఖాసా కల్వపూడి మొదలైనవి రెవిన్యూపదాలతో చేసిన వివక్ష. పండితవిల్లూరు, దొంగతిమ్మాపురం, నీళ్లులేని తిమ్మాపురం మొదలైనవి వాటివాటి ఆధిక్యాన్ని అభావాన్ని సూచించేవి.

**సంఘటనలతో వచ్చిన పేర్లు :**

రణస్థలం - అక్కడ జరిగిన యుద్ధం కారణంగా వచ్చింది. సంక్రాంతిపాడు - ఆ గ్రామాన్ని కట్టించి సంక్రాంతినాడు దానమివ్వడం కారణంగా వచ్చింది. 'వసంతవాడ' - మార్గమధ్యంలో ఏర్పాటుచేసిన చలివేంద్రం కారణంగా వచ్చింది. పాయకరావుపేట - ఒకానొక సర్దార్‌కు నైజాంనవాబు ఫాయక్‌రావు అనే బిరుదు ఇవ్వడం కారణంగా, అతడు నివాసమున్నచోటుకు ఆ పేరు స్థిరపడింది. 'సర్వసిద్ధి' తెలుగు చాళుక్యులలోని ఒకరికి బిరుదు. అతడిమీది గౌరవంతో విశాఖజిల్లాలోని సర్వసిద్ధి గ్రామం ఏర్పడింది. సోమవారపు పేట, బేస్తవారపు పేటలు ఆయారోజుల్లో అక్కడ సంత జరగడం కారణంగా వచ్చాయి. బంటుమిల్లి భట్టిప్రోలులు సైనికుల పోషణకుగాను ఏర్పాటు చేయబడిన గ్రామాలు. జోడి ధర్మాపురం ఆ గ్రామంపై 'జోడి' అనే పన్నును విధించడం కారణంగా, మరొక ధర్మాపురంనుండి దీనిని వివక్ష చేయడానికిగాను స్థిరపడింది. కప్తానుపాలెం నిజానికి కేప్టెన్‌పాలెం. పోర్చుగీసులు ధాన్యం కొనుగోలుకు ఏర్పాటుచేసికొన్న నెలవు. హంపి పంపానది కారణంగా వచ్చింది. విజయనగరం చరిత్ర తెలిసిందే. వళందపాలెం డచ్చివారి రాజధాని హాలెండు శబ్దంనుంచి వారి మకాముకు పేరుగా నెలకొన్నది. ఫ్రెంచివారి నెలవు పరాసుపేట. ఫరంగుల (విదేశీయులు) ఆవాసం ఫిరంగిపురం. (Foreign అనే ఆంగ్లపదం తెలుగు లిప్యంతరీకరణంలో ఫరంగి అయి, వ్యవహారంలో ఫిరంగి అయింది.)

ఇలా ఊళ్ల పేర్లలో అనేక విశేషాలు నిక్షిప్తమై ఉన్నాయి. వాటిని శాస్త్రీయపద్ధతిలో అధ్యయనం చేయడంవల్ల చరిత్ర, చారిత్రక భూగోళం. ఒకప్పటి నైసర్గికస్థితి, జనుల ఆచారవ్యవహారాలు, వారు పండించిన పంటలు, వారు సాకిన జంతుజాలం - ఈ విధంగా మానవేతిహాసానికి సంబంధించిన అన్ని అంశాలను సమంగా అర్థంచేసికోవడానికి ఉపకరిస్తుంది. గ్రామనామాలు భాషాసంకేతాల రూపంలో ఉన్న శిలాజాలు. అవి కదిలిపోయిన కాలపు గుర్తులు. ఇది కేవలం విహంగవీక్షణం మాత్రమే.

# అర్ధానుస్వారంతో వచ్చిన అర్థభేదం

కం. మృడు నెన్నఁడు శరములఁగ
వ్వడి యడవందొడఁగె గాండివంబున నపుడే
యుడుగకపాడమెడు భయమున
వడఁకుంగుబ్బలి కుమారి వడవడ వడఁకెన్.

శ్రీనాథకవిసార్వభౌముని హరవిలాస సప్తమాశ్వాసంలోనిదీ పద్యం. అర్జునుడు సోదరుల అనుమతి గైకొని, రానున్న మహాభారత సంగ్రామంలో శత్రువులను జయింపగోరి, దానికవసరమైన దివ్యాస్త్రాలను పొందగోరి, ఇంద్రకీల పర్వతంమీద ఇంద్రుని గూర్చి తపస్సు చేస్తాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై, సమరంలో జయము శివుని కృప లేక కలుగదు. కాబట్టి, పశుపతిని గూర్చి తపస్సు చేయమని బోధింపగా, దానికి పూనుకున్నాడు అర్జునుడు. కొంతకాలానికి, పరమేశ్వరుడు, పాశుపత దివ్యాస్త్రాన్ని, అర్జునునికి ప్రసాదింపగోరి, ముందుగా, అతని స్థైర్యాన్ని పరీక్షింపగోరి, కిరాతవేషంలో, పార్వతి చెంచెత రూపంలో తన్ననుసరింపగా, మూకాసురుడు వరాహరూపంలో రాగా, దానిని వేటాడే నెపంతో, తరుముకుంటూ, అర్జునుడు తపస్సు చేసికుంటున్న ప్రాంతానికి వచ్చాడు. శివుడు, అర్జునుడు ఇరువురూ ఒకేసారి వరాహంపై బాణాలు వదిలారు. పంది అయితే చచ్చింది. కాని పంతం మొదలైంది. నేను తరుముకుంటూ వస్తున్న పందిపై నీవు బాణం వేయవలసిన అవసరమేమి? తపస్సు చేసికుంటున్నవాడికి సత్త్వ హింస ఎందుకు? తబిసివి గాబట్టి సరిపోయింది. లేకపోతే ఈపాటికి నిన్ను చంపకుందునే! అయినా, పంది, నా బాణం వల్లనే చనిపోయింది. చచ్చినదాన్ని బాణంతో మళ్ళీ కొట్టడం ఏమంత వీరత్వం - అంటూ శివుడు అర్జునుణ్ణి ఎద్దేవా చేశాడు. అదేం మాట, మీది మీదికి వస్తున్న క్రూరజంతువును ఎలా సహించమంటావు. చేతికొద్దీ బాణం వేస్తే తప్పేమిటి? ఇందులో సిగ్గేముంది? పందిని నీవు కోరుకుంటున్నానంటావా? పట్టుకు పో, కాదు నీవే కొట్టానంటావా? పోనీ అలాగే

కానివ్వు. మధ్యాహ్న వేళయింది. నాకు శివార్చనకు వేళయింది. నీ దారిన నీవు వెళ్లు. పోనీ, నీవు నీ భార్య ఈ అడవిలో తిరిగి తిరిగి అలసిపోయారు. కొంతసేపు సేద దీర్చుకొని వెళ్లండి. ఇంతమాత్రానికి కోపమెందుకు? మనకీ వాదులాటెందుకన్నాడు అర్జునుడు. శివుడెందుకూరుకుంటాడు. వచ్చిన పని వేరుకదా! అలాక్కాదు. నీ విల్లు చూస్తే తాడిచెట్టంతవుంది. వింటినారి దెబ్బలచేత నీ భుజాలు కాయలు కాచినట్లు స్పష్టంగా కన్పిస్తున్నాయి. చూడబోతే నీ తబిసితనం దాంభికంలా వుంది. దానికేంగాని, నిన్ను చూస్తుంటే, నీతో యుద్ధం చేయాలనిపిస్తోంది. రా, కొంతసేపు నాతో యుద్ధం చెయ్యి. చెంచువాడు, వీడితో యుద్ధమేమనుకోబోకు. నన్ను మెప్పించు. నిన్ను సెబాసంటాను. శివార్చనకింతలో వచ్చిన ముప్పేమి లేదు. యుద్ధమంటే తగని అపేక్ష మా ఇంటిదానికి - అంటూ తొందరపెట్టాడు శివుడు. ధనుష్టంకారం చేశాడు. ఇక ఆగలేకపోయాడు అర్జునుడు. యుద్ధసన్నద్ధుడైనాడు. కొంతసేపు బాగానే జరిగింది. ఆ తరువాత అర్జునుని అక్షయ తూణీరాలు ఖాళీ అయినాయి. ఇదేమా అని ఆశ్చర్యపోయాడు. దివ్యాస్త్ర మంత్రాలేమీ స్ఫురణకు రావడం లేదు. దైవం చేసిన మాయను గుర్తింపలేకపోయాడు. చేసేది లేక గాండీవంతో బాదడం మొదలుపెట్టాడు. కొంతసేపు ఆ ముచ్చట. ఆ తరువాత మల్లయుద్ధానికి తలపడడం, శివుడు ప్రత్యక్షం కావడం, అర్జునుడు లెంపలు వేసుకోవడం, సలక్షణంగా పాశుపతాన్ని పొందడం జరిగింది. కాని దీనితో మనకు పనిలేదు. మన అవసరమంతా వడఁకుగుబ్బలి కుమారి - అంటే పార్వతీదేవితోనే.

అంతవరకు, తన భర్తా, అర్జునుడు బాణాలు వేసుకుంటుంటే, ఆ ఆహవాన్ని అబ్బురపాటుతో చూస్తూ ఆనందిస్తోంది అగజ. ఎప్పుడైతే, అర్జునుడు గాండీవంతో బాదడం మొదలు పెట్టాడో, అప్పుడు ఆమెకు భయం కలిగింది. అంతవరకు ఒకరి బాణాలను ఒకరు వమ్ము చేసుకుంటూ వచ్చారు. ఇబ్బందేమీ కలుగలేదు. గాండీవంతో బాదడం మొదలుపెట్టేసరికి తాళలేకపోయింది. వడవడ వణికి పోయింది పార్వతి. ఈ వడవడ వణికిన పార్వతిని, వడఁకు గుబ్బలి కుమారి అని సంభావించాడు శ్రీనాథ కవిసార్వభౌముడు. 'వడఁకు' శబ్దానికర్థం కంపించు అని నిఘంటువులు చెప్తున్నాయి. మంచువలన కంపింపచేస్తాడు, వణికింప చేస్తాడు గనుక, గుబ్బలి అంటే పర్వతం గనుక, వడఁకు గుబ్బలి అంటే హిమవత్పర్వతమని, ఆయన కుమార్తె పార్వతి అని వ్యుత్పత్తి చెపుతారు. ఇక్కడ ఉద్దేశింపబడిన వ్యక్తి పార్వతేగాని, వ్యుత్పత్తి మాత్రం అదికాదు. పోనీ పై చెప్పిన అర్థాన్ని అంగీకరిద్దామంటే 'వడఁకు గుబ్బలి' అంటే వణుకుతున్న పర్వతమనే అర్థం వస్తుందే తప్ప, వణికిస్తున్న (తన మంచుచేత)

పర్వతమనే అర్థం రాదు. హిమవత్పర్వతాన్ని వణుకుతున్న పర్వతమనడం పొసగదు. మరి ఏది దారి. మహాకవి ప్రయోగాన్ని తప్పుబడదామా! అదెంతపని గనుక! తప్పు అనడం తేలికే! ఒప్పించడానికి తాతలు దిగి రావాలి. శ్రీనాథుడెదురుగా వచ్చి అడగబొయ్యాడా! అంటే సరిపోయె గదా అనవచ్చు. అంటే మరొక పదం సూచింప గలగాలి. యతిప్రాసలుండనే వున్నాయి. కనుక శ్రీనాథుడు తప్పు చెప్పాడనుకోవడం కంటే ఒప్పైనదేదో మనం గ్రహించలేకపోయామనడంలో ఔచిత్యముంది. నిజానికి, మహాకవి ఔచిత్యాన్నెరిగి చేసినదీ ప్రయోగం. యతిస్థానంలో నున్న 'వ' కారానికీడైన పదం వకారాదిగా వడఁకు శబ్దాన్ని వేశాడు. మరి లోపమెక్కడంటే 'డ' కారానికి తరువాత నున్న అర్థానుస్వారం. దాని అర్థం వణకించి అనేదే. అక్కడ అర్థానుస్వారం లేకపోతే - అంటే వడకు శబ్దానికర్థం ఉత్తరదిశ. ఫలితార్థం ఉత్తర దిశనున్న పర్వతం హిమవత్పర్వతం. ఆయన కుమార్తె పార్వతి అని. మరి అర్థానుస్వారం లేని వడకు శబ్దం ఈ అర్థంలో నిఘంటువుల్లో లేదు గదా అనబోతారు. లేదుగనుకనే ఇంత వివరణ అవసరమయింది. వడై అంటే తమిళంలో ఉత్తరదిశ అనే అర్థం. అందుకనే ఆంధ్రులను వారు వడిగర్‌లు అంటారు. మరి అర్థానుస్వారం వుందికదా! శ్రీనాథుడు వ్రాసినదానిని సవరించడానికి మనకేమి అధికారముంది అనవచ్చు. కాని శ్రీనాథుడు వ్రాసిన ప్రతి మనకు లభ్యం కాలేదు. ఎవరో వ్రాసుకున్న ప్రతినుండి గ్రహించాము. ఆ వ్రాసుకున్నవానికి అర్థానుస్వారం కూడిన 'వడఁకు' శబ్దం తప్ప అర్థానుస్వారం లేని 'వడకు' శబ్దం తెలియక పోవడం వలన వచ్చిన పొరపాటిది. పాఠభేదాలన్నీ వ్రాయసగాండ్ర అలసత్వంవల్ల, పాండిత్యం చాలకపోవడం వల్ల వచ్చినవేగదా! కనుక కవి హృదయాన్ని గుర్తెరగడం సహృదయత్వం. ఏ అర్థం సబబుగా వుందో దాన్ని గ్రహించడం ఉత్తముల లక్షణం. ఇక వడకులోని 'కు'! ఏమిటి, వడ అంటేనే ఉత్తరదిశ అనే అర్థమున్నపుడు, మరి ఈ 'కు' ఎందుకు? దీని అర్థమేమిటి? దీని ప్రతిపత్తి ఏమిటి? అనే ప్రశ్నలు రావడం సహజం. రావాలి కూడాను. దీనికి ముందు మరొక మాట. తెలుగువారి దిశల పేర్లతో తూర్పు, పడమర తెలుగు శబ్దాలు. కాగా ఉత్తరం దక్షిణం సంస్కృత శబ్దాలు. ఇదేమి వైపరీత్యం. రెండు తెలుగు పేర్లు, రెండు సంస్కృత పేర్లు. అంటే తెలుగువారికి ఉత్తర దక్షిణాలు తెలియవనుకోవాలి. ఎందుకంటే, ఏ భాషలోనైనా, ఒక దానికి పదం లేకపోతే అది ఆ భాష మాట్లాడుతున్న వారికి దానిని గూర్చి తెలియదని సిద్ధాంతం. కాఫీకి తెలుగు ఏమిటి. లేదు. ఉండదు. కారణమేమిటి? అది మన పంట కాదు గనుక, అలాగే ఉత్తర దక్షిణ దిశలను సూచించే పదాలు తెలుగులో లేవంటే, వాటిని గూర్చి తెలుగువారికి తెలియదన్నమాట. కాని వాస్తవ

మది కాదు. ఆ దిక్కులను సూచించడానికి కూడా తెలుగులో పదాలున్నాయి. కాని వ్యవహారంలోనుండి తప్పుకున్నాయి. వడ అంటే ఉత్తరమని చెప్పుకొన్నాం గదా! తెన్ అంటే దక్షిణం. తెన్నేరు అంటే దక్షిణపు ఏరు. ఇప్పుడొక ఊరు పేరు. వెనక అక్కడో ఏరు ఏండేది. దానికి ఉత్తరాన వున్నది వన్నేరు. వడ - ఏరు, వడియేరు క్రమంగా వణ్ణేరు, వన్నేరు అయింది. ఇప్పుడూ ఆ పేరుతో ఏరుంది. ఈ చర్చ ఇంతటితో ఆపి, పైన వదిలేసిన వడకులోని 'కు' సంగతి ఆలోచిద్దాము. ఇదొక ప్రత్యయం. తెలుగులో లేదు. కన్నడంలో వుంది. క్రియాశబ్దాలు, నామవాచకాలు ఏర్పడడానికి ఇది చేరుతుంది. వడ శబ్దం మీద అలాగే చేరింది. తెలుగులో కూడ నీకు, నాకు, మనకు శబ్దాలలోని 'కు' ఇలాంటిదే. తళుకు శబ్దంలోని 'కు' కూడ ఇలాంటిదే. మూలశబ్దం 'తళ' మాత్రమే. వ్యస్తంగా దీనికి ప్రయోగం లేదు. తళతళ అని మాత్రమే ఉపయోగిస్తాము. ఇలాంటివి చాల వున్నాయి. ఇక వడపళనిలోని వడ శబ్దం, ఉత్తరాన్నే సూచిస్తుంది. వణుకూరు కూడ ఇలాంటిదే. వడకు - కుర్రు వణుకూరు అయింది.

ఇంతకూ పద్యంలోని పార్వతి, వణికిస్తున్న పర్వతం కూతురు గాదు. ఉత్తరాన ఉన్న పర్వతం కూతురని వ్యుత్పత్త్యర్థం. అర్థానుస్వారాన్ని అరసున్నగా వ్యవహరించడం పరిపాటి. కాని అది పొరపాటు. సున్న శూన్య పదం నుండి ఉత్పన్నము. గణితశాస్త్ర సంబంధి. కనుక భాషాసంబంధి చర్చలో అరసున్న అనడం తప్పు. అర్థానుస్వార మనడం ఉచితం. అయితే దీనిని అర్థబిందువు అనడం కద్దు. పద గతంగా వున్నది అర్థానుస్వారం. వ్యాకరణ కార్యాలవలన, శబ్దగతంగా గల పూర్ణ బిందువుకు పర్యాయంగా వచ్చినది అర్థబిందువు. దీనిని వేరుగా చర్చించడం అవసరం.



# ఏండ్లూ - పూండ్లూ

చ॥ వెఱవక మీ కొనర్తునొక విన్నప మిట్టివి యెల్ల జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టఁ(బ్రాయపుం
జిఱుత తనంబు మీ మొగము సెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెఱుంగఁదరంబె మీ మహిమలీర యెఱుంగుదు రేమి చెప్పదున్.

సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలచే గండ పెండేరాన్ని తొడిగించుకొన్నవాడు, తానెక్కిన పల్లకిని, కృష్ణరాయనిచే మోయించుకొన్న గౌరవాన్ని పొందినవాడు, ఆతని కొలువులోని అష్టదిగ్గజ కవిమండలిలో ప్రథముడైన పెద్దన స్వారోచిష మనుసంభవ కావ్యమునందలిదిగా ఈ పద్యమునందరు ఎరిగినదే. దీనికే మనుచరిత్ర అనేది ప్రసిద్ధనామము.

ఇక సందర్భమేమంటే, అరుణాస్పదమనే పురంలో ప్రవరుడు అనే సద్బ్రాహ్మణుడున్నాడు. ఆతని సౌందర్యం ఇలాంటిదీ అని చెప్పడానికి వీలులేనంతటిది. సంపత్తికా కొదువలేదు. అనుకూలవతియైన భార్య. ఇంటి యాజమాన్యం వహించడానికి తల్లిదండ్రులున్నారు. చెబితే చాలు అందుకు పోయే శిష్యగణముంది. వినయం, వివేకం గలవాడు. సుఖంగా కాలక్షేపం జరిగిపోతూ వుంది. ఇలా ఉండగా, ఒకనాడు ఒక యతి వచ్చాడు. ఎదురుగా వెళ్లి తోడ్కొని వచ్చాడు ప్రవరుడు. ఆ పైన అతిథి మర్యాదలన్నీ సాంగంగా జరిపాడు, జరిపించాడు. తీరి కూర్చున్నవేళ దగ్గరకు చేరి ఆ ముచ్చటా ఈ ముచ్చటా అడుగుతూ వచ్చాడు. ఎక్కడనుండి ఎక్కడికి వెళ్తూ ఇక్కడికి వచ్చారని అడిగాడు. మీరు సుకృతులు. నానా తీర్థ సందర్శన భాగ్యం గలవారు. మీ బోంట్లు రావడం, మా గృహం పావనం చేయడానికి కాకపోతే మరెందుకొస్తారన్నాడు. మీలాంటి వాళ్ల సంసేవనం, మీ పాదధూళిని శిరసున దాల్చడం వినా, సంసార జంజాటంలో పడిన మావంటి వారికి దిక్కేది యని బహువిధాల యతిని కీర్తించాడు. అతడన్నాడుగదా! నాయనా మావంటి వాళ్లకు ఏ ఇబ్బంది కలగడం లేదంటే అది

మీలాంటి గృహస్థులవల్లనే కదుటయ్యా. చెవిటి, కుంటి, గ్రుడ్డి భిక్షకులు, బ్రహ్మచారులు, పరివ్రాజకులు, ఇంకా దిక్కులేనివాళ్లు అనేకులు సుఖంగా కాలం వెళ్లదీస్తున్నారంటే, అది మీలాంటి గృహస్థుల ఆదరణంవల్లనే కాదా! కనుక గార్హస్థ్యానికి సరి వచ్చేది ఏదీ లేదు సుమా అన్నాడు. దానికి ప్రవరుడు, అయ్యా సమస్త తీర్థాలు చూచినవాళ్లు మీరు. ఏయే దేశాలు చూచారు, ఏయే తీర్థాల్లో తానమాడారు. ఆయా చోటులగల విశేషాలన్నీ వినాలని వుంది. విసుగనుకోకుండా వివరించండి మహానుభావా అన్నాడు. అంతేకాదు, స్వయంగా వెళ్లి సేవించకపోయినా, ఆయా తీర్థక్షేత్ర మాహాత్మ్యాలు విన్నా, సేవించి నంత ఫలితం లభిస్తుందని అంటారు గనుక, ఆ విశేషాలు చెప్పండని మరీ మరీ అడుగుతున్నానన్నాడు... దానికేం భాగ్యం నాయనా అంటూ అందుకున్నాడు. ఏం చెప్పమంటావు. ఎన్ని విశేషాలు ఏకరువు పెట్టమన్నావు. నే చూడని దేశముందా, ఎన్ని ఊళ్లు చూశాను. ఎన్నెన్ని నదుల్లో తీర్థమాడాను. ఆ చోద్యాలన్నీ అన్నీ ఇన్నీ కావు. ఇంతెందుకు, నాలుగు దిక్కులమధ్య ఉన్న విశేషాలన్నీ చూశాను. కేదారేశుని చూశాను. ప్రయాగనిలయుని సేవించాను. బదరీనారాయణుని చూశాను. అదీ, ఇదీ అన్నమాటేమిటి, నే చూడని దేశం లేదు పొమ్మన్నాడు యతి. అయితే ఇదంతా ఈశ్వరానుగ్రహం వలన అల్పకాలంలోనే ఇవన్నీ చూడగలిగానన్నాడు. నిజమే. మిమ్మల్ని చూస్తే అంతటి వారేననిపిస్తోంది. అనిపించడమేమిటి! సందేహం లేదు. అయితే ఒక విన్నపం. ఇన్నిన్ని చూసి రావడానికి రెక్కలు గట్టుకొని ఎగిరొచ్చినా ఏండ్లూ పూండ్లూ పడుతుందే. మీరు చూస్తే చిన్నవారే గదా! మీ మహిమ మీకు తెలియాల్సిందే తప్ప మా బోంట్లకు తెలియరానిది గదా! మరి ఇదెలా సాధ్యమైంది, అన్నాడు. దానికా యతి, నా దగ్గర పరుసవేది వుంది. దాని మహిమచేత ఇవన్నీ చూడగలిగా ననడం, దాన్ని తనకు కొంత ప్రసాదించమనడం, దాన్ని పూసుకొని హిమాలయాలకు వెళ్లడం, వరూథినీ సందర్శనం, ఆ మీది కథా అందరకూ తెలిసిందే మరి, కోరి చెప్పవలసిందే మంటే 'ఏండ్లూ పూండ్లూ' పట్టడం గూర్చి.

పెద్దన్నగారే అన్న మాటేమీ, ఏదైనా పని ఎక్కువకాలం పడుతుందన్న భావనలో ఏండ్లూ పూండ్లూ పడుతుంది, లేక పట్టింది అనడం, అందరూ అంటున్న మాటే. ఏండ్లు అంటే సంవత్సరాలు. మరి పూండ్లు అంటే! ఆఁ! అదేదో మాట వరసకు, మాటకు మాట కలవాలి గనుక వచ్చిందనో, లేకపోతే పండిత భాషలో అయితే ఇట్లాంటి వాటిని ఊనికకొరకనో, అదీగాకపోతే ధ్వన్యనుకరణ శబ్దమనో అంటుంటారు.

కొన్ని అలాంటివి లేకపోలేదు గాని, ఇది అలా వచ్చింది గాదు. పూడి, పూడిక అంటే బురద. అంటే- అచ్చంగా బురదని కాదు. చాలా ఊళ్ల పేర్లలో పూడి

కన్పిస్తుంటుంది. పారుపూడి, జక్కంపూడి, ముళ్లపూడి మొదలైనవి. ఈ ఊళ్లకు సమీపంలో తప్పకుండా వాగో, వంకో, మురుగుకాలవో వుంటుంది. ప్రవాహానికి వరద వస్తే, ఆ ఊరు మునుగుతుంది. అంటే మునకకు గురవుతుంది. అయితే ఇలాంటి సందర్భం - అంటే ప్రవాహాలు చాలాచోట్ల ఉంటాయి గదా అనవచ్చు. అలాకాదు, ఆ ప్రవాహపు నీటివలన, మునకకు గురికాగల అంటే ఆ ప్రాంత పరిసరాలు పల్లంగా వున్నచోట మాత్రమే పూడి అనే గ్రామాలు వస్తాయి. పూండ్లు అంటే చిత్తడినేలలు. ఇక ఏండ్లు అంటే సంవత్సరాలు కాదు. ఏరులు. అంటే నదులు. ఏండ్లూ పూండ్లూ గల ప్రాంతమంటే ఏరులతోటి, చిత్తడినేలలతోటి నిండివున్న ప్రాంతం. ఆ ప్రాంతంలో ప్రయాణం సుకరంగా సాగదు. అనుకున్న సమయంకంటే ఎక్కువ సమయం పడుతుంది. అలాంటి చోట్లను దాటివచ్చినపుడు ఏండ్లూ పూండ్లూ గడిచి వచ్చామని అనాలి. కాని వాడుకలో అదిపోయి, దాని భావమైన - కాలం ఎక్కువ పట్టడం అనే దానిలో, ఈ పదం వ్యాప్తిని పొంది, కాల విలంబ బోధకత్వాన్ని సంతరించుకుంది. దానినే పెద్దనగారు ఉపయోగించారు. అంటే పెద్దన నాటికే ఆ భావంలో స్థిర పడిందన్నమాట. వాస్తవానికి ఏండ్లూ పూండ్లూ గడిచి వచ్చాము అనాలి తప్ప ఏండ్లూ పూండ్లూ పట్టాయి అనకూడదు. కాని వ్యవహారానికి బలముంది. కాదనడానికి వీలులేదు. రూఢ్యర్థమంటే అదేమరి.

అయితే ఏడులు ఏండ్లు కావచ్చు, పూడులు పూండ్లు కావచ్చుగాని ఏరులు ఏండ్లు ఎలా అవుతుందని సందేహం రావచ్చు: నిజానికి ఏండ్లు పూండ్లు కాదు. వ్యవహారంలో ఏళ్లూ పూళ్లు అని మాత్రమే. పండితభాషలో మాత్రమే ఏండ్లు పూండ్లు అని వుంది. పూడి మీది బహువచనం వల్లనే 'పూళ్ల' అనే గ్రామం ఏర్పడింది. మరి ఇంటి పేరులోనికి వచ్చేటప్పటికి పూండ్ల అయింది గదా! అలాగే ఏళ్లు, ఏండ్లు అయింది. అయినా ఏరు కూడా బహువచనంలో ఏండ్లు అవుతుంది.



# అతిసంభ్రమం

సంభ్రమ శబ్దంపై 'అతి' చేరింది. నిజానికి భ్రమశబ్దంపైన అప్పటికే 'సం' చేరింది. భ్రమ శబ్దాని కర్థాలు భ్రాంతి, గమనము. సంభ్రమమనేదానికి గుండ్రముగా తిరుగు, వేగిరపాటు, కలత, భయము, భ్రాంతి, గౌరవము, అజ్ఞానము, సంక్షోభము అనే అర్థాలు, సంభ్రమించు శబ్దానికి తత్తరించు, వేగిరపడు అనే అర్థాలు నిఘంటువుల్లో కన్పిస్తాయి. వీటిలో కొన్నింటికి ప్రయోగాలను కూడా నిఘంటువులు చూపుతున్నాయి. ఇక దీనిపై 'అతి' చేరడం వలన మిక్కిలి అని చెప్పవచ్చు. ఇంత మాత్రమే అయితే దీనిని గూర్చి ప్రత్యేకంగా ప్రస్తావింప వలసిన పనిలేదు. ఏ పదానికయినా భావన సందర్భాన్ని అనుసరించి ఉంటుంది. అలా కాకపోతే ఒకే శబ్దానికి రెండు మూడు పర్యాయ భావనలు, అర్థాలుండవు గదా! ఇక ప్రకృతము.

ఈ 'అతిసంభ్రమ' శబ్దాన్ని నన్నయ ఆదిపర్వ చతుర్థాశ్వాసంలో శకుంతలోపాఖ్యానంలో ఎంత సందర్భోచితంగా ప్రయోగించాడో పరిశీలించండి. దుష్యంతుడు మృగయా వినోదార్థియై అడవికి వచ్చాడు. చాలా జంతువులను వేటాడాడు. చంపెడు వేడుక చేత అతి దూరం వెళ్ళాడు. అతని వేగాన్ని అనుసరించ లేనివారు ఆయా చోటుల ఆగిపోయారు. వెళ్ళివెళ్ళి ముని ఆశ్రమాన్ని చేరాడు దుష్యంతుడు. అది కణ్వాశ్రమం. వలయునమాత్యులను, దగిన వారలను అచ్చటనే ఉండి పొమ్మని, తానొక్కడూ, కణ్వునికి నమస్కరించి రావడానికి ముని వల్లభుమందిరానికి వెళ్ళాడు. వెళ్ళి అక్కడ శకుంతల అనే కన్యను చూశాడు. అప్పటికింకా ఆమె కన్య యని గాని, ఆమె పేరు శకుంతలయనిగాని దుష్యంతునికి తెలియదు. మనకు మాత్రమే తెలుసు. కారణం నన్నయగారు చెపుతున్నారు గనుక. ఆ తరువాత, ఆమె అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించినప్పుడు కూడా, ఆ కన్యకను చూసి దుష్యంతుడు మాట్లాడినప్పుడు కూడా ఆమె కన్యయని అతనికి తెలిసింది అనుకోనక్కరలేదు. అది కూడా కవి మాటగానే సరిపెట్టుకోవచ్చు గనుక. కాని ఆ తరువాత మాత్రం, దానిని కన్యకగా తెలిసికున్నాడు దుష్యంతుడు. వచ్చి, ఆమె చేత

అర్ఘ్యపాద్యాది విధుల పూజింపబడి, నేనిందుకొచ్చాను సుమా అని కొంత సంభాషించిన తరవాత, అంటే - అంతసేపు ఆమెను పరికించి చూసిన తరువాత ఆమె కన్యయని అతనికి బోధపడింది. ఎలా! ఎలాగో తెలిసింది. అంటే స్త్రీ మూర్తిని చూడడంతోటే (మంగళ సూత్రం, నల్లపూసలు మొదలైనవి లేకపోవడం వలనకాక - ఎందుకంటే అవి కేవలం దేశీయాచారాలు కనుక) ఆమె కన్యా, వివాహితా, అంటే క్షతయోనియా, అక్షతయోనియా అని తెలిపే సౌకర్యంగల శాస్త్ర విద్య అతనికి తెలిసి ఉండాలి. అతనికేగాదు మనకూ తెలునస్తుంది ఆసక్తి వుంటే. చరకసంహిత, అష్టాంగ సంగ్రహంలాంటి ఆయుర్వేద గ్రంథాలతో పరిచయమున్నవారికి ఇంతకు మించి వివరింపవలసిన అవసరం లేదు.

అసలు విషయం అతిసంభ్రమాన్ని విడిచి ఇంత ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, శకుంతలోపాఖ్యానానికిపై చెప్పినది, ఇకముందు చెప్పబోయేది ప్రాణస్థానీయములైనవి కనుక. ఇవి తెలిస్తే, దుష్యంతుడు శకుంతలను మోసం చేశాడనే మాటకు ఏపాటి విలువుందో తేలుతుంది గనుక. నిజానికి ఎవరూ ఎవరినీ మోసం చేయలేదు. అను రూపమైన వయసు. ఒకరిపై మరొకరికి పరస్పరమూ ఆసక్తి ఉంది. దానిని వివరించ బోయేముందు, ఆసక్తి శకుంతలకు కలదనడానికి ఆకరమైన దానిని గూర్చి పరిశీలిద్దాము. ఎందుకంటే, దుష్యంతపరమైన ఆసక్తి ప్రకటితమే గనుక. నిజ వృత్తాంతం తెలిపే వరకూ, నిస్పృహవృత్తిలోనున్నతనకు, శకుంతల తనదైన గాథ సవిస్తరంగా వివరించిన పిదప తన హృదయం మదన బాణపరంపరకాస్పదమైనదని తాననుకున్నాడని నన్నయ చెప్తున్నాడు. ఆ తరువాత అతని మాటల్లో ఎలాగూ వ్యక్తమైంది. ఇక ఇప్పటి సంగతి.

అలా ఆశ్రమానికి వచ్చిన దుష్యంతుని ఎరింగి అతిసంభ్రమంబున ఆసన అర్ఘ్యపాద్యాది విధులంపూజించి కుశల మడిగినది శకుంతల. అంటే వచ్చినవాడు దుష్యంతుడని ఆమెకి తెలిసింది. ఎలా? పై వలే ఇక్కడ శాస్త్రగ్రంథాల పరిచయంతో పనిలేదు. వచ్చినవాడు రాజా, కాదా అనేది ప్రశ్నతప్ప, అతడు బ్రహ్మచారియా, వివాహితుడా అన్నది ప్రశ్న కాదు గనుక. అయినా ఈ సందేహాన్ని తీర్చే శాస్త్రమేదైనా వుందా! ఏమో; నాకైతే తెలియరాదు. మరి రాజు అని ఎలా తెలిసింది. కేవల లౌకిక జ్ఞానం వలన. రాజోచితమైన లాంఛనాలు, ఆభరణాదికాలు, దుస్తులు మొదలైన వాటి వలన, అంతేకాదు, దుష్యంతుని గూర్చిన ఆకార వివరణ కూడ అంతకు పూర్వమే ఆమెకు అంది ఉండవచ్చు. ఎక్కడో అడవిలో, మున్యాశ్రమంలో, జనపదానికి దూరంగా ఉంటున్న శకుంతలకీవిషయాలు ఎలా తెలుస్తాయి అని ప్రశ్నించవచ్చు. ఇది-తర్క సహమైన ప్రశ్నే. కాని యుక్తి సహమైనదికాదు. ఆమె ఎంత ప్రాజ్ఞురాలో, ఆమె, రాజ

సభామందిరంలో, సమయోచితంగా, సభామర్యాదకనుగుణంగా, సత్యాన్ని గూర్చిన చేసిన ప్రసంగం పట్టి ఇస్తోంది. కాకపోతే నేను నిన్నెరుగను. ఎక్కడిదానవు, ఎందుండి వచ్చితివి అక్కడికే వెళ్ళు తొందరగా' - అన్న దుష్యంతుని పలుకులకు కోపారుణిత నయనంబుల బాష్పకణంబులు దొరగందలవాంచి ఆ రాజును కటాక్షించుచు, హృదయ సంతాపంబు తనకు తాన యుపశమించుకొని, తప్పబలుకనగునె ధార్మికులకు, విమలయశోనిధీ యని వ్యంగ్యవైభవంగా సంబోధించుట-ఎవరికి, లేక ఎంతమందికి చేతనవుతుంది. వివాహ విధులు ఎనిమిది. అందు గాంధర్వంబు సక్షత్ర వంశ్యులకు ఉత్తమము అని చెప్పినపుడు. మా అయ్యవచ్చి నీకిచ్చిన పాణిగ్రహణము సేయుమన్న శకుంతల నీ ప్రసాదం చేత నాకుదయించిన పుత్రునికి యువరాజ్యమప్పగించడానికి నీవు ఒడబడి, అలాగా, వరం నాకిచ్చినట్లాయెనా, నీకును నాకును సంగమంబగున్ అని ఖండితంగా పలుకగలిగిన నేర్పుగల శకుంతలకు, వచ్చిన వాడు దుష్యంతుడని పోల్చుకోగల ఇంగితం లేదని భావించవలసిన అవసరం లేదు! మరోమాట. శకుంతలకు దుష్యంతునిపై ఆసక్తి ఉన్నదని చెప్పడానికి మరోసాక్ష్యం కేవలం తాను క్షత్రియ కన్యనే అని సూచించడానికి, తన జన్మ ప్రకారాన్ని అంత వివరంగా చెప్పవలసిన అవసరం లేదుకదా! అదలావుంచుదాం. దుష్యంతునికి తన ఎదుట ఉన్న శకుంతల జన్మాదికం తెలిసిన తరువాత, తన యందాకోమలి అనురాగముపలక్షించి, ఈ ముని పల్లెలో ఉండడమేమిటి. ఈ నీ విలసితరూపకాంతి నిర్మల గుణములకీ వల్కలాజనములు, ఈ వన్యఫలాశనములు, ఈ విటప కుటీరావాసములుచితములా, భామిని, నాకు భార్యవై, అశేష రాజ్యలక్ష్మీ మహనీయ సౌఖ్యములమేలుగనందు మన్నపుడు, ఆ వచ్చినవాడు తనకు క్రొత్త, తాను క్రొత్త అయినపుడు, అతడెంతో చనవుతో నాకు భార్యవుకావలసింది అన్నపుడు, కణ్వుని పెంపకంలోనిదైన శకుంతల ఆ మాటకేమీ మారుమాట్లాడలేదెందు వలన. ఆ చనవు తీసికొనడానికి దుష్యంతుని కంత బలిమి ఎలావచ్చింది. అది కణ్వాశ్రమమని తెలియదా! ఆమె ఎవరి పెంపకంలోనిదో తెలియదా! తెలుసుగనుకనే, అది ఉచితమైనది గనుకనే - తాముభయులూ క్షత్రియులు గనుకనే, దానికి తప్పక ముని అనుమతి ఉంటుందనే నమ్మకంతోనే అంత మాట అనగలిగాడు. కాని నాడు అంత కెంతగునో తెలియరాని వాడా దుష్యంతుడు. మరి అతడు ప్రయోగించిన 'భామిని' శబ్దార్థం శకుంతలకు తెలియదా! కాంక్షాపూరితమైనదని గదా దాని అర్థం. (a passionate woman). ఆ కాంక్ష ఏమో వివరించ వలసిన అవసరముందా! మరిమిన్న కున్నది శకుంతల. కనుక దుష్యంతుడేకాదు, శకుంతలకూడా అతనిపై ఆసక్తి కలిగి

ఉన్నదనడం స్పష్టం. ఈ ఆసక్తి ఎప్పుడు కలిగింది. ఇప్పుడు దుష్యంతుడు మునిఆశ్రమానికి వచ్చినప్పుడా! లేక, అతని గుణాదికాలను ఇతఃపూర్వమే వినివుండడం వలన, అతడు మాత్రమే తనకు కాగల పతి అనే భావన అప్పటికే ఉండడం వల్లనా! అంటే రెండవదే సరియైనమాట అవుతుంది. కాకపోతే, అంత సవిస్తరంగా తన జన్మవృత్తాంతాన్ని చెప్పవలసిన అవసరం లేదనేది స్పష్టం చేస్తోంది. కాగా రెండవది, అతి సంభ్రమమున అతనికి అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించడం. పై విషయాన్ని మరింతగా స్పష్టం చేస్తోంది. అదెలాగో చూద్దాం.

ఈ 'అతిసంభ్రమ' శబ్దానికి ఈ సందర్భంలో తొట్రుపాటు, తత్తరపాటు, వేగిరము అనే అర్థాలు చెప్పడం పరిపాటి. ఆ శబ్దానికా అర్థాలున్నమాట నిజమే. సందర్భం కూడా, పై వివరణ మనసుకు అందిరాకపోతే (రాజు అనే విషయం ఆమెకు తెలియడం). రాజును చూసి, ఆమె తత్తర పడింది, తొట్రుపాటు పడింది - అని చెప్పడం సందర్భాన్ని బట్టి సబబుగానే కన్పిస్తుంది. కాని దుష్యంతునెరింగి యనడం వలన పై అర్థాలు ప్రాకరణికంగా నిలువవు. సంభ్రమ శబ్దానికి పై అర్థాలతోపాటు, సంస్కృతంలో కుతూహలము, ఆసక్తి (eagarness, zeal) అనే అర్థాలు కూడా ఉన్నాయి. జీల్ అనే ఇంగ్లీషుపదానికున్న అర్థాల్లో ఒక వ్యక్తి పై కుతూహలం అనేది కూడా ఉంది. మరి ఈ కుతూహలం, ఆసక్తి ఎందువల్ల ఆమెకు కలిగాయి. వచ్చిన అతిథి ఎవరైనా, అర్ఘ్యపాద్యాదులివ్వడం మర్యాదసూచకమే. పూజించడం కూడా సామాన్యమేనని సరిపెట్టుకోవచ్చు. కాని వీటికి ముందు సంభ్రమమేల కలిగింది - అనేదే అసలు ప్రశ్న. అది కూడా వచ్చిన వాడు దుష్యంతుడని స్పష్టంగా తెలిసిన మీదట.రాజు గనుక తొట్రుపాటు పడింది అని సరిపెట్టుకోవడం ఉచితమో లేక తదనంతరవృత్తాంతంలోని విషయాలనుబట్టి, ఆమెకు అతనిపై అప్పటికే ఆసక్తి వున్నదని నిర్ధారించడం ఉచితమో విజ్ఞులకు తెలియంది కాదు. అంతేకాదు అతని సామీప్యాన్ని ఆమె ఆకాంక్షించిందనడానికి మరో సాక్ష్యం, కణ్వుడు, పండ్లు దేరబోయినాడు. కనుక, వారు వచ్చునంతకు ముహూర్త కాలంబుండునది అని నిర్దేశించటం. దీని వలన ఆమె ఆంతర్యం బోధపడుతోంది గదా!

ఇక సంభ్రమ శబ్దం తెలుగులో సంబరమైనది. సంబరశబ్ద భావనతో పై సందర్భాన్ని వివేచిస్తే, ఆమెకు దుష్యంతుని చూడడం వలన, లేక అతడు దుష్యంతుడని గ్రహించడం వలన ఆమెకు కలిగినది సంబరమో, తొట్రుపాటో తెలియకపోదు. నన్నయ మరి విపులశబ్దశాసనుడు. నానారుచిరార్థసూక్తి నిధి.

●●●

# శ్రీనాథుడు కర్ణాటుడే !

ఆంధ్ర కవిసార్వభౌముడు శ్రీనాథుని జన్మస్థలము, మాతృభాషా విషయములు చర్చనీయములగుట సాహితీ లోకమెరిగినదే. జన్మస్థల మేదియో యిప్పటికిని సమముగ నిర్ధారింపబడినదికాదు. మాతృభాష మాత్రము తెలుగని నిర్ధారించిరి.

శ్రీనాథుడు తన జన్మస్థలమును గూర్చి ప్రస్తావించియున్నాడు.

కనకక్ష్మాధరధీరువారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణ సంగ్రహ కళాకావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁగవితా విద్యాధరుంగొల్తుమా
యనుఁగుం దాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్య చూడామణిన్

అని భీమేశ్వరపురాణమున తన తాత కమలనాభామాత్యుని ప్రశంస చేయు సందర్భమున, 'అతడు' వారధి తటీ కాల్పట్టణాధీశ్వరుడని స్పష్టపరచినాడు. కాని ఆ వారిధి తటీ కాల్పట్టణమేదియో తెలియరాకుండుట, శ్రీనాథుని జన్మస్థలమేదియో నిర్ధారించుటకు వలనుపడినది కాదు. కొందరు గుంటూరు సీమలోని రేపల్లెకు సమీపమునగల నల్లూరనియు[1], మరికొందరు కృష్ణామండలమునందలి మచిలీపట్నమునకు సమీపమునగల 'కలపట' మని[2], ఇంకొకరు కాల్పట్టనమును క్రాల్పట్టణముగ గ్రహించి, క్రాలు అనగా ప్రకాశించు అనునర్థమున అది క్రొత్తగ కట్టిన పట్టణమై యుండునని ఊహించి, ఒంగోలునకు సమీపమునగల క్రొత్తపట్టణమని నిర్ధారించిరి[3]. మరియొకరు మచిలీపట్నమునకు సమీపమున గల కాలీపట్టణమనిరి[4]. కాగా ఇంకొకరు 'కాల'శబ్దమునకు నల్లని అనునర్థము గ్రహించి, నెల్లూరికి సమీపమునగల కృష్ణపట్టణ మనిరి[5]. కృష్ణ శబ్దమునకు నలుపను అర్థముండుట ఈ ఊహకు బలము. శ్రీనాథుడు తన బాల్య సఖుడగు అవచి తిప్పయ శెట్టికి హరవిలాసము నంకితమిచ్చెను. అతడు నెల్లూరి వాసి. కనుక శ్రీనాథుడు కూడ నెల్లూరి వాడేనని మరియొకరు సమర్థించిరి[6]. ఇట్లు వాదోపవాదములే తప్ప, జన్మస్థలమేదియో స్పష్టపడలేదు. అనగా శ్రీనాథుడు చెప్పిన కాల్పట్టణ మేదియో తెలియరాలేదు.

---

1 చాగంటి శేషయ్యగారు
2 కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు
3 వీరేశలింగం పంతులుగారు
4 వేటూరి ప్రభాకరశాస్త్రిగారు
5 చిలుకూరి వీరభద్రరావుగారు
6 నేలటూరి వెంకటరమణయ్యగారు

ఇక మాతృభాషా విషయము వివాద గ్రస్థమగుటకు కారణమైనది, అతడు భీమఖండమందు

ప్రౌఢి, బరికింప సంస్కృత భాషయంద్రు
పలుకునుడి కారమున నాంధ్రభాషయందు
రెవ్వరేమన్న నంద్రు నాకేలకొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష

అని చెప్పుట. అతడే స్పష్టముగా తనభాష (కవిత్వము) కర్ణాట భాష యనుట వలన, అతని మాతృభాష కర్ణాట భాషయని (కన్నడము) తీర్మానించిరి. ఇంతేగాక అతని దేశము కూడ కర్ణాట దేశము (కన్నడదేశము. నేటి కర్ణాటక రాష్ట్రము) అని చెప్పుటకు సాక్ష్యముగ కాశీఖండమునందలి ఈ క్రింది పద్యమును చూపుదురు. 'చిన్నారిపొన్నారి చిరుతకూకటినాడు.... ఇత్యాదిగా తాను ఏయేవయసులలో ఏమే కావ్యములు రచించినాడో చెప్పిన సీసపద్యపు ఎత్తుగీతిలో

ప్రాయమింతకు మిగుల గైవ్రాలకుండఁ
గాశిఖాఖండ మనుమహాగ్రంథమేను
దెలుగుఁ జేసెదఁ గర్ణాటకటక
పద్మవనహేళి శ్రీనాథభట్ట సుకవి -కాశీఖండము.

అని స్పష్టపరచుట. మరియొకటి, అతడు దేవరాయల ఆస్థానమున ప్రవేశము గోరిన వేళ, పడిన యిబ్బందులను పేర్కొనుచు "తల్లీ కన్నడ రాజ్యలక్ష్మీ!" యని ఆ రాజ్యరమను సంబోధించుట. పై అంశముల నాధారముగా శ్రీనాథుని దేశము, మాతృభాషలు రెండును కర్ణాటములే (కన్నడ దేశ, భాషలు) యని కొందరు భావించిరి.

కాని అతడు తెలుగువాడేనని, అతని మాతృభాషయు తెలుగేనని మరికొందరు భావించిరి. 'ప్రౌఢి బరికింప.....' ఇత్యాదిగా గలపద్యము ప్రక్షిప్త మని శ్రీచాగంటి శేషయ్యగారు. దానికి వారు చూపిన కారణము, శ్రీనాథుడు మరియే యితర కావ్యమునందును కుకవినింద చేయలేదు గనుక, ఇచ్చటను చేసియుండడని. చేసియుండెడి వాడు కాడేమో కాని, కొండవీడు నుండి రాజమహేంద్రవరము తరలి వెళ్లిననాడు, బంధుత్వమును పురస్కరించుకొని, బెండపూడి అన్నయామాత్యుని ప్రాపున రాజస్థాన ప్రవేశము పొందిన వేళ, స్థానికులయిన పండితులు తమ కతడుద్ది కాగలడని మాత్సర్యము వహించి, తనను ఈసడించుట కారణముగ, ఇతః పూర్వము చేయకపోయినను, ఇచ్చట కుకవినిందచేసి యుండవచ్చునుగదా! కనుక ప్రక్షిప్తమని త్రోసివైచి వాదమును క్రిందు పరచుట ఇచ్చట కుదురదు. కర్ణాటుడు కాడు తెలుగు వాడేనని, నిర్ధారించు వారు చూపు ఉపపత్తి, శ్రీనాథుడు ఒక్క కావ్యమునైనను, కడకొక్క పద్యమైనను కన్నడమున వ్రాయ లేదు. ఇది నిజమే గాని, కన్నడమున వ్రాయవలయునని, (మాతృభాష కన్నడమైనందున) నిబంధనమేదియు లేదుకదా! కనుక ఇదియు వాదమునకు నిలుచునదిగాదు. ఇంతకంటె మేలైన ఉపపత్తి

చూపినగాని అతడు తెలుగువాడని నిర్ధారించుటకు వలను పడదు. అట్టదేమైన కలదేమో చూతము.

శ్రీనాథుడు అనినది 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' యనిగదా! ఈ పద్యపాదము ఏభాషకు సంబంధించినది. తెలుగు కదా! ఎందుల కనవలసివచ్చినది. కొందరాయన భాష సంస్కృత మని, మరికొందరు ఆంధ్ర మనుట వలన గదా! ఇట్లు అనిన వారెవరు! రాజమహేంద్రవరము నందలి సమకాలీన పండితులేగదా! వారు తెలుగువారు. తెలుగువారికి, తెలుగునచెప్పి, నాదుకవిత్వంబు కర్ణాటభాషయని అతడు చెప్పిన మాత్రమున అది కన్నడ మెట్లగును. తెలుగే ననుట స్పష్టము. తాను కర్ణాటుడనని గాని, తన మాతృభాష కర్ణాటమనిగాని (కన్నడదేశము, కన్నడభాష) శ్రీనాథుడు చెప్పలేదు. తనకవిత్వము కర్ణాట భాష యనినాడు. తాను కర్ణాటకటక పద్మవనహేళి యైన భట్టసుకవినని గదా అతడు చెప్పినది. తనభాషను, తన కవిత్వమందు చోటుచేసికున్న భాషావిన్యాసమును కర్ణాటమనుచున్నాడు. అట్లనినది కర్ణాటమనుటకు (కన్నడమునకు భిన్నమైనది) కారణము తెలిసిన గాని, ఈ చర్చకు తెరపడదు. అది తెలిసిన, అతని భావమున కర్ణాటకటక పద్మవనమేదియో తెలియును.

ఇది తెలియుటకు పూర్వము ఒక విషయమును గమనింప వలసి యున్నది. తల్లీ కన్నడ రాజ్యలక్ష్మీ! యని సంబోధించుటను, మాతృదేశవందనముగ భావింప పని లేదు. నాటి తన విషమస్థితిని ఏకరవు పెట్టు సందర్భమున ఎలుగెత్తి చేసిన మనవిగా గ్రహింపనగును. కనుక అతడు కన్నడిగుడనుటకు ఈ ఉపపత్తి చాలదు. కాని, రెండు పర్యాయములు 'కర్ణాట' (కన్నడముకాదు) శబ్దమును ఉట్టంకించుటకు బలమైన కారణముండ వలయును. ఒకటి భీమఖండమున, రెండవది కాశీఖండమున. రచనా కాలము విషయమున కొంత (స్వల్పమైనను) అంతరముగలదు. 'మీరేమైన అనుకొనుడు, నాకవిత్వము కర్ణాటభాష అని, నాటిపండితులకు చెప్పినను, మరల కర్ణాటకటకపద్మ వనహేళి అని చెప్పుటకు ఏదియో ప్రసక్తముండవలయును. అనగా, కాశీఖండ రచనా సమయము వరకును, అచ్చటి పండితులు స్పర్థ వహించియే యున్నారని భావింపవలయును. నాటిరాజమహేంద్రవర పండితుల తెరగెట్టిదియో శ్రీనాథుడు విశదీకరించియే యున్నాడు.

బోధమల్పంబు గర్వమభ్యున్నతంబు
శాంతినిప్పచ్చరంబు మత్సరము ఘనము
కూప మండూకములుఁ బోలెఁ గొంచెమెఱిఁగి
పండితం మన్యులైన వైతండి కులకు.---1-13 భీమేశ్వరపురాణము.

అని యన్నవాడు, అల్పులైన వారితో వాదేల యను కొనినాడో ఏమో, ఆవెంటనే

నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరికాకులు బిట్టు పెద్దఱచినప్పు

డుడిగిరాయంచ యూరక యుంటలెస్స
సైఁపరాకున్న నెందేని జనుటలెస్స. 1-14 భీమఖండము

అని నాకవిత్వంబునిజము కర్ణాట భాషయను పద్యపాదమునకు ఆకరమైన పద్యము చెప్పియున్నాడు. ఇందుకొంత ఉపేక్ష కలదు. కొంత సమాధానమునుగలదు. పండితం మన్యులైనవారితో వాదేల యని ఉపేక్షించిన శ్రీనాథుడు, తిరిగి తాను కర్ణాటకటక పద్మవనహేళి నని ఏలచెప్పవలసి వచ్చినది. పై నిరసనముతో కూడిన ఉపేక్ష వారి పట్ల చాలునని భావించినాడు. కానివారి నైజము మారినదికాదు. కనుకనే ఉపేక్షించిన శ్రీనాథుడు మరల అట్లుచెప్పవలసి వచ్చినది. మరి ఆతని నైజము ఊరకుండ నిచ్చునది కాదు. విషయము కథా సందర్భమేకాని, ఆతని నైజమునకు అనువర్తింప దగిన దొకటి కాశీఖండమునందు చూడనగును.

కంటికి నిద్రవచ్చునె? సుఖంబగు నేరతికేళి? జిహ్వకున్
వంటకమించునె? యితర వైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబు గలయట్టి మనుష్యున కెన్నడేనియున్
గంటకుఁడైన శాత్రవుడొకండు దనంతటి వాఁడు గల్గినన్.

ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁజేసాచవలదు చేసాచినచో
నివ్వల నవ్వలనెవ్వరు
నవ్వకయుండంగ బగర నణఁగింపఁదగున్. -కాశీఖండము

ఈ ప్రవృత్తియే ఆయనచే కర్ణాటకటక పద్మవనహేళిననిపించి యుండ వచ్చును. అనగా నాభాష కర్ణాట మగుటయే గాదు, కర్ణాట కటక పద్మవనమునకు అనగా పండిత మండలిలో నేను భాస్కరభాసమానుడను సుమా యనుట. మనసునకు చలమావహింపనే రాదు. ఆవహించిన దాని కగుమూలమును పట్టి పల్లార్పకుండ రాదు గదా! ఇది, తనకవిత్వమును అధిక్షేపించినవారిని చెంపపెట్టు పెట్టుటయేగాదు, మించి పండ్లూడదన్నుట. "నేనే కవితాసూర్యుడను. పండిత మండలిమనః పద్మముల నుండి ప్రసరించు భావ వికాస పరిమళములకు మూలము నాదు ఉజ్వల కవిత్వదీప్తి ప్రసరణమే. ఇకేమి వచింపుదురో వచింపుడు' అని ప్రతికక్షులను సవాలుచేయు చున్నట్లున్నది. ఏమైనను ఈ రెండు వక్కణములతో, 'నాదేశము, నా భాష కర్ణాటములే' అని స్థిరీకరించినాడు కవిసార్వభౌముడు, మరి ఆయన కావ్యభాష తెలుగైనప్పుడు, దాని నాతడు కర్ణాట మనుట ఎట్లు పొసగినది. పొసగకున్న, నాటి పండితమండలి దాని నెట్లు అంగీకరించినది. నేటి మనము తప్ప, ఇన్నేండ్ల కాలవ్యవధిలో శ్రీనాథుని మాటను ఎవరును ఏల అధిక్షేపింప లేదు. దీనికి రెండు కారణములను చెప్పవచ్చును.

ఒకటి ఔదాసీన్యము. రెండవది శ్రీనాథుడన్న మాటను అంగీకరించుట. ఔదాసీన్యము నకు కారణము లేమని చెప్పగలము. అంగీకరించినారన్న శ్రీనాథుని భాషను (తెలుగును) కర్ణాట భాషయనుటలోని ఔచిత్యమును వారెరుగుదురన్నమాట. మనము తర్కించుచున్నామన్న, మన ప్రాచీనులకు తెలిసిన విషయము మనకు అంది రాలేదన్న మాట! కనుక, తెలుగును కర్ణాట మనుట ఎట్లో తెలియవలసియున్నది. అది తెలియవలయునన్న అతని జన్మస్థానము తెలియుట, అది కర్ణాటాంతర్గతమని తెలియుట అవసరము.

జన్మస్థల విషయమై గల వాదములను ముందు చూచితిమి. స్థిరీకరింప బడకుండుటయు తెలిసినది. కారణము కాల్పట్టణ మేదియో గుర్తు పట్టలేకుండుట. అది అట్లుండ, భీమఖండ కృతిపతి బెండపూడి అన్నమంత్రి శ్రీనాథుని `పాకనాటింటి వాడవు, బాంధవుడవు, కమలనాభుని పౌత్రుడ వమలమతివి` అని సంభావించినాడు. పాకనాటింటివాడవు అనగా పాకనాడు యింటిపేరుగా గలవాడనుట.* కాని, దానినట్లు గాక పాకనాటివాడవు అని గ్రహింపవలసి యున్నదని కొందరు భావించిరి. ఏమైనను శ్రీనాథునికి పాకనాటితో సంసర్గము కలదని పై పక్కణము స్థిరీకరించు చున్నది. పాకనాడనగా నెల్లూరిసీమ. తూర్పున సముద్రము. ఉత్తరమున పెన్న , దక్షిణమున గూడూరుకు నాయుడుపేటకు మధ్యప్రాంతము. పడుమర వెంకటగిరికి ఉత్తర దక్షిణములందున్నప్రాంతము. ఈ సరిహద్దుల లోపలనున్నది పాకనాడు. అయితే ఉత్తరపుహద్దు ఒంగోలు కావలనున్న ముసీనది యనిచెప్పవలసియున్నది. పాకనాటికి దక్షిణముననున్నది తొండమండలము. దానికి మరింత దక్షణమున నున్నది అరువైనాడు. ఇక పాకనాటికి ఉత్తరమున గలది వెలనాడు దానికి మరింత ఉత్తరమున నున్నది గుద్దవాదినాడు (గుడివాడ సీమ). దానికి ఉత్తరానగలది వేంగినాడు. వెలనాటికి పడుమట నున్నది కొండపడుమటిసీమ. ఇచ్చట కొండయనగా కొండవీడు కొండలని తెలియవలయును. దానికి పశ్చిమాన ఉన్నది తూర్పుకనుమల పర్వంతము లేదా కృష్ణానదిపర్యంతము పల్లెనాడు లేక పలనాడు. పలనాటితో కలుపుకుని తూర్పు కనుమలకు తూర్పున గల భూభాగమంతయు కమ్మనాడు. అనగా వెలనాటితో సహా•

---

* ఈ అభిప్రాయమును వెలిబుచ్చినవారు బేకుమళ్లఅచ్యుతరావుగారు. నిజమున కదియే సరియైనది. ఇంటివాడవనగా, ఇంటిపేరింటి వాడనియే తప్పు, పాకనాటినియోగిశాఖా బ్రాహ్మణుడనుట సమర్థింపదగినదికాదు. ఆయానాడులపేర్లు ఇంటిపేర్లుగల వారున్నారు. ఉదా:- కాసలనాటి, కరణము, కమ్మ మొదలయినవి. చివరి రెంటి యందును నాడు లోపించినది

• రెండు కమ్మలకు మధ్యగలది కమ్మనాడు. కమ్మయనగా, నది. గుండ్లకమ్మపేరకమ్మలు ఆరెండునదులు. పేరకమ్మ అనగా కృష్ణానది. వెలమనగా తీరము. తీరస్థభూమివెలనాడు.

పాకనాటికి పశ్చిమమున, కనుమల నంటి యున్నదేశము కనుమయవ్వలి దేశమని సంభావింపబడినది. స్థూలముగ నిది, ఒకనాటి సీమా విభాగము. అందుశ్రీనాథుడు పాకనాటివాడు. ఇది స్పష్టమే.

శ్రీనాథుడు పాకనాటి వాడని చెప్పినంత మాత్రమున, ఆయన జన్మస్థలమును చెప్పినట్లు కాదుగదా! తన తాత కమలనాభామాత్యుడు వారిధి తటీ కాల్పట్టణా ధీశ్వరుడని శ్రీనాథుని మాట. 'వారిధితటి' అని చెప్పుటకు కారణమేమై యుండును. వారిధితటి యందే గాక, ఇతరప్రాంతములందును కాల్పట్టణములున్నప్పుడే, అట్టినిర్దేశ మవసరమగును. అట్టివి కలవా! ఉట్టంకింపబడిన కాల్పట్టణమే తెలియరాలేదు. ఇతరములగు కాల్పట్టణములును కానరావు. ఇక్కడ ఒక విషయము గుర్తు పెట్టి కొనవలసియున్నది. పట్టణమను మాట సముద్రతీర జనావాసములకు, ముఖ్యముగా, ఓడరేవులు గలవానికే చెల్లివచ్చును. కళింగపట్టణమాదిగా భీముని పట్నము, విశాఖ పట్టణము, మచిలీపట్నము నిజాముపట్టణము, రామాయపట్నము, చెన్నపట్నము. నాగపట్నము మొదలగునవన్నియు తీరస్థములగుట గమనార్హము. పెద్ద పెద్ద జనావాసములను పట్నములనుట నేటి పద్ధతి. కాని ఎట్టి జనావాసములను ఏ పేరులతో సంభావింపవలయునో తెలిసిన స్థితి ఆనాటిది. కనుక తీరస్థముగాని కాల్పట్టణము లుండుట, ఉండుననుట సరిపడనిసంగతి. అనగా శ్రీనాథుడు తన జన్మస్థలముగ సంభావించినది (కనకక్ష్మాధరధీరు..... ఇత్యాదిగాగల పద్యపాదమందలి కాల్పట్టణ విషయము) కాల్పట్టణము కాదన్నమాట. అవునన్నచో వార్థితటి అని చెప్పుట సమంజసముకాదు. మరి ఏమైయుండవచ్చును. ఏమైనను ఆపేరుతో మరి ఒకటి లేక రెండు జనావాసములుండి యుండవలయును. అప్పుడు మాత్రమే వాటినుండి వివక్ష చేయుటకు 'వార్థితటి' నిర్దేశమవసర మగును. దీనిని సమన్వయించుట కనువుగ. 'కనకక్ష్మాధరధీరువారిధి తటీ కాల్పట్టణాధీశ్వరున్ అనుదానిని "కనకక్ష్మాధరధీరువార్థితట పాకల్పట్టణా ధీశ్వరున్' అని చదివిన సంగతమగును. ఇట్లు మార్చుటకు మనకుగల యధికారమేమి? అధికారము లేదనుట స్పష్టము. కాని అనుమానించుటకు అవకాశ మున్నది. అందొకటి పైనపేర్కొన్నదియే. కాల్పట్టణములు లేకుండుట. పట్టణ మనుపదము ఓడరేవుకుమాత్రమే సంకేతమగుట కాగా పాకల యనుపట్టణము గలదా! అది ఓడరేవుగాగలదా! ఆపేరుతో మరియొక జనావాసము గలదా! అదియును పట్టణమేనా! అగుచో అదియు ఓడరేవగునా! ఓడరేవే అయినపుడు, అది సముద్ర తీరముననే వుండునుగదా! మరి వార్థితట మను నిర్దేశమెట్లు చెల్లివచ్చును! ఈ సందేహములకు సమాధానము కనుగొనిననే, పైపాఠమునందలిది వారధిత టీకాల్పట్టణముగాక, వార్థితటపాకాల్పట్టణమని అనుమానించుటకు, కడకుతీర్మా

నించుటకు అవకాశము కలుగును. ఇన్ని ప్రశ్నలకు సమాధానము వెదకుటకంటె. 'కనకక్ష్మాధరధీరువా....త.... కల్పట్టణాధీశ్వరున్' అని మాత్రమే పాఠము లభింపగా, దానిని కనకక్ష్మాధరధీరువారధి తటీకాల్పట్టణాధీశ్వరున్, అని పూరించి నారని చెప్పిన చాలును. అంతేగాక, శ్రీనాథ స్వహస్త లిఖితమగు ప్రతికి ఎన్ని ప్రుత్రికలు వెలసినవో! కనుక అట్టి పూరణమునకు అవకాశము లేదని భావింపలేము. అయినంత మాత్రమున, దానిని తప్పుగాభావించి, కనకక్ష్మాధరధీరు వార్ధితటపాకల్పట్టణాధీశ్వరున్ అను పాఠమునే సరియైనదని భావించుట ఎట్లు? ఒకటి కాల్పట్టణములు లేవనుట. రెండవది ఇతః పూర్వము లేవనెత్తిన ప్రశ్నలో దాగియున్నది. పాకల అను గ్రామము మరొకటి గలదా! ఒకటిగాదు. మూడుగలవు. అవినేటి ప్రకాశంజిల్లా యందలిదొకటి. రెండవది చిత్తూరుజిల్లా యందలిది. మూడవది తెలంగాణము నందలిది. ఇందు రెండవ దానికి, మూడవదానికి ఇచట ప్రసక్తిలేదు. కారణము శ్రీనాథుడు పాకనాటి వాడు. కనుక చిత్తూరు జిల్లా యందలి పాకల, తెలంగాణము నందలి పాకల అతని జన్మస్థలములు కానేరవు. మొదటిది మూసి, పాలేరుల సంగమస్థానము సమీపమున నున్నది. కాలాంతరమున ఆ రెండనదులు గమనమును కొంత ఉత్తరమునకు మార్చుకొనినవి. ఆమార్పుకు కారణమైనది పదునారవ శతాబ్దప్రారంభమున వచ్చిన పెనుతుపాను. అదే రాత్రి సంభవించిన భూకంపము. ఈ భూకంపమునకు కేంద్రస్థానము పొదిలి. అశేష జననష్టము. కృష్ణ, గుండ్ల కమ్మలు గమనమును మార్చుకొనుట, మాచర్ల చెన్న కేశవాలయ స్థంభములు పడిపోవుట మున్నగు ఘటనలు దాని ఫలితములే. ఇక ఈ పాకల ఓడరేవేనా! స్పష్టముగ నది ఓడరేవు. ఇప్పటికిని ఆచిహ్నములుగలవు. తెలంగాణమునందలి పాకలను విడిచినను చిత్తూరు జిల్లా యందలి పాకల పట్టణ మగునా! పట్టణము రేవునకే సంకేతమనుమాట అభ్యంతరముగ నిలువదా! ఇట్లనుటకు కారణము, ఇది కూడ పట్టణమైననే, శ్రీనాథుడు తన జన్మస్థలమును 'వార్ధితటపాకల్పట్టణ' మని వివక్షించినాడనుట పొసగును. పట్టణము గాకున్న వార్ధితటమను నిర్దేశము వ్యర్థముకదా! వీనిని సమన్వయ పరచుటెట్లు! పట్టణము, శబ్దోత్పత్తి ననుసరించి రేవునకే చెల్లివచ్చునను మాట స్థితిస్థాపకము. పెద్ద జనావాసములను పట్టణములనుట నేటి వాడుక యని పూర్వము చెప్పబడినది. నాడు పెద్ద జనావాసములను పట్టణము లనలేదుగాని జలధి తీరస్థ జనావాసములనే గాక, నదీతీరస్థ జలతీరస్థ జనావాసములను పట్టణములనుట వ్యవహారమున గలదు. ఉదాహరణలుగా పురుషోత్తమ పట్టణము , శ్రీ రంగపట్టణము చెన్నపట్నము లను గ్రహింప వచ్చును. పురుషోత్తమపట్నమనుపేరుతో కృష్ణా మండలము నందొకటి (ముస్తాబాదుకు సమీపము), గుంటూరు మండలము నందొకటి (చిలకలూరి పేట సమీపము) కలవు. ఈ రెండును పురుషోత్తమ గజపతి పేరుమీదుగా ఏర్పడినవి. కృష్ణామండలము నందలి పురుషోత్తమ పట్నము పెద్ద

జలాశయ తీరస్థము. గుంటూరు మండలము నందలిది ఓగేరువాగు (శాసనములలో నిది ఒంగేరునదిగా ప్రస్తావితము) తీరస్థము. శ్రీరంగపట్టణము, చెన్నపట్నములు మైసూరురాజ్యమునందలి కావేరీ నదీ తీరస్థములు. అనగా 'పట్టణము' అనుపదము మొదలు సముద్రతీరస్థ రేవులకు సంకేతమై కాలాంతరమున క్రమముగ జలాశయ తీరస్థములు, పరిమాణమున పెద్దవైన జనావాసములకు సంకేతమై నిలిచినది. ఇందు చిత్తూరు జిల్లా యందలి పాకల జలాశయ తీరస్థము. తెలంగాణము నందలి పాకలకంటె, ఈ పాకలయే చర్చయందలి పాకలకు సమీపమునందలిది. పట్టణ పదముతో సంభావింప నర్హమైనది. అయితే వార్ధి తటము నందలిదిగాదు. కనుకనే, నేటి ప్రకాశంజిల్లా యందలిపాకలను వార్ధి తటమని వివక్షింప వలసి వచ్చినది. కాల్పట్టణములు గానరాకుండుట, పాకల్పట్టము లుండుట కారణముగా, ఉపలబ్ధమైన పాఠమును మార్చుటకు సావకాశ మేర్పడినది. పైనపేర్కొనబడిన పాకల పాకనాటిలోని దనుట నిర్వివాదాంశము.

ఏమైనను పై సమర్థనము ఊహాపోహల సమ్మేళనము. అదిసరియైనది కావచ్చును. కాకపోవచ్చును. కావచ్చు ననుటకు బలీయమగు ఇతరసాక్ష్యములు లభించిననే, అది కాల్పట్టణము గాదని పాకల్పట్టణమని నిర్ధారిచుటకు వలను పడును. అట్టివేమైన గలవేమో పరిశీలింతము.

శ్రీనాథుని జన్మస్థలముగ, లేక, అతని తాత కమలనాభామాత్యుని ఆధిపత్యము చెల్లివచ్చిన 'పాకల' యని (పాకనాటిలోనిది) సందేహింపబడుతున్న గ్రామము నాడు కాకతీయుల వశము నందుండి యుండవలయును. లేకున్న పైచర్చ యంతయు వ్యర్థమగును. ఈ పాకలను ఇటీవలి కాలమున నేను సందర్శించుట జరిగినది. పాకలలో ప్రాచీనమైన రామలింగేశ్వరాలయము గలదు. దీనికి పూర్వదిశ యందు నిరాశ్రయమగు శివలింగమును గలదు. కాగా క్రీ.శ. 1309లో ఈ శివాలయమును రెండవకాకతి ప్రతాపరుద్రుడు పునర్నిర్మించెను. ఈ మేరకు శాసనస్థ సాక్ష్యముగలదు. కనుక నాటికీ ప్రాంతము కాకతీయుల అధీనమునందున్నదనుటలో విప్రతిపత్తిలేదు. అందువలన కమలనాభామాత్యుడు వినమత్కాకతి సార్వభౌముడగుట తటస్థించినది. కనుక ఆతనిని వారధితటీ కాల్పట్టణాధీశ్వరునిగా కంటె వార్ధితట పాకల్పట్టణాధీశ్వరుడని చెప్పుట ఔచిత్యభంగముకానేరదు. మరియొక సాక్ష్యమును చూతము. శ్రీనాధుని హరవిలాస కృతిపతి అవచిత్ప్రియశెట్టి. ఇతనికి గురువు పిల్లల మఱ్ఱి పెద్దన్న. ఈ పెద్దన్న కలికివాయి బిట్రగుంట వాడని శృంగారశాకుంతలమున పినవీరభద్రుడు చెప్పియున్నాడు. ఇది పై పాకలకు అత్యంత సమీపగ్రామము. శృంగార శాకుంతల కృతిభర్త చిల్లర వెన్నయామాత్యుడు. ఇతడు సోమరాజుపల్లికి పాలకుడు. ఈ సోమరాజుపల్లియు పాకలకు సమీపగ్రామము. అవచితిప్పయ శ్రీనాథునికి

బాల్యసఖుడు. ఆ తిప్పయ గురువు పిల్లలమఱ్ఱి పెద్దన్న పాకల సమీప గ్రామమందలివాడు. ఈ కారణములచే శ్రీనాథుని జన్మస్థలము కాల్పట్టణ మనుట కంటె పాకల్పట్టణ మనుట మేలుగదా! కాల్పట్టణము కనబడకున్నది. ఒకవేళ కాల్పట్టణమే యైనను, అది పై పరిసరములలోనే వుండవలయును తప్ప, కృష్ణా, గుంటూరు మండలములలో నుండుట అసంభవము. ఇప్పటికిది జన్మస్థల విషయమైన చర్చ. ఇక ఈ జన్మస్థలము కర్ణాటము నందలిదని నిరూపించిన ఆయనభాష కర్ణాట మగును. అతడు కర్ణాటకటకపద్మవనహేళి యగును. దీని కగు ఉపపత్తులను కనుగొందము.

కర్ణాటకమను పేరుతో సర్వులకు తెలిసినది, ఆపేరుతో వ్యవహరింప బడుచున్న కర్ణాటకరాష్ట్రము. ఇది నేటిస్థితి. కాగా వెనుకటి స్థితివేరుగానున్నది. నేటి కర్ణాటక రాష్ట్రముతో పాటు గోవాప్రాంతము, తీరాంధ్రము, కోయంబత్తూరు, సేలం, మధుర, తంజావూరు జిల్లాల భూభాగమంతటికి కర్ణాటమను పేరు చెల్లి వచ్చినది. ఆర్కాటు నవాబులను కర్ణాటక నవాబులని వ్యవహరింపబడి యుండుటయు తెలిసినదే. ఈ సందర్భమున మద్రాసు ఎడ్మినిస్ట్రేటివ్ వాల్యూమ్ మూడు (Glossary) నందుగల ఉట్టంకింపును గమనింపవలసినది.

★ **Carnatic:** From (kar, tamil. black+nadu, Tamil. country) In allusion to the black regady (regar) soil. The term is found in varahamihiran. There are other black coruntries in the sense, tracts of black soil being found scttered throughtout the valley of the Kistna, and occupying the lower plains and flats of Coimbatore, Salem, Madura, Tanjore, Ramnad, and Tinnevelly.

a) The carnatic proper may be defined as bounded:- to the south by the plateau of Mysore; to the east by a line passing through Nandidroog, Penuconda, Adony, Ryechore and Gulbarga, Beedar, its most northern point; to the north by a irrigular line passing form Beedar by Calyanam, Sholapur, Pundarpore and Kolhapore to Gheriah or Viziadroog on the sea.

b) The nawabs of Arcot, were known as Nawabs of carnatica payeen ghaut, or that adjunct to the carnatic proper which lay below ghats. But the English in error dropped the distinctive term payeen ghaut and applied the unmeaning term carnatic to the whole country below the ghauts on line eastern side of the peninsula. By just the same error the terms canara was extended

---

★ From Pages126 or 127 Glossary of Madras Presidency Ed.by C.D. Maclean.

to the country below the western ghauts. The English carnatic was devided into Southern, Central and Nortern. The first is the country of south of Coleroon comprising Puduccottah, Tinnervelly, Madura, part of Trichinapolly and Tanjore. Central carnatic is the country between Coleroon and Pennair comprising the larger portion of Trichnopolly, the whole North and South Arcot, Chengalput and section of Nellore. Northern carnatic was limited by the Pennair on one extremity, and Guntoor on the other including within it the remainder of Nellore. The English carnatic extended from lat 8º 10' to lat. 16º and from the sea on the east to long 77º20' on the west.

ఇందు మొదట ప్రస్తావింపబడిన కర్ణాటకమునకు కర్ణాటమని చెల్లుబడి గలదనుటకు శ్రీశైలమునకు పశ్చిమాన కర్ణాటము గలదను పాల్కురికి సోమన బసవపురాణము నందలి వ్రాత ప్రబలసాక్ష్యము. కర్ణాటశబ్దము ఆదేశమునకు అందలి భాషకు (కన్నడము)ను పర్యాయముగా వ్యవహారము గలదనుట స్పష్టము. కానడరాగము అనుపేరు కన్నడ మనుపదము నుండి ఉత్పన్నమైనదే.

అది అట్లుండ మొత్తము దాక్షిణాత్య సంగీతమునకు కర్ణాట సంగీతమను వ్యవహారము చెల్లివచ్చుట గమనింపదగినది. దీని కేమి కారణము. కర్ణాట శబ్దమును బులుసువెంకటరమణయ్యగారు కర్ణ అట శబ్దములుగా భావించి, వినసొంపైన భాషయని శ్రీనాథుడు భాషాపరముగా చెప్పిన దానినే, కర్ణాటసంగీత మను దానికి కూడ వర్తింపచేయుదమా! అయిన ఎవరి భాషా, సంగీతములు వారికి వినసొంపుగా నుండవా? కనుక దీనిని అంగీకరింపలేము. వారి భాషలు వారికున్నను, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితర్ మున్నగు ఆంధ్రేతర భాషావ్యవహర్తలు, తెలుగున వారి సాహిత్యము వెలయించిరి. అనగా సంగీతమునకు అనువైనభాష తెలుగని వారు విశ్వసించిరి. అనగా శ్రుతిహితమగుననుటయే. అయితే బులుసువారి నిర్వచనము వలనగాదు. తెలుగు అజంతభాష. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అనునది తెలుగునకు గల మరియొక ప్రశంస. కనుక మిగిలిన భాషలకంటె దీనియందొక మాధుర్యమున్నది. ముఖ్యముగ సంగీత విషయమై దానిని అనువర్తింప జేసినపుడు. కాగా మొత్తము సంగీత బాణికి కర్ణాటమని వ్యవహరించుటకు కారణము, తెలుగునకు కర్ణాటమను పేరుండుటయే. దీనిని స్థాపించుటకు పూర్వము కర్ణాటభాషా లక్షణము తెలియవలసి యున్నది. అనగా వ్యాకరణ సంబంధమైకాదు. మాధుర్యవిషయమై తెలియవలసి యున్నది. మాధుర్యవిషయమై కర్ణాటభాష లక్షణము తెలియుట ఒకటి. రెండవది ఆ, కర్ణాటము తెలుగేనని తెలియుట మరొకటి.

రాజశేఖరుడు కావ్యమీమాంసలో కర్ణాట భాషను గూర్చి

రసః కోప్యస్తు కావ్యస్తురీతిః కోపస్తువాగుణః<br>
సగర్వం సర్వకర్ణాటాష్టంకారోత్తరపాఠినః

అని చెప్పియున్నాడు. రసమేమున్నను, రీతిఏదైనను, గుణమేమున్నను, కర్ణాటదేశీయులు సగర్వముగ టంకారమును చేర్చి చదువుదురని పై దాని భావము. ఈ టకారప్రయోగము ఆంధ్రభాషకు ప్రత్యేకలక్షణము. ఆంధ్రబ్రాహ్మణుల వ్యవహారమున దీనిని ఇప్పుడును గమనింప గలము. వచ్చాట్ట, వెళ్లాట్ట అనువిధమున. సాధారణజనానీకము విషయమున కూడ, ఇది కలదు. ఒకరు చెప్పిన దానిని యథాతథముగా తనముఖమున ఇతరులకువిన్పించి, చివర అవునటా అనుదానికి మారుగా 'అఁవటా' అని చేర్చి చెప్పెదరు. చిక్కని గ్రామీణ భాషతో పరిచయమున్న వారికి ఇది ఎరుకలోనిదే. ఇది కావ్యములకును ప్రాకినది. క్రీడాభిరామమున

చాటుప్రౌఢి బిసాళమాడెదవు కాసల్నాటి బాపండవో
శాటీహాటకనిష్కముల్ వెలిగ జంఝూటంబు చాలించుక
ర్ణాటస్త్రీలు కటారికత్తియలటే రాపాడగాఁ బట్టగాఁ
'డాటా' లీడ గుణింపరాదు పెఱచోటంబోలె పైపాటునన్.

అని ఆంధ్రనగరము (ఓరుగల్లు) నందలి కర్ణాటవేశ్య, టిట్టిభమంచనశర్మలు తనను పరిహసించిన వేళపలికినది. ఇట్లు ఆమె పలుకుటకు కారణము మంచన శర్మ ఆమెతో ననిన మాటలు. అవి.

పంచారించిన నీపయోధరములాస్ఫాలింతునో, లేతబొ
మ్మంచుంగెంజిగురాకుమోవి జెసిధాత్వర్థంబనుష్ఠింతునో
పంచాస్త్రోపనిషద్రహస్యపరమ బ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామ పదంబు ముట్టుదునొ యోకర్ణాటతాటంకినీ!

వ్రాలని నీ చన్నులతో
వ్రాలెడు జక్కవలుసరియెఁ వలలంబెట్టం
జాలెడునీ కన్నులతో
బాలకి! సదృశములె వలలఁబడు మత్స్యంబుల్.

అనునవి. కానిపై పద్యములలో ఎచ్చటను, ఆమె అనినట్లు 'టాటా'లు లేవు. మరి ఆమె అట్లు ఎందుకనినట్లు. అనగా 'టాటా'లను యథావిధిగా ఇచ్చుట గ్రహింపరాదు. కేవలము వారిమాటలలోని ఆకుకు పోకకు అందని ఆంతర్యమునే గ్రహింపవలయును. ఆమాటే కవి నర్మగర్భముగా వారు పలికి నారని చెప్పియున్నాడు. అట్లే రాజశేఖరుని మాటను కూడ యథావిధిగా కాక, అందలి విశిష్ట లక్షణమగు రాగముతీసి పలుకుటగా గ్రహింపవచ్చును. ఇందు మరొకవిశేషముగలదు. రాజశేఖరుడు చెప్పిన విశిష్టలక్షణము కర్ణాటమునకు సంబంధించినది. కాని ఇచ్చుటి వేశ్య కర్ణాటస్త్రీ. కాగా ఆమె ఆక్షేపణమునకు గురియైనవారు కాసల్నాటివారు. అనగా

రాజశేఖరుడు చెప్పిన విశిష్టలక్షణము వ్యత్యస్తమయినది. దీనిని సమర్థించుట ఎట్లు అను ప్రశ్న ఉదయించును. కాసలనాడు కృష్ణకు ఆవల మెదకు జిల్లాలోని భాగము. కృష్ణకు ఈవలి తీరాంధ్రము కర్ణాటము. తూర్పు కనుమల నంటియున్న తూర్పు భాగమునకు కనుమ యావలి ప్రాంతమని పేరు. తీరాంధ్రము కర్ణాటమని గదా తీర్మానింపవలసి యున్నది. దానికి వలయు ఉపపత్తులను, ఈ 'కనుమ యవ్వలి' యను దాని మూలమున గ్రహించుటకు అవకాశము గలదు. ఈ 'కనుమయవ్వలి' ప్రాంతమునకే కరణదేశమను పేరుగలదని ముందుచెప్పుట జరిగినది.

పై చెప్పిన క్రీడాభిరామ విషయమునకు కొనసాగింపుగా, అనగా ఆ కర్ణాట వేశ్యతో మంచనశర్మ 'కౌగిలింపగదవె। యోకరణకాంత।' యనినాడు. అనగా కరణకాంత, కర్ణాటతాటంకిని పదములు ఒకరినే ఉద్దేశించి చెప్పినవి. దీనిమూలమున కరణదేశము, కర్ణాట దేశములు రెండును ఒకటే నని బోధపడుచున్నవి. ఈ కరణదేశము కనుమయవ్వలి దేశమను మాటయు అందేగలదు.

'విజ్జోడుపడనిడ్డ..... అనుపద్యము ఎత్తుగీతిలో నిట్లుగలదు.

✪ ఓరుగంటి పురంబులో, నోరఁగ్రంతఁ
బెద్దయెలుఁగుననమ్మె సంపెంగనూనె
కోకిలము పంచమ శ్రుతిఁగొసరినట్లు
కనుమయవ్వలి దేశంబు కరణకాంత.

కనుక కనుమ యవ్వలి దేశము కరణదేశము. దీనికే కర్ణాటదేశమను పేరు గలదనుటకు ప్రమాణము శివరాత్రిమాహాత్మ్యమునందుగలదు.

★ వేడ్కనృత్యంబు లాడిరి వీథులందుఁ
బాడిరెత్తిలి పిక కుహూ పంచమమునఁ
బంజళంబున ధవళప్రబంధగీతి
కనుమయవ్వలి కర్ణాటకమల ముఖులు.

దీనినిబట్టి కనుమయవ్వలి దేశమునకు కరణదేశము, కర్ణాట దేశములను పేర్లున్నట్లు స్పష్టమగుచున్నది. కనుమ అనగా తూర్పు కనుమలు. అవ్వలి శబ్దమును అన్వయించుట ఎట్లు. ఎటున్నవారికి అటువైపు అవ్వలి యగును. కాని ఇచ్చట ఆధారముగలదు. క్రీడాభిరామమునకు రంగస్థలము ఓరుగల్లు. శివరాత్రి మహాత్మ్య కథా సందర్భ ప్రదేశము వింధ్యకు దక్షిణమున గల దిగువ ప్రాంతము. ఈ రెంటికి ఆవలిప్రాంతము కనుమలకు తూర్పు ప్రాంతమే యగును. కావున సంధిగ్ధము తొలగినది. కనుక కరణ, కర్ణాట ప్రాంతములు ఒక్కటే. కాని కొంత భేదముగలదు. కర్ణాట భూమి (పాకనాడు)కి పశ్చిమాన కనుమల నంటి యున్న భూభాగము

✪ క్రీడాభిరామము. పద్యసంఖ్య 101. ఎమెస్కొప్రచురణ

★ శివరాత్రి మహాత్మము, ద్వితీయాశ్వాసము, పద్యసంఖ్య 54, తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ.

కరణదేశము. స్థలనిర్దేశమున రెంటిని పర్యాయముగా నుపయోగింబడినదిగా పూర్వోక్త విషయమును గ్రహింపవలయును. పై ఉపపత్తులను బట్టి కర్ణాటమనగా తీరాంధ్రమని తెలియవచ్చినది. అయితే ఇది నల్లనేల గలప్రాంతముగాదు. మరి కర్ణాడు అనగా నల్లభూమి యని చెప్పిన మాటతో దీనినెట్లు సమసింప జేయగలము. కర్ణాటక రాష్ట్రమునకు నల్లనినాడను నిర్వచనము చెల్లివచ్చును. తీరాంధ్రమున కది చెల్లిరాదు. ఇచ్చట కరనాడనగా తీరభూమియని యర్థము. కరయనగా సముద్రము టొడ్డు. కరవాక, కరకట్ట మొదలగువానిలో గల యర్థమును గ్రహింపనగును. కరవాది (కరవది) యను గ్రామనామము ఆయర్థముగలిగినదే. కర్ణాటమన తీరాంధ్రమని చెప్పుటకు గల మరియొక ఉపపత్తిని గమనింతము.

తెలుగున ఒక చాటు పద్యముగలదు.

కాటుకంటినీరు చనుకట్టు పయింబడనేలనేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల యోమదంబ యో
హాటక గర్భురాణి నిన్నాకటికింగొనిపోయి యల్ల కర్ణాట
కిరాట కీచకులకమ్మనను(ద్రిశుద్ధిగనమ్ము భారతీ!

ఇది ఎవరిదో స్పష్టముగ తెలియరాదుగాని పోతన కృతముగ వ్యవహృతి నందినది. కర్తృత్వ విషయమటుండనిండు. వక్తవ్యాంశమును గమనింతము. ఆకలికారణముగ, కావ్యకృతిని కర్ణాట కిరాట కీచకులకు అమ్మననుచున్నాడు కవి. ఇట్లేల యనవలసివచ్చినది. ఎవరైన అట్లు అమ్మికొనిన విషయము అతనికి తెలిసి యుండవలయును. అట్లు అమ్మినవారెవరు. తెలియరాదు. కాని అమ్మినది మాత్రము కర్ణాటకిరాట కీచకునకు. ఎవరీ కర్ణాట కిరాట కీచకుడు. కీచకశబ్దము నిందార్థకము. కనుక కొన్నవాడు కిరాటుడు. అతడు కర్ణాట దేశస్థుడు. కిరాటుడనగా వైశ్యుడు. ఈ అర్థమున క్రీడాభిరామమున, వసుచరిత్రమునందు ప్రయోగములు గలవు. హరవిలాసమున చిరుతొండనంబిని కృతిపతియైన అవచి తిప్పయ వంశమగు వాణిజ్యవంశంబునకు కూటస్థుడని శ్రీనాథుడు సంభావించి యున్నాడు. ఆప్రకారము అవచితిప్పయము కిరాటుడు. అతడు నెల్లూరి సీమవాడు. ఆనెల్లూరిసీమ కర్ణాటమందలిది. శ్రీనాథుడు అవచితిప్పయకు హరివిలాస కృతినిచ్చుటను అమ్మికొనుటగా పై పద్యకర్తభావించియున్నాడేమో! అట్లు తాను అమ్మననుచున్నాడు. నరాంకితము చేయనన్నవాడు పోతన. అందువలన పై పద్య కర్తను పోతనగా భావించి యుండవచ్చును లోకము. వివరములు కర్ణాటకీచకులెవరు అను వ్యాసమున చూడనగును.

మరియొక ఉపపత్తి చూతము. ఆంధ్రకవితరంగణిలో చాగంటి శేషయ్యగారు ఈ ఉపపత్తిని చూపియున్నారు. వీరాచార్యులనువారు సంస్కృతమున వ్రాసిన గణితశాస్త్రమును తెలుగు చేసిన ఎలుంగంటిపెద్దన ఇట్లుచెప్పినాడు.

హాటకమైన ప్రకీర్ణము
పాటించి గుణింప జేతు బహుపద్ధతులన్
గాటంబగు లెక్కలుక
ర్ణాటకమున వెలయ సూర్యనారాయణుడా!

కనుక నేటి మన యీ వాగ్వ్యవహారము (linguafranca) నకు కర్ణాటమని పేరున్నట్లు స్పష్టమగుచున్నది. వాగ్వ్యవహారమను మాట స్థూలార్థమున గ్రహింపనగును. కాకున్న శ్రీనాథుని వక్కణము నిలువదు. సమష్టిలో తెలుగంతయు నొక్కటేకదా! అయినపుడు రాజమహేంద్రవరము నందలి వ్యవహారము అదియేకదా! మరిశ్రీనాథుడు వారిని ఆక్షేపించుచు తనభాష కర్ణాటమనుట ఎట్లు పొసగును. కావున, వారి వ్యవహారము కంటె, తనవ్యవహారము భిన్నమను నర్థముననే దానిని ప్రయోగించెననుట సత్యము. అనగా తనదైన భాష. కర్ణాట మండలమునందలిది సుమా! మీరనుకున్నట్లు కేవలము సంస్కృతమును గాదు. అట్లని ఆంధ్రమునుగాదు. కొంత విశిష్టలక్షణమును సంతరించుకొన్న గుంటూరు, నెల్లూరు మండలము లందలి తీరాంధ్రభాష యని శ్రీనాథుని వక్కణము. అది కర్ణాటము. అందువలన ఆయనభాష కర్ణాటము. ఆయన కర్ణాటకటక పద్మవనహేళి.

ఇందలి కటక శబ్దమునకు రాజధాని నగరమని యర్థముచెప్పుట జరుగు చున్నది. శ్రీనాథుడప్పుడున్నది రాజమహేంద్రవరమున. అదివీరభద్రుని రాజధానియే. దానిని గూర్చి యే చెప్పియుండు ననుట సంగతముకాదు. కారణము. వివాదమచ్చటి పండితులతో. అదియుగాక అదికర్ణాట దేశము కాదు. కర్ణాట దేశమున అప్పటి రాజధాని ఏది. తెలియరాదు. కొండవీడు పతనమైన పిదప, రాయలు దండెత్తి వచ్చువరకు ఆప్రాంతము ఏకరాజ్యముగ నున్నట్లు దాఖలా లేదు. మరి అందెవరి రాజధానిని ఆతడుట్టంకింప గలడు. మొదలు అక్కడ ఆదరణము లేకయేగదా అతడు రాజమహేంద్రమునకు పయన మైనది. కనుక కర్ణాటమునందలి రాజధాని యని చెప్పినాడనుట పొసగదు. కటక శబ్దమునకు పర్వతసాను ప్రాంతమను నర్థము కలదు. అప్పుడు కర్ణాట, కటక శబ్దములను రెండుగా గ్రహింపవలయును. అనగా తీరాంధ్రము, దానికి పడుమర కనుమలపర్యంతముగల భూభాగమగు పద్మవనమునకు అతడుహేళి యగును. ★ఇక అతనికావ్యములలో నెల్లూరి సీమాసంబంధి పదములు కొల్లలుగ నుపయోగించి యుండుట సాహితీ ప్రియులెల్లరు ఎరింగిననదే.

---

★ ఇది కేవలము ఊహాపోహ విచారముకాదు. నెల్లూరి జిల్లాయందలి ఉదయగిరి కర్ణాటకటక మధ్యస్థమైనదని శాసన స్థసాక్ష్యము గలదు.

ఉదయగిరి నామ్నినగరే కాంతేకర్నాటకటక మధ్యస్థలే.....

శాసనసంఖ్య 33, South Indian Inscriptions Vol XVI

కాగా ఒక్కసందేహము. శ్రీనాథుడు కర్ణాటక రాష్ట్రమును సందర్శించినాడు. అనగా అతనికి రెండు కర్ణాటకములు తెలియును. అట్టి సందర్భమున తనభాష కర్ణాటభాషయనిన, భవిష్యమున, ఆతడు దేనినుద్దేశించి ఆమాట చెప్పియుండునను అనుమానము కలుగునే. (నిజమునకు ఈ చర్చ అట్టి అనుమానమువలననే గదా). మరిదానినెట్లు నివారింపదలచినాడనునది ఆ సందేహము. దానికగు ఉపాయమేదైన అతడు సంఘటించినాడేమో చూతము. శ్రీనాథుడు భీమఖండ కృతిపతి యగు అన్నమంత్రికి గల వివిధ భాషాపరిచయమును గూర్చి ఇట్లు చెప్పియున్నాడు.

అరబీభాషతురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధారఘూ
ర్జర భాష మలయాళభాష శకభాషా సింధు సౌవీర బ
ర్బర భాషల్ కరహాట భాష మఱియుంభాషా విశేషంబుల
చ్చేరునై వచ్చునరేటి యన్ననికి గోష్ఠీ సంప్రయోగంబులన్.

-భీమేశ్వరపురాణము.

ఇందుప్రస్తావింపబడిన 'గజకర్ణాటాంధ్ర' సమాసమును గజ, కర్ణాట, ఆంధ్రములుగా భావించి, గజశబ్దమును ఓఢ్రభాషకు సంకేతముగా నాతడు సంభావించెనని వ్యాఖ్యానించుట జరిగినది. ఈ భావనకుమూలము గజపతులు. వారు ఓఢ్ర దేశమును పాలించి యుండుట. కావున పై భావన సమంజసమే. కాని ఒకా ఒక రాజవంశము పేరుతో భాషను సంభావించుట కుదురునా! గజ శబ్దమును ఓఢ్రభాషకు సంకేతముగ నెవ్వరు ఉపయోగించినట్లు తెలియరాదు. భాషయు దేశములు ఒకదాని కొకటి పర్యాయములగుట ఎరుగుదుము తప్ప, ఒకానొక రాజవంశముపేరు, మొత్తము భాషకు చెల్లివచ్చునా। పరిశీలింపవలసియున్నది. అదికాకున్న, ఈ వివరణ మేల్తరమేమో సహృదయులు పరికింతురుగాక.

గజ శబ్దమునకు సామాన్యార్థములు రెండు. ఒకటి దైర్ఘ్య ప్రమాణము. రెండవది ఏనుగు. ఇదిగాక, గజశబ్దము, మధ్య ఉబ్బెత్తుగా నుండి, ప్రక్కలకు వాలియున్న నివాస యోగ్యమైన భూభాగమను అర్థమున చెల్లివచ్చును. అయినపుడు అది పీఠభూమితో అన్వయించును. అప్పుడు గజకర్ణాటమనగా నేటి కర్ణాటరాష్ట్రమును సూచించును. ఈ విధముగ రెండు కర్ణాటములకు మధ్యగల సందిగ్ధతను నివారించి యున్నాడేమో!

ఏమైనను, తీరాంధ్రము కర్ణాటమనుటలో విప్రత్తిపత్తి లేదు. అందువలన శ్రీనాథుడు కర్ణాటుడే! ఆయనభాషయు కర్ణాటమే.

---

*Note: ఈ వ్యాస రచనకు తక్షణ ప్రేరణ (1) డా॥ గుండవరపు లక్ష్మీనారాయణగారి భీమేశ్వరపురాణ వ్యాఖ్యా గ్రంథము. (2) వాసా లక్ష్మీనారాయణరెడ్డి గారిచే ప్రకటింపబడిన 'కవిసార్వభౌముడగు శ్రీనాథుని జన్మస్థలం' పాకల అను వ్యాసమును అందించినవారు శ్రీ టి.జి. సంజీవరావుగారు. వారికి కృతజ్ఞతలు.*

# శ్రీనాథుని దౌత్యము - అవచి తిప్పయ ఔచిత్యము

శ్రీనాథుని హరవిలాసకావ్యము అవచి తిప్పయకు అంకితమనుట లోకవిదితము. ఇది రచన గావించునప్పుడు అవచి తిప్పయ కంచి యందు నివాసమున్నాడు. దీనికి పెక్కు ఆధారములు హరవిలాసము నందు గలవు. శ్రీనాథుడు కృతి కర్తను ఈవిధముగ సంబోధించియున్నాడు.

1 కాంచీపురనివాస 2 కావేరీశా, 3శ్రీ కావేరీవల్లభ 4కావేరీవల్లభా 5కావేరి వల్లభ ఇందు మొదటి ఉదాహరణము స్పష్టమైనది. రెండవది కొంత సంధిగ్ధతకు తావిచ్చును. అవచి తిప్పయను కావేరీ వల్లభుడు, అధీశుడనుటకు కారణము, ఏమై యుండును. అందరకు తెలిసిన కావేరి కంచికి చాలదూరము. అంతేగాక కావేరినదియే గాని పురముకాదు. అయితే కావేరీ పురమును పేరుతో తమిళనాట మూడు గ్రామములున్నవి. అందొకటి, కంచికి కడు సమీపము. అవచి తిప్పయ తాత ఒకరు "కావేరి , గట్టించె, గార్వాసరాసుల నుబ్బిచోడడు మెచ్చ"6 అనికూడ చెప్పబడినది. ఇది కంచికి సమీపమున గల చిన్నఏరు. దానికి తిప్పయు తాతగారొకరు అడ్డుకట్టవేయించి, నీరుపారించి, భూములను వ్యవసాయయోగ్యము గావించెననుట పై పద్యార్థము. ఆ సమీపగ్రామమే కావేరి పాక్కం అనుగ్రామము. ఇది అవచివారికి సర్వమాన్యమై యుండవలెను. అందువలననే, తిప్పయను కావేరి వల్లభ అని పేర్కొనుట జరిగియుండవలెను. ఏమైనను గ్రంథరచనా కాలమునాటికి తిప్పయ కంచిపుర వాసి యనుట స్థితిస్థాపకము. ఇక గ్రంథరచనము కూడ అచ్చటే జరిగినదని చెప్పుటకును గ్రంథము నందే సాక్ష్యముగలదు. 7'అవచి దేవయతిప్ప ప్రభుండొక్కనాఁడా స్థానమంటపంబున సుఖో పవిష్టుండై' శ్రీనాథునితో 8బాల సఖుడవు శైవ ప్రబంధమొకటి యవధరింపుము నా పేరనంకితముగ' అని చెప్పుట వలన అది స్పష్టమగుచున్నది. అయిన ఇంతకు శ్రీనాథుడు కంచికి ఏలవెళ్లవలసివచ్చినది. పై శీర్షికకు సమాధానము ఈ ప్రశ్నకగు సమాధానమందిమిడి యున్నది గనుక దీనిని పరామర్శింపవలసి యున్నది.

హరవిలాస రచనకు పూర్వము శృంగారనైషధమును వెలియించి యున్నాడని

1. తృతీయా శ్వాసాంతపద్యము 3 -98
2. ద్వితీయా శ్వాసాంతపద్యము 2 - 145
3. చతుర్థాశ్వాస ప్రారంభపద్యము 4 -1
4. చతుర్థా శ్వాసాంతపద్యము 4 - 104
5. పంచమాశ్వాసాంత పద్యము 5 - 61
6. ప్రథమాశ్వాసము - 10 7. అందే - 7 8. అందే -8

గ్రంథస్థసాక్ష్యము కలదు. [9]ఆంధ్రభాషా నైషధాబ్జభవుని' అని చెప్పుట దీనికగు సాక్ష్యము. అయితే అప్పటికే మరుత్తరాట్చరిత్ర శాలివాహన సప్తశతి అనుకృతులను రచించియుండెనని ఇతర సాక్ష్యముల వలన తెలియును. కాని వాని నిచ్చట పేర్కొనలేదు. అట్లే వానిని పేర్కొన్న కాశీఖండము నందు, హరవిలాసమును పేర్కొనలేదు.. దీనికి కొన్ని కారణములు గలవు. వానిని వేరుగ చర్చింపవలసియున్నది. ప్రస్తుతమున కది అక్కరలేదు. నైషధము, మామిడి సింగనకు, అంకితము. ఈ మామిడి సింగన, అప్పటికి చందవోలు (నేటి చందోలే)రాజధానిగా నేలుచున్న పెదకోమటి వేముని మంత్రి. పేదకోమటి వేమునికి కొండవీడు రాజధానిగా పాలించుచున్న కుమారగిరికి రెడ్డిరాజ్య సింహాసనాధిపత్య విషయమై వైరము కలదు. దానికొక పరిష్కారమును సూచించినవాడు కుమారగిరి బావమరిది కాటయవేముడు. కాటయవేముడు సూచించిన పరిష్కారము, కుమారగిరి యనంతరము కొండవీడు పై ప్రభుత పేదకోమటి వేమునకు సంక్రమింపజేయుట. అది అట్లే జరిగిన వివాదముండెడిదికాదు. హరవిలాసకావ్యము కూడ రచింపబడి యుండెడిదికాదేమో! దీని నేపథ్యమట్టిది. చర్చా సంబంధకాలమునాటికి, కుమారగిరికి సజీవపుత్ర సంతానములేదు. దానివలన కాటయవేముని సూచనను కోమటివేము డంగీకరించెను. పిదప కాటయవేముడు సింహాచలము వరకు జయించుట జరిగినది. దీనిని మెచ్చి, కుమారగిరి, జయించిన రాజ్యమునంతను, రాజమహేంద్రవరము రాజధానిగా నేలుకొమ్మని కాటయవేమునకు ధారాదత్తముచేసినాడు. ఇది పెద కోమటి వేమునకు ఆగ్రహకారణమైనది. కుమారగిరితో యుద్ధమునకు సిద్ధమైనాడు. కుమారగిరి వ్యక్తిగా పండితుడు. రసికుడు. కాని యుద్ధవిద్య యందంత మేటి కాదు. కాని అతనికి కొండంత అండ బావయైన కాటయవేముడు. బంధుత్వ విషయకముగ విజయనగర రాజుల ప్రాపును గలదు. ఈ కారణములుగ, కుమారగిరిని జయించుట పెదకోమటివేమున కంత సులభము కాదు. కాని ఉపాయాంతరము గలదు. కాటయవేముడు ప్రస్తుతమున కొండవీడు నందులేడు. కొండవీడుకు, రాజమహేంద్రమునకు కడుదూరము. రెండు నదులను దాటవలసి యున్నది. అంతేగాక అతనిని నిలువరించుటకు వెలమల సాయము పొందవచ్చును. మొదలు యుద్ధవార్తలను చేరనీకుండ కట్టుదిట్టము చేయవచ్చును. కారణము కొండవీడుకు, రాజమహేంద్రమునకు నడుమ తానున్నాడు. కొండపల్లిపై తన ప్రభుత చెల్లుచున్నది. కనుక ఇరువైపులనుండి ఇబ్బంది లేదు. కాటయవేమునకు కబురందు లోపల తాను కొండవీడు నాక్రమింపగలడు. చందోలు అంత సమీపమునున్నది. కాని విజయనగరమునుండి బంధుత్వ కారణముగ కుమారగిరి రెడ్డికి లభింప గల సాయమును నిలువరించుట ఎట్లు? ఇది సాధ్యమైన కొండవీడును సాధించుట పెద్ద లెక్కలోనిది కాదు. అంతేగాక, ఒప్పందమున్నను, కుమారగిరి అనంతరము మాత్రము కొండవీడు తనకు (పెదకోమటి వేమునకు)

---

9. 1- 8

దక్కునని ఎట్లు భావింపవచ్చును. విజయనగరమువారి అండతో, తన వియ్యంకుడైన అల్లాడరెడ్డి (కాశీఖండ కృతిభర్త వీరభద్రారెడ్డి తండ్రి) సాయముతో కాటయవేముడు తననే కడతేర్పవచ్చును. కనుక, వైరమెట్లును తప్పుటలేదు. కనుక తానే అవకాశమును తీసికున్న ఎట్లుండును. అవకాశమును తీసికొనవలెనన్న విజయనగరమువారిని ఏదో ఒక ఉపాయముతో సాయమురాకుండ నిరోధింపవలయును. ఇచ్చట హరవిలాసకావ్యరచనకు వలయు నేపథ్యమేర్పడినది. పై చెప్పినవానికన్నింటికి చరిత్ర యందు సాక్ష్యములు గలవు. ఇక ముందు చెప్పబోవు విషయము పండితులు ఊహించినది. అది ఎట్టిదో చూతము.

పెదకోమటివేమునికి గల తక్షణ కార్యము విజయనగరమునుండి సాయము రాకుండ చూచుట. కొండవీటికి తూర్పున తానున్నాడు. పశ్చిమమున విజయనగరమున్నది. కనుక సైన్యబలముతో దానిని నిరోధింపలేడు. మరి ఉపాయాంతరమేది? వారిని అసలురాకుండ చేయుట. ఇది ఎట్లు సాధ్యము. బంధుత్వకారణముగ కుమారగిరి, వారికి కబురుపెట్టును గదా! కబురు వెళ్లినను వారు రాకుండ తాటస్థ్యము వహింపవలయును. వారు తాటస్థ్యము వహించునట్లు చేయుట ఎట్లు? ఎవరుచెప్పిన వారట్లు చేయుదురు. ఇచ్చట పండితుల ఊహ ఇట్లు సాగినది. వారికి చెప్పగలవాడు అవచి తిప్పయ. తిప్పయకు చెప్పగలవాడు అతని బాలసఖుడు శ్రీనాథుడు. అతడిప్పుడు పెదకోమటి ప్రాపున నున్నాడు. ఈ ప్రాపునకు కారణము, శృంగారనైషధమునకు కృతిపతియైన మామిడి సింగన పెదకోమటి వేముని మంత్రియగుట. కనుక వారి అభ్యర్థనముపై శ్రీనాథుడు కంచికి పయనమై, తిప్పయను దర్శించి యుండును. అతని అభ్యర్థనపై హరవిలాసము చెప్పెను. శ్రీనాథుని అభ్యర్థమునపై తిప్పయ, విజయనగరాధీశుడైన హరిహరరాయడు, పెదకోమటివేమ, కుమారగిరుల యుద్ధమున తాటస్థ్యము వహించి యుండును. ఇదీ ఊహ. ఇది ఇట్లే జరిగి యుండవచ్చును. కారణము విజయనగరము వారు సాయము రాలేదు. కుమారగిరి రాజ్యభ్రష్టుడై రాజమహేంద్రవరము చేరుట, పెదకోమటివేముడు కొండవీటి సింహాసనము నధిష్ఠించుట చారిత్రక సత్యములే. కనుక శ్రీనాథుడు దౌత్యము చేసెనని ఊహించుటలో విప్రతిపత్తి కానరాదు. బాలసఖుని అభ్యర్థనము, మీదు మిక్కిలి, ప్రస్తుతము తనకు కావ్యమునంకిత మిచ్చుట అను వానిని బట్టి, తిప్పయ గావించిన సాయమందు ఔచిత్యము గలదని స్థూలదృష్టితో భావింపవచ్చును. కాని సూక్ష్మవివేచనమున నిందు ఒకటి రెండు సందేహములకు తావున్నది. జరిగినది అంతే ననుటలో విప్రతిపత్తి లేకున్నను అది ఎట్లు పొసగినదో పరిశీలింపవలసి యున్నది.

స్థూలదృష్టిలో ఈ పొసగుటకు కారణములు పైన చెప్పబడినవి. కాని సందేహములెట్టివో చూతము.

1. అవచి తిప్పయ, శ్రీనాథునికి బాలసఖుడైనంతమాత్రమున, అతని విజ్ఞాపనమున తనకు గల జ్ఞాతి వైరమున, అతడు, తమ కనుకూలముగ, విజయనగరమునకేగి, హరహరరాయలు తాటస్థ్యము వహించునట్లు చేయునని పెదకోమటి వేము డెట్లు తలచెను.

2. విషయమెంతో సంకిష్టము. తనకు బాల సఖుడైనంత మాత్రమున తిప్పయ దీని కంగీకరించునని శ్రీనాథుడెట్లు తలచెను.

ఈరెండు ప్రశ్నలకును సమాధానము ప్రశ్నయందే యిమిడియున్న బాలసఖత్వ మని సరిపెట్టుకొనగలమా! సరిపెట్టుకున్నను మరికొన్ని ప్రశ్నలుదయించును.

1. హరిహరరాయనికి చెప్పి ఒప్పింపగల కూరిమి, అతని యొద్ద తిప్పయకు కలదా! కలదనుటకు గ్రంథస్థ సాక్ష్యమే గలదు. 'హరిహరరాయ....[1] ఇత్యాదిగా గల పద్యము దీని కుపబలకము. కనుక ఈ ప్రశ్న నిలుచునదికాదు. సరియే! అయినను.

2. కుమారగిరికి, అవచి తిప్పయకు గల అనుబంధము ఈ నాటిదికాదు. అది సామాన్యమైనది కూడ కాదు. ఇది శ్రీనాథునికి తెలియని విషయమును కాదు: హరవిలాసముననే పెక్కుతావుల ఈ విషయము పేర్కొనబడినది [1] కుమార గిరిరెడ్డి నిర్వహించు వసంతోత్సములకు వలయు సమస్త సంబారములు సమకూర్చెడివాడు, అవచి తిప్పయ్య. అతని చేత ఆందోళికా ఛత్ర, చామర తురంగాది ప్రభులాంఛనము లందినవాడు తిప్పయ. అట్టివాడు కుమారగిరికి నష్టము కలిగించు పని తిప్పయ చేయునని శ్రీనాథుడు ఎట్లుభావించెను.

3. శ్రీనాథుడిట్లు భావించినను, పై కారణములచే తనకాప్తుడైన కుమారగిరికి వ్యతిరేకముగ తిప్పయ ఎట్లు వర్తించెను.

4. నీవు చెప్పున దెట్టి న్యాయమని తిప్పయ శ్రీనాథుని ఏల మందలింపలేదు.

శ్రీనాథుడు దౌత్యమొనరించి యుండునని ఊహించిన పండితకోటి మదిలో ఈ ప్రశ్నలు పొడమినట్లు కానరాదు. అట్టివానిని గూర్చి ఇప్పటి కెట్టి సమాచారమును లేదు. పై సందేహములే ఈ వ్యాసరచనమునకు కారణము. ఏమైననేమి, కార్యము జరిగినది కదా! యనువారికి చెప్పవలసినపనిలేదు. పై సందేహములను పరిశీలింతము. అయితే క్రమము మారవచ్చును.

పెదకోమటి వేమునికి, అతనిమంత్రికి కావలసినది తమకనుకూలమైన చర్య దానికి తమకు గల సాధనము శ్రీనాథుడు. అతనికి బాలసఖుడు అవచితిప్పయ తిప్పయకు, హరిహరరాయనికి సఖ్యముగలదు. అంతే! నిర్వహణమెట్లు అనునది వారి కనవసరము. వారికి వలసినది ఫలితము. కనుక శ్రీనాథుని నియోగించినారు. అత డందుల కంగీకరించినాడు. ఈ అంగీకరించుటలో బాల సఖత్వ మొక్కటేనా యిమిడి యున్నది. తిప్పయకు, కుమారగిరికి గల కూరిమి తానెరిగినదే కదా! మాటమాత్రము తిప్పయ, ఇది నేనెట్లు చేయుదునని భావించితి వన్నచో శ్రీనాథుని

[1] 1 - 24 హరవిలాసము

పరిస్థితి ఏమి! అట్లనకపోగా మిత్రకార్యము నిర్వహించుటకు సమకట్టిన తిప్పయ ఔచిత్యమెట్టిది. అంతకు ముందుగ అనుకొనవలసినది మరి యొకటి గలదు. శ్రీనాథుడు 2 అధ్వర్యుడు, వేదశాఖాధీతి నిష్ణాతుడు, 3 ఆగమజ్ఞాననిధి, తత్త్వార్థఖని, బహుపురాణజ్ఞుడు, శుభభవ్యమతి 4 బ్రాహ్మీదత్తవరప్రసాదుడు. ఈశ్వరార్చన కళాశీలుడు. ఇంతటివాడు. తన కాశ్రయ మిచ్చినంత మాత్రముచేత జ్ఞాతి వైరములో చిక్కుకున్న పెదకోమటివేముని మాట శిరసావహించినాడా! అతని వివేక మీపాటిదా! తన కాలము వారు గాని, అనంతర కాలము వారలు గాని దీనికి తనను అపహసింతురని కూడ తలప లేదా శ్రీనాథుడు. కనుక తాను సమకట్టినది సబబేనని ఆయనకు తోచి యుండ వలయును గదా! అది ఎట్టిది అనునదొక ప్రశ్న.

పై ప్రశ్నలన్నింటికి సమాధానము రాబట్టవలసి యున్నది. అది ఇట్టిది.

అవచి తిప్పయ తాతతండ్రులు అద్దంకిలో రెడ్డి రాజ్యస్థాపనమునాటి నుండి కుమారగిరి రెడ్డివరకు వాణిజ్య ప్రముఖులుగా నుండిరి. హరవిలాసమునాటికి అవచి తిప్పయ కంచియందున్నను, అంతకు పూర్వము లేక కనీసము వసంతోత్సవ సమయములం దైనను (కుమారగిరి రెడ్డి పాలనకాలమున, తిప్పయసోదరుడు తిరుమలశెట్టి కొండవీడు నందున్నాడు1) కొండవీటి యందుండుట తటస్థించినది. ఆ పరిచయము కారణముగ తాను, స్వయముగా గాని, లేక శ్రీనాథుని అభ్యర్థనపై గాని, అనవేమారెడ్డి (కుమారగిరి తండ్రి) ఆస్థానమున శ్రీనాథుని ప్రవేశమునకై ప్రయత్నించి యుండ వచ్చును. ఈ ప్రయత్నమున మంత్రియైన మామిడి పెద్దన సాయమును కూడ తీసికొని యుండవచ్చును. కాని ఆ ప్రయత్నము నెరవేరినట్లు కనుపింపదు. అయితే పెద్దన కుమారుడైన వేమనకు, మరుత్తరాట్చరిత్ర అంకితమిచ్చి యుండవచ్చును. ఆరాధ్యచరిత్రను వేమన సోదరుడగు ప్రగడయ్యకు అంకితమిచ్చినా.2 వీరి మరియొక సోదరుడు సింగన్న. ఈ సింగన్నకు అంకితము నైషధము. ఈ సింగన్న పెదకోమటివేముని మంత్రి. మామిడి వారి కుటుంబముతో గల అనుబంధమునకు మూలమైనది అవచి తిప్పయతోడి బాలసఖత్వము. కొండవీడులో ఆశ్రయము లభింపకున్నను, తన మిత్రునకు చందోలులో రాజాశ్రయము లభించినది గదాయని అవచి తిప్పయ సంతోషించియుండును. కాలక్రమమున వార్ధక్యమున, తిప్పయ కంచికి చేరియుండును. ఇది కథాకాలమునాటి స్థితి. ఇట్టి సమయమున పైన వివరించిన పరిస్థితులు సంభవించినవి. పై వృత్తాంతము ఒక ప్రశ్నకు సమాధాన మీగలదు. అదియేమన, తిప్పయ. 'నాకు కుమారగిరి కావలసినవాడు. అతనికి వ్యతిరేకముగ నేను వర్తింతునని నీవెట్లు భావించితివి" అను ప్రశ్న. దీనికి శ్రీనాథుని వైపు నుండి

1 (a) 1-7; 1-24 ; 1-30 ; 4 - 103; 5 -60, హరవిలాసము

2 1-8; హరవిలాసము

3 1-12 హరవిలాసము

4 1-18 నైషధము

1 1-24 హరవిలాసము

2 1-14 శృంగార నైషధం

గల సమాధానము. నిజము. కుమారగిరిరెడ్డి నీకు మిత్రుడే. మరి నేను బాల సఖుడను. ఈ నేటి సంసర్గమునకును (పెదకోమటి వేమునితోగల) నీవే కారణము. నీ వలననే కదా నే నచ్చట చేరినది. మరి నన్నేలిన ప్రభువు నన్నిది కోరినాడు. నేనేమి చేయవలయును" అనునది పై ప్రశ్నకు గల సమాధానము. అనగా కంచికి ప్రయాణమై వెళ్లుటకు, వెళ్లి తిప్పయతో కార్యము నివేదించుటకు శ్రీనాథునివైపు నుండి, తన్నుతాను సమర్థించుకొనుటకు, అనువేర్పడినది.

అయినను ఇది చాల సున్నితమైన సమస్య. తిప్పయ తానిది చేయకున్న, తనబాల్యమిత్రునకు, పెదకోమటివేముని ఆస్థానము నుండి ఉద్వాసన జరుగవచ్చును. ఇది బాధాకరమైన విషయమే - అని, కార్యమునకు పూనుకున్న - తాత తండ్రుల నుండి, తనకును, కుమారగిరికిని అనుబంధమున్నది. వారి ప్రాపున వీరు, వీరి ప్రాపున వారు అభివృద్ధి చెందినారు. ఇప్పుడును తన తమ్ముడు తిరుమలనాథుడు అచ్చటనే వ్యాపారము చూచుచున్నాడు. వీరి దింకను ఉమ్మడి కుటుంబమే. తన కుటుంబప్రయోజన మట్లుండ, తానట్లుచేసిన అది మిత్ర ద్రోహము కాదా! కృతఘ్నుతకాదా! అని తిప్పయకు అనిపించలేదా! మరియెట్లు పూనుకొనెను. సాధారణ లౌకిక విషయమున అది అట్లే భాసించును గదా!.. లోకనిందయు తప్పదు. మరి తిప్పయ దీనినెట్లు సంబాళించుకొనెను. దీనిని పరిష్కరించిన సర్వము తెల్లమగును. అంతేగాక అంతటి మహానుభావుడైన శ్రీనాథునికి కూడ, ఇది సమంజసమని ఎట్లనిపించినదో కూడ తెలియవచ్చును.

శ్రీనాథుడు హరవిలాసమున తిప్పయను వాచాగోచర వివేకవైయాత్యుడని[1], యుగంధర చాణక్య నీతి గతి నిపుణుండని[2] సంభావించెను. ఇవి కేవలము పొగడ్తలని భావింతమా। లేక తిప్పయ యట్టివాడేనా! శ్రీనాథుని మాటను సాధారణముగ గ్రహింపలేము. అతడు అట్టి గుణములు లేనివాడైన వానిని స్పృశింపడు. మరి ఇతర విశేషణములతో సంభావింపలేడా! ఇందు 'వాచాగోచర వివేకవైయాత్య' అను విశేషణమును శ్రీనాథుడు పరమేశ్వరుని పరమునకూడ[3] ఉపయోగించి యున్నాడు. అనగా శ్రీనాథుని దృష్టిలో, ఆ విశేషణము విషయమున, పరమేశ్వరుడు, తిప్పయలు సమానులగుచున్నారు. తిప్పయ అందుకు పాత్రుడు కాకున్నచో, పరమేశ్వరుని సంభావించిన విశేషణముతో అతనిని సంభావించునా! కనుక శ్రీనాథుడు సాభిప్రాయముగనే భావించె ననవలెను. అంతేగాక, అందే, తాను విన్నవించుకార్యము, అందలి సున్నితత్వము, దానిని నిర్వహించుటలో, పాల్పడుటలో (కుమారగిరికి వ్యతిరేకముగా వర్తించుట) తిప్పయకు, తనకును గల వెఱపులను త్రోసి రాజని, కార్యనిర్వహణము నందలి సమంజసత్వమును గూర్చిన ప్రబోధము ఇమిడి యున్నది.

---

1 1-34 హరవిలాసము

2 1-33 హరవిలాసము

3 7 - 95 హరవిలాసము

తిప్పయ సాధారణుడుకాదు. వివేకముగల వాడు. అంతేకాదు. అందు వైయాత్యత గలవాడు. ఈ పదములకు వాని నియతార్థమునందు భావించిన సర్వము తేట తెల్లమగును. వివేక శబ్దము సమమైన నిర్ణయము, సరియైన వివక్ష, యథార్థ జ్ఞానము (విషయమును స్వస్వరూపమున విచారించుట) అనునర్థములు కలది. వైయాత్యశబ్దము, వియాత పదమునకు తద్ధితరూపము. ఈ వియాత శబ్దము జంకు గొంకు లేక ఉన్నదున్నట్లు (మాట్లాడుట) చెప్పెడి విషయమున, లేక ఆచరించెడి దాని యందు మనమున ఎట్టి సిగ్గును, సంకోచమును లేక వర్తించుట అను నర్థములనిచ్చును. అనగా కార్యనిర్వాహకుని దక్షతకు ప్రతీకగా నిది వర్తించును. కాకున్న పరమేశ్వరుడు వాచా గోచర వివేక వైయాత్యుడెట్లగును. ఫలితార్థము-విషయమును వివేచించుట, దానినుండి తేలిన దానిని ప్రవర్తింపజేయుట యందు మరియొక ఆలోచనము లేకుండుట. ఈ లక్షణము అవచి తిప్పయ యందుండి యుండవలెను. లేకున్న అంతటి వాణిజ్య నిర్వహణ మెట్లు చేయును. దానికితోడై నిలిచినది యుగంధర చాణక్య, నీతి, గతి నిపుణత్వము. పరమేశ్వరుని విషయమున పై వివేక వైయాత్యమే చాలును. కారణము అతని కార్యములు అలౌకికములు. కాని తిప్పయ వర్తనము లౌకికము. లౌకిక కార్యసాధన విషయమున ఈ రెండు పదాని ప్రాముఖ్యమెంతో- అంత. అదిగో ఆ అంతటి గుణవిశేషములు ఇప్పుడు శ్రీనాథుని అభ్యర్థనము తీర్చుటకు అవసరమైనవి. ముందు అంతటి శ్రీనాథుడు దీనికి పాల్పడుటకు మనసెట్లొప్పినది అని ప్రశ్నించుకుంటిమి. దీనికిని ఇదియే సమాధానము. తిప్పయ వివేకవైయాత్యుడైన శ్రీనాథుడు కాకుండునా! అదియే ఆయనను ఈ విషయమున కంచికి నడిపించినది. మీద, పెదకోమటి వేముని ఆస్థానమున గల తన యునికిని భద్రమొనర్చుకొనుట యను లౌకిక విషయమెట్లును గలదు. దీనిని కథాకాలము నాటి కన్వయింతము.

వంశపారంపర్యముగ రెడ్డి రాజ్యము కుమారగిరిరెడ్డికి దక్కినది. కానిపెదకోమటివేముడు తన కందు హక్కు గలదనినాడు. కాదనుటకు వీలులేని స్థితియున్నది గనుకనే, కాటయవేముడు, కుమారగిరి యనంతరము రాజ్యము నేలు కొనవచ్చునని మధ్యేమార్గము సూచించినాడు. కనుక అతని హక్కులోని సమంజసత్వము లోక విదితము. ఇది తిప్పయకు తెలిసిన విషయమే. అంగీకారము ప్రకారము రాజ్యమంతయు ఏకపాలన మందుండ వలయును.దీనికి, కుమారగిరి రాజమహేంద్రవర రాజ్యమును, కాటయవేమున కిచ్చుటతో విఘాతము కలిగినది. దీని నెవరు నివారింపవలయును. ఒప్పందమును తీర్చిదిద్దిన కాటయవేముడే దీని నుల్లంఘించి రాజమహేంద్రవర సింహాసన మాక్రమించినాడు. మరి ఏది దారి. కనుకనే, పెదకోమటివేముడు తన హక్కును సుస్థాపితము చేసికొనుటకు ప్రయత్న మారంభించినాడు. ఇందతని దోషము లేదు. కాని, నిర్వహణము అంత తేలికైనది

గాదు. ఎదిరి కుమారగిరి దుర్బలుడే కాని, కాటయవేమునితో సంబంధ బంధుత్వముగల విజయనగరము వారు బలవంతులు. వారిని రాకుండ ఆపగలిగిన తనకార్యము నెరవేరును. దాని కొరకై శ్రీనాథుని సాయముపేక్షించినాడు పెదకోమటివేముడు. ఇది అవచి తిప్పయతో కాగలదను భావనతో శ్రీనాథుడు బయలుదేరినాడు. పై రాజ్యమునందలి హక్కు విషయమై, తిప్పయ శ్రీనాథుల వివేక వైయాత్యత ప్రవర్తిల్లినది. అనగా, కుమారగిరి యందు దోషమును సంస్థాపించుట వరకు. ఇక రాజ్య, ప్రజా శ్రేయము ననుసరించి చూచినను, కుమారగిరి దుర్బలుడు. అతడు సరస సంగీత సాహిత్యవేత్త. రాజ్యధురంధరుడు కాడు. కనుక నేడు కాకున్నను సమీప భవిష్యమున అరాచకము ప్రబలును. అతని అనంతరము కాని ఒప్పందము ప్రకారము పెదకోమటి వేముడు పాలకుడు కాలేడు. కాటయవేముడు బలవంతుడే. కాని అత డిచ్చట లేడు. రాజమహేంద్రమునుండి, అతడు కార్యనిర్వహణము చేయజాలడు. కనుక కుమారగిరినే కొనసాగ నిచ్చిన లౌకికరాజ్య నిర్వహణమున లోటుపాట్లేర్పడు ననుట స్పష్టమగుచున్నది. అది తన కుటుంబ వ్యాపారమునకును హాని కలిగించును. కనుక ఏవిధముగ నాలోచించినను, కుమారగిరికి వ్యతిరేకముగా వర్తించుట అవసరమగు చున్నది. ఈ నిర్ణయమునకు వచ్చుటకు తోడ్పడినది వివేకవైయాత్యత. ఇక విజయనగరమువారికి ఏమిచెప్పి వారి నిటు రాకుండ చేయవలయును. వారు కాటయవేమునితో సంబంధబంధుత్వము గలవారు. ఇట్టి బంధుత్వము అతనితో కుమారగిరికిని గలదు. ఇది సున్నితమైన వ్యవహారము. రాజనీతి యిచ్చట అవసరము. విజయ నగరమువారికి గల ప్రత్యక్ష బంధుత్వము కాటయవేమునితో గాని కుమారగిరితో కాదు. కాటయవేమునితో పెదకోమటి వేముడు తలపడుట లేదు. రాజ్యమా, ఆరాచకము ప్రబలుటకు అవకాశము గల దగుచున్నది. రాజ్యముపై పెదకోమటి వేమునకు హక్కులేదాయనిన, ఉన్నదని అంగీకరించినది తమ యల్లుడైన (విజయనగరము వారికి) కాటయవేముడే. ప్రస్తుత పరిస్థితి యిట్లేయున్న, తమకాప్తుడైన తిప్పయ కుటుంబ వాణిజ్యమునకును విఘాతము కలుగును. అతని అభ్యర్థనము కాదందుమన్న, మోటుపల్లి రేవుపై. - ఒక విధముగ తూర్పు సముద్రవ్యాపారమంతయు తిప్పయ అధీనమునన్నున్నది. ఇట్టి సంకట పరిస్థితి కల్పించినది తమకు సంబంధము లేనిచోట కలిగిన సంక్షోభము. తాము మిన్నకుండిన ఏమి కానున్న నది యగును. తిప్పయ మాట పాటించి నట్లగును. ఈ పరిస్థితిలోనికి వారిని నెట్టివేసినది తిప్పయ యుగంధర చాణక్య నీతి గతి నైపుణ్యము. కనుక శ్రీనాథుని దౌత్యవిషయమై పండితుల ఊహవెనుక గలనేపథ్యమిట్టిదని, దానిపై తిప్పయ ఔచిత్యమిట్టిదని భావింపనైనది. ఈ రెంటిని పట్టియిచ్చినది శ్రీనాథుడు తిప్పయవిషయమై ఉపయోగించిన వివేకవైయాత్యము, యుగంధర చాణక్య నీతిగతి నిపుణతయను రెండువిశేషణములు. విజ్ఞు లాలోచింతురు గాక.

# శ్రీనాథుని సాహితీ జీవనం

శ్రీనాథుని జన్మస్థలం 'పాకల' పట్టణం అని ఇతఃపూర్వం నిరూపింపబడింది. అందే, పిల్లల మఱ్ఱిపెద్దన, అతని యొద్ద విద్యనేర్చిన అవచితిప్పయ, పెద్దన ప్రభువు చిల్లర వెన్నయామాత్యుడు - వారి నివాస స్థలం కలికివాయి బిట్రగుంట - వీని మూలమున, శ్రీనాథునికి తిప్పయకు గల సఖ్యం - ఇవన్నీ నిరూపింపబడ్డాయి.1 ఇక ఈ వ్యాసంలో శ్రీనాథుని కావ్యాల రచనకు గల చారిత్రక నేపథ్యం అంచనా వేయడం జరుగుతుంది.

శ్రీనాథుడు తాను వ్రాసిన కావ్యాలను తన రచనలలో పేర్కొన్నాడు. శ్రీనాథుని రచనలలో పోయినవి పోగా మిగిలినవి శృంగారనైషధం, హరవిలాసం, భీమేశ్వరపురాణం, కాశీఖండం, శివరాత్రిమాహాత్మ్యం. ఈ గ్రంథముల ప్రకటనాను పూర్వికూడ ఇట్టిదే. ఇవిగాక ఇతర సమాచారం వలన మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి2; పండితారాధ్య చరిత్ర3 రచించినట్లు తెలియుచున్నది. ఈ సమాచారం శ్రీనాథునిదే. పై వానిలో పలనాటి చరిత్రను గూర్చి శ్రీనాథుడు ప్రసంగింపలేదు. దాని కర్తృత్వమును గూర్చి పండితులలో భిన్నాభిప్రాయములు గలవు. ఇక అతడు రచించినట్లుగ ఇతరులచేత చెప్పబడిన గ్రంథములు. (1) ధనంజయవిజయము: దంతులూరి బాపిరాజు తన మూర్తిత్రయోపాఖ్యానంలో తనవంశంలో పూర్వుడైన దంతులూరి గన్న భూపాలునికి ఈ కావ్యం అంకిత మీబడిందని చెప్పాడు. శ్రీనాథ సుకవీంద్రుచే ధనంజయ విజయంబును సత్కార్యమంది వెలసె'. ఈ గన్నభూపాలుడు, పెదకోమటి వేముని మామ యని పలువురి విశ్వాసము. (2) నందనందన చరిత్రము. దీని ప్రస్తావన, గణపవరపు వెకంటకవి తన ప్రయోగరత్నాకరమందును, కస్తూరి రంగకవి తన ఆనంద రంగరాట్ఛందమునను గావించిరి. (3) వల్లభాభ్యుదయము. దీనిని గూర్చి పెదపాటి జగ్గకవి తన ప్రబంధరత్నాకరము నందు ప్రస్తావించినాడు.

1. శ్రీనాథుడు కర్ణాటుడే అనువ్యాసము చూడుడు.
2. 1-7, కాశీఖండం, శ్రీనాథుడు
3. 1-14 శృంగార నైషధం శ్రీనాథుడు.

(4) కాటమరాజుకథ. దీని ప్రస్తావనము పిన మల్లయ తాను వ్రాసిన ద్విపద కాటమరాజు కథలో చేసినాడు. (5) కామశాస్త్రము. దీనినిగూర్చి నెల్లూరి శివరామకవి తన కామకళానిధి యను గ్రంథమున ప్రస్తావించి నాడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పి, అతడు ప్రస్తావించిన శ్రీనాథుడు, నైషధాది గ్రంథకర్త శ్రీనాథుడును ఒకరు కాకపోవచ్చునని సందేహించిరి. ఈ చర్చ వలన స్పష్టముగ శ్రీనాథుని రచనలని తేలినది (1) మరుత్తరాట్చరిత్ర. (2) శాలివాహన సప్త శతి (3) పండితారాధ్య చరిత్ర (4) ధనంజయ విజయము (5) నందనందన చరిత్రము (6) వల్లభాభ్యుదయము (7) కాటమరాజు కథ (8) శృంగారనైషధము (9) హరవిలాసము (10) భీమేశ్వర పురాణము (11) కాశీఖండము (12) శివరాత్రి మాహాత్మ్యములు. ఇందు మొదటి ఏడును అలభ్యములు. కడమ అయిదును లభ్యములు. ఇవిగాక క్రీడాభిరామము కూడ శ్రీనాథుని రచనమందురు. కాని అది స్పష్టముగ వల్లభరాయ కృతముగ గ్రంథస్థ సాక్ష్యమున్నది. కనుక దానిని శ్రీనాథుని రచనగా చెప్పుట కుదరదు. అయితే, శ్రీనాథుని ప్రమేయము ఏతద్గ్రంథ రచనమున ఉండి యుండవచ్చును.[1] లభ్యములైన కావ్యముల నాధారముగా, చారిత్రక నేపథ్యమును అంచనా వేయుదము.

లభ్యములైన కావ్యములలో మొదటిది శృంగార నైషధము. ఇది మామిడి సింగనకు అంకితము. నైషధమునందే, పండితారాధ్య చరితము మామిడి ప్రెగడయ్యకు అంకిత మీబడెనని చెప్పబడినది. సింగన, ప్రెగడయ్యలు సోదరులు. వీరి మరియొక సోదరుడు మామిడి వేమన. వీరిముచ్చురిలో వేమన పెద్దవాడు. ప్రెగడయ్య మధ్యముడు. సింగన కనిష్ఠుడు. వీరితండ్రి మామిడిపెద్దన. ఇతడు నాడు కొండవీటి నేలుచున్న అనవేమారెడ్డి కడ మంత్రి. వేమన దండనాయకుడు. ప్రెగడయ్య ప్రధానద్వార పరిరక్షకుడు. ఇక సింగన, చందవోలు రాజధానిగా నేలుచున్న పెదకోమటి వేముని కడమంత్రి.

జగము నుతింపఁగఁజెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగు ఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సారసంగ్రహ
మగు నా యారాధ్య చరితమాదిగఁ బెక్కుల్

అని నైషధమున చెప్పుటను బట్టి పండితారాధ్య చరిత మొక్కటియే గాక యితర కావ్యములను అంకితమొనర్చెనని తెలియుచున్నది. అంతేగాక ప్రెగడయ్యకు మాత్రమేగాక, వేమనకును ఇచ్చి యుండవచ్చునని సందేహించుటకు అవకాశము గలదు. అది నిజమే అయినచో, మామిడి కుటుంబము నందలి ముచ్చురికి శ్రీనాథుడు కావ్యములు అంకితము గావించెనని తెలియును. ఇది ఎట్లు జరిగియుండవచ్చును. దాని కగు నేపథ్య మేమై యుండును.

1. పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మ స్వరూపంబు నీకాంచీదామపదము అను వ్యాసము చూచునది.

శ్రీనాథుని స్వగ్రామము పాకల. అవచి తిప్పయ అతని బాలసఖుడు. ఈ అవచి తిప్పయ అనవేమారెడ్డి కాలమున వారికి ప్రాపైన వ్యాపారిముఖ్యుడు. ఈ ప్రాపు ఈ తరమునాటిది గాదు. అద్దంకిలో ప్రోలయవేముడు రాజ్యము స్థాపించిన నాటి నుండియు యుండి యుండవచ్చును. శ్రీశైలమునకు సోపాన మార్గము నిర్మించుటలో ఈ యవచి కుటుంబము వారి అండదండలున్నవనుట స్థితిస్థాపకము. పైరెండు విషయములును హరవిలాస తృతీయా శ్వాసప్రారంభ పద్యమున పేర్కొనబడినవి.

శ్రీ పర్వత సోపాన
స్థాపక । వేమా క్షితీశ సామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య............
..............దేవయతిప్పా.

ఇది యిట్లుండ శ్రీనాథుని తాతగారు కమలనాభామాత్యుడు. అతడు వార్ధి తటీ పాకల్పట్టణాధీశ్వరుడు1. కనుక సంపన్న కుటుంబ మనుటలో సందేహములేదు. 'పాకల' నాడు కరపట్టణము. ఓడరేవు. దానిపై ఆధిపత్యము కమలనాభామాత్యునిది. ఇక శ్రీనాథుని తండ్రి మారన. విద్యారాజీవభవుడు. తల్లి భీమాంబ 2. ఇదే విషయము హరవిలాసమునందు భీమాంబికామారనామాత్య నందనునిగా చెప్పికున్నాడు3 భీమేశ్వర పురాణమున తాతగారి ప్రస్తావన మాత్రమేగాని, తండ్రి ప్రస్తావన లేదు. కాశీఖండమునను, పితామహుని దలచినాడు తప్ప తండ్రిని తలపలేదు4 అయితే అన్ని గ్రంథములందును ఆశ్వాసాంత గద్యలయందు తండ్రిని ఉట్టంకించియే యున్నాడు. కావ్య ప్రారంభమున రెండు కావ్యములందు ప్రస్తావించి, కడమ రెంటి యందు ప్రస్తావింపకుండుటకు కారణమేమైయుండును. ఏమరి నాడనవచ్చునా! లేక ఏదైన ప్రత్యేక కారణమున్నదా! తాతగారు ఘనుడు. పద్మపురాణ సంగ్రహ కళా ప్రబంధాధిపుడు5. శృంగార నైషధమును బట్టి తండ్రి విద్యారాజీవభవుడు. అంతమాత్రమే. హరవిలాసమున కేవలము మారనామాత్యుడని సంభావింపబడినాడు. అనగా తాతగారి సంపన్నత్వ వారసత్వము విద్యయందే తప్ప భౌతిక సంపద తండ్రి యందు వ్యయమైనదని తలపవచ్చునా! తనకును తాతతండ్రుల నుండి విద్యా వారసత్వమే అబ్బినట్లున్నది. తండ్రిగారి యందలి గౌరవమే అతనిని అమాత్యుడని సంభావింపజేసినది తప్ప. అతడు చేసిన రాజోద్యోగము ఏదియు తెలియరాదు. కూర్చుని తినిన కొండలైనను తరుగును. అంతేగాక ఆస్థి సాధారణముగా మూడవ తరము నాటి కుండదని లోకోక్తి. తాతగారి ఆస్థి తండ్రి తరమును, తన బాల్యదశను

1. 1-1 భీమేశ్వర పురాణము.
2& 5 1-12 శృంగార నైషధము.
3. 1-8 హరవిలాసము
4. 1-20 కాశీఖండము

ఇబ్బంది లేక గడపి యుండవలయును. తనకు వ్యక్తత వచ్చునాటికి విద్యా సంపన్నత్వము పుష్కలముగ నున్నది గాని లౌకిక సంపద లేకపోయి యుండ వలయును. సంపదయున్నను లేకున్నను బ్రతికి చెడ్డ స్థితి నేటిది. నాటి జీవన సరళిని తప్పించుట కష్టము. నేటి ఆర్థిక దుస్థితి దాని నందుకొన నీయదు. శ్రీనాథునిది ప్రభువంశము కాదుగాని, వైభవమున దాని కెనయైనదే ననుట స్పష్టము. ఇప్పటి స్థితి ఇంగువ కట్టిన గుడ్డ. చిన్నారిపొన్నారి చిరుతకూకటి నాటికే కావ్యము చెప్పనేర్చిన దిట్ట. ఆనాటికి తాతతండ్రు లిరువురు ఉండియుందురు. మరి నూనూగు మీసాలనూత్న యౌవనము నాటి స్థితి. విద్యాసంపన్నత్వము శాలివాహన సప్తశతిని నుడివింపచేసినది. లౌకిక సంపదకు కొరత ఏర్పడి యుండవలెను. మరి వివాహము కూడ అయినదేమో! చాప చిరిగిన చదరంత. రెండు కావ్యములు రచించిన వానికి శిష్యగణముండదా! శిష్యుల నుండి ధనమాశించిన కాలము కాదది. మీదు మిక్కిలి వారికి తానే భోజన సదుపాయము లేర్పాటు చేయవలసి యున్నది. చాప పోగా మిగిలిన చదర దాని నను వు పరుపదు. మరి ఏది దారి. తన అపారవైదుష్యము. దాని నాదరింపగల ప్రభువు కలిగిన సమస్య తీరును. అప్పటికి ప్రాభవమున నున్నది కొండవీడు రాజ్యము. అచ్చట తన మిత్రుడు అవచి తిప్పయ వ్యాపారి ముఖ్యుడు. అతని సాయమపేక్షించిన! అన్ని సమస్యలు తీరును. ఈ నేపథ్యమున శ్రీనాథుడు కొండవీడుకు పయనమై ఉండవచ్చును. అంతేకాదు నడుమనడుమ బాల్యమిత్రుని ఆర్థిక సాయమును పొంది యుండవచ్చును గదా! అవచి తిప్పయ ఆదరణము నట్టిదే. అయితే రాజాశ్రయమును కల్పింపగలిగినాడా లేదా అనునది ప్రశ్న. లేదనుట స్పష్టము. అంతేకాదు. తన ప్రయత్నమునకు తోడుగా, మంత్రియైన మామిడి పెద్దన సాయమును తిప్పయ ఈ విషయమున అపేక్షించి యుండవచ్చును. కాని యిరువురి ప్రయత్నము సాగి వచ్చినట్లు లేదు. అనవేమారెడ్డి ఆస్థానమున శ్రీనాథుని ప్రసంగము కానరాదు. శ్రీనాథుడును దీని నెచ్చుటను తలపలేదు. కాని యిది, శ్రీనాథుని 'మామిడి' కుటుంబమునకు దగ్గర చేసినది. ఏతత్ఫలితమే ఆరాధ్య చరితమాదిగా రచించిన కృతులు ప్రెగడయ్యకు అంకితమొనర్చుట. పనిలో పనిగా, వేమనకును, ఏదైన అంకిత మిచ్చెనేమో. అది శాలివాహన సప్తశతి గావచ్చును లేక మరుత్తరాట్చరితము గావచ్చును. ఏదియును కాకపోవచ్చును. ఏమైనను ఆ కుటుంబముతో సన్నిహితత్వము పెరిగిన దనుటలో విప్రతిపత్తి లేదు. కాలముమీదట అనవేమారెడ్డి గతించుటయు, కుమారగిరిరెడ్డి సింహాసనమునకు వచ్చుటయు జరిగినవి. కాటయవేముడు కుమారగిరికి బావమరది. ఇతడు రణరంగమున ఎంతటి పరాక్రమవంతుడో, సాహిత్యరంగమునను అంతటి దిట్ట. మహాపండితుడగు వామనభట్టును అచ్చట గలడు. కుమారగిరి స్వయముగా సాహితీవేత్త. కాటయవేమునిది, కుమారగిరిది

కుండమార్పిడి సంబంధము. కాటయవేముడు, కుమారగిరిరాజీయము, కుమారగిరి వసంత రాజీయమను గ్రంథములను సంస్కృతమున ఘటించిన పండితులు. వామనభట్టు నలాభ్యుదయమును రచించినవాడు. ఈ నలాభ్యుదయము, శ్రీనాథుడు హర్షనైషధమును తెనుగుసేయుటకు ప్రేరణ నిచ్చి యుండవచ్చును. ఇది యిట్లుండ కారణములేమైనను, రాజాస్థానమున శ్రీనాథునికి చోటు దొరికినదిగాదు. అప్పుడే తటస్థించిన వారసత్వ వివాదమున, పెదకోమటివేమునికి చందోలు ప్రాంతము దఖలు పడినది. మామిడి కుటుంబములోని సింగన అచ్చట మంత్రిగ కుదురుకొనినాడు. పూర్వపరిచయమును పురస్కరించుకొని, నైషధమును కృతిగానిచ్చి, శ్రీనాథుడు, సింగనకు మరింత సన్నిహితుడైనాడు. ఈ సన్నిహితత్వము శ్రీనాథునికి పెదకోమటివేమునితో సన్నిహితత్వము కల్పించి యుండును. కాలము సుఖముగ గడచుచున్నది. కాని యింతలో నొక సమస్యవచ్చి పడినది. కాటయవేముడు పూర్వ దిగ్విజయ యాత్ర చేసి, సింహాచలము, ఇంకను ఆ పైవరకు జయించి వచ్చినాడు. బావమరది విజయమునకు మెచ్చి, కుమారగిరి, జయించిన రాజ్యమును, రాజమహేంద్రవరము రాజధానిగా, ఆతనినే ఏలుకొమ్మనినాడు. పూర్వపు అంగీకారము మేరకు, రెడ్డిరాజ్యము కుమారగిరి యనంతరము పెదకోమటివేమునికి సంక్రమింపవలసి యున్నది. కాని నేడది విభాగింపబడినది. ఇది సహజముగ పెదకోమటివేమునికి కంటగింపైనది. ఎదిరివారు ఒప్పందమును ఉల్లఘించినపుడు, తానుదానికి కట్టుపడవలసిన పని ఏమున్నది. కాటయవేముడు, అతని మిత్రుడు, వీడ్యకుడు అల్లాడరెడ్డి ఇప్పుడు కొండవీటియందు లేరు. కుమారగిరిరెడ్డి యుద్ధతంత్రమున ఆరితేరినవాడు కాడు. ఈ అవకాశమును వినియోగింప దలచుకొనినాడు పెదకోమటివేముడు. కుమారగిరిని ఒక్కనిగా ఈ సమయమున జయించుట సులభము. అయితే రాజమహేంద్రమునుండి కాటయవేముడు, అతనితో గల సంబంధ బంధుత్వమున విజయనగరమువారు, మిత్రత్వకారణముగా అహ్మదు నగర ప్రభువు ఫిరోజిషా, కుమారగిరికి దన్నుగా నిలుతురు. వీరిని, సాయము రాకుండ నిరోధింపగలిగిన! పెదకోమటివేముడు జయమునందుట నిశ్చయము. తనకార్యము సఫలముగావలెనన్న ముందు వారిని సాయమురాకుండ చేయ వలయును. దానిని సాధించి పిదప మెరుపుదాడి చేయవలయును. ఈ లోపున యుద్ధ ప్రయత్నము రహస్యముగా నుంచవలయును. దీనిని సాధించుటెట్లు! కొండవీటికి, రాణ్మహేంద్రవరమునకు నడుమ తానున్నాడు. కొండపల్లి తన అధీనముననున్నది. కాటయవేముడు బలగముతో రావలెనన్న గోదావరి, కృష్ణలను దాటిరావలసియున్నది. ఇచ్చట ప్రయత్నములు వారికి తెలియకుండ తగు కట్టుదిట్టము గావించుట ఏమంత కష్టముగాదు. ఇకమిగిలినది విజయనగరము వారిని, అహ్మదునగరము వారిని రాకుండ చేయుట. దీనినెట్లు సాధించుట! పెదకోమటి వేమునికి మంత్రి మామిడిసింగన

కొండంత యండ. ఆతని చతురత్వము, యుద్ధ విద్య యందలి నిపుణత్వములు సాటిరానివి. కనుకనే శ్రీనాథుడు అతనిని 'వేమక్షతిపాలరాజ్య భావకళారక్షామణి'[1], రాజహితకార్యారంభ నిర్ధారణా ధౌరంధర్య కళాయుగంధర[2], వేమభూపతి మహాసామ్రాజ్య రక్షామణీ[3] నయచాణక్యా[4] యని కీర్తించినాడు. విజయనగర ప్రభువుల కడ కేగి విషయమును నిపుణముగ విశదపరచి, వారి నిటు రాకుండ చేయగల సమర్థుడిప్పుడు కావలయును. అట్లే ఫిరోజిషాకును చెప్పగలవాడు కావలెను. వారిరువురి ఆలోచనమున ఈ కార్యనిర్వహణమున పొడగట్టినవాడు అవచి తిప్పయ. అతని నెరుగనివారు కారు వీరిరువురు. అతడిప్పుడు కంచియందున్నాడు. తామైవెళ్లుట! అది బయటకు పొక్కిన యత్నము సర్వము నిష్ఫలమగును. దీనికై ఎవరిని నియోగింపవలయునను ఆలోచనమున, దీనికి సమర్థుడు శ్రీనాథుడని భావించినారు. శ్రీనాథునికి, అవచి తిప్పయకుగల అనుబంధ మీనాటిది గాదు. మామిడి కుటుంబమునకు శ్రీనాథుని సన్నిహితము చేసినదియు అవచితిప్పయయే. రాజ్యావారసత్వ విషయమై జరిగిన నిష్కర్షయు అతని కెరుకలోనిదే. ఈ యన్నియు శ్రీనాథునికి పరిచితములే. వీనినన్నింటిని దృష్టిలో నుంచుకొని, దీనిని సంఘటింపుమని శ్రీనాథుని అభ్యర్థించినారు. ఈ కార్యమునందలి సాధ్యాసాధ్యములను మనసున వివేచించి[5] కంచికి పయనమైనాడు శ్రీనాథుడు. అవచి తిప్పయను దర్శించినాడు. ఈ దర్శనము. హరవిలాస కృతిని సాహితీ లోకమునకు ప్రసాదించినది. దీనిని కొంత పరామర్శింతము.

శ్రీనాథుడు కంచికి వెళ్ళిన వెంటనే కార్యమును నివేదించి, తిరుగు ప్రయాణము కావలసిన పనిలేదు. ఆ కార్యస్వభావమును అట్టిది గాదు. అంతే గాక వారిరువురు సఖులు. కొన్నినాళ్లు అచ్చట యుండుటకు శ్రీనాథునకు ఇబ్బందియులేదు. అతనిని పోషించుటకు, సర్వసౌకర్యములను సమకూర్చసామర్థ్యము లేని వాడు గాదు అవచి తిప్పయ. అప్పటికి ఎన్ని ఏండ్లాయెనో వారిరువురు కలసి. నాటికి నేటికీ విధమున అవకాశము చిక్కినది మిత్రులిరువురుకు. అట్లుకొంతకాలముండగా ఒకనాడు, ఎప్పటినుండియో తన మనమునగల కోరికను వెలిబుచ్చినాడు అవచితిప్పయ.

మిత్రమా!

కంటిని విశుద్ధ సంతతి
వింటిపురాణములు పెక్కు విశ్వమువొగడన్
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటినుతింపన్[6].

---

1 1 - 44 శృంగార నైషధము
2 1-111 శృంగార నైషధము
3 2-144 శృంగార నైషధము
4 6-144 శృంగార నైషధము
5 చూడుడు : శ్రీనాథుని దౌత్యము - అవచి తిప్పయ ఔచిత్యము :
6 1-9 హరవలాసము

మిగిలినవన్నియు అటుండ యశోధనము కొంటిని సుకవి కోటినుతింప'అని ప్రత్యేకముగ చెప్పికొన్నాడు. తాను వ్యాపారి. సంపాదింపను గలడు. ఈవి కొలది వితరణమును గావింపగలడు. యశస్సును పొందగలడు. అది సాధారణ ధనార్థుల వలన మాత్రమే కాదు సుమా! సుకవిపండితకోటి వలనను పొందితిని, అని అర్హతను ప్రకటించుచున్నాడు. ఇది ముందు తానడుగ బోవు దానికి పీఠిక. దానిని, తన తాతలు గావించిన దానాదికములతో ఆమ్రేడించినాడు.[1] మరినీవు ఆగమజ్ఞాననిధివి. తత్త్వార్థఖనివి బహుపురాణజ్ఞుడవు. బాలసఖుడవు. శైవప్రబంధమొకటి అవధరింపుము నాపేరనంకితముగ[2]. అని కోరి తన కోరిక లోని ఔచిత్యమును కూడ శ్రీనాథునికే వదలి వైచినాడు. దాని కగుమాట 'శుభభవ్యమతివి' అనునది. కాదనుటకు శ్రీనాథుని మనసొప్పునా! సాధారణ స్థితిలోనే కాదనుట కుదరదు. మీదుమిక్కిలి తానిప్పుడు కార్యార్థియై వచ్చినాడు. ఇక కావ్యము. చెప్పుట అనునది శ్రీనాథుని కొక హేల. కావ్య రచనము అతనికి ఈప్సితార్థము. ఈప్సితార్థమునకు బారు హృదయరుచియు, నిమ్నమున కోడిగిలు నీరు నిలుపరానిది. కృతికర్తగా అవచి తిప్పయకు గల అర్హతను, చిత్తము విచారమార్గమునకు చేరదెచ్చి తత్త్వమును పొడగాంచినాడు. ఇంత యాలోచించినను 'కర్ణాటకిరాటకీచకులకు కావ్యమునమ్ముకొన్నాడన్న' వాద మెట్లును తప్పలేదు. దానికేమి! లోకపు తీరే యంత. కావ్యము చెప్పనారంభించి నాడు. తన గొప్పతనమును, తన వంశాదికమును అప్పయచెప్పినట్లుగా ఒకపద్యము సంధానించినాడు. అందు ఆంధ్రనైషధాబ్జ భవుడనని చెప్పికున్నాడు. మరిముందు 'ఆరాధ్యచరితమాదిగ' పెక్కుకృతులు చెప్పి యున్నాడు గదా! వాటినేల ప్రస్తావింపలేదు. ఈ ప్రశ్నలేవనెత్తుటకు ఒకకారణముగలదు. కాశీఖండమున,[3] ఏయే వయసులలో తానేకావ్యములు చెప్పినాడో తెలిపినాడు. అచ్చట హరవిలాసము ఊసెత్తలేదు. దీనిపై పండితులు, బహుశః శ్రీనాథునికి హరవిలాసము పై అంతదృష్టి యుండియుండక పోవచ్చునని, కార్యార్థియై కంచివెళ్లినపుడు, తిప్పయమాటకాదనలేక, త్వరత్వరగా కావ్యము చెప్పినాడని, తనపాండిత్యమునకది నికషోపలము కాదని అతను భావించి యుండవచ్చునని, త్వరత్వరగా రచించుటవలననే షష్ఠాశ్వాసమునందు కథ శివునిచే ఉత్తమపురుషలో ప్రారంభింపజేసి, కొంతదూరము పోయిన తరువాత దీనిని మరిచి ప్రథమ పురుషలో శివుడు కథనముగావించినట్లు రచించినాడని విమర్శకు లూహించిరి. ఈ కథాకథన విషయము వేరుగ చర్చింపవలసియున్న విషయము. కాశీఖండమున, హరవిలాస ప్రసక్తి చేయకపోవుటకు, దానిపై అతనికంత దృష్టి లేదను పండితుల

1 1 - 10, 11 హరవిలాసము

2 1-12 హరవిలాసము

3 1-7 కాశీఖండము

ఊహసమంజసమైనదో కాదో విచారింపవలసియున్నది. హరవిలాస ప్రసక్తి, కాశీఖండమునందేగాదు. భీమఖండమునందును చేయలేదు. మరుత్తరాట్చరిత్ర, నైషధము, సప్తశతి, పండితారాధ్య చరిత్రముల ప్రస్తావన మాత్రముగావించినాడు.[1] హరవిలాసరచనకు పూర్వపు రచన శృంగార నైషధమునందును, అనంతర రచనలు భీమేశ్వర కాశీఖండములందు ప్రస్తావింపబడిన పండితారాధ్య చరిత్ర, మిగిలిన కృతులు, మరుత్తరాట్చరిత్ర, సప్తశతులను హరవిలాసమునందేల ప్రస్తావింపలేదు. కాని ఈ విషయము పండితుల దృష్టిని ఏలనో ఆకర్షింపలేదు. నిజమునకు ఇట్లు ప్రస్తావించుటకు, ప్రస్తావింపక పోవుటకు ఏమైన విశేషకారణము లున్నవా! లేక ఆయన అప్పటికి తోచినట్లు వ్రాసెనని భావింపవలెనా! ఆలోచించిన ఇది ఉద్దేశ పూర్వకము గనే గావించినట్లు తెలియును. హరవిలాసము, తరువాతి భీమఖండ, కాశీఖండములలో ప్రస్తావింప బడకపోవుటకు కారణములు వాని చారిత్రక నేపథ్యమును చర్చించునపుడు పరిశీలింప వచ్చును. ప్రస్తుతము హరవిలాసమున, ఆరాధ్యచరిత్ర, మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతులను ప్రస్తావించుటకు కారణములు తెలియుదము.

మరుత్తరాట్చరిత్ర, సప్తశతి, ఆరాధ్య చరిత్రములు అవచి తిప్పయ్య కొండవీడు నందుండగనే కూర్పబడియుండును. ఇట్లూహించుటకు ప్రబలకారణము ఆరాధ్య చరితమాదిగ పెక్కులు ప్రెగడయ్యకు నాయనుంగుఁబెద్దనకు కృతులు జగము నుతింప జెప్పితివన్న, మామిడిసింగన వక్కణమే. ఆ కృతులు చెప్పిన కాలమున, సింగన సోదరులు కొండవీటినందున్నారు. వారితోడి శ్రీనాథుని సంసర్గము ముందే చెప్పబడినది. కనుక, ఆయా కృతుల రచన, అవచి తిప్పయకు తెలిసిన విషయమే. కాని ఈనడుమ, అనగా తిప్పయ కొండవీడు వదలి కంచిలో స్థిరనివాసము ఏర్పరుచుకొన్న పిదప రచించినది నైషధము. కనుక దాని విషయము మాత్రమే ప్రస్తావించినాడు. ఇప్పుడు తాను వచ్చిన కార్యము తనపై బడుటకు కారణమైనది నైషధము. ఇది అంకితమిచ్చుటవలననే, శ్రీనాథుడు సింగనకు అత్యంత సన్నిహితుడైనాడు. ఆసన్నిహితత్వము పెదకోమటి వేముని దగ్గరచేసినది. అనగా నైషధ ప్రకటనము ఇంతకు మూలమైనది. మొదలు 'మామిడి' వారితో సన్నిహితత్వమునకు మూలమైన వాడు అవచి తిప్పయ. కుమారగిరికి అపకారముగలిగించు కార్యము (విజయనగరమువారు, ఫిరోజిషా రాకుండ నిరోధించుట) నేనెట్లు చేతునని ఒకవేళ తిప్పయ ప్రశ్నించిన, దానికి ముందుగనే, ఈ రూపమున అనగా నేను ఈ పనికి పూనుకొనవలసివచ్చుటకు, అందే నా అభ్యున్నతి యిమిడి యుండుటకు నీవే కారణభూతుడవు,' అను సమాధానము నిందు శ్రీనాథుడు సిద్ధము చేసినాడని భావింపవచ్చును. అయితే ఈ కార్యనిర్వహణమున కొన్ని సున్నితమైన సమస్యలు

1 1-17 భీమేశ్వర పురాణము

గలవు. వానిని శ్రీనాథుని దౌత్యము- అవచి తిప్పయ ఔచిత్యము అనువ్యాసమున చర్చించుట జరిగినది. ఇది హరవిలాస రచనమునకు గలచారిత్రక నేపథ్యము. శ్రీనాథుని అభ్యర్థనమును తిప్పయ పాటించినట్లు తలపవచ్చును. కారణము అనంతరము జరిగిన యుద్ధమున విజయనగరమువారుగాని, ఫిరోజిషాగాని, కొండవీడుపై కన్నెత్తి చూడలేదు. ఫిరోజిషాకు నచ్చచెప్పుటలో, తిప్పయతోబాటు, సింగన పాత్ర కూడ యుండి యుండవచ్చును. దానిని పట్టి యిచ్చుమాట నైషధమున నొకటి గలదు. అది. యవనాధీశ సభానిరంకుశ వచో వ్యాపార పారంగతా[1] అనునది. తలపెట్టిన కార్యము నెరవేరినది. పెదకోమటి వేముడు కొండవీడు సింహాసనముపై సుప్రతిష్ఠితుడైనాడు. శ్రీనాథుడు ఆస్థానమున విద్యాధికారిపదవినధిష్ఠించినాడు.

కాలముగడువ పెదకోమటివేముని పిదప, ఆయన కుమారుడు రాచవేముడు రాజ్యాధికారమును స్వీకరించినాడు. ఈతని పాలనాకాలము దుర్భరముగ గడచినది. తుద కతడు. అతని అంగరక్షకుని చేతనే సంహరింపబడినాడు. రాజ్యము అల్లకల్లోలమైనది. కడకు పరాధీనమైనది. శ్రీనాథునికి ఆశ్రయము కరవైనది. మొదలు కొండవీడుకు వచ్చినప్పటి స్థితి సంభవించినది. రాజాశ్రయములేక నిలుచునట్టిదికాదు అతని కుటుంబస్థితి. ఏవేవో ప్రయత్నములు గావించియుండును. ఆప్రయత్నములో, ఆలోచనలో రాజమహేంద్రవరము మదిలో మెదిలి యుండవలయును. అచ్చట బంధువగు[2] బెండపూడి అన్నయ మంత్రిత్వము నెరపుచున్నాడు. ప్రభువు వీరభద్రారెడ్డి. ప్రభ్వీణి అనితల్లి. ఈమె కాటయవేముని కుమార్తె. వీరభద్రారెడ్డి అన్న వేమారెడ్డి. వీరిరువురు అల్లాడరెడ్డి కుమారులు. వీరుగాక దొడ్డారెడ్డి, అన్నయరెడ్డి అను మరి యిరువురు కుమారులు అల్లాడరెడ్డికి గలరు. బెండపూడి అన్నమంత్రి పరమ శివభక్తుడు. శివాలయములకు అనేక ఉపాయనము లిచ్చినవాడు. నిర్మాణములనేకములు గావించినవాడు. ముఖ్యముగ 'దక్షవాటిక (దాక్షారామము) యందు, తరుణేందు మౌళికి మొగిలి వాకిట ధామమును రచించిన'[3] వాడు. ఇక శ్రీనాథుడెట్లును ఈశ్వరార్చన కళాశీలుడు[4]. హరవిలాసరచనము వలన అభవు నర్చించు తన అభిమతము కొంత నెరవేరినది. ఇట్లనుటకు కారణము నైషధరచనము పిదప కూర్చిన కావ్యములు హరవిలాసమాదిగా, శివరాత్రి మహాత్మ్యము వరకు నన్నియు శివసంబంధములగుట. తన అభిమతమునకు తోడు, కృతి భర్తల యభిమతము నట్టిదేయగుట ఆతని సుకృతము. ఇహపరములను సాధించుటకది ఉపాదేయమైనది. హరవిలాస రచనము,

1 2-144 శృంగార నైషధము

2 1-23 భీమేశ్వర పురాణము

3 1-75 భీమేశ్వర పురాణము

4 1-13 శృంగార నైషధము

పరోక్షముగ, అతనిని పెదకోమటి వేముని ఆస్థానమున విద్యాధికారిపదవి నధిష్టించుటకు తోడ్పడినది. భీమేశ్వర పురాణము, ఏతత్ కృతిభర్త అన్నమంత్రిప్రాపున, వీరభద్రారెడ్డి, ఆస్థానమునకు పరిచయము గావింప సమర్థకమైనది. కాశీఖండము అతడచ్చట స్థిరముగ పాదుకొనుటకు కారణమైనది. శివరాత్రిమాహత్మ్యము, అవసానకాలమున, శ్రీశైలమఠమున ఆశ్రయముపొందుటకు అనువేర్పరిచినది. వీనిని కొంత వివరముగ పరిశీలింతము.

శ్రీనాథుని అదృష్టమో దురదృష్టమోకాని, ఇతరుల సాయము లేక రాజాశ్రయము లభించినది కాదు. పెదకోమటివేముని ఆస్థానమున చేరుటకు మామిడి సింగన ప్రాపు అవసరమైనది. అతనితోడి సంసర్గమునకు కారణమైనది అవచి తిప్పయ మాటసాయము. ఈ మాట సాయము అంతటితో నాగలేదు. రాజ్యవ్యవహారములందు, పెదకోమటివేమునికి, కుమారగిరికి గల జ్ఞాతి వైరమునందు తలదూర్చునట్లు చేసినది. ఇది రెండు కార్యములకు ఆలంబనమైనది. ఒకటి పెదకోమటి వేముడు కొండవీటి సింహాసనముపై సుప్రతిష్ఠితుడగుట. రెండవది హరవిలాసకావ్యరచనము. తన యిష్టదైవమును కీర్తించుట కాటపట్టయిన హరవిలాస ప్రశంస, తదనంతర కావ్యములలో చేయకుండుటకు ఇదియే కారణమైనది. ఎన్నడో చిన్ననాట రచించిన మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి పండితారాధ్య చరితలను[1] నైషధమును[2] ప్రస్తావించినాడుగాని, తన దైవమును ముమ్మొదట కీర్తించిన హర విలాసమును తలపలేదు. మొదలు ఈ విధముగ పూర్వ కృత కావ్యములను తలచుటకు కారణమేమి! తన పాండితీ గరిమను, పరిచయము గావించుకొనుటకేగదా! అయినపుడు అన్నియు చెప్పవచ్చునుగదా! మరి హరవిలాసమును విడుచుట ఎందులకు. దీనికొక కారణము ముందు చెప్పబడినది. అది కర్ణాటకిరాటకీచకునకు అంకితమగుటగా ప్రచారమందినది.[3] ఇచ్చట ఇతర కారణములను పరిశీలింతముగాక!

భీమఖండము, కాశీఖండములు రాజమహేంద్రమున వెలసినవి. అందు భీమఖండము బెండపూడి అన్నమంత్రికి, కాశీఖండము అతని ప్రభువగు వీరభద్రారెడ్డికి అంకితములు. ఏనాటి బంధుత్వమునో పురస్కరించుకొని, అన్నమంత్రిని ఆశ్రయించి, వీరభద్రారెడ్డి ఆస్థానమున ప్రవేశము పొందుట శ్రీనాథుని యెదుటగల తక్షణ కర్తవ్యము. దాని కనువుగ ముందు, అన్నమంత్రి, కోరి, ఏదేవునికి ముఖ మంటపమును రచించెనో ఆ భీమనాయకుని మహిమను కొనియాడి, అతనిని సుముఖుని గావించుకొను ప్రయత్నములో భాగముగా, దీనిని ఆయన కంకితమొనర్చెను. ఇందును ఒక ప్రత్యేకత

1 1-17 భీమేశ్వరపురాణము

2 1-17 భీమేశ్వరపురాణము, మరియు, 1-23 భీమేశ్వరపురాణము

3 కర్ణాట కిరాటకీచకులెవరు? అను వ్యాసము చూడుడు.

గలదు. భీమఖండము పీఠికాభాగమున కృతిభర్తయగు అన్నయమంత్రి వంశమును వర్ణించుటతోపాటు, ప్రభువగు వీరభద్రారెడ్డి వంశమును ఘనముగా కీర్తించినాడు. ఇది అసంగతముకాదు. కాని అప్రస్తుతము. శ్రీనాథుడు దీనినేల చేయవలసివచ్చినది. అయితే శృంగారనైషధమున ఏతత్ కృతిభర్త యగు సింగనతోపాటు, అతని ప్రభువగు పెదకోమటి వేముని, హరవిలాసమున అవచి తిప్పయతోపాటు, అతని మిత్రుడగు కుమారగిరిని ప్రస్తావింపకపోలేదు. అది మాట మాత్రము. కాని ఇచ్చట అట్లుగాదు. సంపూర్ణ వంశావతార వర్ణన. దీనికి కారణమేమి. శ్రీనాథుని అంతిమ లక్ష్యము రాజమహేంద్రవర ఆస్థానమున స్థిరముగ పాదుకొనుట. దాని కొరకు అది అవసరమైనది. ఈ అవసరమును సాధించుటకు, హరవిలాస ప్రస్తావనము ఆటంక మగునని కవిసార్వభౌముడు తలచియుండవచ్చును. ఆ తలంపునకు కారణము హరవిలాస రచనమునకు గల నేపథ్యము. కుమారగిరిని సింహాసన భ్రష్టునిగావించి, పెదకోమటి వేముడు కొండవీడు నాక్రమించెను. ఏతత్ప్రయత్నమున అవచి తిప్పయ, శ్రీనాథుల నిర్వహణము లోకమునకు తెలిసియున్నదే. కుమారగిరిరెడ్డి, ప్రస్తుతము రాజహేంద్రము నేలుచున్న వీరభద్రారెడ్డికి మామయగు కాటయవేముని బావమరది. అతని కన్నతండ్రి అల్లాడరెడ్డి, పిల్లనిచ్చిన మామ కాటయవేముడు అనుంగు మిత్రులు. హరవిలాస ప్రస్తావనము దీనినంతయు గుర్తు తెచ్చును. ఇది తనపట్ల వైముఖ్యమునకు దారితీయవచ్చును. తలచిన కార్యమునకు భంగము కలిగించును. ఈ కారణములుగా, - ఒకటి హరవిలాసము కర్ణాటకిరాటకీచకునకు అంకితమగుటగా ప్రచారమగుట, రెండవది పైన వివరించిన కారణము - దాని ప్రస్తావన భీమఖండము, కాశీఖండములందు చేసియుండక పోవచ్చును. మరిశివరాత్రి మాహాత్మ్యమున ఏలచేయలేదు. అను ప్రశ్న యుదయించును. దీని నా సమయమున ప్రస్తావింతము గాక.

ఇక కాశీఖండ రచనా నేపథ్యమెట్టిదో చూతము, భీమేశ్వరపురాణ రచనము, రాజమహేంద్రమున తాను నిలదొక్కుకొనుటకు ఉపకరించినది. అన్నమంత్రిప్రాపు, అతని పాండితీ గరిమ దానిని సుస్థాపిత మొనరించినవి. ఈరెండును, పెదకోమటి వేముని విషయమున తాను నిర్వర్తించిన పాత్రపై, వీరభద్రారెడ్డి, అతని అన్న వేమారెడ్డి గార్లకు గల నిరసనమును మాన్ప సమర్థకములైనవి. అంతేగాక కాలము కూడ గాయమును మాన్పును గదా! అంతేగాదు. నిన్నమొన్నటి వరకు, తమ శత్రుకూటమి లోని వారి ఆస్థానము నందుండి, కాలవైపరీత్యముచే, తమ్మాశ్రయించినాడు. అతడు కేవలము కవిమాత్రము కాదు. అశేష శేముషీధురంధరుడు. తామాదరింపకున్నను, శ్రీనాథుని ఎవరో ఒకరు ఆదరింపకపోరు. తామే ఆదరించిన - తాము ఔదార్య మూర్తులగుదురు. లోకమున తమకీర్తి యినుమడించును. ఇది సత్యమనుటకు, అనంతరకాలమున శ్రీనాథుని ఆదరింపకపోవుటయేగాక పెక్కుయిడుములపాలు

జేసిన ఒడ్డె ప్రభువులపై అపనింద నేటికిని నిలిచి యున్నదిగదా! తెలుగు సాహిత్యమున్నంత కాలము అది అట్లేయుండును. అట్టి సత్కవిచే తామును ఏదైన కావ్యమునంకితముగొన్న! తమ పుట్టువు చరితార్థమగును గదా! ఇది కాశీఖండ రచనమునకు నేపథ్యమును సవరించినది. ఇచ్చట తరచి చూడవలసిన విశేషమొకటి కలదు.

శ్రీనాథుడు అన్నికావ్యములు (లభ్యమైనవి) ఆయా కృతి కర్తల అభ్యర్థనము మేరకే రచించినాడు. ఒక్క భీమఖండము తప్ప. అత డేదేని కావ్యము రచింతుమని తలంచుచున్న సందర్భమున, భీమఖండము వ్రాయుమని, తన కంకితము గావింపుమని అన్న మంత్రికోరినాడు. అట్లే శృంగారనైషధమును రచింపుమని సింగన, హరవిలాసమును (శైవ ప్రబంధమును) రచింపుమని తిప్పయ కోరినారు. కాని కాశీఖండము అట్లుగాక, తాను వ్రాయవలెనని సంకల్పించినాడు.[1] దానిని కర్ణాకర్ణిగావిని వీరభద్రభూపాలుడు, శ్రీనాథుని సభాస్థలికి పిలిపించినాడు. సముచితాసనంబున కూర్చుండ నియమించినాడు. తమ్ముని యింగితమెరిగి, వేమభూపాలుడు ఇపుడు చెప్పదొడంగిన యీ ప్రబంధమంకితము సేయు వీరభద్రయ్యపేర' అని అభ్యర్థించినాడు. తన ఆశయము సిద్ధించినది. ఇది ఇట్లే కాకపోవచ్చును. అన్న మంత్రి మాట సాయముండి యుండవచ్చును గాక! దానికేమి. అది యెట్లును తప్పదు. పిలిచి, పెద్దపీట వేసి, నిండుకొలువున తనను సమాదరించినారు. ఇది సామాన్యమైనది కాదు. ఏలనన, పెదకోమటి వేముని, విషయమున తనపాత్ర నెరింగియు, తనపట్ల ఔదార్యము నెరపుట - అందును రాచపుట్టువులు అట్లుచేయుట అసామాన్య విషయము. కావుననే భీమఖండమున, అప్పటి తన అవసరమునకై గావించిన వీరభద్రారెడ్డి వంశకీర్తనము, కాశీఖండమున, కృతజ్ఞతా సంభరితమైనది. కనుకనే అంత విస్తృతముగా చేసినాడు. అందును, మొదట ప్రస్తావించినది వీరభద్రారెడ్డి అన్న యగు వేమభూపాలుని గూర్చియే. బీమఖండముననుమ ముందుగ నతనినే ప్రస్తావించినాడు) అదియును' ఆంధ్రక్షమా మండలాఖండలుండైన' వేముడనుటతో ప్రారంభము. దీనికి కారణము గలదు. వేమారెడ్డి సామర్థ్యముననే. రాజమహేంద్రవర రాజ్య సుస్థిరమైనది. చీడికాడ, మాకరము, సప్తమాడియ, ఝాడు, జంతుర్నాడు, బారహదొంత. కలువపల్లి, ఒడ్డాదులను జయించినవాడు.[2] తమ్మునిచే ధాత్రి నేలించినవాడు. ఇంతటివాడు, మరియు, తాను జ్యేష్ఠుడై యుండియు తమ్ముని సింహాసనాధిష్ఠితు నేల జేసెను. ఇందే, వేముని ఔదార్య మిమిడి యున్నది. రాజ మహేంద్రవర రాజ్యము, కుమారిగిరిచే కాటయవేమున కీబడినది. కాటయవేముని కుమార్తె అనితల్లిని వివాహమాడినవాడు

1 1-7,8 కాశీఖండము

2 1-33,34 కాశీఖండము

వీరభద్రారెడ్డి. రాజ్యము మరదలి నుండి సంక్రమించినది గనుక, దానిపై ఆధిపత్యము తమ్మునికే యుండుట ధర్మమని తలంచినాడు వేముడు. కనుకనే తాను జ్యేష్ఠుడయ్యును, పరాక్రమవంతుడయ్యును, రాజ్యమును సుస్థిరము, విశాలమును గావించిన వాడయ్యును, తమ్మునే రాజ్యమందు నిలిపెను. అన్ని అవకాశములు తన కున్నను, ధర్మబద్ధుడగుట సామాన్యమగు విషయముకాదు. ఈ యన్నియు శ్రీనాథుని చలింపజేసినవి. అందుకే నోరారా అతనిని కీర్తించినాడు. అంతమాత్రమేకాదు. రాజాస్థానము నలంకరించిన వారిని తప్ప (సింహాసనాధీశులు, తక్కుపరివారము) అంతఃపురములలోని వారిని, ప్రస్తావ వశముగ పేర్కొనుట తప్ప, ప్రత్యేకము నెన్నడు కీర్తింపని శ్రీనాథుడు, ఈకావ్యమున వీరభద్రారెడ్డి భార్య అనితల్లిని కీర్తించినాడు. ఆ కీర్తించుట కూడ 'సాక్షాదిందిరా దేవత2 యని. ఇట్లు పొగడుటకు ఆమె కేవలము ప్రభ్విణియగుట మాత్రమేగాదు. అట్టిదేయైన అది కేవలము తన స్వార్థమే - తనకు ఆశ్రయము కల్పించిన ప్రభుభార్యయగుటే - యగును. కాని అనితల్లి నిజముగ వనితామతల్లి. శ్రీనాథుడిట్లు పొగడుటకు కారణము తెలియవలెనన్న, ఆమె కలువచేరు శాసనముచూడనగును. ఇంతమాత్రమేగాక, ఈ రాజ్యస్థాపనకు మూలకారకుడగు ఆమె తండ్రిని కాటయవేముని కూడ 'మనుతుల్యుండగు కోట భూవిభుని1 అని కీర్తించినాడు. కాటయవేముని కీర్తించుటకు ఈ విశేషణమేల అవసరమైనది. అతని గుణగణములను కీర్తింపవలయునన్న ఎన్నియో కారణములు గలవు. అతడంతటి పరాక్రమశాలి. అంతటి సాహిత్యవేత్తయు కూడ. ఆ యన్నింటిని వదలి 'కోట భూవిభుడనుట' ఏల. ఇచ్చట కోట యనగా ధరణికోట. ఈ ధరణికోటను అనంతరమేలిన గన్న భూపాలుడు పెదకోమటి వేమునికి పిల్ల నిచ్చిన మామ. (సూరాంబికతండ్రి). పెదకోముటి వేముడెవరు. కుమారగిరిరెడ్డికి పినతండ్రి బిడ్డయే. ప్రోలయవేముని అనంతరము అతని తమ్ముడగు అనవేముడు, ఆ పిదప అతని కుమారుడు కుమారగిరిరెడ్డి ప్రభువులైరి. అనవేముని తమ్ముని కుమారుడు పెదకోమటి వేముడు. రాజ్యము అనవేముని కొక్కనికే ఏలరావలయును. అతనికి గల అర్హత తన తండ్రికిని గలదు. కనుక తనకును భాగము గలదనినాడు పెదకోమటి వేముడు. ఇందలి సమంజసత్వమును గుర్తించియే కాటయవేముడు, కుమారిగిరిరెడ్డి తరువాత, రాజ్యము పెదకోముటివేమునికి సంక్రమింపగలదని చేసిన ఏర్పాటు. కోటవారికి, కొండవీటివారికి గల సంబంధము ఈ నాటిదిగాదు. ఇదంతయు బీరకాయపీచు వంటిది. రాజ్య కలహములందురా! తప్పవు. అది అంతయు జరిగినపోయిన కాలమునాటి మాట. ఇప్పటి కందరు ఇట రాజమహేంద్రవరమున సుఖమున్నారు. గతించిన వాటిని తలచిన, ప్రయోజనము కన్న, అసూయాద్వేషములు ప్రబలును.

1 1-43,44 కాశీఖండము

అయినదేమో అయినది. కాలవశమునగాని, మరియొక విధమునగాని, తానును, ఈ జ్ఞాతివైరమునందు తలదూర్చినాడు. ఇందలి తనదోషమెంత. ఏమో! అది దైవము విచారించును. మీరును మీరును అందరూ కావలిసినవారే. నడుమ చీకాకులు కలిగిన మాట వాస్తవము. అందలి నా పాత్రను మరచి, ఆశ్రయమిచ్చిన మహానుభావులు మీరు. దీని నంతయును మనసు నందుంచి కొనియే, సంబంధబంధుల నందరిని కీర్తించినాడు. ఇది కాశీఖండమునకు గల నేపథ్యము. ఇందలి చిన్నారిపొన్నారి చిరుతకూకటినాడు...[1] అనుపద్యమే, ఈ వ్యాసరచనకు మూలము. ఇందు హరవిలాసమును ప్రస్తావింపలేదని, అందువలన దానిపై అతనికంత చూపులేదని విమర్శకులూహించిరి. ఆ లేకపోవుట తత్పూర్వరచనము భీమఖండమునందును, తదనంతర రచనము శివరాత్రి మహత్త్వమును గావింపలేదనుట వాస్తవము. ఇక శివరాత్రి మహత్మ్య రచనా సందర్భమును పురిశీలింతము.

శివరాత్రి మాహాత్మ్యరచనము శ్రీశైలమునగావింపబడినది. శ్రీనాథుడు శ్రీశైలమున కేగవలసిన పరిస్థితు లెట్లేర్పడినవి. కాలక్రమమున రెడ్డి రాజ్య మంతరించినది. రాజమహేంద్రవరము, కొండవీడులు గజపతుల వశమైనవి. రాజాశ్రయము కరవైనది. ప్రాయము కైవ్రాలినది. తమ శత్రురాజుల ఆస్థానియని ఒడ్డె ధాత్రీపతులు తనను మన్నింపరైరి. కుటుంబపోషణమునకు బొడ్డుపల్లెను గుత్తకు దీసికొనినాడు. అది కృష్ణవేణమ్మ పాలైనది. మిగిలినవిదేమైననున్న బిలబిలాక్షులు దినిపోయినవి. కట్టుగుత్త ఏడునూర్లటంకములు చెల్లింపలేక శిక్షలనుభవింపవలసి వచ్చినది. ఇకతాను భూలోకమున నుండలేనని 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ' అమరపురికి నరుగుదు ననినాడు. ఈ విశేషములన్నియు మనకు అతని చాటు పద్యములవలన లభించు చున్నవి. తానను కున్నను, స్వర్లోకప్రాప్తి జీవుని యధీనము కాదుగదా! అంతటి వార్ధక్యమున పొట్టకూటి కొరకై శ్రీశైలమున కేగినాడు. ఎంతటి మహాకవి. ఎంతటి వైభవమను భవించినాడు. జరిగిన కాలమంతయు కలగా భాసించుచున్నది. జరిగిన చరిత్రయందు తాను కవిగా మిగులక, రాజ్యతంత్రములందు తన ప్రమేయ మేల. అది అప్పటి అవసరము. మరి యిప్పటి స్థితికిని అదే మూలము. దీని నెవరు తప్పింపగలరు. మరియొక మార్గములేదు. స్వర్గమునకే వెళ్లుదమనుకొనినాడు. అది తనచేతిలోనిది గాదని ఎరుగని వాడు కాడు. ఉన్నంతకాలము దేహయాత్ర తప్పదు. నడుమ భార్య ఏమైనదో! కుమార్తెను దుగ్గన కిచ్చినాడు. అతడున్నచోటనే ఉండినాడు. అతడు అల్లుడేగాదు. బావమరదియును.

---

1 1-7 కాశీఖండము

ఆ కారణముగా, భార్యను అచటి కంపి యుండ వచ్చును. ఇకతాను. ఆ అమరపురి చేరుటకు బదులు, ఈ అమరపురి (శ్రీశైలము) మనసున మెదిలినది. తన పరదైవ మచ్చట నున్నాడు. తన కింత వసతి కల్పింపకపోడు. కల్పింపకున్నను వచ్చు నష్టము లేదు. చెంత కృష్ణమ్మ ఉండనే యున్నది. ఆమె యైనను తనకాశ్రయమీదా! ఇట్టి ఊహాపోహ విచారము గావించె నేమో! కవిసార్వభౌముడు. ఏది ఏమైనను, ఈ రాజాశ్రయములు, అవి తెచ్చిపెట్టు వైభవములతో విసివి యుండ వచ్చును. శ్రీశైలము జేరినాడు. గతి లింగపతి యని తీర్మానించుకొనినాడు. అచ్చటి మఠాధిపతి భిక్షావృత్తి (మఠమునకునును అదియేపేరు) ని చూచినాడు. తాను కోరి కీర్తించిన, ఆరాధ్య చరితమునకు మూలమైన ఆరాధ్యు లొకప్పు డధివసించిన చోటది. కనుక ఆశ్రయమునకొక యడ్డంకి లేదు. శ్రీనాథుని ప్రసిద్ధిని తెలియని వారు గారచటివారు. పండితుని సత్కరించుటయన్న, అతని కిష్టమైన పనిని అప్పగించుటయే. అదియే జరిగినది. ముమ్మడి శాంతయ్య నధినాయకునిగా, శివరాత్రి మాహాత్మ్యము సంతరించుటకు తగు నేపథ్యమేర్పడినది. హరవిలాసమున ప్రారంభమైన శివకీర్తనము, భీమేశ్వర పురాణమున విస్తరించి, అందుమాటమాత్రముగా చెప్పిన వ్యాసుడు కాశినెడబాసిన వృత్తాంతము సాకుగా గొని, మొత్తము కాశీఖండమును అనువదించి, అన్నింటికి మూలమైన శివరాత్రి మహాత్మ్యముతో తన ఈశ్వర యాగమును పరిసమాప్తి గావించుకొనిన పుణ్యమూర్తి శ్రీనాథుడు. ఇందును హరవిలాసమును ప్రస్తావింపలేదు. కర్ణాటకిరాట కీచకుల కిచ్చెనన్న మొదటి కారణముండనే యున్నది. అదిగాక, ఆ పిదప జరిగిన శ్రీనాథుని యావద్విశిష్ట చరిత్రకు అదియే మూలము. ఏ తత్కార్యనిర్వహణము నందు తన పాత్ర యెట్టిది. తానేల ఆ పని చేయవలసి వచ్చినది. తత్కాలీనకారణము లున్నవి. లేవనిగాదు. ఇప్పుడు మొత్తము నంతను బేరీజు వేసికొనిన, రాజ్యతంత్రమున పాల్గొనుట తన కేమవసరము. దనినంతను మననము చేసికొని, దీనిని జ్ఞాపకము చేసికొనుటకు ఇష్టము లేకపోయివుండవచ్చును. లేకున్న, అన్నింటిని స్మరించి, (కావ్యములను) అంతటితో నాగక, కథాసందర్భము వింధ్య పర్వతప్రాంత మందలిదైనను, కనుమయవ్వలి కర్ణాట కమలముఖులను, పలివెల, దక్షారామ గంధర్వకన్యలను స్మరించిన వాడు, హరవిలాసమును ఏల స్మరింపలేదు. బహుశ: పై కారణములు గావచ్చును. అయితే ఇది ఊహమాత్రమే. గ్రంథస్థ సాక్ష్యములు కొరవడిన చోట, లభించిన ఆధారములకు ఊహను జోడించుట తప్పిదము కాదుగదా! విజ్ఞులు ఆలోచింతురుగాక. నా బుద్ధికి పొడమిన, శ్రీనాథుని రచనలకు గల నేపథ్యకారణము లిట్టివి. అంతేగాదు. శ్రీనాథుని అంతిమ రచన

శివరాత్రి మహాత్మ్యము. ఆ మహానుభావుని అంతమ ఘడియలు అచ్చటనే జరిగి యుండవలయును. నడుమవచ్చిన పలనాటి చరిత్రరచన, దీనికి దావున నుండి కృష్ణానదీ గర్భమున గలసి నేటికి కనుమరుగైన బొడ్డుపల్లెలో నున్నప్పటిది కావలయును. ఇక క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయని రచనగా గ్రంథస్థ సాక్ష్యముగలదు. అయితే శ్రీనాథుని హస్తముండి యుండవచ్చును. ఆయా పద్యములనుట్టంకించుచు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దానిని ఇతఃపూర్వమేస్థాపించి యున్నారు. వాటన్నింటికంటె ముఖ్యమైనది' పంచారించిన - ఇత్యాదిగాగల పద్యము. అందు, 'పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మస్వరూపంబు'గా స్త్రీ మూర్తి కాంచీదామపదమును అభివర్ణించుట జరిగినది. దీని భావమును విడమరచి చెప్పపనిలేదు. అయినను పరమ బ్రహ్మమనుట కేవలము అలంకారముగా చెప్పుటయా! లేక నిజముగా నది యట్టిదా! నిజముగ నది యట్టిదని అనగా బ్రహ్మకు గల రెండు ముఖములలో నొకటి విద్యకు స్థానమనియు, రెండవది సృష్టికి మూలమగు స్త్రీజననాంగమని ఛాందోగ్య బ్రాహ్మణము చెప్పుచున్నది. ఇంతటి పరామర్శనము వల్లభరాయని వల్లనైనదని భావించుటకంటె, అది శ్రీనాథుని సర్వతోముఖ జ్ఞానమునకు ప్రతీకయని భావించుట మేలుగదా! ఈ క్రీడాభిరామము, శ్రీనాథుడు, విజయనగరమునకు ప్రయాణమై వెళ్లువేళ, మార్గమధ్యమున వినుకొండలో, వల్లభరాయని ఆతిథ్యమును స్వీకరించిన వేళ ప్రకటనమై యుండవలయును. మిగిలినవన్నియు తత్పూర్వరచనలనుట (లభ్యములు, అలభ్యములు) స్పష్టము. అట్లే, శృంగార నైషధము ముందే రచించబడి, హరవిలాస రచనము గావించిన తరువాత, పెదకోమటి వేముడు కొండవీటి సింహాసనమును అధిష్టించిన తరువాత, మామిడి సింగనకు అంకితమై యుండవచ్చునని పండితులూహించిరి. దీనికి ఉపపత్తిగా, అప్పుడు సంభవించిన రాజ్యసంబంధమైన కలహము. దీని నిమిత్తమై శ్రీనాథుడు కంచివెళ్లవచ్చుటగా నూహించినారు. కాని, హరవిలాసమునందు అంధ్రనైషధాబ్జభవునిగా చెప్పికొనినాడు. కేవలము వ్రాసి, ప్రకటింపకనే, అట్లు చెప్పుట పొసగునదికాదు. కనుక సింగన కంకితమైన పిదపనే శ్రీనాథుడు కంచికి వెళ్లి యుండవచ్చును. అంతే గాక, పెదకోమటి ప్రభువైన వేళ, దానిని ఆయనకే అంకిత మీవచ్చును గదా! సింగన కంకిత మిచ్చుట ఏల! అను ప్రశ్నకు సమాధానము దొరకదు. దీని అంకితమే, శ్రీనాథునికి పెదకోమటి వేమునితో, సింగన ప్రాపున, సాంగత్యము కల్పించినదని భావించుట ఉచితము.

ఇట్టిది అంధ్రసాహిత్య సరస్వతికి అమూల్యాలంకారములు గావించిన కవిసార్వభౌముని సాహితీ జీవితేతి వృత్తము.

●●●

# అనంతామాత్యుని స్వగ్రామం పెనమకూరు

మనకు గల మంచి కథాకావ్యాల్లో భోజరాజీయ మొకటి. ఏ తత్కర్త అనంతామాత్యుడు. పదునేనవ శతాబ్దికి చెందినవాడు. ఛందోదర్పణము, రసాభరణము అనునవి ఇతని ఇతరకృతులు. తన సోదరు లార్వురి వలననే, నియోగి బ్రాహ్మణులకు ఆరువేల వారను నామము ప్రసిద్ధమైనదని చమత్కరించినాడు. తన తాత తండ్రులనుగూర్చి, జన్మస్థానమును గూర్చి సవివరముగ చెప్పియున్నాడు. జన్మస్థలమును గూర్చి చెప్పిన పద్యమిది.

సీ॥ విలసితంబగు కృష్ణవేణీ మలాపహారిణి
　　　భీమరథి నా ధరిత్రియందు.
దనరు నదీ త్రయాంతర్వేది యగు
　　　పావన క్షేత్రమున శోభనములకెల్ల
ధర నివాసంబగు పెరుమగూరు పురంబు
　　　నందు విద్వజ్జనానందమైన
జీవన స్థితి చేతఁ జెన్నొంది వంశకర్తృత్వ
　　　సంపత్తిఁ బ్రభుత్వమొంది.

తే॥ నెమ్మిఁ బ్రత్యక్ష పరమ పదమ్మనంగ
నొప్పుశ్రీకాకుళంబున కొడయఁడైన
యాంధ్ర వల్లభు హరిసేవ నలరుచుండుఁ
బెక్కు భంగుల ముమ్మ తిక్కవిభుండు.

సమీప భూతకాలమున, దీనిని సాహిత్య అకాడమీ వారు ప్రచురించినారు. దానికి కొండూరు వీరరాఘవా చార్యులుగారు పీఠికను సంతరించినారు. అందు వారు కృతికర్త జన్మస్థలమును గూర్చి చర్చించుట జరిగినది. ఆ సందర్భమున వారు పేర్కొనిన

విశేషముల సారాంశమిట్లున్నది. ఆంధ్రకవితరంగిణి కర్త చాగంటి శేషయ్యగారు, అనంతామాత్యుడు తన జన్మస్థలముగ పేర్కొనిన 'పెరుమగూరు' శ్రీకాకుళమునకు సమీపగ్రామమని, మొత్తముమీద కావ్యకర్త కృష్ణామండలమువాడని, ఆ గ్రామము 'పెనమకూరు' అను ప్రతిపాదనమును వారు అంగీకరింపలేదని, వ్రాయుచు, సరియగు ఆధారములు దొరుకువరకు సత్యము తేలుట కష్టమని వారు వ్రాసిరి. అయితే 'పెనమకూరు' అని అన్న వారి పేరు ఉదాహరింపలేదు. అన్నది ఎవరైనను, అన్నమాట వాస్తవమే గనుక, ఆంధ్రకవి తరంగిణిని ఈ విషయమై ప్రత్యేకముగ పరామర్శింప నవసరము కనుపింపదు.

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు, లభించిన సమాచారమును పొందుపరచిరేతప్ప, తామై, జన్మస్థలమును నిర్ధారించుటకు ఎట్టి ప్రయత్నమును గావింపలేదు. పెనమకూరు అని అన్నవారి మాటను చాగంటి శేషయ్యగారు అంగీకరింపలేదనినారు తప్ప, దానిపై తమ అభిప్రాయమును కూడ వెలువరింపలేదు. పెనమకూరు అనునది, రాఘవాచార్యుల వారికి కూడ అంగీకారమైనట్లు తోపదు. కాకున్న ' సరియగు ఆధారములు దొరకు వరకు' అని వ్రాయవలసిన పనిలేదు గదా! కావ్యకర్త అంత స్పష్టముగ వివరించినప్పుడు, ఇంక సరియగు ఆధారములు ఎట్టివి లభింపవలెనని వారు ఆశించినారు? పూర్వ గ్రంథస్థ విషయములను క్రోడీకరించుట తప్ప దానిని ఆవిష్కరించుటలో వీరిదైన ప్రయత్నమెట్టిదియు కనుపింపదు. ప్రాయికముగా, మన కావ్యపీఠికల తీరు తీయములిట్టివైయున్నవి. అది పెనమకూరు అగుట ఎట్లో చూతముగాక!

ముద్రణమునందు పెరుమగూరు అని యుండగా అది పెనమకూరు ఎట్లగును అనునది మొదటి ప్రశ్న. దానికి సమాధానము పెరుమగూరు అను గ్రామము ఆంధ్రదేశమునందు లేదు. కృతికర్త, ఆ గ్రామము నెలకొన్న ప్రాంతమును స్పష్టముగా నిర్దేశించినాడు. ఒకవేళ ఆ పేరుతో గ్రామము కలదని భావించినా, అది అనంతామాత్యుడు నిర్దేశించిన ప్రాంతములో ఉండవలయును తప్ప, అన్యప్రాంతములందలి ఆ పేరుగల గ్రామము అనంతామాత్యుని జన్మస్థలము కానేరదు గదా!

అనంతామాత్యుడు, తన స్వగ్రామము 'కృష్ణవేణి, మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందు దనరు నదీ త్రయాంతర్వేది' యందు గలదని గదా చెప్పినది. కృష్ణవేణి తెలిసినదే. మిగిలినవి మలాపహారిణి, భీమరథి అను నదులు ఎచ్చట గలవో తెలియుట ఒక అవసరము. కృష్ణతో కలిపి, ఆ మూడు నదుల అంతర్వేది ఏదో తెలియుట రెండవ అవసరము. ఆచోట స్థితి గలది అతని స్వగ్రామము. ఇందు మలాపహారిణి అనునది

'పుల్లేరు' కు సంస్కృతీకరణము. ప్రస్తుతము పుల్లేరు పేరుతో ఒక కాలువ గలదు. చర్చలోనిది ఇదికాదు. అంతమాత్రమేగాదు. పుల్లేరు అనుపేరుతో ఆంధ్రదేశమున చాలా వాగులు వంకలు గలవు. మురుగునీటి ప్రవాహమును మన పూర్వులు పుల్లేరుగా సంభావించుట దీనికి కారణము. అట్టిది పైన చెప్పబడిన కాలువ. అది ఒకప్పుడు, అనగా కృష్ణపై ఆనకట్ట నిర్మింపకపూర్వము కేవలము మురుగు ప్రవాహము. ఆ పిదప దానినే పంటకాలువగా మార్చుట జరిగినది. అట్లు మార్చుటను గూర్చి, దానికి బాధ్యుడైన అధికారిపై చర్య తీసికొనబడినది. అది వేరే కథ. మరియొక పుల్లేరు గుంటూరుజిల్లా మంగళగిరి సమీపాన గలదు. దాని సంస్కృతీకరణము వ్యాఘ్రనది. దానిని నేడు కొండవీటి వాగుగ వ్యవహరించుచున్నారు. జనుల అలసత్వము, పండితులకు సంస్కృతముపై గల వ్యామోహము - ఇట్లు ఎన్ని అనర్థములకో కారణమైనది. అది అట్లుండ, ఇంకను మరికొన్ని ప్రాంతములందును పుల్లేరులు ఉండవచ్చుననుట ప్రకృతము. మనకు కావలసిన పుల్లేరు, అనగా, అనంతామాత్యుడు ప్రస్తావించినది నేడు ప్రస్ఫుటముగా కనుపింపదు. దాని అవశేషములు మాత్రము గలవు. ఇట్లగుటకు కారణములు సుదీర్ఘకాలమున భూభౌతిక స్థితిలో వచ్చిన మార్పులు. దీనికి కారణములు భూకంపములు, తుపానులు. అట్టివి అనంతామాత్యుని తరువాత, ఇంకను స్పష్టముగ చెప్పవలెనన్న, శ్రీకృష్ణ దేవరాయల తరువాత, ఏకకాలమున సంభవించినవి.

తత్ఫలితమే, నేటి శ్రీకాకుళాంధ్రనాయకస్వామి ఆలయ పునర్నిర్మాణము. రాయలు, ఆముక్తమాల్యదకు శ్రీకారము చుట్టినది అచ్చటనేగదా! కాని అతడు సందర్శించినది నేటి ఆలయమును గాదు, దానికి ప్రబల సాక్ష్యము, అతడు వేయించిన శాసనము క్రమపద్ధతిలో నుండక, అక్కడ కొంతభాగము మరొకచోట కొంతభాగము, వరుసదప్పి, నేటి ఆలయ ప్రాకారములపై చోటు చేసికొనుట. అది అట్లుండ పుల్లేరనగా మురుగు ప్రవాహమని చెప్పుట జరిగినది. అది ఇప్పటి అర్థము. కాని అప్పటి అర్థము, మల శబ్దమునకు ఆధిక్యమని మాత్రమే. నిజమునకు ఇది ఒకప్పటి కృష్ణ ప్రవాహ భాగములలో ఒకటి. అయితే వరద వచ్చినపుడు మాత్రమే నదీజలము ప్రవహించెడిది. సాధారణ స్థితిలో ప్రాదేశిక వర్షజలము ప్రవహించెడిది. ఈ రెండు కారణములుగ నిది పుల్లేరు. దీని అవశేషములు గలవని ముందు చెప్పబడినది. అట్టిదాక నమోదైన సాక్ష్యము గలదు. విజయవాడ - మచిలీపట్నము రోడ్డుమార్గములో, నిడుమోలు గ్రామమునకు వెలుపల ఒక ప్రవాహముపై వంతెనగలదు. దాని ప్రవాహ వివరములను ప్రదర్శించు ఫలకముపై, మలాపహారిణి అని వ్రాయబడియున్నది. ఇది, మనకవసరమైనది.

ఇక భీమరధి విషయము. ఇది భీమనది అని యుండవలయును. రధి అనునది ముద్రాపకుల దోషమైనను (పాఠనిర్ణేతలు గావచ్చును) గావచ్చును. లేదా అనంతామాత్యుని నాటికి, పండితులు అట్లు దానిని వ్యవహరించి యుండవలెను. ఏమైనను జనుల వ్యవహారము భీమేరు మాత్రమే. దీని ఉనికి నేడును గలదు. ఇది కూడ ఒకప్పటి కృష్ణ ప్రవాహభాగము. ప్రస్తుతము దీనిని కూచిపూడి - పాముఱ్ఱు రోడ్డుమార్గమున, పెదపూడికి సమీపమున గమనింపవచ్చును. ఇక తెలియవలసినది కృష్ణతో కలిపి ఈమూడింటి అంతర్వేది. అంతమాత్రమే గాదు. అది శ్రీకాకుళమునకు సమీపమునందుండవలయును. అచ్చట ఉన్నది పెనమకూరు తప్ప పెరుమగూరుకాదు. అట్లు ముద్రింపబడుట ఒక దురదృష్టము. కాగా, ఇంత స్పష్టముగ చెప్పియున్నను, తెలియకపోవుట మరొక దురదృష్టము. ప్రాంతములను దర్శింపక, శాసనములను చదువక, విషయనిర్ణయము చేయబూనుట అన్నింటికిని మించిన దురదృష్టము. ఏమైనను అనంతామాత్యుని స్వస్థలము పెనమకూరు అగుట నిశ్చయము.



# గురుపద్యవిద్య

ఆదికవి నన్నయ, భారతావతారికలో వాల్మీకిని స్తుతిస్తూ చెప్పిన పద్యంలో, ఈ పదబంధం కనిపిస్తుంది.

హరిహరాజగజాననార్క షడాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతా తతికిన్ నమస్కృతిసేసి దు
ర్భర తపో విభవాధికున్ గురుపద్య విద్యకు నాద్యునం
బురుహగర్భ నిభుం బ్రచేతసు పుత్త్రు భక్తి దలంచుచున్.

వాల్మీకి ఆదికవిగా సంభావింపబడుట లోక విదితము. కాగా నన్నయ గురుపద్యవిద్యకు అతనిని ఆద్యునిగా సంభావించు చున్నాడు. ఇచ్చట పద్య విద్య అనగా కవితావిద్య అని భావించుటలో విప్రతిపత్తి లేదు. అయిన గురుపద్యవిద్య అని దేనిని సంభావింపవలయును.

ఇప్పటికి తెలియవచ్చినంతవరకు, గురు శబ్దమునకు, శ్రేష్ఠము. ఉత్తమము అను అర్థములను సంయోజించుట జరిగి, గురుపద్య విద్య యనగా ఉత్తమ కవిత్వమను అర్థము చెప్పబడుచున్నది. సాధారణ దృష్టికి ఇందు ప్రత్యేకముగా ఆలోచింపదగినది లేనట్లు అనిపించును. కాని అందుండి ఈ ప్రశ్నలు ఉదయించుటకు ఆస్కారమున్నది. ఉత్తమమని ఎప్పుడు చెప్పబడును. కొన్నింటి యందు ఒకటి శ్రేష్ఠమైనపుడు గదా! అయినపుడు వాల్మీకి మహర్షి కవిత్వమును ఎవరి కవిత్వముతో పోల్చి చెప్పినట్లుగును. కాళిదాసాదులతో ననవచ్చునా! ఉపమా కాళిదాసస్య - ఇత్యాదిగా, వారివారికి గల ఉత్తమ గుణములను లోకము ప్రశంసించినది గదా! లేక వారివారిలో గల ఆయాగుణములన్నియు వాల్మీకి యందు గలవనియా! లేక ఈ యుగపు కవులుకంటె పూర్వపువాడగు వ్యాసమహర్షితోనా! కాని వాల్మీకి త్రేతాయుగమునాటి మహర్షిగదా! అంతేగాక వాల్మీకిని ఆదికవిగా సంభావించుచున్నపుడు ఇట్టిపోలిక తగునా! లేక వాల్మీకి కంటె పూర్వులైన వారు గలరా! ఉన్నచో, ఆదికవి యనుట ఎట్లు, ఇన్ని ప్రశ్నలు, దీనినుండి పుట్టుచున్నవి.

ఇంతమాత్రము నన్నయ ఎరుగడా! మరి, అట్టి విశేషణమును ఉపయోగించుటలో నన్నయ ఆశయమేమై యుండును.

పై సందేహముల వలన పద్యవిద్యకు 'గురు' శబ్దాన్ని విశేషణంగా భావించడం అసంగతమనిపించును. కనుక సంభావ్యమైన దేదో తెలియవలసియున్నది. అది గురుపద్యవిద్య అనుదానిని ఒకే పదబంధముగా గ్రహించుట. పద్యవిద్య కేవలము కవితావిద్య. ఈ పద్యవిద్యకు ఎట్లును సంస్కృతమున వాల్మీకి ఆద్యుడే. గురుపద్యవిద్యకును అతడు ఆద్యుడు. మొదటిది అందరకు తెలిసినది. రెండవది నన్నయ మాత్రమే సంయోజించినది. అది రామాయణ రచనకు గల నాంది యందు గలదు.

రామాయణ రచనకు పూర్వము వాల్మీకి దుర్ధర తపో విభవాధికుడు. గురుపద్య విద్యతో రామాయణమును సృజించి, అంబురుహగర్భ నిభుడైనాడు. ఇప్పుడు ఒక్క పర్యాయము రామాయణ రచనకు గల నేపథ్యమును స్మరింతుముగాక! అది. ఆయన స్నానాద్యనుష్ఠానములు పూర్తిగావించుకొని, శిష్యగణముతో, ఆశ్రమానికి తరలివచ్చువేళ, బోయవాని వ్రేటుకు కామసుఖమునందున్న పక్షిదంపతులలో ఒకటి కూలుట, రెండవది దుఃఖించుట, దానిని చూచిన వాల్మీకి నోటివెంట అప్రయత్నముగ వెలువడిన 'మానిషాద॥... ఇత్యాదిగా గల శ్లోకము. ఆశ్రమమును చేరిన పిదప దానిని గూర్చి ఆలోచించుట - రామాయణ రచనకు అది గదా నాంది రామాయణ ప్రారంభమును ఒక్కసారి పరికించిన అంతము స్పష్టమగును.

అనగా రామాయణ రచనకు నేపథ్యమును సవదరించినది 'మానిషాద... ఇత్యాదిగా గల శ్లోకము. అది వెలువడుటకు కారణమైనది. బోయవాని క్రూరత్వము- దానికి బలియైన పక్షి - దీనితోగూడిన సంఘటన. దానిని చూచిన వాల్మీకి నోట అప్రయత్నముగ వెలువడిన శ్లోకరూప శబ్దవిన్యాసము. ఈ సంఘటనకు స్థితి లేకున్న... రామాయణము వెలువడునా! ఏమో! తెలియరాదు. అయితే అంతకు పూర్వము అట్టిది రచింపవలెనను ఊహలేని స్థితిలో, ఆశువుగ, అప్రయత్నముగ, సంఘటన దర్శన మాత్రమున, ఏతత్క్షణమున (momentum) కలిగిన దుఃఖము - పదాకృతి నంది శ్లోకమైనది. అది కావ్యరచనకు నాందియైనది. పూర్వనేపథ్యముగాని, ఆలోచనగాని లేక తత్క్షణ మాత్రన వెలువడిన కవితారూపము గురుపద్యవిద్య. గురుశబ్దానికి, పైన చూపిన ఆంగ్ల పద భావన గలదు. అట్టి దానికి ఆద్యుడు వాల్మీకి. దానిని నన్నయ సంయోజించినాడు. మరి అతడు విపుల శబ్దశాసనుడు. సత్ప్రతిభాభియోగ్యుడు. విజ్ఞులు దర్శించి పరామర్శింతురు గాక!

***

# పద్యవిద్య - శ్రీనాథుని నిష్కర్ష

ఇందు పద్య విద్యయను పదబంధము సాహిత్యమునకు పర్యాయముగ గ్రహింపబడినది. దానికి కారణము ప్రాచీనుల దృష్టిలో ప్రముఖముగ సాహిత్యమనగా పద్యకృతులు గ్రహింపబడుట. నిష్కర్ష పదము ఇందు స్థిరమైన, అభిప్రాయమను అర్థమున సంయోజింప బడినది.

ఆంధ్రసాహిత్యమున అనేకానేక కారణముల వలన శ్రీనాథునికి ఒకానొక ప్రత్యేక స్థానము కలదు. అందు ప్రధానమైనది, ఎఱ్ఱన యందు దృశ్యాదృశ్యముగ కనుపించు ప్రబంధ శైలి, శ్రీనాథుని యందు ప్రస్ఫుటమై అనంతరకాలమున వచ్చిన ప్రబంధశైలి యనుదానికి మార్గదర్శకముగ అది నిలుచుట. మిగిలినవి, అతని భౌతిక జీవనసరళి, సాహితీజీవన వైభవము, కంచుఢక్కను పగులగొట్టించి కవిసార్వ భౌముడగుట, నానారాజసందర్శనము, సమకాలీన రాజకీయములందు చురుకైన పాత్ర, ఈశ్వరార్చన కళాశీలము, చాటుపద్యములు మున్నగునవి. మించి యతడు సాహిత్యవిద్య పై గావించిన నిష్కర్ష. మించి యనుటకు ప్రత్యేక కారణములు గలవు. వానిని పరామర్శించుట దీనికి లక్ష్యము.

కవులందరు పూర్వకవులను స్తుతించుట, తమ కవితాగుణములను ప్రకటించుట, కుకవులను నిందించుట పరిపాటి. శ్రీనాథుడును ఆ పని చేసినాడు. అంతవరకు ఏ ప్రత్యేకతయు లేదు. కాని అందరు పరిపాటిగ చేసిన కుకవినింద, ఇతనిపట్ల ప్రత్యేకతను సంతరించుకొనినది. మొదలు అట్టిది ప్రక్షిప్తమనుటకును కొందరు సాహితీ విమర్శకులు సాహసించినారు. కారణమేమనగా, శ్రీనాథుని కుకవి నిరసనము ముమ్మొదట భీమఖండమున చోటుచేసికొనుట, తత్పూర్వ కృతులైన శృంగార నైషధము, హరవిలాసము లందు అట్టిది లేకుండుట. ఇది సమంజసమగు కారణముగనే పైకి కనుపించుచున్నది. అయితే, కుకవి నిరసనమునకు అది పరిమితమైన ఆమాట శ్రీనాథుని ఉత్తమ సంస్కార నిరూపణమునకు తార్కాణగ నిలిచి, అతనిపై అభిమానము తోనే అట్లు ఆ విమర్శకులు పలికినారని చెప్పికొనుటకు వీలుకల్పించెడిది. కాని అట్లుగాక శ్రీనాథుడు తన కవిత్వమును గూర్చి

ప్రౌఢిఁబరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష యండ్రు
యెవ్వరేమన్న నండ్రు నాకేలకొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష

అని, భీమఖండమున చెప్పిన దాని లోని, అతని కర్ణాటభాషను సమముగా పరిష్కరింప ననువు పడని సందర్భమును పురస్కరించుకొని ఈ పద్యమునకు ముందు కుకవి నిరాకరణ విషయమై చెప్పిన పద్యములను ప్రక్షిప్తమనుట జరిగినది కనుక అది శ్రీనాథుని గుణశీలములపై వెలువరించినదిగా తోపదు. దీనికి, సాహిత్యవిషయమై శ్రీనాథుని నిష్కర్షకు సంబంధమేమియను శంక సహృదయ పాఠకులకు సందేహము పొడమును కాని, ఆ పద్యమునకు వెనుక ఎంతో చరిత్రగలదు. ఆ చరిత్రయే, ఆ పద్యమునకు ముందుగల పద్యములు, కొన్ని చాటువులు చెప్పుటకు కారణము. శ్రీనాథుని నిష్కర్ష ఆ పద్యముల యందు నిమిడి యుండుట. వాని స్థితికి ఆకరమైన దానిని తడుమవలసి వచ్చినది. దానిని వివరముగ పరిశీలింతము.

ఈ విషయమై వివరణ, ఈ గ్రంథమునందేగల 'శ్రీనాథుడు కర్ణాటుడే', 'శ్రీనాథుని సాహితీజీవనము' అను వ్యాసములందు గలదు. తక్షణస్ఫూర్తి కొరకు ఇచ్చటను కొంత వివరింపబడుచున్నది. పునరుక్తిని సహింతురుగాక! దానికి పూర్వము శ్రీనాథుని పాండితీ విశేషములను అతని మాటలలోనే అనగా అతని కావ్యముల నుండియే గ్రహింతము.

శృంగార నైషధసదర్భమున, ఏతత్ కృతిభర్త మామిడి సింగన పలుకులలో శ్రీనాథుడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు, ఉరుప్రజ్ఞావిశేషోదయా జిహ్మాస్వాంతుడు, ఈశ్వరార్చన కళాశీలుడు, అభ్యర్థిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధానుడు. లభ్యమైన అతని కృతులలో నిది ప్రథమకృతి. అట్టి వానిలో రెండవది హరవిలాసము. అది అవచి తిప్పయకు అంకితము. అతడు శ్రీనాథుని గూర్చి పలికిన తీరు. ఆగమజ్ఞాన నిధి, తత్వార్థఖని, బహుపురాణజ్ఞుడు, శుభభవ్యమతి. మూడవ కృతి భీమఖండము. తత్కృతిపతి బెండపూడి అన్నమంత్రి. అతడు ప్రత్యేకించి, శ్రీనాథుని కవితా గుణములను పేర్కొనలేదు. కేవలము, ఆయా సమయముల ఆయా ప్రభువులకు, అతడు వినిపించిన కావ్యములను, ఆయా సభాంగణముల దర్శనీయమైన అతని వచోవైఖరిని మాత్రము ప్రశంసించి యున్నాడు. ఇది ఇట్టి దగుటకు గల వివరణలో, కుకవి నిరాకరణ పద్యములు ప్రక్షిప్తములు గావని, పనివడియే శ్రీనాథుడు వానిని చెప్పినాడని స్పష్టపరచుటకు ఆధారములిమిడి యున్నవి. ఏ తత్సందర్భమున అది ముచ్చటింప బడును. ఇక కాశీఖండము

వీరభద్రారెడ్డికి అంకితము. దానిని అట్లు గావింపుమని కోరిననాడు అతని అన్న వేమ భూపాలుడు. అతడు శ్రీనాథుని కొనియాడిన తీరు. ఈ క్షోణిన్, (శ్రీనాథుని) బోలు సత్కవులు లేరు ఆనాటికాలమున అని ప్రశంసించుచు, అతని ప్రౌఢసాహిత్యములు, దక్షారామచాళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్యభారము నధ్యక్షించుననినాడు. మిగిలిన రెండు కృతులు పలనాటి వీరచరిత్రము. శివరాత్రి మాహాత్మ్యములు. కాని ప్రస్తుత చర్చకు పై యుదాహరణములు చాలును గనుక అందలి విశేషములు పరామర్శించుట లేదు.

ఇక అతనిని గూర్చి, అతని కవిత్వమును గూర్చి ప్రశంసించిన వారు గలరు. అందు అతని బావమరది దుగ్గపల్లి దుగ్గన ఇట్లుపలికెను.

సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య
భాషా పరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాస బలము
అక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయ కళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్య విరచితా పూర్వకావ్య
భావ రససుధా చర్వణ ప్రౌఢతయును
గందళింపగఁగా శిఖా ఖండనైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధములొనర్చి.

ఇందు శ్రీనాథునికి గల అనేకభాషల పరిచయము వివిధ శాస్త్రములతో అతనికి గల సంసర్గములు వెల్లడి యయినవి. దీనినిబట్టి, పూర్వ ప్రశంసలను బట్టి, శ్రీనాథుని వైదుష్యము, దానితోనిండిన అతని వ్యక్తిత్వ, మూర్తిమత్వములు దర్శనీయము లగుచున్నవి. దుగ్గన మరియొక మాట అక్కడ అనినాడు. అది, శ్రీనాథునికి, పూర్వకవుల రచనలతో గల పరిచయసాంద్రత, దాని నుండి ఆయన కలవడిన సాహిత్య సౌష్ఠవము. అది అతని కావ్యములలో ప్రసరించిన తీరు. మొదలు శ్రీనాథుడే పూర్వకవులకు వందనము చేయువేళ, వారి వారి, కవితా గుణములను గుర్తించి, వానిని తానెట్లు జీర్ణించు కొనినాడో, ఈ తీరున సంభావించియున్నాడు.

వ్యాస వాల్మీకి సంయమి వాక్సుధాంబోధి
లోలోర్మిపంక్తుల నోలలాడి
భట్టబాణమయూర భారతీసందర్భ
సౌభాగ్య గరిమంబు సంగ్రహించి

భాససౌమిల్లిక ప్రతిభాసమున్మేష
హేలావిశేషంబు నిచ్చగించి
మాఘ భారవి వచోమకరంద నిష్యంద
మాధుర్యమునకు సమ్మదము నొంది
కాళిదాసు మనంబు లోఁగాంచి మ్రొక్కి
రాజశేఖరుఁగవిరాజు । బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యుని । దిక్క యజ్వ
శంభుదాసుని । గరమర్థి సన్నుతించి.

ఇది శృంగారనైషధ సందర్భమున చెప్పిన తీరు. భీమఖండమున దీనిని ప్రపంచీకరించినాడు.

శ్లోకంబుల్ శతకోటి । గాండములుగా సూత్రించి రామాయణం
బేకైకాక్షరమెల్ల పాపముల మాయింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణ సంయమివరున్ జాతున్మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావ తీర్ణ కవితా లీలాపతీ వల్లభున్.

తలతున్ భారత సంహితాధ్యయన విద్యానిర్మిత ప్రక్రియా
నలిన ప్రోద్భవునిన్ గళింద తనయాంతర్వేది పుణ్యస్థలీ
పులినాభోగ కృతావతారు నపరాంభోజాక్షు నక్షీణ ని
ర్మల సాహిత్య కళాసమృద్ధికయి పారాశర్యమౌనీశ్వరున్.

ప్రణుతింతు రసభావభావనా మహనీయ
కవితాసముల్లాసుఁగాళిదాసు
గణుతింతు నిరవద్య గద్యపద్య నిబంధ
పరితోషిత స్థాణు భట్టబాణు
భజియింతు సాహిత్య పదవీ మహారాజ్య
భద్రాసనాధీశు బ్రవరసేను
వర్ణింతు నంభోధి వార్వీచి గంభీర
తాసార వాక్సముత్కర్షు హర్షు
భాస శివభద్రసౌమిల్ల భల్లులకును
మాఘ భారవి బిల్హణ మల్హణులకు
భట్టి చిత్తప కవి దండి పండితులకుఁ

గీలుకొలుపుదు నొసలిపైఁగేలుదోయి.
నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌమునిఁగవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠగాఢ ప్రతిభున్.

పంచమ వేదమై పరఁగు భారత సంహిత నాంధ్ర భాషఁగా
వించెఁ బదేను పర్వములు విశ్వజగద్ధిత బుద్ధినెవ్వఁడ
క్కాంచన గర్భ తుల్యున కఖండిత భక్తి నమస్కరింతు ని
ర్వంచిత కీర్తివైభవ విరాజికి। దిక్కన సోమయాజికిన్.

శ్రీనాథుని పర్యాప్తసాంద్ర సాహిత్యానుశీలనమునకు పై ఉట్టంకింపులు చాలును. కడమ వానిని తడుమ పనిలేదు. ఇందరి సాహిత్య వ్యవసాయ ఫలసాయమును అందిన వాడు గనుకనే వారి అనుభవమార్గమునే తానును అవలంబించినాడు. అనుసరించినాడు. దానినిట్లు వెల్లడించినాడు.

వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయ భట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని రేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు

ఈ అన్ని విధములను ఆకళింపు చేసికొనినవాడు, ఆచరించినవాడు గనుకనే, కవిత్వ మెట్లుండవలయునో తీర్మానించినాడు. అది ఎట్లన

హరచూడా హరిణాంకవక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుట తటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెననగా సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండు, గవిరాజీ గేహరంగంబులన్

అనగా, పరమేశ్వరుని తలపై అలంకారముగ నిలిచిన నెలవంక వక్రత, కాలుని సంహరించుటకు చండిక ఉద్యమించు సందర్భమమున, దేహమును స్వాయత్తపరచువేళ, ఆమె వలుద కుచముల అంచుల పర్యంతము వ్యాపించిన కాఠిన్యము, తోడు అందు సహజముగ నుండు మృదుత్వములు కవిత యందుండ వలెను. అనగా వక్రత, కాఠిన్యము, అందే గూఢముగ వర్తిల్లు రసము - దీనితోకూడి యుండవలయును. అట్టికావ్యములు మాత్రమే సాహితీవ్రతుల గృహాంగణముల

శాశ్వతముగ నర్తించును. ఇది - కవిత్వవిషయమై ఆయన గావించిన నిష్కర్ష. ఇంతటితో ఈ వ్యాసము ముగిసినది - అని అనిపించును. కాని ప్రారంభమే ఇచ్చట. ఇంత దనుక నాంది కగు పలుకాట మాత్రమే.

లభ్యములగు కావ్యముల అనుక్రమములో భీమఖండము మూడవది. మొదటివి శృంగారనైషధ, హరవిలాసములు. పై పద్యము భీమఖండము లోనిది. ఆ పై పద్యములు కూడ "వ్యాస వాల్మీకి... ఇత్యాదిగా వచియింతు వేములవాడ భీమనభంగి.... వరకు గలవియు ఇందలివే. పై వానిలో పూర్వకవి స్తుతి వరకు గలవి స్తుతి సాధారణములు. కాగా వచియింతు... ఇత్యాదిగ మొదలుకొని, ఆ వెంట, హరచూడా హరిణాంక వక్రత.... ఆదిగా గల పద్యమును చెప్పి, పిదప కుకవి నిరసనమునకు పూనికొనినాడు, కవిసార్వభౌముడు. అవి ఇవి.

వెస వసుధా స్థలంబున, గవీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనః కటాహకుహరంబులనించి కలంచి జిహ్వికా
కిసలయ తూలికంగొని లిఖింతురు కబ్బము లెన్నగా మహా
వ్యసనముతో నిజానన వియత్తల తాళపలాశరేఖలన్.

బోధ మల్పంబు గర్వమభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మత్సరము ఘనము
కూపమండూకములుఁబోలె గొంచె మెరిగి
పండితం మన్యులైన వైతండికులకు.
నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరక యుంటలెస్స
సైప రాకున్న నెందేనిఁజనుట యొప్పు.

అని చెప్పి. ఆ తరువాత ప్రౌఢిపరికింప..... ఇత్యాదిగ గల పద్యమును చెప్పియున్నాడు. ఇవి ప్రక్షిప్తములని విమర్శకులూహించి యున్నారు. అందుకు గల కారణములు పైన చెప్పబడినవి.

అయితే ఇవి ప్రక్షిప్తములు గావని, శ్రీనాథుని కృతములేనని నిరూపించుటకు తగు ఆధారములు, ఆ పద్యముల క్రమములో నున్నది. వానిని చెప్పుటలో నిమిడియున్న నేపథ్యములో నిమిడియున్నది. పూర్వపు రెండు కావ్యములలో, ఆయా కృతుల నంకితము గొన్నవారు శ్రీనాథుని కవితాగుణములను ప్రశంసించి యున్నారు. కాని ఇచ్చట అట్టిది లేదు. కేవలము పూర్వకవులను స్తుతించినాడు. కృతిభర్తయగు బెండపూడి అన్నమంత్రి మాటల సారాంశమును ముందు చెప్పికొంటిమి. ఈ రెంటికి నడుమ 'హరచూడా... ఇత్యాదిగ కవిత్వలక్షణమును గూర్చి చెప్పినదియు, కుకవి

నిరసనమునకు చెందిన పద్యములు చోటుచేసికొనినవి. వానికి అంత్యమున 'నాదు కవిత్వంబు నిజము కర్ణాటభాష' అనినాడు.

అనగా పూర్వకావ్యములలో వలె తన కవిత్వలక్షణముల ప్రశంసగాక, మొదలు కవిత్వమెట్లుండవలయునో హరచూడ... అను పద్యము మూలమున తెలిపియున్నాడు. ఈ వివరణ ఎవరికొరకు. తనకాలమునాటి, రానున్న కాలమునాటి కవులకా! సాధారణ స్థితిలో ఇరువురికి. కాని ఆ వెంటనే చెప్పిన ' వెస వసుధా స్థలంబున' - అనుపద్యభావము గమనించిన, ప్రత్యేకముగ కుకవుల నుద్దేశించినట్లు బోధపడును. ఆ పద్యభావ మిట్లున్నది. అందు కావ్యరచన కగు సామగ్రి అంతయు శ్రీనాథుడు చెప్పి యున్నాడు. గమనించుడు. శేముషి యున్నది. మషీరసమున్నది. లిఖించుటగు పని ముట్టు గలదు. తాళపత్రములున్నవి. ఇంకేమి! కావ్యములు తయారగును! ఈ విధమున శ్రీనాథుడు సంయోజించిన దేమి? ఊహ ప్రస్ఫుటమగుటకు ఆయనే అనిన మరికొన్ని మాటలను పచారింతముగాక! కబ్బములు రచించువారు గనుక వారు కవీంద్రులు. ఇక వారి శేముషీ మషీరసము. దానిని మనః కటాహ కుహరముల నించి కలంచుదురు. మరి అది అక్షరరూపము నందవలెను. ఆ అందిన దానిని వదనమునుండి వెలువరింపవలయును. ఆ వెలువరించుట మహావ్యసనముతో! దానికగు తూలిక జిహ్వాకా కిసలయము. ఇక వ్రాయున దెచ్చుట. నిజానన వియత్తల తాళపలాశ రేఖల యందు. వ్రాయుటకు అవి నిజాననము లైనవి. ఇందు శ్రీనాథుడు ఉద్దేశించినదేమి. వారువ్రాసినవి కావ్యము లేనా! లేక నేర్చిన తగుపాటి విద్యతో నల్లిన ఆశుకవితా పద్యములా! అనగా, శాశ్వత ప్రయోజనము గలవిగాక, కేవలము సందర్భము ననుసరించి, చెప్పిన మెచ్చికోలు పద్యములా! విజ్ఞులు ఆలోచింతురుగాక! అట్టివారికి బుద్ధి గరపుటకు గాక, 'హరచూడా... అను పద్యమును చెప్పుట ఎందులకు? అయితే ఒకటి నిజము. ఆ మిషతో లోకమునకు శ్రీనాథుని కవితా స్వరూపము అందివచ్చినది. అందులకు, ముందు శ్రీనాథునికి అనంతరము ఆ రచన కాస్కారమిచ్చిన నాటి రాజ మహేంద్రవరపుర పండిత కోటికి మనము కృతజ్ఞతాబద్ధులము కావలెను. కాకున్న ఆ పద్యము వెలువడదు కదా! ఆ వెంట, బోధమల్పంబు... అను పద్యమును చెప్పియున్నాడు. ఇందు నూతిలోని కప్పలవలె దేశమును చూడక, కొంచెమెరిగి కోశమును చూడక, ఎదుటివారు చెప్పు దానిని వేగపడక సహింపక, కారణములేని మాత్సర్యము వహించుచు పండితులమని తమంత తాము భావించుకొనెడి వితండవాదులను, ఎత్తిదూషించినాడు.

ఆ పిదప, తనను తాను సంబాళించుకున్నట్లు, మూర్ఖులతోడి వాదేమి యనుకున్నట్లు, చెవి దగ్గరచేరి కఠోరముగ కాకులు అరచునప్పుడు, రాయంచ ఊరకుండుట మేలు, సహింప లేకున్న ఆ చోటు వదలి మరొక తావునకు పోవుట మేలు అని - నాడు, తనను తక్కువ చేసి మాట్లాడు పండితులను నిరసించి నాడు.

అట్లు తక్కువ చేసి మాట్లాడిన విషయమును ఆ తరువాతి పద్యమున వివరించియున్నాడు. అది ఏమనగా, ఆయన కవితా భాషను కొందరు, శైలియందలి ప్రౌఢిని బట్టి కేవలము సంస్కృతమనినారు. మరికొందరు అందలి నుడికారమును బట్టి కేవలము ఆంధ్రమనినారు. అంతే తప్ప అతని భాష నిజస్వరూపమును గ్రహింపలేకపోయిరి. ఎవరెవరు ఎట్లు అనుకున్నను, నాది మాత్రము కర్ణాటభాష అని వారికి చెప్పినట్లుగ చెప్పి, తన్ను తాను సమాధానపరచుకొని నాడు మహాకవి.

పై వివరణము వలన, పూర్వమువలె కృతి భర్తలముఖమున గాక, తానై తన కవిత్వ గుణములను వివరించుట లోని ఆంతర్యము, దాని క్రమము, స్థూలముగ కవిత్వ లక్షణమును వివరించుటకు గల కారణములు ఈ వరకు పాఠకులకు అందివచ్చి యుండును. ఇక ఇందు ఇమిడియున్న చరిత్ర తెలియవలయును. శ్రీనాథుడు మొదట కొండవీడు నేలిన పెదకోమటి వేమారెడ్డి కడ విద్యాధికారిగ నున్నవాడు. ఆ రాజ్యము కాలమున కనుమరుగైన వేళ, బెండపూడి అన్నమంత్రితో గల పూర్వబంధుత్వమును పురస్కరించుకొని, రాజాశ్రయమును కోరి రాజమహేంద్రము చేరినాడు. అతడు చేరుటకు ముందు చేరినవి అతని అశేషశేముషీపాండితీ వైభవములు. ఇది పట్టలేదు అచ్చటి పండితులకు. కారణము, అతనితో ఎట్లును పాండిత్యమున స్పర్థ వహింపలేని బేలతనము. వారికి పట్టినది, అతని శృంగారనైషధ అనువాదమును గూర్చి. అది కేవలము మాత్సర్యమునుండి జనించిన డుమువులు చేర్చినాడన్న అపప్రథ. మరియొకటి హరవిలాస అంకితగాథ. అవచి తిప్పయ్యకిచ్చుట. కర్ణాట కిరాటకీచకులకు అమ్మినదిగా ముద్ర పడుట. ఇందొక వేళ రెండవ దానికి కాలము వలన స్థితిలేకున్నను మొదటది మాత్రము స్థితినందినది. తమ వృత్తుల కెచ్చట భంగము కలుగునో యను భయమునుండి జనించిన మాత్సర్యము శ్రీనాథుని విద్యావైభవమును గమనింపనీయని అంధత్వము, నాటి పండితులకు కమ్మినది. అది ఆపాటిది ఈ పాటిదై యుండదు. కేవలము బంధుత్వకారణముగ అన్నమంత్రి ఆశ్రయమిచ్చు చున్నాడని, తన్మూలమున రాజసభాప్రవేశము చేయనున్నాడని, దాని నిరోధించు దిశగా, ప్రభువర్గమును ప్రబోధించునంతటిది గావలయును. లేకున్న, వారిది కేవలము మాత్సర్యముతో కూడిన నిరసనమేయైన శ్రీనాథుడంతగా ప్రతిస్పందింప బనిలేదు. దానికి నిదర్శనము' నికటమున నుండి.... అను పద్యము. అందుకొంత ఉపేక్షగలదు. కాని వారు అంతటితో ఆగలేదు. పద్యభావము, సహృదయ పాఠకులను బాధించుననియు శాశ్వతమై నెగడు తన కావ్యమున అది యుండ దగదని భావించి, తప్పించి నాడు తప్ప, లేకున్న వారి నాక్షేపించిన విధము గమనింపుడు.

హంసీయానకుఁగామికిన్నధమ రోమాళుల్ నభః పుష్పముల్
సంసారద్రుమమూల పల్లవ గుళుచ్ఛంబైన యచ్చోట వి
ద్వాంసుల్ రాజమహేంద్ర పట్టనమునన్ ధర్మాసనంబుండి ప్ర
ధ్వాంసా భావము ప్రాగభాగమనుచున్ దర్శింతు రత్రాంతమున్.

ఇది చెప్పుటకు కారణము అతని స్వభావ తీవ్రత, అదికంటికి నిద్రపట్టనీయదు. రతికేళి సుఖముగూర్పదు. జిహ్వాకు పదివేల వంటకములును రుచింపవు. ఇసుక లోపల తాటి పండదిమినట్లు ఎదిరిని అదుమునట్టది. కావ్యమున చేర్చకపోవుటకు సంస్కారము అడ్డువచ్చినది. అయితే అది చాటుపద్యము గదా! అందువలన ఇందు చోటు చేసికొనుటకు ఆస్కారము లేదని అనవచ్చును. కాని సంగతి గలిగినచోట, సభ్యమనుకున్నచో, అట్టిదానిని చేర్చుటకు అతడు వెనుదీయ డనుటకు ఉదాహరణము గలదు. దానిని చెప్పుటకు ముందు, రాజమహేంద్రవరము నందలి పండితుల విషయమును ముగింతము.

భీమేశ్వర పురాణము రచనముతో నైనను వారి ఆగడమునకు తెరపడలేదు. మాత్సర్యమునకు మందు గలదా! హృదయసంస్కారము తప్ప. వారికి లోపించిన దదియే గదా! అంత స్పష్టముగ తన భాష కర్ణాటభాష అనినను సమాధానము కలుగలేదు. కర్ణాటభాష అనగా నేదియో వారికి తెలియకపోదు. అయిన నేమగును. వారు కూపస్థమండూకములు గదా! వారికి వారి భాషావ్యవహారపు తీరు తప్ప, అన్యప్రాంతముల వ్యవహారపు తీరు వారికి తెలియదు. తెలియకపోవుటగాదు. దానిపై నిరసనము గూడ గలదు. (అట్టిది ఇప్పటికిని గలదనుట. ముఖ్యముగ గోదావరికి పశ్చిమమున గల బ్రాహ్మణులను, కోనసీమయందలి బ్రాహ్మణులు కర్ణాటమువారని ఎకసెక్కము గావింతురట. (అయితే ఇది ఒరులవలన విన్నమాటమాత్రమే) ఆ నిరసనము నకు, మాత్సర్యమునకు అంతము లేకున్నది. అది కాశీఖండ రచన సమయము వరకు గలదనుట స్పష్టము. లేకున్న కర్ణాట దేశ కటక పద్మవనహేళి శ్రీనాథభట్ట సుకవి' నని ఎలుగెత్తి చెప్పుటకు కారణము కనుపింపదు. మత్సరగ్రస్థులగు వారు ఎట్లు భావించినను, కవితాసామ్రాజ్యమున తన స్థానము సుస్థిరమని చాటి చెప్పినమాట అది. అయితే, అట్టి కుకవుల వచో వైఖరి, ఆయన మనమును అమితముగ బాధించినట్లున్నది. లేకున్న, చరమమున చెప్పిన శివరాత్రిమహాత్మ్యమున

ఉఱవైన సుకవికోటుల
తెఱగిది యని తప్పులెల్లఁదీర్తురు వశులై
యెఱుగరు సుకవులఁగు కవుల
కఱకులు పలుకటయె నేర్పు గర్వప్రేధిన్.

అని పలుకడు గదా ఆ మహానుభావుడు. ఇక దీనిని విడిచి, చాటువైనను, మదికి ఇంపైన దానిని, సభ్యమగుదానిని కావ్యములకు ఎక్కించు తత్వము అతనికి గలదను దానిని తెలియుదము. ఇది కేవలము పై విషయమును నిర్ధారించుటకే కాదు. మరియొక నిర్ణారణము కొరకును. ముందు అతడు చెప్పిన 'హరచూడా... ఇత్యాదిగా గల పద్యము కవిత్వవిద్యపై అతడుగావించిన నిష్కర్ష అని చెప్పుట జరిగినది. అప్పటికది సరి. ఏలనన, నిజమునకు కవిత్వ నిష్కర్ష అదియేగదా! అందు శ్రీనాథుని ప్రత్యేకత ఏమున్నది. దీనికిని, పై చెప్పినదానికిని ఉపాదేయమైన దొక్కటి గలదు.

ఇంతకు పూర్వము, కాశీఖండ రచనవేళ, ఏ తత్కృతి భర్తయగు వీరభద్రారెడ్డి అన్న, వేమారెడ్డి పలికిన పలుకులుగా 'దక్షారామ చాళుక్య భీమవర.....' ఇత్యాదిగా గల పద్యపాదమును ఉదాహరించుట జరిగినది గదా. దానికి ఆకరమైన పూర్తి పద్యమును గమనించుదము.

ఈక్షోణిన్ నిమఁబోలు సత్కవులు లేరీ నేటి కాలంబునన్
దక్షారామ చళుక్యభీమవర గంధార్వప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ భవదీయ ప్రౌఢసాహిత్యముల్.

ఇది శ్రీనాథుని కవిత పై వేమారెడ్డి నిదానము. అతనినోట పలికించినను, ఇది శ్రీనాథుడు తన కవిత్వవిద్యపై తాను గావించుకొనిన నిష్కర్ష. అనగా వెనుక 'హరచూడా హరిణాంక వక్రతయు...' అని చెప్పిన కవిత్వ లక్షణములకు తోడు తన కవిత్వమిట్టిది సుమా అని చాటుట. దీని భావము తెలియుటకు పూర్వము, ఈపద్యమును ఇట్లు సంధానించుటకు ఆకరమైన చాటు పద్యమును గమనించిన, తన మనసు కెక్కిన, సభ్యతకు, హాని కలిగింపని చాటువులను కావ్యమున కూర్చుటకు అతనికి ఎట్టి అభ్యంతరము లేదని నిరూపణమగును. అది

అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవి రాడ్బృందారక శ్రేణికిన్
దక్షారామచాళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించుఁదద్వాసనల్.

అనునది. ఈ రెండు పద్యములలోను 'దక్షారామచాళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ' ము వరకు సామాన్యము. కాగా ఈ పద్యమునందు సాంపరాయని తెలుంగాధీశుని కోరినది కస్తూరి. దాని ఉపయోగము, దక్షారామ చాళుక్య భీమవర గంధర్వాప్సరోభామినుల వక్షోజద్వయ కుంభికుంభములు తద్వాసనతో గుబాళించుట.

కవిసార్వభౌముని అంతరంగ మెరిగిన వేమారెడ్డి (అతనిముఖమున శ్రీనాథుడు) దానిని సంయోజించిన తీరు (అనగా శ్రీనాథుని అంతరంగమునందలి అభిప్రాయము) ఎట్లో పరిశీలింతము. ఇచ్చట, ఆ గంధర్వాప్సరోభామినుల వక్షోజద్వయముపై గంధసార, ఘుసృణములున్నవి. అనగా అప్పటికే అవి వానిచే పరిమళ భరితములు. కాగా, ఈ నేటికాలమున శ్రీనాథునితో పోల్పగల సత్కవులు ఎవరును లేరు. అంతటి వానిదైన ప్రౌఢ సాహిత్యము, వారి వక్షోజద్వయముపై గల గంధసార ఘుసృణ ద్వైరాజ్య భారము నధ్యక్షించునట. దీని భావమేమి! అధ్యక్షించునది, కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యములు గదా! అధ్యక్షింపబడునవి వక్షోజద్వయ సంస్థిత గంధసార, ఘుసృణములా! అయినపుడు ద్వైరాజ్య భారమేది. మీదుమిక్కిలి, ద్వైరాజ్య భారంబున్ అని ద్వితీయాంతముగ నున్నది. కనుక అధ్యక్షింపబడునది, ద్వైరాజ్య భారమేతప్ప, వక్షోజద్వయ సంస్థిత గంధసార ఘుసృణములు కావు. అనగా వక్షోజద్వయగంధసార ఘుసృణములు ద్వైరాజ్యభారమను దానికి విశేషణముగా భావింపవచ్చునా! వక్షోజ'ద్వయము' గనుక ద్వైరాజ్యభారమను దానిలోని 'ద్వై' శబ్దము ద్విశబ్దవృద్ధి గదా! అయిన రాజ్యభారమేది. వక్షోజద్వయమా లేక వానిపైగల గంధసార ఘుసృణములా! ఇంతకు ప్రౌఢసాహిత్యములు ఎచ్చటనుండి అధ్యక్షింపవలెను. దీనికగు పరిష్కారమిది. ద్వైరాజ్య శబ్దమున కర్థము, రెండురాజ్యముల నడుమగల ప్రాంతము. ఇరువురు ప్రభువుల మధ్య విభజించబడిన ప్రదేశము. రెండు రాజ్యముల పొలిమేరలు గల చోటు. (a dominion devided between the princes; the boundaries of two states; a frontier). అనగా ఏమి. వక్షోజద్వయము పై గల గంధసార, ఘుసృణములు పరస్పరము కలియుచోటు ఏదిగలదో అది ద్వైరాజ్యము. అనగా వక్షోజములు నడిమి ప్రదేశము. హృదయస్థానము. అనగా భావము పుట్టుచోటు. సాహిత్యమునకు ఆకరము భావము. ఆ భావపరిమళము, గంధసార, ఘుసృణ పరిమళములను నధ్యక్షించు బాధ్యతను చేపట్టినది. అనగా, భౌతిక వస్తు సుగంధము కంటె భావ సుగంధము మిన్న యని సంయోజనము. ఇది మాట, కందివచ్చున దాని కంటె మనసు కందివచ్చునది. కస్తూరికా భిక్షాదానము అక్కడ వక్షోజద్వయమును పరిమళ భరితముగావించుచున్నది. ఇచ్చట, వక్షోజద్వయము పూర్వమే గంధసార ఘుసృణ సుగంధభరితము. ఆ పరిమళములను ప్రౌఢసాహిత్య పరిమళము, వానికి స్థానములైన వక్షోజముల ద్వైరాజ్యముననుండి, వాని నధ్యక్షించు బాధ్యత గైకొన్నది. కవిత్వవిద్యపై శ్రీనాథుని కడపటి నిష్కర్షఇది. మరి భావమునకు పరిమళ మబ్బించిన వాడు గదా శ్రీనాథ కవిసార్వభౌముడు.

# బుద్ధుడు - ఆంధ్రుడా

బుద్ధుడు క్షత్రియుడు. శాక్యగణానికి చెందినవాడు. తండ్రి శుద్ధోధనుడు. తల్లి మాయాదేవి. భార్య యశోధర, కుమారుడు రాహులుడు. రాజధాని కపిలవస్తు. తల్లికొలియగణానికి చెందినది. భార్య శాక్య గణానికి చెందినది. శుద్ధోధనుడు రాజే అయినా, కోసల దేశానికి సామంతుడు. తల్లి చనిపోగా బుద్ధుని పెంచిపెద్దచేసినది శుద్ధాధనుని మరో భార్య ప్రజాపతి గౌతమి. ఆహారం ప్రధానంగా వరి. దానికి కావలసిన నీటి సరఫరా రోహిణి నది నుండి లభ్యమయ్యేది. ఈ నదీజలాల వినియోగంపై శాక్యులకు కొలీయులకు వివాదముంది. ఈ వాదం కారణంగా, కొలీయులతో యుద్ధ చేయాలి, అని శాక్యగణం తీర్మానించింది. బుద్ధుడు దానితో విభేదించాడు. ఈ విభేదం కారణంగా, గణపరమైన ఆచార వ్యవహారాలు, విధి నిషేధాలు కారణంగా బుద్ధుడు సన్యసించవలసి వచ్చింది. బుద్ధుడు ఆదిత్య గోత్రానికి చెందినవాడు. ఎనిమిదవ ఏట ఇతనికి అక్షరాభ్యాసం జరిగింది. అతని విద్యాగురువు సబ్బమిత్రుడు. బుద్ధుడు మూడు వేదాలను పఠించాడు. అతనికి త్రయీవేది అనే బిరుదు కూడా వుంది. వేదాలు అపౌరుషేయాలు కాదని మానవ రచితమేనని భావించాడు. అయితే పదిమంది మహర్షుల ఉనికిని విశ్వసించాడు. ఉపనిషత్తుల, బ్రాహ్మణాల బోధనలను విశ్వసింపలేదు. అవి బ్రాహ్మణ ఆధిపత్యాన్ని స్థిరీకరించడానికి ఉపయోగ పడుతున్నాయని భావించాడు. అవి భారతీయ, లేదా ఆర్ష ,లేదా సనాతన తత్వానికి మూలభూతాలనే దానిని అతడు తిరస్కరించాడు. తత్కారణంగాను, జంతు హింస ఉండడం కారణంగాను, స్వార్థోపయోగానికి ఉపయోగపడుతున్నాయనే కారణంగాను, యజ్ఞయాగాదులను నిరసించాడు. ఆత్మను గూర్చి వివేచించడం - దానివలన లభించే మేలుకీడులు ఏమీ లేవు గనుక దానిని గూర్చిన చర్చ అనవసరమన్నాడు. పునర్జన్మను అంగీకరించాడు గాని, అది వైదిక సూత్రాల బోధన, ఆచరణలకు అనుగుణమైనది కాదు. అన్నింటికి మూలం దుఃఖమని, దాని నుండి విముక్తంగావడానికి ఏకైక మార్గం అష్టాంగ సూత్ర సాధన, ఆచరణలు మాత్రమేనని బోధించాడు. -- ఇది బుద్ధుని గూర్చి మనకు లభించే ఆవశ్యక సమాచారం.

బుద్ధుడు సంచరించిన, సందర్శించిన ప్రముఖమైన ప్రదేశాలు - కుశి నగరం, సారనాథ్ (దీనికే ఇసిపట్నమని పేరు. వారణాశికి ఏడెనిమిది మైళ్ల దూరంలో వుంది. దీనిని నేను సందర్శించడం జరిగింది). వైశాలి, గయ (బుద్ధగయ) వేలువన, రాజగృహ, ఉరువేల, శ్రావస్తి, గృధ్రకుంట, అనుప్రియ మున్నగునవి. బుద్ధునితో పరిచయంగల సమకాలీన ముఖ్యులు ఆనందుడు. బింబిసారుడు ప్రసేనజిత్తు, అజాతశత్రు, కీసాగౌతమి, ఉపాలి, లకుండక బుద్ధియ, మొగ్గలన్న, కొండన్న, భరద్వాజ, కుబ్జి, సునీత, సుజాత, ఆమ్రపాలి మున్నగువారు.

ఆంధ్రులు బౌద్ధాన్ని ఏ ఇతరులకంటె కూడ అమితంగా ఆదరించారు. విస్తృతంగా ప్రచారంగావించారు. బౌద్ధంతో ఆంధ్రులకు గల తాదాత్మ్యం, నెనరు, కాదని రానివి. ఇలా ఎందుకు జరిగింది. బహుశా ఒక కారణం - బుద్ధుని బోధలోని హేతువాదం ఆంధ్రులకు బాగా నచ్చి వుండాలి. ఆంధ్రులు ఆదినుండి హేతువాదులు. వేతుల్యకులైన ఆంధ్రులు హేతువాదులని బౌద్ధసాహిత్యం (పాళి) చెబుతోంది. దీనితోపాటు మరోకారణం ఆంధ్రులకు బుద్ధునితో, అతని బోధనలు అనుసరించిన వారితో అత్యంత సన్నిహితత్వం - సంసర్గం ఉండి వుండాలి. ఏదో ఒక విధమైన సంసర్గం లేక, ఒక ప్రాంతంలో, ఆ ప్రాంతంలోని జనులలో ఒక బోధపై విశ్వాసంకుదరదు. తన్మూలమైన ప్రచారము జరుగదు అనేవి స్థితిస్థాపక విషయాలు. బుద్ధుడు ఉత్తరభారతానికి చెందినవాడు. ఆంధ్రులు నేడు దక్షిణ భారతీయులు. బుద్ధుని స్వస్థానం బీహారు. ఆ ప్రాంతానికి, నేటి ఆంధ్ర దేశానికి నడుమ చాల భూభాగం వుంది. అయితే ఆ నడిమి ప్రాంతంలో కంటె ఆంధ్రదేశం లోనే బౌద్ధానికి అధిక ప్రచారం కలిగింది. ఇలాంటి ప్రచారం అక్కడ కూడ వుండి వుంటుంది, కాలాంతరంలో అక్కడ సమసిపోయిందని వాదింపవచ్చు. అయినపుడు ఇప్పుడు ఇక్కడ కూడా బౌద్ధంలేదు గదా! కాని అక్కడ లేనివి, ఇక్కడవున్నవి, అవశేషాలుగా మిగిలిన బౌద్ధ చైత్యాలు. మరి ఇలాంటివి ఆ ప్రాంతంలో ఎందువలన లేవు. అంటే కేవలం ప్రచారం గాక, దానికి మించిన అనువర్తనం అంటే, జీవనంలో అది భాగమైన దన్నమాట, ఇది ఇలా ఎందుకు జరిగిందనే దానిలో, పై ప్రశ్నకు సమాధానం ఇమిడి ఉంది. ఇది తెలియాలంటే ఆంధ్రులెవరో తెలియాలి. వీరి పూర్వపు ఉనికి ఎక్కడో తెలియాలి. ఈ ప్రశ్నను బట్టి, ఇప్పటి ఆంధ్రదేశం, వాస్తవమైన ఆంధ్రదేశం కాదనడం స్పష్టం. వీటిని కొంత వివరంగా పరిశీలిద్దాము.

పురాణాల్లోని జాతుల ప్రస్తావనలో అంధకులు ప్రస్తావింపబడ్డారు. అదికూడ భోజ, మాగధీయులతోకలిపి. ఈ రెండుపేర్లతో ఇప్పటికి భాషలున్నాయి. భోజపురి అనేది ఒక జనావాసం. మగధ ఒక రాజ్యంపేరు. ఈ మగధను ఆంధ్రులు పాలించారని చరిత్ర చెబుతోంది. పై రెండు పేర్లతో, హిందీ భాషలో మాండలికాలున్నాయి.

పాళీసాహిత్యంగా చెప్పబడుతున్నదానిలో, ప్రస్తావింపబడింది ఆంధ్రులా, అంధకులా అనే విషయంపై పండితుల్లో ఏకాభిప్రాయంలేదు. రామాయణ, మహాభారతాల్లో ఆంధ్రుల ప్రస్తావన వుంది. మహా భారతంలోని చాణూరుడనే మల్లుడు ఆంధ్రుడుగా చెప్పబడ్డాడు. బౌద్ధానికి చెందిన లలితవిస్తర మహా పురాణంలో ఆంధ్రులు ప్రస్తావింపబడ్డారు. బౌద్ధసాహిత్యంలో వేతుల్యకులైన ఆంధ్రులు హేతువాదులని పేర్కొన బడిందని ముందు చెప్పబడింది. ఐతరేయ బ్రాహ్మణంలో, తనమాటను పాటింపలేదనే కారణంగా తన సంతానమైన ఆంధ్రులను, పౌండ్ర, మూతిబా, పుళింద జాతులతో కలసి పొమ్మని శపించాడనే గాధవుంది. అశోకుని గిర్నారు, షాబాజుగఢి శాసనాలలో, ఆంధ్రులు తన (అశోకుని) రాజ్యములో గలరని, బౌద్ధ ధర్మమును అనుసరించు చున్నారని చెప్పబడినది. మనుస్మృతి యందు ఆంధ్రులు ప్రస్తావింపబడినారు. మత్స్య వాయు పురాణములందును గలదు. ప్లీని (క్రీ.వె.77) కూడ ఆంధ్రులను పేర్కొనినాడు. ఇది ఆంధ్రజాతిని గూర్చిన ప్రస్తావన.

ఆంధ్రదేశాన్ని గూర్చిన ప్రస్తావనలు గమనిద్దాము. బ్రహ్మాండ పురాణంలో ప్రస్తావించిన దానిని బట్టి, ఆంధ్రదేశానికి మహేంద్రగిరి, భీమకాళేశం, శ్రీశైలం అనేమూడు శైవ క్షేత్రాలు, మూడు ద్వారాలుగా వున్నాయి. ఇందు మహేంద్రగిరి ఉత్తరాన శ్రీకాకుళంజిల్లాలో సముద్రానికి పది పన్నెండు మైళ్ల దూరంలో వుంది. భీమకాళేశం కరీంనగర్ జిల్లాలో వుంది. అక్కడ భీమ, కాళేశ లింగాలుండడం కారణంగా అది భీమకాళేశంగా వ్యవహరింపబడింది. శ్రీశైలం తెలిసిందే. ఈ మూడింటిని ఒకరేఖతో కలిపి, దాని రెండు కొనలను బంగాళాఖాతం వైపుకు పొడిగిస్తే, ఆ నడిమి భూభాగం ఆంధ్రదేశమని బోధపడుతుంది. దానిని సుచంద్రుడనే రాజుపాలిస్తున్నాడని బ్రహ్మాండ పురాణ కథనం. ఇందులో ఎక్కడా తెలుగు అనే దాని ప్రస్తావన లేకపోవడం గమనించాలి. ఈ మాట ప్రస్తావించడానికి కారణముంది. పైన చెప్పిన బ్రహ్మాండ పురాణంలో త్రీణిద్వారాణి, అని, పై మూడు క్షేత్రాలలోని లింగములు త్రిలింగములని, ఈశ్వరుడు త్రినేత్రుడని, అతని ఆయుధానికి మూడు మొనలున్నాయని, త్రి శబ్దాన్ని ప్రయోగించడం జరిగింది. ఇందలి త్రిలింగ శబ్దమాధారంగా అనంతరకాలంలో విద్యానాథుడు (రెండవ ప్రతాపరుద్రుని ఆస్థాని) ఈ త్రిలింగములు శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామము (ద్రాక్షారామము నందలి దైవమునకు భీమేశ్వరుడని పేరు) లని, వీనివలననే, ఈ దేశమునకు త్రిలింగ దేశమను పేరు ఒప్పియున్నదని చెప్పియున్నాడు. ఆ త్రిలింగ శబ్దమే తెలుగైనదని, అనంతరకాలమున వ్యాకర్తలు భావించి వ్యాఖ్యానించియున్నారు. బ్రహ్మాండ పురాణమునందు పేర్కొనబడిన త్రిలింగములలో మహేంద్రగిరిని విద్యానాథుడు విస్మరించెను. అంతేగాక భీమకాళేశమను ఏక క్షేత్రమును, దక్షారామ, కాళేశములుగా భావించినాడు. బహుశా దీనికి కారణములు రెండుగా నుండుటకు

అవకాశమున్నది. ఒకటి తాను ఉదహరించిన కాళేశమునకు, భీమకాళేశమను వ్యవహారమున్నట్లు విద్యానాథునికి తెలియక పోయి వుండవచ్చును. ఇంతకంటె ప్రబలమైనది, బ్రహ్మాండ పురాణ వచనముతో నిమిత్తములేక, రెండవ ప్రతాపరుద్రుని రాజ్యము వ్యాపించియున్న భూభాగములోని త్రిలింగ క్షేత్రములను మాత్రమే అతడు భావించియుండ వచ్చును. ఆ త్రిలింగ భావన తెలుగునకు మూలమని అనంతరము వారు భావించుట, కారణముగా అవి గల దేశము త్రిలింగదేశము అనగా తెలుగుదేశమని ముద్రపడుటయు, ఆ భావనమే నేటికిని పండితలోకమున స్థిరమగుటయు జరిగినది. కాని విద్యానాథునికి ముందువాడైన నన్నెచోడుడు తనకుమార సంభవమున, ఆంధ్రదేశమున చాళుక్యులు తెలుగును నిలిపిరని చెప్పియున్నాడు. అనగా, చాళుక్యులు తాము ఆంధ్రదేశమునకు వచ్చినపుడు తమ భాషయైన తెలుగునకు ప్రచారము కల్పించినారని, అనగా రాజభాషగా వ్యవహరించినారని నన్నెచోడుని తలంపు. చాళుక్యులు, తీరమువైపునకు వచ్చినది, క్రీ.శ. 6వ శతాబ్దమున. కనుక అప్పటికి తీర ప్రాంతమునకు ఆంధ్రదేశమని వ్యవహార మున్నట్లు స్పష్టము. స్థూలముగ నిది బ్రహ్మాండ పురాణ స్థాపిత విషయమును ఆమ్రేడించుచున్నది. 'అంధాపథీయోగామో విరిపరు' అను ఒక శాసన భాగమునుబట్టి విరిపఱ్ఱు అను గ్రామము ఆంధ్రదేశము నందలిదిగా చెప్పబడినట్లు తెలియుచున్నది. ఈ గ్రామము కూడ తీరభూమియందలిదియే. కనుక తీరభూమియే ఆంధ్రమనుట స్పష్టము.

అయితే పైన చెప్పబడిన అనగా ఐతరీయబ్రాహ్మణగాథ, ప్లినీవ్రాతలు, మగధపై ఆంధ్రుల ఆధిపత్యం చెల్లిరావడం, మరి ఇతర చారిత్రక ఆధారాలవలన, ఆంధ్రులు ఉత్తరాది వారని తెలియుచున్నది. అయినపుడు బ్రహ్మాండ పురాణంలో చెప్పబడిన ఎల్లలు ఆంధ్రులు ఉత్తరాదినుండి దక్షిణాదికి తరలివచ్చి స్థిరపడిన తరువాతి కాలానికి చెందినవిగా భావించాలి. ఆంధ్రులు ఉత్తరభారతదేశంలో ఉన్నపుడు బౌద్ధాన్ని అనుసరించారు. దక్షిణానికి తరలి వచ్చిన వేళ, దానిని తమవెంట కొని తెచ్చుకున్నారు. కనుకనే నేటి తీరాంధ్రంలో బౌద్ధచైత్య అవశేషాలు అధికంగా కన్పించడానికి కారణం. అయితే ఈ తరలి రావడం ఎప్పుడు జరిగిందనేది ప్రశ్న. బుద్ధుని నిర్యాణం తరువాత యిది జరిగి వుండాలి. బుద్ధుని జీవితకాలంలో, అణగియున్న సనాతన వాదులు, నిర్యాణం తరువాత విజృంభించి వుండాలి. వారిధాటికి తాళలేక ఆంధ్రుల వలస ప్రారంభమైయుండాలి. ఇదంతా ఊహ వలె కన్పిస్తుంది. అయితే అశోకుడు యుద్ధంచేశాడని, అది కళింగయుద్ధమని, దానివలన కలిగిన రక్తపాతానికి అతడు విచలితుడై యుద్ధం చాలించాడని, పిదప బౌద్ధం స్వీకరించాడని చెప్పడం విదితమే. అశోకుడు బౌద్ధంలోనికి మారడం మొగ్గలిపుత్త తిస్సుని బోధల వలన అని కూడ చెప్పడం జరిగింది. మొగ్గలిపుత్త తిస్సుడంటే మౌద్గలాయన పుత్ర తిష్యుడు. కాని తిష్యులు నేటి ఆంధ్రదేశంలో లేరు. తిష్యశబ్దం ఉత్తరభారతానికి చెందింది. అది గాక అశోకుడు

ఎవరితో యుద్ధంచేశాడనేది తెలియదు. కళింగ యుద్ధమని చెప్పడం వలన కళింగులతో యుద్ధం చేశాడని చెప్పవచ్చును. కాని యుద్ధం చేయడానికి కారణాలు తెలియరావు. ఆ యుద్ధం వలన అశోకుడు రాజ్యవిస్తరణ గావించినట్లు తెలియరాదు. అయినపుడు దేని కొరకు యుద్ధంచేసినట్లు! సనాతన వాదుల ప్రేరణపై, బౌద్ధమతానుయాయులపై యుద్ధంగావించి యుండాలి. నేటి కళింగదేశం తెలిసిందే. అది త్రికళింగమని తెలిసిందే. అయితే త్రికళింగములు గంగానదీ ప్రాంతంలో గలవని ప్లినీ వ్రాసినాడు. అతని వ్రాతలప్రకారం ఆంధ్రదేశం గంగానది లంకల్లో అతి విస్తృతమైన భూభాగం. దీనిని బట్టి ఆంధ్రులు ఔత్తరాహులని బోధపడుతోంది. ఉన్నచోటు విడిచి ఒకజాతి మొత్తంగా వలస సాగించారంటే, దానికి కారణాలు అతి బలవత్తరమైనవి కావాలి. ఇక్కడ అది బౌద్ధంపై తిరుగుబాటు. అందులో భాగమే కళింగ యుద్ధం. ఆంధ్రులు దక్షిణానికి తరలివచ్చినపుడు, తమతో తమ ధర్మాన్ని తెచ్చుకోవడంతోపాటు, తమ పూర్వరాజ్యాల అవాసాలపేర్లను కూడ కొనితెచ్చుకున్నారు. అది కొంత వివరంగా చూద్దాము.

కోసల, కుంతల, కుండిన, అశ్మకదేశాలు ఉత్తర భారతానివి. కాని అవి ఆంధ్రదేశంలో వున్నాయి. వేంగికి వెనుక గల చింతలపూడి తాలూకా ఇంకా ఆపైన గల భూభాగానికి కోసల అనిపేరు. రాజమహేంద్రవరానికి వెనుక భద్రాచలంవైపు గలభాగం కుంతలదేశం. కొండవీడుకుకుండిన దేశమనిపేరు. గోదావరి నంటి వున్న నిజామాబాదు ప్రాంతానికి అశ్మక దేశమనిపేరు. మధుర, బృందావనాలు శ్రీకాకుళంజిల్లాలో వున్నాయి. సింహాచలానికి వారణాసి కటకమనిపేరు. బుద్ధుడు సంచరించిన ప్రాంతాల, జనావాసాల పేర్లు ప్రారంభంలో సూచించడం జరిగింది. ఆ పేర్లను జ్ఞప్తిలోనికి తెచ్చికున్నచో ఆ పేర్లన్ని ఆంధ్రదేశంలో నేడు ఉండడం గమనింపవచ్చును. ఊరు, మన గ్రామనామాలలో ద్వితీయావయవంగా చాల గ్రామాల పేర్లలో కన్పిస్తుంది. వెల్ల, ప్రియాగ్రహారం అనే గ్రామాలు గోదావరి జిల్లాల్లో వున్నాయి. పట్టు, పల్లి అనేవి అంతంగా గల గ్రామాలు, ఉత్తర భారతం లోను, ఇక్కడ వున్నాయి. అలాగే పట్నం. సముద్రశబ్దం ప్రాకృతంలో సమ్ముద్దం సంద్రాలుగా పరిణమిస్తుంది. కాని సమ్మెద్యంగా కూడ పరిణమించిందని, కారణాలు తెలియరావని నిరుక్తం. అతి విచిత్రంగా బ్రహ్మసమెద్యమనే గ్రామం కాకినాడకు సమీపంలో వుంది. ఇది ఆవాసాల విషయం. కృష్ణ, గోదావరి అనే పేర్లతో నదులు ఇప్పటికి నేపాల్లో వున్నాయి. వారణాశిలో గోదావరినది అనే పేరుతో ఒక వీధి వుంది. దానికి కారణం. ఒకప్పుడు ఆ పేరుతో నది ప్రవహించేదట! కాలక్రమంలో మేటవేసిందని చెబుతారు. ఆ పేర్లు ఆంధ్రులు దక్షిణానికి తరలి వచ్చినపుడు, వారితోపాటు ఇక్కడకు వచ్చాయి. అలాగే బౌద్ధసాహిత్యంలో ప్రస్తావింపబడిన మంజేరిక, మాజేరుగా మారి ఇక్కడ స్థిరపడింది. కృష్ణాజిల్లా దివి తాలూకాలో ఈ పేరుతో గ్రామాలు, ప్రవాహాలు వున్నాయి. మంజీరా నది తెలిసిందే గదా!

ఇక వ్యక్తుల పేర్ల విషయంలోను, కులాలపేర్ల విషయంలోను ఉత్తరభారతంతో, బౌద్ధసాహిత్యంతో, ఆంధ్రానికి, ఆంధ్రులకు గల సన్నిహితత్వం మరింతగా బోధపడుతుంది. ప్రజాపతి గౌతమి పేరు చెప్పబడింది. అలా చెప్పడానికి కారణం మరో గౌతమి నుండి ఆమెను వివక్షించడం కొరకు. ఆ గౌతమి కీసా గౌతమి. కీస, కృశ శబ్దభవం. ఇదే మన కీచుగొంతు లోని కీచు శబ్దం. లకుండక బుద్దియలోని లకుండ శబ్దం పొట్టి తనాన్ని సూచిస్తుంది. అది మనకు లంగడా అయింది. బద్దియ భద్రశబ్దభవం. భద్రశబ్దం, మనవ్యక్తి నామాల్లో ఎంతగా చోటు చేసికుందో గమనింప వచ్చును. శ్రీరామచంద్రుడు మనకు రామభద్రుడైనాడు. బద్దియవనం కూడ వుంది. అది భద్రవనం. శ్రీకాకుళం జిల్లాలో భద్రపేరుతో (అంతమున) అనేక గ్రామాలున్నాయి. భద్రాచలం ఇలా ఏర్పడిందే. కుర్ర శబ్దం పేర్కొన్నాము. కుర్రవాడు అనే పద్ధతిలో మన భాషలో ఉంది. మరే భారతీయభాషలోను కనుపింపదు. బౌద్ధభిక్షుకి సుజాత, పద్మశాలీయ కుటుంబానికి చెందినది. పద్మశాలీయులు, పద్మనాయకులు అనే పేరుతో ఆంధ్రదేశంలో మాత్రమే కులాలున్నాయి. పద్మశబ్దానికి, బౌద్ధానికి గల సంసర్గ మెంతటిదో తెలియనిది కాదు. సుజాత తండ్రిపేరు 'సేనాని'. శ్రీకాకుళం జిల్లాలో సేనాపతులనే పేరుతో చేనేత వృత్తిగా గలవారున్నారు. బుద్ధుని విద్యాగురువు సబ్బమిత్రుడు. ఈ సబ్బశబ్దం, సర్వలేక సర్వ శబ్దభవం. ఆంధ్రదేశంలో మాత్రమే సబ్బవర ముంది. సబ్బియపేరుతో వ్యక్తులున్నారు. సబ్బినేని ఇంటిపేరుగా కూడ వుంది. అన్నింటికి మించిన ఉదాహరణ ఒకటి వుంది. బుద్ధుని అశ్వ శిక్షకుడు చెన్న. అందము అని ఈ పదానికర్థం. ఇది ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాల్లో మాత్రమే వ్యక్తినామాల్లో కన్పిస్తుంది. దీనివలన ఆంధ్రులకు, బౌద్ధానికి, ఉత్తర భారతానికి గల సంబంధం తేట పడుతుంది. బౌద్ధ సాహిత్యమంతా పాళీలో వుందని, అది ఒక ప్రాకృత భాషగా చెప్పడం జరిగింది. కాని, సంస్కృత నిఘంటువులు అలాంటి ప్రాకృతమున్నట్లు పేర్కొనడం లేదు. అతి విచిత్రంగా అది మన భాషలో వుంది. వ్రాతపనిముట్టులోని భాగంగా!(Nib) అనంతరకాలంలో బౌద్ధంలో చోటు చేసికున్న 'ధారణి' మంత్రానికి ప్రసిద్ధమైన కేంద్రం గావడం వలన ధరణికోట ఏర్పడింది. అచ్చట ధాన్యకర, ఇక్కడ ధాన్యకటకమయింది.

ఇక సాంస్కృతిక విషయాలపరంగా, ఆంధ్రులపై బౌద్ధప్రభావాన్ని గమనిద్దాము. శాక్యుల ఆహారం వరిగా పేర్కొనడం జరిగింది. వరి పంటకు నీరు పుష్కలంగా కావాలి. ఇక్కడ ఒక విషయం గమనించండి. వేసే పైరు ఏదైతే పంట కూడ అదే కావాలి గదా! గోధుమ వేస్తే గోధుమలు, కందివేస్తే కందులు, మినుము వేస్తే మినుములు పండుతాయి. అలాగే మిగతావి కూడా! కాని వేసేది వరి అయితే, పండే పంటను వడ్లు అంటున్నాము. ఇలా ఎందుకంటున్నామో తెలియడం ఒక పెద్ద చర్చ! దాని కిది తావుగాదు. మనకు కావలసింది వరి అనే పదానికి అర్థం. వరి అంటే నీరు. కాని ఏ తెలుగు నిఘంటువు ఈ అర్థాన్ని ఇవ్వదు. సంస్కృతంలో మాత్రం

వారినిధి, వార్ధి అంటే సముద్రం. వారి నిధి అంటే జలనిధి. సముద్రాన్ని జలధి అనడం తెలిసిందే. దీనిని బట్టి వరి అంటే నీరు అని తెలుస్తుంది. అయితే ఇప్పటి మన భాషలో కూడ వరి అంటే నీరు అని అర్థం ఇచ్చే పదం ఒకటి వుంది. అది వరిబీజం అనే పదం. కనుక వరి అంటే ఆ పేరుగలపైరు మాత్రమేగాక నీరు అని అర్థం వుంది అని తెలుస్తుంది. దీనిని బట్టి ఆ పైరుకు నీరు అధికంగా కావాలి గనుక, దాని కాపేరు వచ్చిందనేది స్పష్టం. ఈ విషయాన్ని గూర్చి ఇంతగా చెప్పడానికి కారణముంది. ప్రధానంగా ఆంధ్రులు ఆపస్తంభసూత్రులు. (ఆశ్వలాయన, బోధాయన సూత్రులు లేకపోలేదు) అంటే ఆపస్తంభుడు నిర్దేశించిన సూత్రాల ప్రకారం జీవనయాత్ర సాగించేవారు అని అర్థం. అయితే ఆపస్తంభుడు ఎవరు అంటే ఒక మహర్షి అని చెప్పడం కద్దు. కాని అలాంటి మహర్షి ఒకరు ఉన్నట్లు ఏ పురాణము చెప్పడం లేదు. కాని ఆపస్తంభన మంటే నీటిని నిరోధించడం. ఈ నిరోధించడం వరి పైరు పండించడానికి. కనుక ఆపస్తంభ సూత్రులు అంటే వరి అన్నం తినే వారని అర్థం. ఆశ్వలాయన, బోధాయన, గౌతమ - ఇలా అనేక గృహ్య సూత్రాలు ఆధారంగా జీవనం చేసే జాతులు వివిధములైన ఆహారాన్ని (ప్రధానంగా) గ్రహించేవారున్నారు. అలాంటి జాతుల్లో వరిని ఆహారంగా గ్రహించేవారు నాడు శాక్యులు కొలీయులు. కనుకనే వారిమధ్య రోహిణీ నదీ జలాల వినియోగంపై వివాదాలు ఏర్పడ్డాయి. అలా వరిని ఆహారంగా గ్రహించే జాతి ఆంధ్రులు కూడా.పైన వివరించిన తీరప్రాంతంలో,కృష్ణ, గోదావరులపై ఆనకట్టలు నిర్మింపక పూర్వమే వరి పండింప బడింది. ఆనకట్టల నిర్మాణంతో అధిక పరిమాణంలో భూమి, వరి సేద్యానికి అనువు గావింపబడింది. వరితోపాటు గోధుమ కూడ మొన్నమొన్నటి వరకు పండింపబడిందని ఇంగ్లీషు వారి రికార్డులు తెలుపుతున్నాయి. ఈ విషయాలు కూడ ఆంధ్రులు ఉత్తరాది వారనే దానిని బలపరుస్తున్నాయి. గుమ్మడి, పనస కూరలు నేడు తీరప్రాంతంలోను, వారణాసి ప్రాంతంలోను అధిక ఉపయోగంలో వున్నాయి. కూర అనే పదం ప్రస్తుతం మన ఉపయోగంలో ఉంది. మరే భాషలోను కనుపింపదు. అయితే కాశీలో ఆ పదం వ్యవహారంలో ఉన్నట్లు, ఏనుగుల వీరాస్వామి తమ కాశీయాత్ర చరిత్రలో పేర్కొనడం జరిగింది. తాడి ఇక్కడ, అక్కడ సమృద్ధిగా పెరుగుతోందని కూడ ఆయన వ్రాశారు. మరికొన్ని విశేషాలను చూద్దాము. మనకు భావనారాయణస్వామి, సత్యనారాయణస్వామి ఆలయాలున్నాయి. ఆ దేవతామూర్తులను కూడ విష్ణు ప్రత్యంతర మూర్తులుగానే పరిగణించి, పూజిస్తున్నాము. అయినపుడు విష్ణు సహస్ర నామావళిలో ఎందువలన ఆ పేర్లు చోటు చేసికోలేదు. ప్రసిద్ధ వైష్ణవాలయల్లోని అర్చామూర్తులకు లేని మీసాలు పై వారికి ఎందుకున్నాయి. అలాగే పైచోట్ల గల దేవతామూర్తులకు, ఇతరఛోట్లవలెగాక శంఖు చక్రాల అమరిక వ్యత్యస్తంగా ఉండడానికి కారణమేమిటి. కల్యాణోత్సవాలు ముఖ్యంగా శ్రీకాకుళ ఆంధ్రనాయక స్వామికి వైశాఖపున్నమికి జరుపడంలోని ఆంతర్యమేమిటి. ఏ జాతికి లేనిది

ఆంధ్రజాతిపేరుతో విష్ణువును ఆంధ్రనాయకస్వామిగా పూజించడానికి గ
కారణమేమిటి. ఈ ప్రశ్నలకు స్థానిక అర్చకులు ఏవో కారణాలు చెప్పవచ్చుగాక! క
అవి నిర్ధారించడానికి తగు ప్రమాణాలున్నాయా! మరి పై ప్రశ్నలకు సమాధానా
ఏమిటి! ఒకటొకటిగా పరిశీలిద్దాము.

భావనారాయణ శబ్దంలోని భావం బుద్ధికి సంకేతం. అంటే భావనారాయణ
పేరుతో సంభావింపబడుతున్నది బుద్ధుడే. బెంగాల్‌లో గౌడ్ అనేది ఒక ప్రాంతం.
ప్రాంతపు సుల్తాన్ అల్లావుద్దీన్ హుసేనుషా పూజించే సూఫీ దేవత ఒకరున్నారు. అతని
ఉంగరాల జుట్టు వుండేది. బెంగాలులో గల మహమ్మదీయులు అతణ్ణి 'సత్యపీ
అని సంభావింపగా, అచ్చటి హిందువులు సత్యనారాయణ అన్నారు. (చూడు: అగ్నిధార;
పుట 95; రచయిత్రి కురుతులైన్ హైదర్, ప్రచురణ: నేషనల్ బుక్ ట్రస్టు, ఇండియా
ద్వితీయముద్రణ 1990); గాంధార శిల్పంలో బుద్ధునికి మీసాలున్నట్లు చెప్పబడింద
వైశాఖ పున్నమి సిద్ధార్థుని జన్మదినం, నిర్వాణదినం, బుద్ధుడైన దినం. శంఖ చక్ర
వ్యత్యస్తమైన అమరికకు కారణం, నిజవిష్ణు ప్రత్యంతరమూర్తి కాదని, ఆ
మానవమూర్తి అని ప్రకటించడం. ఆంధ్రనాయకుడు ఒకానొక శాతవాహన చక్ర
అని చెప్పడం తెలిసిందే! పై వివరణవలన తెలియవచ్చింది, మానవత నిండి
మనీషులను, మానవాళి శ్రేయమును కోరిన ధర్మమూర్తులను, విష్ణు సన్నిభులు
పరిగణించారు. మరి ఆర్షధర్మమిదే గదా!

ఇక, శైశవంలో పుట్టు వెంట్రుకలు తీయడం ఎందుకు! బ్రాహ్మణుల్లో వరుడు, వివాహానికి తరలివచ్చికూడా, కాశీకి వెళతాననడం దేనికి! ఇతరులు వివాహ సమయంలో పాంకోళ్లు ఎందుకు ధరిస్తున్నట్లు. అవి ధరింపవలసింది సన్యాసులు గదా! ఆంధ్ర బ్రాహ్మణస్త్రీలు మాత్రమే వైధవ్యస్థితిలో, శిరోముండనం ఎందుకు గావించుకుంటున్నారు. దేవాలయ దర్శనంలో భాగంగా తలనీలాలు ఇవ్వడం దేనికి. ఇవన్నీ బౌద్ధానికి సంకేతాలు గావా! ఆంధ్రులు తప్ప ఇతర భారతీయులెవరైనా వీటిని పాటిస్తున్నారా! పితృతర్పణాల విషయంలో, గయలో విడవాలని, కాశీలో అస్థులు కలపాలనే ఆచారాన్ని ఆంధ్రులు పాటించినంతగా ఇతరులు పాటిస్తున్నారా! ఎందువలన ఇంతగా పై ఆచారాలు ఆంధ్రుల్లో నెలకొన్నాయి. ఇవి బౌద్ధంతో గల నెనరుకు సంకేతాలు కావా! ఇంత నిసర్గ సంబంధం వున్నది గనుకనే, బుద్ధుని జనన ప్రాంతానికి, నేటి ఆంధ్రదేశానికి మధ్య ఎంతో భూభాగం వున్నా, ఇక్కడ మాత్రమే (తీరాంధ్రంలో ముఖ్యంగా) బౌద్ధ చైత్యాలు వెలిశాయి. బౌద్ధం విస్తృత ప్రచారాన్ని పొందింది. ఇలా జరగడానికి కారణం బుద్ధునితో, విడదీయరాని సంసర్గం వుండి వుండాలి కదా! అంతేకాదు! ఉత్తరాది బ్రాహ్మణులు, దక్షిణాది బ్రాహ్మణులను కేరళలోని నంబూద్రీలను తప్ప, మిగిలిన వారిని బ్రాహ్మణులుగా గుర్తింపరు. కారణము బౌద్ధాన్ని ఆచరించుట వలన కలిగిన నిరసనము. కనుక బుద్ధునికి జన్మనిచ్చిన, శాక్యగణం, అతని తల్లిగారిదైన కొలియగణం, ఆంధ్రగణం, - ఇవన్నీ ఒక పెద్ద జాతిలోని గణబేధాలే కావడానికి పెక్కు అవకాశాలున్నాయి. విజ్ఞులు ఆలోచింపదగిన విషయం.